కీ॥ శే॥ శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు పంతులుగారు, ఎమ్.ఏ.



"తనువు రుజాకృతంబయిన దార్ఢ్యము తప్పుచునున్న భావనా
గవికర మొంది తీవ్రకృషి కర్షకరీతి నొనర్చి తత్ఫలం
బవిరళము న్నాంధ్రలోకమునకై వినియోగ మొనర్చియుంటి నీ
జననము సార్థకంబయి ప్రాసంగెను లక్ష్మణరాయ ధీమణీ!" — శ్రీ శివసుబ్రహ్మణ్య కవులు.

విజ్ఞానచంద్రికాగ్రంథమాల, ౩౧.

# లక్ష్మణరాయ వ్యాసావళి

## (ప్రథమ సంపుటము)

విజ్ఞప్తి ముద్రణము.

మొదటి కూర్పు

ప్రకాశకులు:
విజ్ఞానచంద్రికామండలి,
చెన్నపట్టణము
క్రీ. శ. ౧౯౧౩
చందాదారులకు వెల రు. 2—0—0.
ఇతరులకు ,, 2—8—0.

# విషయసూచిక

## చారిత్రక విషయములు



## భాషా విషయములు



## శాస్త్ర విషయములు

# తొలిపలుకు

---

ఆంధ్రమహాశయులారా!

ఆంధ్రవాఙ్మయ[illegible] శ్రీయుత కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారు తమ[illegible] [illegible] శాస్త్ర[illegible] [illegible] చేసియు, [illegible] భాషా[illegible] వ్యాసము చేసియు, నానా[illegible] పరిశోధన[illegible] [illegible] కావించియు, సత్కా[illegible] న్వేషణాభిరుచి[illegible] [illegible] [illegible] మహాత్మ్య[illegible] గౌరవాతి శయముల కర్హులైరి. [illegible] జీవించియుండినప్పుడే తా మప్పుడప్పుడు వ్రాసినవ్యాసములను చేర్చి సంపుటములుగ ప్రచురింపవలెనని నాతో చెప్పుచుండిరి. ఈ యుద్దేశముతో వ్యాసావళియొక్క ప్రతులను తయారుచేసిరి. కాని యుద్దేశము నెఱవేఱకముందే వారు స్వర్గస్థులైరి. చనిపోయిన వెనుక నీవ్యాసములను అచ్చొత్తించుమని విజ్ఞానచంద్రికామండలి వారు నన్ను నియమించినప్పుడు మిత్రఋణము కొంతవఱకైన దీర్చుకొనుటకు అవకాశము గలిగినదని సంతసించి మండలివారి యాజ్ఞను శిరసావహించితిని. కాని యీ ముద్రణవిషయమై నేను చేసిన దేమియు లేదు. విషయానుసారముగ వ్యాసములను చేర్చి యచ్చు కిచ్చుటయే. ఇం దొకటిరెండు తప్ప మిగిలిన వ్యాసము లిదివరలో నచ్చైనవే. పోతనను గూర్చిన వ్యాసమును, కర్మయోగము నిదివఱకు ముద్రితము కాలేదు.

మిగిలిన యముద్రితవ్యాసములు రెండవ సంపుటములోఁ బ్రకటింపఁబడును. ఈ సంపుటమునందు మఱికొన్నివ్యాసములు చేర్చుట కుద్దేశించితిని. కాని గ్రంథ మిప్పటికే విస్తరించుటచేత నది మాని వేయవలసివచ్చినది. ఈ కారణమువలననే లక్ష్మణరాయని గూర్చి వ్రాసిన పండితాభిప్రాయములు గూడ ఈ సంపుటములోఁ జేర్చలేదు. మిగిలినవ్యాసములును, లక్ష్మణరాయని సంక్షేపజీవిత చారిత్రమును, పండితాభిప్రాయములును రెండవసంపుటముగ త్వరలో బ్రచురింపఁబడును.

నేను దూరదేశమున నుండుటచేత ముద్రణమునందేమియు పాల్గొనలేకపోతిని. ఆంధ్రవిజ్ఞానసర్వస్వము తయారుచేయుటలో కుడిభుజమై పనిచేసి లక్ష్మణరావుగారిచే 'సహాయసంపాదకుఁ' డని పిలువఁబడిన మల్లంపల్లి సోమశేఖరశర్మగారు చెన్నపట్టణమే వాసముగ నుండనియెడల ఈ సంపుటము ప్రచురితమయ్యెడిది కాదు. ఈయన చారిత్రపరిశోధనములందు లక్ష్మణరావుగారిచే తర్ఫీదై ఆయనయెడల గురుభావముతో మెలఁగుచుండెడివాఁడు. ఆయనకు సోమశేఖరశర్మగారనిన పుత్రవాత్సల్యముగాని వేరొకభావము లేదు. ఇట్టిస్థితిలో ఈ వ్యాసావళి ముద్రణమునకు సోమశేఖరశర్మగారికి నేను వందనము లర్పించ ననవసరము లేదు. లక్ష్మణరాయని ఋణము కొంతవఱకైనను తీర్చుకొనుట కవకాశము గలిగినందుకు మే మిద్దరము సంతసించుచున్నాము. ఈ యవకాశ మొసంగిన విజ్ఞానచంద్రికా మండలివారికి కృతజ్ఞులము.

కుంభకోణము,
౧౬-౧౨-౧౯౨3.

వేమూరి విశ్వనాథశర్మ.

# విజ్ఞానచంద్రికామండలి చందాదారులకు విన్నపము

మహాశయులారా !

విజ్ఞులగు మీకు చిరకాలపరిచితులము. ఈమధ్య కొన్ని సంవత్సరములు మీతో సాంగత్యము తెగిపోయి విధివశమున విశేషదుఃఖకరమగు పరిస్థితులలో నేడు విజ్ఞానచంద్రికామండలి మీ పూర్వస్నేహమునకై చేయిసాచుచున్నది. ముఖ్యసంపాదకుడగు లక్ష్మణరాయని యకాలమరణమువలన నిప్పుడు విజ్ఞానచంద్రికామండలి తలలేని మొండెమువలె నిలచియున్నది. ఇట్టి విచారసమయమున మిత్రసందర్శనము దుఃఖోపశమన మగుననుటకు సందేహము లేదు.

౧౯౦౬ వ సంవత్సరములో స్థాపితమై ౧౯౧౬ అనగా పదిసంవత్సరములలో మండలివారు ౩౦ పుస్తకములు ప్రచురించిరి. ఆటుతరువాత పుస్తకములు వెలువడకుండుటకు కారణములు లేకపోలేదు. యుద్ధమువలన కాగితముల ధర విపరీతముగ పెరిగి మానిబంధనల ప్రకారము చందాదారులకు స్వల్ప క్రయమునకు పుస్తకముల నందజేయ లేకుంటిమి. మరియొకముఖ్యకారణము గూడ కలదు. ప్రకృతిశాస్త్రజ్ఞానమును, జనసామాన్యములో స్వాతంత్ర్యాభిలాషను పురికొల్పు

టకు శక్తిగల వివిధదేశముల చరిత్రలును, ప్రపంచోద్ధారకు లనదగు మహాపురుషుల జీవితములును ప్రకటించుటయే మండలివారి యాదర్శము గాని నవలాప్రచురణము ముఖ్యోద్దేశము కాదు. ఇందుచేత ప్రచురింపఁదగిన పుస్తకముల సంఖ్య ప్రాయశః కొంతవఱకు సంకుచిత మగును. మే మింతవరకు ప్రచురించిన గ్రంథముల పట్టిక చూచినయెడల చాలవరకు ప్రకృతిశాస్త్రములు వెల్లడియైనవని తెలియును. ముఖ్యముగ ప్రచురింపఁదగిన శాస్త్రములు మరికొన్ని గలవు. కాని యయా శాస్త్రములలో ప్రవీణులై మాతృభాషలో సుబోధకముగ వ్రాయఁగల గ్రంథకర్త లరుదగుటచేత గ్రంథసంపాదనము కష్టసాధ్య మయ్యెను. ఈ కారణములచేత గ్రంథప్రచురణము నందు కొంత అంతరాయము గలిగినది.

స్వవిషయము రెండుమాటలు చెప్పవలసియున్నది. మండలి స్థాపకులలో నొకరై మొదటి రెండుసంవత్సరములు కార్యభారమును సంపూర్ణముగ నిర్వహించిన రావిచెట్టు రంగారావుగారు గతించినప్పుడు మిత్రవియోగమునకు వగచితిమి కాని మండలి యుద్దేశములకు భంగము గలుగునని భయపడలేదు. ఈసంవత్సరము వేసంగిలో మండలి సభ్యులలో నొకరగు తాడిమళ్ల వెంకటరామయ్యగారు పరమపదమునొందిరి. వీరు కార్యభారమును వహింపకపోయినను మండలియొక్క బాల్యావస్థలో మిక్కిలి శ్రమచేసి మాయుద్దేశములను ఆంధ్రలోకమున ప్రచురించి యనేకులను చందాదారులుగఁ జేర్చిరి. ఇప్పుడు పులిమీఁది పుట్రవతుగా ముఖ్యసంపాదకుని మరణము

నకు వగవవలసివచ్చినది. లక్ష్మణరావుగారు మండలికి మొదటి నుండియు ఆయువుపట్టువి వేఱే చెప్పనక్కఱలేదు. మండలి యొక్క సామాన్యకార్యములన్నియు నిర్వహించుటయేగాక మేము ప్రచురించిన పుస్తకములలో లక్ష్మణరావుగారిచేయి కానిది లేదు. ఇట్టి [illegible]మును కోలుపోయినస్థితిలో మండలియొక్క భావి [illegible]ంధ్రుల యభిమానముతోను, ఆదరణముతోను, [illegible] త్ర [illegible] గలము. ప్రస్తుతము మా కృతజ్ఞతను వెలువుటకై లక్ష్మణ రావుగారి వ్యాసావళి రెండు సంపుటములుగా ప్రచురించి [illegible] నిశ్చయించితిమి. లక్ష్మణరావుగారి [illegible] తా [illegible] సర్వప్రమాణికములతో యీవిజ్ఞాన సర్వస్వ ప్రచురణములలో నున్న వారివ్యాసావళికి ఆంధ్రదేశమున సంపూర్ణాదరణము సంపాదించునని మా నమ్మకము.

మండలి సభ్యులలో నొకరగు అయ్యదేవర [illegible]శ్వర రావుగారు కారాగృహమునం దుండినప్పుడు ఫరాసువారి స్వా తంత్ర్యవిజయమును తెలుఁగున అనువదించిరి. దీనిని మండలి వారు ప్రచురింపవలెనని లక్ష్మణరావుగారు జీవించియున్నప్పు డే నిశ్చయమైనది. అందుచేత ఈ మూడుపుస్తకములను వెం టనే ప్రచురించుటకు దీర్మానించితిమి. ఆంధ్రమహాశయులు తమ సహజవాత్సల్యమును, అభిమానమును మాయెడల చూపుచుండెద రను సంపూర్ణవిశ్వాసముతో విన్నవించు,

ఆచంట లక్ష్మీపతి,
మేనేజరు.

# లక్ష్మణరాయ వ్యాసావళి

## చారిత్రక విషయములు

---

## ఆంధ్ర బ్రాహ్మణులలోని నియోగివైదికభేద కాలనిర్ణయము *

భరతఖండములోని యితరదేశములలో లేని రెండువింతలు ఆంధ్ర బ్రాహ్మణులలోఁ గలవు. అందొకటి బ్రాహ్మణులు లింగము కట్టుకొనుట. వీరిని మనదేశమున నారాధ్యబ్రాహ్మణు లనియెదరు. ఆఱువేలనియోగుల లోను గొందఱు ఆరాధ్యులశిష్యులై లింగములు కట్టుకొని యున్నారు. ఇందుకుఁ గందుకూరివారు బుద్ధిరాజువారు మొదలగు నాఱువేలకుటుంబములు దృష్టాంతము. ఆంధ్రబ్రాహ్మణులలో వృత్తినిబట్టి నియోగులనియు, వైదికు లనియు రెండుతెగ లేర్పడుట రెండవవింత. మొదటివింతనుగుఱించి మఱియొక తఱవ వ్రాయఁగలను. ప్రస్తుతము రెండవవింతనుగుఱించి కొంత వివరింపఁ దలఁచితిని.

ఆంధ్రదేశములోని బ్రాహ్మణులతెగలు వైదికులు, నియోగులు అని రెండు. ఈరెండుతెగలవారును ఆంధ్రదేశంబునఁ గలసిమెలసి యసంఖ్య సంవత్సరములనుండియు నన్నదమ్ములవలె వాసముచేయుచున్నారు. ఇటీవల నేఁబది యఱువది యేండ్లక్రిందట ఆంధ్రదేశముయొక్క యొకానొకభాగమందు వీరికిఁ

---

* 'స్వధర్మప్రకాశిని' ప్లవంగ సం॥ కార్తిక, మార్గశిర మాసములు, సం ౧, సం ౮ : ౯ లు, పుట ౧.

బరస్పరద్వేషము పుట్టెను. కాని సుదైవమున నది క్షేమంతటను బ్రసరించినది కాదు. ఈరెండుశాఖలవారిలోని విశేషములును ఈవిభేదము లెప్పుడు పుట్టి నదియు మన మిచ్చటఁ గొంచెము విచారించెదము.

వైదికులనఁబడువారిలో వారు నివసించినదేశములను బట్టి నాఁడు లను భేదములు కలిగినవి. అందు వేఁగినాఁడు, వెలినాఁడు, మురికినాఁడు, తెల గాణ్యము, కాసలనాఁడు అనునవి ముఖ్యమైనవి. "నాఁడు" అను తెలుఁగు మాటకు దేశము అని యర్థము. అందుచే నాంధ్రదేశములోని వేఱువేఱు సీమ లలో నుండువారొక్కొక్క తెగగా నేర్పడిరని మన మూహింపవచ్చును. ఈ వేఱువేఱునాఁడులవారందఱును వైదికులయినను, ఒకరితోనొకరు సంబంధ బాంధవ్యములు చేయరు. ప్రతినాఁడివారును తమనాఁడియే శ్రేష్ఠమైనది యని చెప్పుచు నితరనాఁడులవారిని తృణీకరించెదరు. గుజరాత్ దేశమున నెన్నియో వందల సంవత్సరములక్రిందట శాంకరమతమునకుఁ బ్రతిస్పర్ధిగా శుద్ధాద్వైత మతమును స్థాపించిన వల్లభాచార్యులవారు వెలనాఁటివారు. ఈయనవంశము వారు ఇప్పటికి నాదేశమున లక్షాధీశులగు మతాధిపతులుగా నున్నారు. ఈ పీఠాధిపతులు గృహస్థులు. వీరికి భార్యలు కావలసినప్పుడు ఆంధ్రదేశమునకు వచ్చి వేలకొలఁది శుల్కములిచ్చి వెలనాఁటిపిల్లను వివాహమాడుచుందురే కాని గుజరాథ్ బ్రాహ్మణుల కన్యలఁగాని, ఇతరనాఁడుల కన్నియలఁగాని వివాహ మాడరు. శృంగేరీపీఠాధిపతు లగు ప్రస్తుతపు శంకరాచార్యులవారు, మురికి నాఁటి యాంధ్రబ్రాహ్మణులు. ఇంతియకాదు. పదిపండ్రెండుతరములనుండియు నాపీఠమునకు మురికినాఁటివారే యధిపతులగుచున్నారు. మురికినాఁటివారు కానివా రాపీఠమునకు నధిపతులుకాఁగూడదని యచ్చటివారి యభిప్రాయ మైనటులఁ గానవచ్చుచున్నది. ధర్మగ్రంథములలో నెచ్చటలేని యశాస్త్రీయ మైననాఁడుల యభిమానము పీఠాధిపతులఁ గూడ బాధించుట యాశ్చర్యము కదా! ఇటుల వైదికులలోని శాఖాభేదమునుగుఱించి కొంత విచారించి యిఁక నియోగులనుగుఱించి కనుఁగొందము.

నియోగులలోని ముఖ్యశాఖ ఆఱువేలవారిది. సాధారణముగా నాంధ్రదేశమందు నియోగియనిన ఆఱువేలనియోగి యనియే యర్థము. వీరందఱును కృష్ణయజుర్వేదాంతర్గత ఆపస్తంబసూత్రమువారు. ప్రథమశాఖవారును, నందవరీకులును, కరణకమ్మలనువారును తాము నియోగులమని చెప్పుకొనియెదరు కాని వీరిసంఖ్య మిక్కిలి తక్కువయైనందునను, ఇందనేకులు ఇతరదేశముల నుండి యాంధ్రదేశమునకు నిటీవల వచ్చినట్టుల వారె చెప్పుకొనుచుండినందునను వారు మొదటి ఆంధ్రనియోగులు కారని చెప్పవలసియున్నది. కావునఁ బ్రస్తుతవ్యాసమునందు వారినిగుఱించి విశేషము వ్రాయనొల్లను. మఱియొకప్పుడు వ్రాయఁగలను. ఆఱువేలవారిలోనుండి చీలిన శాఖవారొకరు కలరు. వారికి పాకనాటి ఆర్వేలనియోగు లనిపేరు. ఆఱువేలవారు పాకనాటికిఁ బోయి పాకనాటివారైరి. పాకనాఁడనఁగాఁ బ్రస్తుతపు గుంటూరుమండలములోని కొండవీఁడు మొదలు నెల్లూరుమండలములోని కందుకూరువఱకు నున్న దేశమని యెఱుంగవలయును*. ఈదేశములోని ఆఱువేలనియోగులు పాకనాటి వారనిపించుకొనిరి. అందుచే నేగ్రంథమునందైనను పాకనాటివారని యున్న యెడల నప్పుడు ఆఱువేలనియోగులశాఖ యుండెనని మనమూహింపవచ్చును.

ఇట్టియుభయశాఖలలోని యంతర్భేదములను గుఱించి విచారించి యీ శాఖాభేదము లాంధ్రదేశమున నెంతకాలమునుండి యున్నవో మన మాలోచింపవలసియున్నది. ఇందునగుఱించి యనేకు లనేకవిధముల వ్రాసియున్నారు. కాని యొకరును ఇందునగుఱించి శాస్త్రీయపద్ధతిని (Scientific) విచారించినవారు కారు. మనము ప్రస్తుతము పక్షాభిమానము విడచి యైతిహాసికపరిశోధన **(Historical Investigation)** మార్గమును ననుసరించి యీవిషయమును పరిశోధించెదము.

---

* మ. రా. శ్రీ. రావుబహదుర కందుకూరి వీరేశలింగము పంతులుగారిచే వ్రాయఁబడిన ఆంధ్రకవులచరిత్ర - ప్రథమభాగము - శ్రీనాథకవిచరిత్ర చూడనగు.

క్రీ. శ. పదునెనిమిదవ శతాబ్దములో కంకంటి పాపరాజు ఈక్రింది పద్యములో నాఱువేలవారిని పొగిడియుండుటచే నాకాలమునం దీశాఖవారు మిక్కిలి వైభవదశయం దుండిరని మనము నిశ్చయింపవచ్చును.

సీ. అఖిలరాజాధిరాజాస్థానజనహృద్యవిద్యావిహారు లార్వేలవారు
కల్పకబలికర్ణకలశార్ణవోదీర్ణవితరణోదారు లార్వేలవారు
సజ్జనస్తవనీయసతతనిర్వ్యాజపరోపకారు లార్వేలవారు
ఘనదుర్ఘటస్వామికార్యనిర్వహణప్రవీణతాధారు లార్వేలవారు

* * * *

ఇట్లు పదునెనిమిదవ శతాబ్దంబున ఆఱువేలవా రుండి రని దృఢపఱచుకొని ఇంతకుఁ బూర్వపుకాలమున వీరుండిరా లేదా యని మన మాలోచించెదము. క్రీ. శ. యొక్క పదునేడవశతాబ్దమున నీశాఖాభేద ముండె ననుటకుఁ గొన్ని ప్రమాణము లున్నవి. కాని పదునాఱవశతాబ్దముననే వీరుండినటుల ప్రబల ప్రమాణ మున్నందున దానినే యిచ్చట నుదాహరించెదను.

కుమారధూర్జటి యనుకవి కృష్ణరాయవిజయకావ్యమునందుఁ దాను పాకనాటార్వేలవాఁడయినటుల స్పష్టముగా వ్రాసియున్నాఁడు:—

సీ. నను భరద్వాజగోత్రునిసదాపస్తంబసూత్రుని బాంధవస్తోత్రపాత్రు
బాకనాటార్వేల వంశ ప్రసిద్ధుని ధూర్జటిపౌత్రు బంధురచరిత్రు

* * * *

కృష్ణదేవరాజవిజయము క్రీ. శ. ౧౫౫౦ ప్రాంతమునందు రచింపఁబడినదని బ్రహ్మశ్రీ కందుకూరి వీరేశలింగముగారు నిర్ణయించియున్నారు. (ఆంధ్రకవులచరిత్ర-ద్వితీయభాగము కుమారధూర్జటిచరిత్ర చూడుఁడు.) ఇఁకముందుఁ జేయఁబడిన కాలనిర్ణయము లన్నియుఁ బంతులుగారి ఆంధ్రకవులచరిత్రము నుండియె గ్రహింపఁబడినవి. స్థలవిస్తరభీతిచేతఁ గాలనిర్ణయమునకుఁ గల కారణములన్నియు నిచ్చట నీయలేదు. ఆకారణములన్నియు సవిస్తరముగాఁ జూడఁగోరువారు ఆంధ్రకవులచరిత్రముఁ జూడనగును.

పైపద్యమును కవికాలనిర్ణయమునుబట్టి పదునాఱవశతాబ్దమధ్యమున ఆర్వేలశాఖ ప్రబలియుండెననియు, పాకనాటివారు ఆర్వేలవారిలోనుండి చీలిన యొకశాఖ యనియు మనము నిర్ధారణచేయవచ్చును. ఈ కుమార ధూర్జటి కవిధూర్జటియొక్క మనుమఁడు. కవిధూర్జటి కృష్ణదేవరాయల యాస్థానకవీశ్వరుఁడని యందఱికిఁ దెలిసిన విషయమే. మనుమఁడు నియోగి యైనప్పుడు తాతమాత్రము వైదికియగునా? కావున కృష్ణరాయల సమయ మందు నియోగిశాఖయుండెనని మన మూహింపవచ్చును. కాని మన కీయూహ లతోఁ బనిలేదు. అప్పుడార్వేలవారు మిగుల విఖ్యాతిఁజెందిన కవులుగను, రాజ్యధురంధరులుగను, మంత్రీశ్వరులుగను, సైన్యాధీశులుగను నుండి రని చూపుటకు నాకాలమందలి ప్రత్యక్షప్రమాణములే కలవు. అందు మొదటిది పారిజాతాపహరణము.

పారిజాతాపహరణకర్త నంది తిమ్మన్న. ఈతనినే ముక్కు తిమ్మన్న యనియెదరు. ఈతఁడు తనకావ్యమును కృష్ణరాయనికి నంకితముచేసెను. ఈతఁడు 'ఆర్వేలపవిత్రకులుఁడ' నని తన కావ్యములోని చరమపద్యములో చెప్పుకొనియున్నాడు:—

సీ. కౌశికగోత్రవిఖ్యాతుఁ డాపస్తంబసూత్రుఁ డార్వేలపవిత్రకులుఁడు

*    *    *    *

కృష్ణరాయనియాస్థానకవి యగు మఱియొక మహాకవీశ్వరుఁడు మాదయ గారిమల్లన. ఈతఁడు తన రాజశేఖరచరిత్ర మను కావ్యములోఁ గృతిపతిని సంబోధించుచు నిట్లు వ్రాసియున్నాడు:—

సుగంధి. పారదప్రభావిభాసిభద్రకీర్తివాహినీ
పూర! దానధూతదివ్యభూజకామధేను! దు
ర్వార! యాఱువేలవంశవార్ధిపూర్ణచంద్రమా!
సారబుద్ధిజాలనీత శత్రుభూమి భద్రమా! ఆ. ౨.

ఇటులఁ గవిచే సంబోధింపఁబడిన కృతిపతి నాదిండ్ల అప్పామాత్యుఁడు. ఈతఁడు కృష్ణదేవరాయునికి మంత్రియైన తిమ్మరసుకు జామాత యగుటచే నా మహానీయుఁడును ఆఱువేలనియోగియని సుస్థిరమగుచున్నది. ఈ యప్పామాత్యుఁడు తిమ్మరసుకుమార్తె యగు తిరుమలాంబికను పెండ్లియాడెను. ఈతఁడు కొండవీటికి దండనాథుఁడుగా నుండినటులఁ గానవచ్చుచున్నది. ఈతనితమ్ముఁడగు గోపన గుత్తిదుర్గమునకు దండనాథుఁడుగా నుండెను. ఇటుల శ్రీకృష్ణరాయలవారి కాలములో నియోగులుండుటయేగాక వారు మహోన్నతదశయందుండిరని స్పష్టపడుచున్నవి. కృష్ణదేవరాయలవారు క్రీ. శ. ౧౫౦౯ మొదలుకొని క్రీ. శ. ౧౫౩౦ వఱకు రాజ్యముచేసినందునఁ బదునాఱవ శతాబ్దప్రారంభమునను, పదునైదవశతాబ్దాంతమునందును ఆఱువేలవారు విజృంభించియుండిరని చెప్పవచ్చును. ఇదియుఁ గాక ముక్కుతిమ్మన 'ఆర్వేలపవిత్రకులుఁడు' అని వ్రాసియున్నాఁడు. ఆర్వేలశాఖను గుఱించి యింత ఘనతగాఁ జెప్పుకొనుటకు నది యప్పటికే మిక్కిలి పురాతనమైనదిగా నుండవలెను. అప్పుడు పుట్టినదిగాఁ గాని నూఱుసంవత్సరములకు లోపల పుట్టినదిగాఁ గాని యుండనోపదు. అందువలన ఈ శాఖ పదునాల్గవ శతాబ్దాంతమునఁ గూడ నుండెనని చెప్పవచ్చును.

ఇదియేగాక క్రీ. శ. ౧౪౮౭ వ సంవత్సరము మొదలు, క్రీ శ. ౧౫౦౭ వఱకు రాజ్యముచేసిన నరసింహదేవరాయల (ఈయన కృష్ణదేవరాయలతండ్రి) యాస్థానకవీశ్వరుఁడగు నంది మారుతకవి ముక్కుతిమ్మనకు మేనమామ. ఈ కవియొక్క నిజమైనపేరు ఘంటసింగయ్య. ఈతని మేనమామ నందిమల్లయ్య. ఇందువలనఁ బదియైదవశతాబ్దమధ్యమునఱ కుండిన యీ కవులందఱు నియోగులని మనము స్పష్టముగాఁ జెప్పవచ్చును; క్రీ. శ. ౧౪౨౮ వ సంవత్సరము రాజ్యమునకు వచ్చిన సాళువగుండ నృసింహపాలునికి నాదిండ్లప్పామాత్యుని ముత్తాతతమ్ముఁడైన చిట్టిగంగన్న మంత్రిగా నున్నటుల రాజశేఖరచరిత్రలోఁ జెప్పఁబడియున్నది. (ప్రథమాశ్వాసములోని కృతిపతివంశవర్ణన చూడుఁడు)

ఇందువలనఁ బదునాల్గవ శతాబ్దాంతమువఱకే యీశాఖ ప్రబలి యీశాఖవా రనేకు లనేకరాజులయొద్ద మంత్రిత్వ సేనాపతిత్వముల సంపాదించి ఆంధ్ర కర్ణాట దేశములలోని రాజ్యములను దమధీశక్తిచే మంత్రిత్వమున స్వాధీన పఱచుకొనిరని మనము చెప్పవచ్చును.*

---

* పైయంశములు వ్రాసి యచ్చునకుఁ బంపినతరువాతఁ బదునాల్గవ శతాబ్దాంతమునను, బదునేనవ శతాబ్దారంభమందును ఆఱువేలనియోగిశాఖ తెలుఁగు సీమలో మిక్కిలి ప్రబలియుండెనని చూపుటకు బలవత్తరమైన యాధారము కనుపించినది. అనంతామాత్యుఁడనుకవి భోజరాజీయ మను కావ్య మొకటి రచించెను. ఈతఁడు అనంతఛందస్సు, రసాభరణము అను రెండు లక్షణగ్రంథములనుగూడ రచించెను. భోజరాజీయములో నీతఁడు తనపూర్వుల వర్ణించుచుఁ బూర్వులలో నొక్కనికి నార్గురుకొడుకులు గలిగిరని చెప్పి యిట్లు ఉత్ప్రేక్షించియున్నాఁడు:—

క. ఈయార్వురు నొక్కొక్కఁడు
వేయిండ్లకు మొదలుగాఁగ వెలయుదురని కా
దే యాఱువేలపేరిడి
రీయన్వయమునకు నేవ్య మెఱిఁగినపెద్దల్.

[ప్రథమాశ్వాసము - ౬౫ వ పద్యము.

ఇందువలన నీకవి యాఱువేలనియోగియని స్పష్టము. ఈతఁడు శాలివాహనశకము ౧౩౫౬ వ సంవత్సరమునం దనఁగా క్రీస్తుశకము ౧౪౩౪ వ సంవత్సరమునందు రసాభరణమను అలంకారశాస్త్రమును రచించినటుల నా గ్రంథములోనే వ్రాసికొనెను. కావునఁ బదునాల్గవశతాబ్దాంతమునను, పదునైదవ శతాబ్దారంభమునను వైదికనియోగిభేద ముండెను అని నిశ్చయించుటకు నేమియుఁ సంశయము లేదు. ఇంతియ కాదు. పైని నుదాహరించిన పద్యములోని 'ఏవ్యము' అను పదమువలన ఆఱువేలనియోగు లంతకు మిక్కిలి పురాత;

శ్రీనాథుని కాలమును, అతని గ్రంథములును చూచినను పైసంగతియే స్థిరపడుచున్నది. శ్రీనాథుఁడు పదునాల్గవశతాబ్దాంతమునందును, పదునైదవ శతాబ్దారంభమునందును నున్నవాఁడు. ఈతఁ డాఱువేలనియోగి యైనటుల ఈ క్రిందిపద్యమువలనఁ గానవచ్చుచున్నది :—

పాఁకనాఁటింటివాఁడవు బాంధవుఁడవు
కమలనాభునిమనుమఁడ వమలమతివి

(భీమఖండము.)

పాఁకనాఁటివా రార్వేలవారిలోని వారని యిదివఱకే స్థిరపఱచినాము. గనుక పాఁకనాఁటివాఁ డనఁగాఁ బాఁకనాఁటార్వేల నియోగియని యర్థము స్పష్టము. పైపద్యములోని 'బాంధవుఁడవు' అను పదము ముఖ్యమైనది. ఇది

---

కాలమునుండియే యుండి రని మన మూహింపవచ్చును. ఆఱువేలశబ్దముపై నుత్ప్రేక్ష చేయుట చూడఁగా, ఆకాలపువారికిఁ గూడ ఆఱువేలశబ్దవ్యుత్పత్తి తెలియనంత పురాతనకాలముక్రిందనే యీశబ్దమును, తద్ద్యోతకమగు శాఖయుఁ బుట్టెనని తోఁచుచున్నది.

ఈ 'నియోగి' 'ఆఱువేల' శబ్దములను గూర్చి యొకవిశేష మిచ్చట వ్రాయవలసియున్నది. పూర్వపు ఆంధ్రకవులు ఆఱువేల పదమునే వాడిరి. కాని నియోగిపదమును వాడలేదు. పై వ్యాసములో నుదాహరింపఁబడిన పద్యములవలన ఈమాట చదువరులకుఁ దేటపడఁగలదు. నాలుగయిదువందల సంవత్సరములక్రింద అఱవదేశమునకుఁ బోయి యచ్చటనే యున్న యాంధ్రనియోగుల సంతతివారిని మీరెవరని యడిగిన మేము ఆఱువేలవారమని చెప్పెదరే కాని నియోగుల మని చెప్పరు. ఉత్తరసర్కారులలోనివారు మాత్రము మేము నియోగుల మని చెప్పెదరు. కావున మొదట నాఱువేలపదమే విశేషముగా వాడుకలో నుండెననియుఁ దరువాతఁ గొన్నిదినములకు నియోగిపదమునకుఁ బ్రాముఖ్యత వచ్చెననియు తోఁచెడిని.

కృతిపతియైన పెండపూడి యన్నయమంత్రి కవినిగూర్చి చెప్పినాఁడు. కావున క్రీ. శ. ౧౪౦౦ వఱకు ననఁగా నేఁటికి నైనూఱండల యేండ్లక్రిందనే నియోగులు కవిత్వ మంత్రిత్వముల స్వాధీనపఱచుకొని రని చెప్పుటకు సందేహము లేదు. ఇట్లు మనము విజయనగరరాజులలోని రెండవ హరిహరరాయల రాజ్యకాలమువఱకు వచ్చిచేరితిమి. ఇఁక నింతకుఁబూర్వ మీ వైదికనియోగివిభేద మున్నదా లేదా యని మనము విచారింపవలసియున్నది. కాని యింతకుఁ బూర్వపు గ్రంథములలో ఆఱువేలవారనిగాని, పాఁకనాఁటివారనిగాని యుండదు. కావున మనము పదునాల్గవ శతాబ్దమునకుఁ బూర్వపు నియోగులను మఱియొక లింగము (గుర్తు)చేఁ గనుఁగొన వలసి యున్నది. గ్రంథాదులలో నుపయోగింపఁ బడిన 'అమాత్య', 'మంత్రి', 'సచివ', 'దండనాథ' మొదలగు పదముల వలన మనము ఆవర్ణనకు విషయభూతుఁ డగు పురుషుఁడు నియోగి యని నిశ్చయింపవచ్చును. పల్లెకరణమైనను అత్యంతముబీదవాఁ డయినను నియోగి తన పేరుతోఁ గలిపి 'అమాత్య' పదము వ్రాయును. ఇది యొక విశేషము. కావున దీనిని పట్టి మనము మనయైతిహాసికపరిశోధన (Historical Investigation) చేయవచ్చును. కాని యీపద్ధతిని గుఱించి శ్రీవిద్యారణ్య చరిత్రలో మ. రా. రా. వావిలాల శివావధానులు బి. ఏ. గా రొక యాక్షేపణ చేసియున్నారు. నియోగి వైదిక విభేదములేని మహారాష్ట్రులు, ఇతర దేశస్థులు కూడ నిజముగా మంత్రులుగానుండి అమాత్యపదము నుపయోగించిరనియు, ఆంధ్రులలోని వైదికులు నిజముగా మంత్రిపదమును జేపడినవారేల 'అమాత్య' పదప్రయోగము చేసి యుండకూడదనియు, అందుచే 'అమాత్య' పదమువలన వీఁడు నియోగియని నిశ్చయించుటకు వీలులేదనియు వారువ్రాసిరి. ఈయాక్షేపణ కొంతవఱకు నిజమైనదియె. కావున నిది గ్రాహ్యమే. మనము ప్రస్తుతవిచారణలో నియోగి యని చెప్పఁదలఁచిన పురుషుఁడు ఆంధ్రబ్రాహ్మణుఁడుగా నుండవలయును. 'అమాత్య' పదవాచ్యుఁడుగఁ గాని, తదర్థక పదవాచ్యుఁడుగఁ గాని యుండవలెను. ఏరాజునొద్దను మంత్రిగా నుండఁ గూడదు. ఇన్ని లక్షణము లేకీభవించినయెడల శ్రీ వావిలాల శివావధానులు

గాని యాక్షేపణ యచ్చట వర్తింప నేరదు. కావున మన పేరంగుణవిశిష్టు లనే ప్రస్తుతవిచారణలో గ్రహింతము.

ఇట్టివారిలో మొదటివాఁడు బమ్మెరపోతరాజు. ఈతఁడు ఆంధ్రబ్రాహ్మణుఁడనియు, అత్యంతము బీదవాఁడనియుఁ, కృషీవలన జీవనము చేయుచుండె ననియు నందఱెఱిఁగినదియే. ఈతఁడు తనభాగవతములోను, ఇతరు లీతని గుఱించి యితరగ్రంథములలోను, 'పోతనామాత్యుఁ'డని వాడియున్నారు. కావున నీతఁడు నియోగియని స్పష్టముగఁ జెప్పవచ్చును. ఈతఁడు శ్రీనాథునికి సమకాలీనుఁడైనను, ఆతనికంటె నిరువది ముప్పది సంవత్సరములు పెద్దవాఁడు. ఈతఁడు శాలివాహనశకము ౧౩౦౦ ల సంవత్సరమునం దనఁగా క్రీ. శ. ౧౩౭౮ వ సంవత్సరమునందు జనన మొందినట్లు తెలుఁగు భాగవతమును ముద్రించినవారు పీఠికయందు వ్రాసియున్నారు. ఇది విజయనగరరాజయిన మొదటి బుక్కరాయలకాలము. ఈ బుక్కరాజు నొద్దనే శ్రీమాధవాచార్యులవారు మంత్రిగానుండిరి. కావున శ్రీవిద్యారణ్యులవారికాలమున ఆంధ్రబ్రాహ్మణులలో వైదిక నియోగి విభేదము లేక యుండెనని శ్రీవావిలాల శివావధానులుగారు వ్రాసినమాట మనము సంశయింపవలసి యున్నది. ఇటుల బదునాల్గవ శతాబ్దమును శోధించి పిదప పదమూడవ శతాబ్దమునకుఁ బోవుదము.

పదమూడవ శతాబ్దములోని యాంధ్ర బ్రాహ్మణ మార్తాండుఁ డనఁదగువాఁడు కవిబ్రహ్మ యైన తిక్కనసోమయాజి. కాని యీతఁడును, ఈతని తండ్రి తాతలును, రాజులయొద్ద నిజముగా మంత్రులయి యున్నందునే యీతని గ్రంథములలోని అమాత్యపదము లన్వర్థకములు. శ్రీ అవధానులవారి యాక్షేపణ విషయములు. కావునఁ బ్రస్తుత విచారణలో మన కుపయోగపడ నేరవు.

పైనఁ జెప్పిన కారణముచేఁ దిక్కన సోమయాజికాలమున నియోగు లుండిరా లేదా యని శోధించుటకు మనము వేఱుమార్గములఁ జూడవలెను. అందుఁ గొన్నిఁటి నిచ్చట నిచ్చుచున్నాను.

౧. తిక్కన సోమయాజివంశపువా రిప్పుడు నెల్లూరు మండలములోని పాటూరు అనుపల్లెయందు గణములుగను, పాకనాటిూర్వేలవారుగను నున్నారు. కావున వారి పూర్వుఁడగు తిక్కనయు నియోగియై యుండవలెను అని మన మూహింపవచ్చును.

౨. అనంతామాత్యుఁడను కవి భోజరాజీయములోఁ దనవంశమును వర్ణించుచుఁ దన ముత్తాత యగు బయ్యనను గుఱించి యీ ప్రకారము వ్రాసి యున్నాడు:—

చ. క్షితిఁ గ్రతుకర్తృతామహిమ జేకొని పంచమవేదమైన భా
 రతముఁ దెనుంగుబాస నభిరామముగా రచియించినట్టి యు
 న్నత చరితుండు తిక్కకవినాయకుఁ డాదట మెచ్చి భవ్య భా
 రతి యనఁ బేరుగన్న కవిరత్నము బయ్యనమంత్రి యల్పుఁడే.

ఈ పద్యమువలన అనంతామాత్యుని పూర్వుఁడగు బయ్యనామాత్యుఁడు తిక్కన సోమయాజి సమకాలీనుఁడని స్పష్టముకదా. అనంతామాత్యుఁడు తా నాఱువేలవాఁడ నని స్పష్టముగా వ్రాసియున్నాఁడు. (ప్రథమాశ్వాసము-౨౮-వ పద్యము చూడుఁడు) కావున ఈతని ముత్తాతయగు బయ్యనయు నాఱువేలనియోగి యని మనము నిశ్చయింపవచ్చునుగదా! ఇదియుఁగాక యీ కవివంశములో నెవ్వరును మంత్రులు గాకపోయినను అందఱికి నీతఁడు 'మంత్రి' 'అమాత్య' పదములఁ బ్రయోగించియున్నాఁడు. బయ్యన మంత్రి గాకపోయినను ఈతనిని అనంతకవి 'మంత్రి' 'చమూపతి' పదములతో గౌరవించి యున్నాఁడు. కావునఁ దిక్కన సోమయాజికాలమునఁ గూడ నాఱువేల నియోగిశాఖ యుండెనని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

ఇటులఁ బండ్రెండవ శతాబ్దాంతిమునకుఁ బరిశోధన చేసి యింకను నంతకుఁ బూర్వకాలపు వాఙ్మయమును పరిశీలించి చూడఁగాఁ బదునొకండవ శతాబ్దములో నన్నఁగా నన్నయభట్టు, రాజరాజనరేంద్రుల కాలములో వైదిక

నియోగిశాఖాభేదంబులున్నటులఁ గానవచ్చుచున్నవి. ప్రస్తుతము మనకుఁ తెలిసినంత వఱకు నాంధ్రవాల్మీకి యనఁదగు నన్నయభట్టును, ఆతనికి నాంధ్ర భారతరచనలో సహాయుఁ డయిన నారాయణభట్టును వైదికశాఖీయులని మనము భట్టపద ప్రయోగమువలన నూహింప వచ్చును. నన్నయభట్టు నియోగి యని యొకానొకరుసాధింప యత్నించిరి. కాని యట్లు సాధించుట యసాధ్యము. భట్టపదప్రయోగమే గాక నన్నయ తాను రాజరాజనరేంద్రుని వంశమునకు రాజపురోహితుఁడ నని 'తనకుల బ్రాహ్మణ' అను పదముచే భారతములోనే చెప్పియున్నాఁడు. కావున ఆంధ్రభాషావధూటికి జనకుఁడై, వాగనుశాసనుం డను ప్రౌఢబిరుదుచే శోభితుఁ డగు నన్నయ తమవాఁడని చెప్పుకొను గౌరవ వైదికులకే గలదని నొక్కి వక్కాణింపవచ్చును.

ఆ కాలమున నియోగిశాఖ యున్న దనుటకు పావులూరు మల్లనకృతమైన గణిత మొక నిదర్శనము. మల్లన రాజరాజ నరేంద్రునివలన నగ్రహారము వడసినవాఁడు కావున నన్నయభట్టునకు సమకాలీనుఁడు. ఈతఁడు తన గ్రంథములోఁ దనను గుఱించియుఁ, దన పూర్వులను గుఱించియుఁ జెప్పియున్నాఁడు. అం దొకరును ఏరాజునొద్దనైనను మంత్రులుగా నుండినటులఁ జెప్పుకొని యుండలేదు. అందుచే నీతఁడు మంత్రి కాఁడనుట స్పష్టము. అయినను తన గ్రంథముయొక్క యాశ్వాసాంత గద్యములో 'పావులూరి మల్లనామాత్య ప్రణీతం బైన దశవిధ గణితశాస్త్రంబునందు' అని వ్రాసియున్నాఁడు. ఇందువలన నీతఁడు నియోగి యనియు, ఆకాలమందు నియోగి వైదిక శాఖాద్వైధం బుండె ననియు మనమూహింపవచ్చును.

రాజరాజ నరేంద్రుఁడు క్రీ. శ. ౧౦౨౨ మొదలు ౧౦౬౩ వఱకు రాజ్యముచేసినటుల శాసనాదులనుబట్టి నిర్ణయింపఁబడినది. కావునఁ బదునొకండవ శతాబ్దారంభమందును, పదవ శతాబ్దాంతము వఱకును అనగా నేఁటికిఁ దొమ్మిది వందల సంవత్సరముల క్రిందికాలమువఱకు మనము వచ్చియున్నాము.

నన్నయభట్టుకుఁ బూర్వకాలపు తెలుఁగుపాత్రంబు లేమియుఁ గాన రావు. కావునఁ బదునొకండవ శతాబ్దమునకుఁ బూర్వము ఆంధ్రబ్రాహ్మణులలో రెండు తెగ లుండెనా లేదా యని విచారించునెడ శాసనంబులు తప్ప వేరుమార్గంబు లేదు. కాని శిలాతామ్రశాసనములు రాజులచే వ్రాయింపఁబడిన వగుటచే వానియందుఁ బ్రస్తుతవిచారణకు నుపయోగకరంబులగు నంశములుండవు. కావునఁ బ్రమాణాభావంబుకతన మన మీ విచారణ యింతటిలో నాపివేయ వలసినదియే. కాని చాళుక్యరాజుల యొకానొక శాసనములోఁ బ్రస్తుత విషయమునకు నుపయోగకరమగు ఒక చిన్నవాక్యము కనుపించినది. దానిని ఇచ్చట నుదాహరించెదను. ఇది తూర్పు చాళుక్యవంశజుఁ డగు సర్వలోకాశ్రయ మహారాజుచేఁ గొందఱు బ్రాహ్మణులకు నొకగ్రామ మిచ్చుచు నీయఁబడిన తామ్రశాసనము. ఇది నెల్లూరు మండలములో దొరకినది. ఎపిగ్రేఫియా ఇండికా యనఁబడు త్రైమాసపత్రికయొక్క ౯వ సంపుటములోని నాల్గవ సంచిక (1906 ఏప్రిల్) యందుఁ బ్రచురింపఁబడినది. అందలి మూడవపటలము (Plate) లోని రెండవ పుట (side) లో నిట్లు వ్రాసియున్నది:—

'పరమబ్రహ్మణ్యః మహారాజానుభావ శ్రీ సర్వలోకాశ్రయ మహారాజః కమ్మరాష్ట్రే చెన్దలూఱుగ్రామే గ్రామేయకాన్ అత్రగత సర్వనైయోగికవల్లభాం శ్చాజ్ఞాపయతి.'

అర్థము:—బ్రాహ్మణులయెడ మిక్కిలి విధేయుండును, మహారాజానుభావశ్రీ బిరుదాంకుడును అగు సర్వలోకాశ్రయ మహారాజు కమ్మరాష్ట్రములోని చెన్దలూరుగ్రామవాసులను, అచ్చటనున్న సర్వనైయోగికవల్లభులను ఆజ్ఞాపించుచున్నాఁడు.

ఇందులోని 'నైయోగికవల్లభా' అనుపదము నూఱువరహాలు వెలగలది. అందువలన నాకాలమున నియోగులనువా రుండుటయే గాక వారు రాజకీయోద్యోగములలో వల్లభులుగా నుండిరనియుఁ దేలుచున్నది.

ఈ సర్వలోకాశ్రయ మహారాజునకే మంగియువరాజని నామాంతరము. ఈతఁడు పూర్వచళుక్యరాజులలో నైదవవాఁడు. ఈతఁడు రెండవ విష్ణువర్ధనుని కుమారుఁడు. ఇంద్రభట్టారకుని మనుమఁడు; కుబ్జవిష్ణువర్ధనుని మునిమనుమఁడు. ఈతఁడు క్రీ. శ. ౬౭౨ వ సంవత్సరము మొదలు ౬౯౬ వ సంవత్సరమువఱకు ననఁగా నిరువదియైదు సంవత్సరములు రాజ్యము చేసెను. ప్రస్తుత శాసన మీతఁడు క్రీ. శ. ౬౭౩ వ సంవత్సరమున అనగా నాతఁడు రాజ్యమునకు వచ్చిన రెండవ సంవత్సరమున చెక్కించెను. ఈ యంశము లన్నియు శాసనములవలన స్థిరపడిన యంశములు. కనుక నేడవ శతాబ్దములో ననగా నేటికిఁ బండ్రెండువందల సంవత్సరముల క్రిందట నియోగిశాఖ యస్థిత్వములో నుండెనని మనము నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

ఇట్లు ఆంధ్రదేశములోని నియోగిశాఖ బహుపురాతనకాలమునుండి యుండెనని చూపుట యైతిహాసికపరిశోధన (Historical research) లాలసచేతనే యనియు, ఒక శాఖయందుఁ గల విశేషాభిమానముచేతఁగాని, మఱియొకశాఖయందుఁ గల యసూయచేతఁ గాని కాదనియుఁ జదువరు లెఱుంగుదురుగాక. ఉభయశాఖలవారును, ఆశాఖలలోని యుపశాఖలవారును నాకు సమానులె.

ఇటీవలి వారు కొందఱు పరశాఖాద్వేషప్రాధాన్యులయి నియోగ వైదిక శబ్దములకు విశేషార్థములును, విపరీతార్థములను గల్పించిరి. కాని కేవల కల్పనాసృష్టిలోని యాఘాందసవ్యుత్పత్తులతో మనకుఁ బ్రయోజనము లేదు. పూర్వగ్రంథములలో బ్రాహ్మణులకు రెండు ఉద్యోగములు విధింపఁబడి యున్నవి. ఒకటి రాజులకుఁ బురోహితుఁడై యుపనయనాది గృహ్యసంస్కారములును, యజ్ఞయాగాదిక్రతువులును చేయించుట. రెండవది రాజులయొద్ద మంత్రులుగాను, న్యాయసభలలో సభాసదులుగాను, ఇతర రాజకీయాధికారులుగాను ఉండి రాజ్యమును గాపాడుట. భరతఖండములోని యితరదేశములలోను వలెనే యాంధ్రదేశములో నీ రెండు పనులును

బ్రాహ్మణులు చేయుచుండిరి. కాని యీ దేశమందుఁ గొన్ని దినములకు వీ రుభయులు రెండుతెగలవారై వీరిలో భోజనాదులున్నను వివాహసంబంధములు లేకుండనయ్యెను. పౌరోహిత్యముచేయుచు వేదమువలన జీవనముచేయువారు వైదికు లయిరి. గ్రామకరణీకము మొదలు మంత్రిత్వమువఱకుఁ గల సకల రాజకీయోద్యోగములు చేయువారు నియోగులయిరి; ఇంతియకాని వీరిలో భేద మేమియు లేదు. ఒకరు వేదవిద్యను గీర్వాణభాషను గాపాడిరి. మఱియొకరు ఆంధ్రరాజ్యములను, ఆంధ్ర కవిత్వమును రక్షించిరి. ఇట్లు వీరిరువురును శ్రమ విభాగన్యాయము (Division of labour) ననుసరించి దేశక్షేమమున కవ సరము లయిన కార్యము లన్నియుఁ జేయుచుండిరి. ఇదియుఁగాక శ్రీ విశ్వ పతి శాస్త్రిలు, శ్రీ నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితుల కాలము వఱకును వైదిక నియోగి శాఖవారికి నన్యోన్యమైత్రియేకాని వైరము లేదు. కలహము పుట్టించి పెంచుటలో నెవ్వరు ప్రముఖులుగా నుండిరనిన విషయము ప్రస్తు తము విచారించుట యనావశ్యము. ఎట్లు లుద్భవించిననేమి? ఈ వైరాగ్ని విశేషము ప్రజ్వరిల్లక యున్నందులకు మనము సంతసించి, యాంధ్రబ్రాహ్మ ణులలోని యీ రెండుశాఖలను, వీనిలోని యుపశాఖలను గలిపి యాంధ్ర బ్రాహ్మణ ప్రపంచమంతయు నొక్కటిగాఁ జేయఁ బ్రయత్నింపవలయును. నిజముగా బ్రాహ్మణధర్మమునందు నమ్మిక కలవారు, ఏశాస్త్రములలోను లేని యశాస్త్రీయములును, తస్మాత్ అధార్మికంబులును నగు వైదిక, నియోగ, వేఁగినాఁటి, వెలినాఁడు మొదలయిన యాంధ్ర బ్రాహ్మణులలోని యంతర్భేద ముల నశింపఁజేసి, వీరందఱి సమ్మేళనము గావించి యాంధ్రబ్రాహ్మణుల నందఱిని నొక్క కుటుంబమువారిని జేయుట తమ ప్రథమకర్తవ్యముగ నెంచ వలయును.

ఈ నియోగి వైదిక సమ్మేళన మసంభవము కాదు. ఈ భేదమునకు శాస్త్రమునందు ఆధారము లేదు. ఇది స్వకపోల కల్పితము. కావున వీరిని గలుపుట కాక్షేపణ యుండదు. పీఠస్థులును ఒప్పుకొనిన విషయమే. ఇందుకు

బహిష్కారభీతి లేదు. ధర్మమునకు దేశమునకు నుపయోగకరమైన సంగతి, కన్యాపుత్రవివాహాదులకును మిక్కిలి వీలు కలుగును. ఆంధ్రవివైదికభ్యముఁ జేసి శ్రుతిస్మృతిచాతుర్వర్ణ్యములలో మొదటిది యగు బ్రాహ్మణ్యమునకు బలంబును, తద్వారా గౌరతయు, ధర్మాభిమానులును దేశాభిమానులును గలిగింతురుగాత.

ఈ రెండు శాఖలవారును ఒకరికినొకరు పిల్లనిచ్చి పుచ్చుకొనుటకు వారివారి నిరాధారము లగు స్వాతిశయములు తప్ప మఱియే కారణమును లేదు. మే మధికులమని వైదికు లనుకొనియెదరు; మే మధికులమని నియోగు లనుకొనియెదరు. మొదటినుండియు వీ రుభయులును సమాను లని పైన వ్రాసియే యున్నాము. ఒకవేళ వీరుభయు లనుకొనినటుల నేదో హేతువుచేత వీరిలో నొక్కొకరు ఇతరులకంటె నధికులుగాఁ బూర్వముండినప్పటికి నేఁడా యాధిక్యతకుఁ జోటులేదు. ఇప్పుడు పరిస్థితి (circumstances) యంతయు మారిపోయినది. వైదికులు తామధికులమని యేల యనుకొనియెదరు? నియోగులకంటెఁ దమకు వైదికవిద్య యెక్కువ వచ్చుననిగదా? ఈ యంశము పూర్వకాలమందు నిజమైనను నేఁడు నిజముకాదు; వేదవిద్య వారిలో మిక్కిలి తగ్గిపోయినది. ఇంగ్లీషు నేర్చి పూర్తిగ లౌకికు లయినవారిని విడచివేసినను, వైదికులలోఁ బ్రతిదినము తప్పక సంధ్యవార్చువారు నూటికి నిరువదియైదు గురి కంటె నెక్కుడుండరని చెప్పిన నతిశయోక్తి కానేరదు. ఇదియుఁ గాక యనేక నియోగులు ప్రస్తుతము వేదాధ్యయనాదికములను చేసి మీసములు దీసి ఆధానములుచేసి శ్రోత్రియులయియున్నారు; కావున ఈ విషయమై యీ యుభయ శాఖలవారికి విశేషతారతమ్యము లేదు. ఇందుచే వైదికులు తమశ్రోత్రియత్వమే కారణముగాఁ గల యాధిక్యతను మఱవవలెను.

ఇటులనే నియోగులు కూడ తామధికులమని యనుకొనఁగూడదు. వీరు తామధికుల మనుకొనుటకుఁ గారణ మేమి? తాము లౌకికధూర్వహుల మనియు, రాజకీయాధికారములచే శోభితులమనియు, రసికులమనియు, వైదికు లట్టివారుగాక యాచనయే జీవనాధారముగాఁ గలిగి లౌకికజ్ఞానము లేని యుర

సికు లనియుఁ గదా వీరి తాత్పర్యము. ఈ యంశములు పూర్వకాలమున నెంత నిజమైనను నేఁడు నిజములు కావని యందఱకిఁ దెలిసిన విషయమే. ప్రస్తుత మనేక వైదికులు ఇంగ్లీషులో గొప్ప పరీక్షల నిచ్చి తహాసీల్దారు, డిప్యూటీ కలెక్టరు మొదలైన గొప్పయుద్యోగములను జేయుటయు, వారి యింట్లో నియోగి యగు సింగన్న పంతులుగారు పాకాధ్యక్షుఁడుగా నుండుటయు మనము ప్రత్యక్షముగా నిప్పుడు చూచుచున్నాము. ఇట్టి సింగన్న పంతులు గారు 'నేను అమాత్యపదవికి నర్హుఁడను. కావున ఈ వైదికుకంటె శ్రేష్ఠుఁడ'నని చెప్పినయెడల హాస్యాస్పదముగ నుండదా? కావున మన మిట్టి గర్వము విడువ వలెను. ప్రస్తుతము వైదికమునందేమి లౌకికమునందేమి యందఱును సమానులయి నారు. కావున వీరందఱు భిన్నశాఖలుగా నుండుటకంటె నేకశాఖగా నుండు టయ మంచిది. దేశమందు నైక్యభావము నభివృద్ధిచేయఁగోరు మహానుభావులు గాని, ధర్మాభివృద్ధిచేయఁగోరు శ్రోత్రియులుగాని యీ సులభమైనట్టియు, శాస్త్రీయమైనట్టియు సకలాంధ్రబ్రాహ్మణులకు నుపయోగకరమైనట్టియు సంస్కరణము గురించి శ్రద్ధతోఁ బనిచేయఁ బూనెదరుగాక.



# శ్రీనాథుని గ్రంథముల కాలనిర్ణయము *

[“హరవిలాసము” ననుసరించి]

శ్రీనాథమహాకవిప్రణీతకావ్యములలో హరవిలాస మనునది యొకటి. ఈ మహాకావ్యముయొక్క యొకప్రతియుఁ దెనుఁగుదేశమునందు లేకుండ లోపించియుండెను. సీతారామాచార్యుల కాలమున దీనిని ఆంధ్రలోకమెఱుఁగదు. అఱవదేశములో, తంజావూరు పుస్తకభాండాగారమునందు దానిని సంపాదించి యాంధ్రులకొసంగిన యశస్వి శ్రీ వీరేశలింగము పంతులుగారిది. దానిని మొదటఁ బ్రకటించిన గౌరవము సరస్వతీపత్రికాధిపతులది.

హరవిలాసమనునది శివమాహాత్మ్యమును వర్ణించునట్టి యేడాశ్వాసముల పద్యకావ్యము. ఇది యవచితిప్పయసెట్టికి నంకితము చేయఁబడినది. కొండవీటిని ౧౩౮౦-౧౪౦౦ వఱకుఁ బాలించిన కుమారగిరియొద్ద నీ సెట్టి సుగంధభాండాగారాధ్యక్షుఁడుగ నుండెను. కవివర్ణన యతిశయోక్తులు కావేని యితఁడు ద్వీపాంతరములతోను, దేశాంతరములతోను వర్తకముచేయుచుండిన కోట్యధీశుండుగఁ గానవచ్చుచున్నాఁడు. కావునఁ జరిత్రవిషయమున ఈ కావ్య మధికాదరణీయము. కాని ప్రస్తుత మావిషయమును గుఱించి విచారింపఁదలఁపలేదు. ఈ కావ్యమునందు శ్రీనాథుని కావ్యముల కాలనిర్ణయము చేయుటకు మంచిసాధనముకలదు. అందునుగుఱించి యిచ్చటఁ గొంత చర్చించెదను.

కృతిపతియొక్క తమ్ముఁడైన తిరుమలసెట్టిని వర్ణించుచుఁ గవి యిట్లు వ్రాసియున్నాఁడు:—

చ. హరిహరరాయ ఫేరొజిసహా సురథాణ గజాధిపాది భూ
వరులు నిజప్రభావ మభివర్ణనసేయఁ గుమారగిర్యధీ

* ‘గ్రంథాలయసర్వస్వము’—ద్వితీయ సంపుటము, ప్రథమసంచిక.

శ్వరుని వసంతవైభవము సర్వము నొక్కఁడె నిర్వహించు మా
తిరుమలనాథసెట్టికిని ధీగుణభట్టికి నెవ్వరీడగున్.

ఈపద్యమునందు ముగ్గురు సమకాలికులయిన రాజులపేళ్లు చెప్పఁబడి యున్నవి. వీరిలో హరిహరరాయలు విజయనగరాధీశుఁడు. ౧౩౭౭ మొదలు ౧౪౦౪ వఱకు రాజ్యముచేసెను. 'ఫేరోజిసహా' బహమనీరాజు. ౧౩౯౭ మొదలు ౧౪౨౨ వఱకు రాజ్యముచేసెను. కుమారగిరి కొండవీటిరాజు. ఈతఁడు శ్రీజయంతి రామయ్యగారి మతమున ౧౩౭౮ మొదలు ౧౩౯౮ వఱకు రాజ్యముచేసెను *; శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి మతమున ౧౩౮౩ మొదలు ౧౪౦౦ వఱకు రాజ్యముచేసెను†. ఈ ముగ్గురు రాజులు బ్రతికి యుండి స్వస్వరాజ్యములను పాలించుచుండిన కాలము శ్రీజయంతి రామయ్యగారి యభిప్రాయప్రకారము ౧౩౯౭-౧౩౯౮ రెండు సంవత్సరములు. శ్రీ వీరభద్రరావుగారి యభిప్రాయప్రకారము ౧౩౯౭-౧౪౦౦ నాలుగు సంవత్సరములు. ఇట్లు హరవిలాస నిర్మాణకాలము మనము ఒకరెండు సంవత్సరముల అంతరములో సరిగఁ గనుఁగొనఁ గలిగితిమి. ౧౪౦౦ వ సంవత్సర ప్రాంతమున ననఁగా ౧౩౯౮ లోనో ౧౩౯౯ లోనో, కుమారగిరి ప్రభుత్వపుఁ జివరకాలమున, ఈకావ్యము వ్రాయఁబడినదని స్పష్టపడుచున్నది. దీనినిబట్టి యితర కావ్యములయొక్క కాలనిర్ణయము చేయవచ్చును.

శ్రీనాథకృతమైన కాశీఖండమునందు ఈక్రిందిపద్యము కలదు:—

సీ. చిన్నారిపొన్నారి చిఱుతకూకటినాఁడు రచియించితిని మరుద్రాట్చరిత్ర
నూనూఁగుమీసాల నూత్నయౌవనమున శాలివాహనసప్తశతి నొడివితి
సంతరించితి నిండుజవ్వనంబునయందు హర్షనైషధకావ్య మాంధ్రభాషఁ
బ్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁగొనియాడితిభీమనాయకునిమహిమ

---

* Epigraphia Indica Vol. VIII page 13.

† ఆంధ్రుల చరిత్రము; ౩-వ భాగము, ౧౮౧ వ పుట.

తే. ప్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండఁ
గాశికాఖండ మనుమహాగ్రంథమేను
దెనుఁగుచేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి.

ఈ పద్యమునందలి "చిన్నారిపొన్నారి చిఱుతకూకటి"కిఁ బదునాఱేండ్లనియు, "నూనూఁగు"నకు నిరువదియైదేండ్లనియు, "నిండుజవ్వనము"నకు ముప్పదియైదనియు, "వయఃపరిపాకము"నకు అఱువదియేండ్లనియు మనము సాధారణముగ నర్థముచేసికొనవచ్చును. హరవిలాసమునందు నైషధము పేర్కొనఁబడినది. కావున హరవిలాసమునకుఁ బూర్వ మైదేండ్లక్రింద నైషధము రచింపఁబడిన దనుకొందము. హరవిలాసమునకు మనము ౧౪౦౦ ల ప్రాంతము కాల మేర్పఱచినందున, నైషధకాలము ౧౩౯౫ అగును. అప్పటికి శ్రీనాథుఁడు ౩౫ సంవత్సరములవాఁడనుకొనిన ౧౩౬౦ వ సంవత్సరప్రాంత మాతని జన్మకాల మగును. ఇఁక మరుద్రాట్చరిత్ర ౧౩౭౬ లోను, శాలివాహన సప్తశతి ౧౩౮౫ లోను, నైషధమందుఁ బేర్కొనఁబడిన పండితారాధ్యచరిత్రము ౧౩౮౫ లోను, భీమఖండము ౧౪౨౦ లోను, కాశీఖండము ౧౪౩౦ లోను రచింపఁబడి యుండవచ్చును. "శివరాత్రి మాహాత్మ్యము" అను శ్రీనాథరచితకావ్య మొకటి ఆంధ్రసాహిత్య పరిషత్తువారికి దొరకినది. అది భిక్షావృత్తియను జంగముల మఠమువారికి సంకిత మొనర్పఁబడినది. దానినిగుఱించి మనకు నధికము తెలియువఱకును అది ౧౪౩౫ ప్రాంతమున రచింపఁబడినట్లు మన మెంచుకొందము. ౧౪౧౦ లో ఫిరంగిపురశాసనమును, ౧౪౧౩ లో ఆలపాడు తామ్రశాసనములును, ౧౪౧౬ లో అమీనాబాదు శాసనమును—శ్రీనాథుఁడు కొండవీటిరెడ్లయొద్ద విద్యాధికారిగ నుండి రచించినట్లు కనఁబడుచున్నది*. శ్రీనాథుఁడు ౧౪౪౦ ప్రాంతమునఁ గీర్తిశేషుఁడైనట్లు మన మూహింపవచ్చును. ఏలయన, "కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి"

* Epigraphia Indica Vol. XI. P. 315.

యను చాటువువలన నీతఁడు రాజమహేంద్రవరము రెడ్డి ప్రభుత్వము అంతరించువఱకు నుండెననియు, తరువాతఁ గొద్దికాలములోనే మృతుఁడయ్యెననియు అనుకొనవచ్చును. అల్లాడ వేమారెడ్డి శాసనములు ౧౪౩౭-౩౮ తరువాతఁ గానవచ్చుటలేదు1. వీరభద్రారెడ్డి శాసనములు ౧౪౩౩-౩౪ తరువాతవి లేవు2. ౧౪౪౩-౪౪ వఱకు రాజమహేంద్రవరము విజయనగరరాజుల పాలయినట్టును, రెడ్డిప్రభుత్వ మంతరించినట్టును మనము రెండవ దేవరాయల ద్రాక్షారామ మందలి శాసనమునుబట్టి నిశ్చయింపవచ్చును2. కావున శ్రీనాథుఁడు ౧౪౪౦ కంటెఁ దరువాతఁ బ్రతికియున్నట్టు నిదర్శనములేవియు లేవు. శ్రీనాథుఁడు మొత్తముమీఁద నెనుబదిసంవత్సరములు బ్రతికియుండెనని తేలుచున్నది. ఇట్లు పైని శ్రీనాథునిగుఱించి మనము తెల్సుకొన్న కాలములన్నియు నీ క్రింది విధముగ పట్టికారూపమున నీయవచ్చును.

క్రీ. శ. ౧౩౬౦ జన్మకాలము.
౧౩౭౬ మరుద్రాట్చరిత్ర రచనాకాలము.
౧౩౮౫ శాలివాహనసప్తశతి కాలము.
౧౩౯౫ ఆంధ్రనైషధకాలము.
౧౪౦౦ హరవిలాసకాలము.
౧౪౧౦ ఫిరంగిపురశాసనకాలము.
౧౪౧౩ ఆలపాడుతామ్రశాసనకాలము.
౧౪౧౬ అమీనాబాదు శాసనకాలము.
౧౪౨౦ భీమఖండకాలము
౧౪౩౦ కాశీఖండకాలము.
౧౪౩౫ శివరాత్రిమాహాత్మ్యకాలము.
౧౪౪౦ మరణకాలము.

1 Annual Report on Epigraphy for 1900 p 25, and Ibid for 1894 P. 19.

2 Annual Report for 1900 P. 25, paras 64 and 65.

పల్నాటివీరచరిత్రమును ఎప్పుడు వ్రాసినది తెలియదు. అయినను హరవిలాసము రచించిన కాలము (౧౪౮౦) మొదలుకొని భీమఖండము రచించిన కాలము (౧౪౨౦) వఱకును వేఱు కావ్యములు రచించినట్లు కానరాదు. కావున ఆకాలమునందు నీగ్రంథమును శ్రీనాథుఁడు రచించియుండునని మన మూహింపవచ్చును.

పైని చెప్పినదంతయు హరవిలాసముయొక్క నిర్మాణకాలమును బట్టి చేయఁబడిన యూహ. కాని హరవిలాసము కుమారగిరిరెడ్డికాలమునందు రచింపఁబడలేదనియు, శ్రీనాథుని చరమదశయందు వ్రాయఁబడియెననియుఁ జెప్పు పూర్వపక్షమొకటికలదు. ఇదివఱకు శ్రీనాథునిగుఱించి వ్రాసినవారందఱును ఇట్లే వ్రాసినారు*. కాని యిందుకు వారు కారణములను ఇచ్చియుండలేదు. మన మాకారణములను ఊహించి నివారింపవచ్చును. హరవిలాసము చివరగ్రంథముగ నెంచుటకును, ౧౪౦౦ లో రచింపఁబడినది కాదనుటకును హరవిలాసగ్రంథమునందు నేవిధమైన యాధారమును కానఁబడదు. అది కుమారగిరియొక్క పెద్దసెట్టికి సంకితము చేయఁబడినది. కావున నది కుమారగిరి కాలమునందే రచింపఁబడె ననుకొనుట స్వాభావికము. కుమారగిరి చనిపోయినతరువాత ౩౦ సం

---

* హరవిలాసమును మొదట బ్రకటించినవారు (శ్రీపోలవరము జమీన్దారుగారు) "హరవిలాసము ౧౪౪౦ ప్రాంతములను రచించినట్లు స్పష్టమగుచున్నది" యని వ్రాసిరి. 'శ్రీనాథుని చారిత్ర'మును బహుమతివ్యాసము వ్రాసిన శ్రీ కూనపులి లక్ష్మీనరసయ్యగారు తమగ్రంథమునందు "(హరవిలాసము) ఈతని యంతిమగ్రంథమని నేనూహించెదను" (౩౭-వ పుట) యని యభిప్రాయపడిరి. శ్రీ వెంకటరాయశాస్త్రిగారు దీనిని శ్రీనాథుని చివరగ్రంథముని యభిప్రాయపడిరి (సర్వంకష టీక, పుట ౧౦). 'పెదకోమటిభూపాలుఁడు మరణమునొందిన తరువాత తాను రాజమహేంద్రపురముఁ జేరకమునుపు హరవిలాసమును రచించి......తిప్పయసెట్టి కంకితముగావించెను' (ఆంధ్రులచరిత్రము, ౩-వ భాగము, ౨౨౪ పుట) అని శ్రీ వీరభద్రరావుగారి యభిప్రాయము.

వత్సరములకో ౪౦ సంవత్సరములకో వ్రాయఁబడినదనుకొనుట యస్వాభావికము. ఇదియుఁగాక యీ గ్రంథమునందు, కృతిపతిని అతనిబంధువులనుగుఱించి వ్రాసిన యీక్రింది గద్యపద్యములవలన కుమారగిరిసేవలో వీరుండగ నీగ్రంథము వ్రాసినట్లు మన మూహింపవలయును; గాని, కుమారగిరి చచ్చిపోయినతరువాత ఇరువది యేండ్లకు వెనుకటిసంగతులు జ్ఞాపకముతెచ్చుకొని వ్రాసె ననుట పొసఁగ నేరదు.

"...కర్పూరవసంతరాయండును......మాణిక్య సింహాసనాధీశ్వరుండును.........వశీకృతనిఖిల భూభుజుండును......నయోధ్యానగర స్వామియో యనఁబరఁగి జంబూద్వీప భూభువనమండలీమకుటమండనాయమానంబగు కొండవీటిపురంబు రాజధాని గాఁ గీర్తిలతాదిష్టతాష్టాదశద్వీపాంతరాళుండునగు కొమరగిరి నృపాలునివలన నాందోళికా చ్ఛత్రచామర తురంగాది రాజ్యచిహ్నములు వడసి యమ్మహారాజునకుం బ్రతి సంవత్సరోత్సవంబునకుం దగిన...... ......సుగంధద్రవ్యంబు లొడఁగూర్చియుఁ జీని సింహళ తవాయి హురుమంజి జలనోగి ప్రభృతి నానాద్వీపనగరాకరంబు లగు ధన......గాణిక్యంబులు తెప్పించియు......సదాచారుండును నన విఖ్యాతిగాంచిన యవచిదేవయ తిప్ప ప్రభుం డొక్కనాఁ డాస్థానమండపంబున సుఖోపవిష్టుండై" (౧-౭)

"స. ఖుసిమీరజ్ సురథాణి నిండుకొలువై కూర్చున్నచో నీకరా
భ్యసనంబు న్నుతియించురా యవచితిప్పా (౧. ౨౨.)

".........కుమారగిర్యధీ
శ్వరుని వసంతవైభవముసర్వము నొక్కఁడ నిర్వహించుచున్. (౧. ౨౩.)

"కొమరగిరిరాజ దేవేంద్ర కార్యహితుఁడు" (౧. ౨౫.)

క. కొమరగిరి వసంతనృపా, గమకవివరగంధసార కస్తూరీ కుం
కుమ కర్పూరహిమాంభ, స్సముదంచితబహుసుగంధిశాలాధ్యక్షా. (౧. ౩౦.)

ఇట్లు, హరవిలాసము వ్రాయునప్పుడు కుమారగిరి బ్రతికియుండెననియు, కొండవీటిలో రాజ్యము చేయుచుండెననియు, ఆతనియొద్ద పెద్దసెట్టిగా అవచి

తిప్పయయుండెననియుఁ జూపువాక్యము లీగ్రంథమునందుఁ బెక్కులు గలవు. ఇట్టివాక్యములున్నను, కుమారగిరి చనిపోయినతరువాత, తిప్పన అధికార మూడిపోయినపిదప, హరిహర ఫేరోజుశాహులు కీర్తిశేషులైన యెన్నియో వత్సరములకుఁ దరువాత నీ కావ్యము రచింపఁబడియెనని చెప్పుటకంటె విపరీతమైన సిద్ధాంతము మఱియొకటియుండదు. ఇది కుమారగిరిరెడ్డి కాలమున రచింపఁబడలేదని చెప్పునెడల-నైషధము పెదకోమటి వేమారెడ్డికాలమున వ్రాయ లేదనియు, భీమఖండము అల్లాడవేమ వీరభద్రులు బ్రతికియుండఁగఁ జెప్పఁబడలేదనియు నొప్పుకొనవలసివచ్చి విపరీతసిద్ధాంతప్రసంగము ప్రాప్తించును.

ఈ ప్రకార మతఃప్రమాణములవలన నిది ౧౪౦౦వ సంవత్సర ప్రాంతముననే వ్రాయఁబడియెనని చూపి, యిఁక దీనికిఁ బ్రతికూలములైన బహిఃప్రమాణముల విచారించెదము.

హరవిలాసము ౧౪౦౦ లోనిది యని చెప్పుటకు నడ్డముగ రెండు పూర్వపక్షములు రావచ్చును. ఒకటి హరవిలాసమునందు నాంధ్రనైషధమును పేర్కొనుట. రెండవది కృతిపతియైన తిప్పయ్యయొక్క వయస్సునకు సంబంధించినది. ఈ రెంటిని క్రమముగా విచారింతము.

ఆంధ్రనైషధము పెదకోమటి వేమారెడ్డియొక్క మంత్రియైన మామిడి సింగన్నకు నంకితము చేయఁబడినది*. పెదకోమటి వేమారెడ్డి కొండవీటిరాజ్య

---

* నైషధమును అంకితమందిన మామిడి సింగన్న అనవేమారెడ్డికి మంత్రి యని శ్రీ జయంతి రామయ్యగారును (Epigraphia Indica Vol. XI P. 315 foot note), రాజమహేంద్రవరము నేలిన వేమారెడ్డికి మంత్రి యని శ్రీ వేదము వెంకటరాయ శాస్త్రిగారును (శృంగారనైషధము, అవతారిక, పుట ౧౧), కుమారగిరిరెడ్డికి మంత్రి యని కేతవరము వెంకటశాస్త్రిగారును (ఆనందముద్రాక్షరశాల, శృంగారనైషధము పీఠిక ౧౨) వ్రాసియున్నారు. కాని శృంగారనైషధమునకుఁ జివర చివర 'కావ్యోపసంహారము'గాఁ గవిచే వ్రాయఁబడిన గద్యయందు 'పెదకోమటివేమ భూపాల కరుణాపాత్ర' యని వ్రాయఁబడియుండుటచే, కృతిపతి పెదకోమటియొక్క కుమారుఁడైన వేమారెడ్డికి మంత్రిగ నుండెననుట స్పష్టము.

మును కుమారగిరిరెడ్డి తరువాత, ౧౪౦౦ మొదలు ౧౪౧౫ వఱకు శ్రీ వీరభద్ర రావుగారి మతప్రకారమును, ౧౩౮౭ మొదలు ౧౪౧౫ వఱకు శ్రీ రామయ్యగారి మతమునను ఏలెను. కావున కుమారగిరి కాలములో వ్రాయఁబడిన హరవిలాసమునందు నాంధ్రనైషధమును పేర్కొనుట యెట్లు సంభవించును? అందుచే హరవిలాసముతరువాత వ్రాయఁబడినది యని పూర్వపక్షము. మొదట చూచుటకు నీ పూర్వపక్షము కొంతబలవత్తరమైనదిగాఁ గానవచ్చును. కాని కొంచెము ఆలోచించినయెడల నీ పూర్వపక్షమునకుఁ బ్రత్యుత్తర మున్నదని తోఁచును. పెదకోమటి వేమారెడ్డి ౧౪౦౦ లో కొండవీటిరాజ్యమునకు వచ్చినను అంతకుఁ బూర్వ మేమియులేని యష్టదరిద్రుఁడు కాఁడు. కొండవీటి వంశములోనివాఁడు. పెద్దకుటుంబమువాఁడు. ఈక్రింది వంశవృక్షమువలన ఇతనికిని ఇతని పూర్వపు కొండవీటి రెడ్డిరాజులకును గల సంబంధము తెలియఁగలదు.




ఈ వంశవృక్షము శాసనములను, వేమభూపాలీయమ్ అను కావ్యమును అనుసరించివేయఁ బడినది. ఇందు ప్రభుత్వముచేసినవారికి ౧,౨ అంకెలు వేయఁ

బడి క్రింద గీటుగీయఁబడినది. అందు నైదవవాఁడు పెదకోమటివేమ. ఈతని పేరు వేమ; తండ్రిపేరు పెదకోమటి; కావున ఈతనిని పెదకోమటివేమ యందురు. ఈతఁడు 'మాచ'ని వంశములోనివాఁడు. మాచనితమ్ముఁడైన '౧ వేమ' (ఈతనినే ప్రోలయవేమ యందురు) మిక్కిలి శూరుఁ డగుటచే కొండవీటిరాజ్య మాతనికే పోయెను. ఇట్లు కొండవీటిరాజ్యము రెండవ వంశమునకుఁ బోయినను 'మాచ', అతని రెండవకొమారుఁడైన 'పెదకోమటి' అనామధేయులుగ నుండలేదనియు, రాజ్యము చేయుచున్నవారికిఁ దోడుగ నుండి రనియు, మన మూహింపవచ్చును*. వేమభూపాలీయమునందు వీరిని గొప్పరాజులుగఁ గవి వర్ణించినాఁడు. ఆ యతిశయోక్తిని వదలినను, కొన్నిగ్రామములు, భూతాదినిమిత్తమైనను, వీరిక్రింద నుండెనని యెంచుట ప్రమాదము కానేరదు. కావున పెదకోమటికుమారుఁడైన వేమారెడ్డి, కుమారగిరి మరణానంతరము రాజ్యమునకు వచ్చుటకుఁబూర్వము ఒకచిన్న జమీందారుగను రాజవంశమునందు గౌరవముగలవాఁడుగను ఉండెననుటకు సందేహములేదు. శ్రీనాథుఁ డాకాలమున నాతనిమంత్రియైన మామిడిసింగన్నకు నాంధ్రనైషధమును అంకితమిచ్చి వేమరాజునకు మంత్రియని వర్ణించుటయందు విరుద్ధమేమియు లేదు. అనఁగా కుమారగిరి కొండవీటిలోఁ బ్రభుత్వము చేయుచున్నప్పుడు ఆతని పెత్తాతమనుమఁడగు పెదకోమటి వేమారెడ్డికూడ కొండవీటికి రాజు గాకపోయినను ఒక చిన్నజమీందారుగ నుండెను. నాలుగూళ్లుగలవారినిగూడ పెద్దరాజులుగను, వారియొద్దనున్న గుమాస్తాలను మంత్రులుగను వర్ణించుట మనకవుల సంప్రదాయమని యాంధ్రకావ్యపాఠకులకు నేను వేఱుగఁజెప్ప నక్కఱలేదు. ఈ పెదకోమటిని నాయకునిఁ జేసి వామనభట్టబాణుఁ డను కవి సంస్కృతగద్యమునందు 'వేమభూపాలీయ' మను కావ్య మొకటి వ్రాసినాఁడు. దానిలో ఈతనిని, ఈతనితండ్రితాతలను మహాచ్చక్రవర్తులుగఁ జెప్పినాఁడు!

---

*ఎఱ్ఱాప్రగడ హరివంశమందలి కృత్యాదిపద్యములను, వేమభూపాలీయమందలి మాచ, పెదకోమటులకు సంబంధించిన వర్ణనలును చూడనగును.

పెదకోమటి వేమారెడ్డి అనవేముని కాలమున (చివరకాలమున నైన యుండును) ప్రభువుగ నుండెననియు, నాతనికి మంత్రులుండిరనియుం జూపుటకు నాంధ్రనైషధములోనే యొకయాధార మున్నది. కృతిభర్త యైన సింగన్న యొక్క తండ్రియైన పెద్దన్న అనవేమభూపాలునియొద్ద మంత్రిగ నున్నట్టును (౧.౨౭), పినతండ్రియైన నామన్న వేమరాజునొద్ద మంత్రిగ నున్నట్టును (౧-౩౦) చెప్పఁబడియున్నది. పినతండ్రినిగుఱించిన పద్యము ఈక్రింద నీయఁబడుచున్నది.

శా. స్వామిద్రోహరగండలాంఛనునకున్ సంగ్రామగాండీవికిన్
వేమక్ష్మాపతి కార్యభారకలనా విఖ్యాత ధీశక్తికిన్
నామామాత్యున కన్యరాజనిటలాన్యస్త స్వభాగ్యాక్షర
స్థేమాపాకరణప్రవీణునకు మంత్రుల్ సాటియే యెవ్వరున్.

ఇందుఁ జెప్పఁబడిన వేమక్ష్మాపతి పెదకోమటికుమారుఁడైన వేమారెడ్డియే. ఏలయన (౧) ఆకాలమున కొండవీటికి సంబంధించినవాఁడు వేఱు వేమారెడ్డి లేఁడు; (౨) ఈ పద్య మెచ్చటిప్రకరణమునుండి తీసికొనఁబడినదో ఆ ప్రకరణమునందు ననఁగా నాంధ్రశృంగారనైషధపీఠికయందు నంతటను వేమశబ్దము పెదకోమటివేమపరముగనే వాడఁబడి యున్నది. ఒకానొకరు 'వేమ' అనగా 'అనవేమ' అని యర్థము చేసినారు. కాని దానిని ఒప్పుకొనుటకు వీలులేదు. శాసనములందును, గ్రంథములందును అనవేముని అనవేముఁడే యందురుగాని, వేముఁడని యెచ్చటను వ్రాసియుండలేదు. 'వేమ' యనఁగా 'ప్రోలయవేమ' యైనను కావలెను; 'కాటయవేమ' యైనను కావలెను; 'పెదకోమటివేమ' యైనను కావలెను; లేదా 'అల్లాడవేమ' యైనను కావలెను. సందర్భానువశమున నితరవేము లక్కడ నన్వయింపరు; గనుక వేమ యనఁగా నైషధభర్తయైన సింగన్నకు రాజైన పెదకోమటివేమ యనియె గ్రహింపవలెను. ఈరీతిగా నీవేమారెడ్డి చివరకాలమునను, కుమారగిరిరెడ్డి కాలమునను ఒక చిన్నప్రభువుగ వారికి సామంతుఁడుగనో, వారి రాజబంధువుగనో యుండెను.

ఆ కాలమున నైషధ మాతనిమంత్రికి నంకితమీయఁబడెను. తరువాత కుమారగిరి చనిపోఁగా రెండవకుటుంబములోఁ బురుషులెవరును లేనందున పెదకోమటి వేమారెడ్డి కొండవీటిరాజ్యమునకు వచ్చెను. అప్పుడు శ్రీనాథుఁడు విద్యాధికారిగ నుండెను. ఫిరంగిపుర శాసనాదుల వ్రాసెను. ఇట్లు మొదట నైషధము వ్రాయఁబడినది; తరువాత హరవిలాసము రచింపఁబడినది. కావున మొదటి పూర్వపక్షమునకు సమాధానము వచ్చినది.

హరవిలాసము ౧౪౦౦ వ సంవత్సర ప్రాంతమున వ్రాయఁబడియె ననుటకు నింకొక పూర్వపక్షము రావచ్చును. హరవిలాసమునందుఁ గవి కృతిభర్తకు బాలసఖుఁడని చెప్పఁబడియున్నది (౧.౮). కృతిభర్త యాక్రందించిపద్యము (౧.౯) చెప్పుటవలన వృద్ధని తోఁచుచున్నది:—

క. కంటిని విశుద్ధ సంతతి, వింటి పురాణములు పెక్కు విశ్వము వొగడన్
మంటి బహువత్సరంబులుఁ, గొంటి యశోధనము సుకవికోటి నుతింపన్.

కృతినందిన అవచితిప్పయ వృద్ధయిన, నాతని బాలసఖుఁడుగూడ వృద్ధే కావలయును గదా. మా లెక్కప్రకారము హరవిలాసము రచనాకాలము (౧౪౦౦) నకు శ్రీనాథుఁడు నలువదియేండ్లవాఁడుగ నున్నాఁడు. కావున ఈ పూర్వపక్ష మంత బలవంతమైనది కాదు. 'మంటి బహువత్సరంబులు' అన నేఁబదియేండ్లు సమీపించినవాఁ డనవచ్చును. 'బాలసఖుఁడు' అనఁగ నేస్తమాడిన ట్టిద్దరికిని ఒక్కటేవయస్సుండనక్కరలేదు. ఇద్దఱికి నేఁడెనిమిది సంవత్సరములు భేదముండవచ్చును. శ్రీనాథుఁడు చిన్ననాఁడే పెద్దబుద్ధులుగల యప్రతిమ ప్రతిభాశాలి గనుక నాతనికంటెఁ బెద్దవారుగూడ నాతనితోఁ జెలిమిచేసి యుండుట యాశ్చర్యముకాదు. ఈ విధముగ రెండు పూర్వపక్షములును ఖండితములగుటచే హరవిలాసము ౧౪౦౦ ల ప్రాంతమున వ్రాయఁబడియెనన్న మన మూలసిద్ధాంతము నిశ్చలముగ నిలిచినది.

## ఉపసంహారము

శ్రీనాథ మహాకవియొక్క గ్రంథముల కాలనిర్ణయము చేయుటకు నిది యొకప్రయత్నము. ఇంతియకాని రాయిగ్రుద్దినట్లును, త్రాసుతూచినట్లును నీ సంవత్సరముననే యీగ్రంథము తప్పక నిర్మింపఁబడినదని చెప్పుటకు నీ వ్యాసము వ్రాయఁబడలేదు. శ్రీనాథుఁ డాంధ్రవాఙ్మయమునందు మిక్కిలి ప్రసిద్ధిచెందినవాఁడు. ఆతని కాలనిర్ణయమును, ఆతని గ్రంథముల కాలనిర్ణయమును వీలయినంతవఱకు సాధారణముగఁ జేయఁ బ్రయత్నించుట మన కర్తవ్యము; గనుక నే నొకవిధముగ దారిచూపితిని. క్రొత్తశాసనములుగాని, క్రొత్త గ్రంథములుగాని బయలుదేరి లెక్కయంతయుఁ దప్పినఁ జెప్పలేను; కాని, ఉన్నసాధనములే యాధారములుగ నిల్చెనేని పదిసంవత్సరములు హెచ్చుతగ్గుగ నేను వేసినలెక్క నిల్చునని నా తాత్పర్యము.



# కృష్ణరాయల కొన్ని దిగ్విజయయాత్రలు*

## (౧. ఆముక్తమాల్యద రచనాకాలము)

ఆముక్తమాల్యదలోని యీ క్రిందివచనము మనమందఱము నెఱిఁగినదియే.

"మున్నె కళింగదేశ విజిగీషానుకీనన్ దండెత్తిపోయి విజయవాటిం గొన్ని వాసరంబు లుండి శ్రీకాకుళనికేతనుం డగు నాంధ్రమధుమథను సేవింపం బోయి హరివాసరోపవాసం బచ్చటం గావింప నప్పుణ్యరాత్రిం జతుర్థయామంబున."

### కృష్ణరాయలు తెలుఁగురాయని సేవించిన హరివాసర మెద్ది ?

కలలో నాంధ్రవిష్ణువు కనఁబడి గ్రంథము రచింపుమని కృష్ణరాయనితోఁ జెప్పెనన్న కథ మనము నమ్మినను నమ్మకపోయినను, రాయలు కళింగముమీఁదికి దండెత్తిపోవునప్పుడు బెజవాడలోఁ గొన్నిదినము లుండి యచ్చటినుండి యొక యేకాదశి దినంబున శ్రీకాకుళమునకుఁ బోయెననియు, అప్పటినుండియే తాను నొక కావ్యము వ్రాయవలెనన్న కోర్కె యాతనికిఁ బుట్టి యాతఁడు వ్రాయ సాగెననియు మన మూహింపవచ్చును. కావున నీహరివాసర మెద్ది యని తెలిసికొనుట యావశ్యకంబయ్యె. కాని యిప్పటికున్న చరిత్రసాధనములవలన నీ యేకాదశి యేసంవత్సరమందలి యేనెలలోని యేపక్షమందలిదియో యని నిశ్చయించుటకు వీలులేకయుండెను. రాయలు బెజవాడలో మకాముచేసియున్న దినములను స్పష్టముగఁ దెల్పు శాసన మింకను మనకు దొరకలేదు. కళింగదండయాత్రాసందర్భమున రాయలవారు బెజవాడకుఁ జుట్టుపట్టు గ్రామములకును,

---

* 'ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక'—కాళయుక్తిసంవత్సరము, సప్తమ సంపుటము. పుట ౩౧౩.

బెజవాడ దాఁటి కళింగగ్రామములకును వెళ్లినకాలములను దెలుపుశాసనములు పెక్కులు కలవు. రాయలు క్రీ. శ. ౧౫౧౫ లోఁ గొండవీటికిని అమరావతికిని వెళ్లెను.1 ఇందువలననే శ్రీ వీరేశలింగముగారు "కళింగదేశ విజయయాత్రకయి వెడలి విజయవాటి (బెజవాడ) కి వచ్చినది హూణశకము ౧౫౧౫ వ సంవత్సర మగుటచేత రాజీగ్రంథము నా సంవత్సరమునందుఁ జేయ నుద్దేశించి ప్రారంభించియుండును." అని వ్రాసియున్నారు2. ఈ యేటనే రాయలు సింహాచలమునఁ దన యిద్దఱుభార్యలతోఁ గలసి దేవునకు దానముచేసియున్నారు3. కావున ఈయేట నాతఁడు బెజవాడమీఁదుగా వెళ్లియుండును. ౧౫౧౬ లో మరల ఈరాజుచేఁ జెక్కింపఁబడిన శాసన మొకటి సింహాచలమునందుఁ గానవచ్చుచున్నది4. "ఇట్లు కళింగదండయాత్రకై రాయలు క్రీ. శ. ౧౫౧౫ మొదలు ౧౫౧౬ వఱకుఁ బెక్కుసారులు బెజవాడమీఁదుగా వెళ్లుట తటస్థించెను. ఈ కళింగయుద్ధము పూర్తియగుకాలమును కృష్ణరాయలు బెజవాడను తనసైన్యమునకు ముఖ్యశిబిరముగ నేర్పఱుచుకొని, అచ్చటినుండి ఆవశ్యకతనుబట్టి సైన్యమును వేఱువేఱుదిశలకుఁ బంపుచున్నట్లు కానవచ్చుచున్నది. రాయలసేనానులైన పెద్దన మొదలగునవారి కొకటాది గ్రామములలోని శాసనములవలనను ఈ విషయమే తేలుచున్నది. "కొకటము మొదటిశాసనములోఁ నింకొక విశేషము గలదు. అది కొకటముదేవాలయమునందుఁ జెక్కఁబడినను నందలి దానము మాత్రము బెజవాడలోఁ గృష్ణాతీరమున మల్లికార్జున స్వామిసన్నిధిని నీయఁబడినది. అనఁగా శా. శ. ౧౪౪౦ వైశాఖ శు౹ ౧౫ చంద్రగ్రహణకాలమున

---

1. 276 and 272 of 1897 Mad. Epi. Collections.

2. ఆంధ్రకవుల చరిత్రము, ౨-వ భాగము కృష్ణరాయలు.

3. 243 and 249 of 1899 Mad. Epi. Collections

4. 244 of 1899.

5. కొకటమునందలి శిలాశాసనముల నకళ్లు. చెన్నపురి గవర్నమెంటు మ్యానుస్క్రిప్టులైబ్రరీలోని లోకల్ రికార్డ్సు, ౧౦-వ వాల్యూంలో "కొకటము కైఫియతు" అను దానిలో నీయఁబడినవి.

(౨౫ ఏప్రిల్ ౧౫౧౭) పెద్దన బెజవాడలో నుండెను. కృష్ణదేవరాయఁడుకూడ నా కాలమున నచ్చట నుండెననియు, అతనితో నాతని సేనానులుకూడ బెజవాడ వెళ్లియుండిరనియు మన మూహింపవచ్చును. దీనికి ననుగుణముగ నిదే తేదినిఁ గృష్ణరాయని మఱియొక సేనాని యయిన శ్రీ మన్మమహామండలేశ్వర సింగయ్య యను నాతఁడు కనకదుర్గకు నిచ్చిన భూదానశాసన మొకటి బెజవాడ కనకదుర్గగుడిలోఁ గలదు1. కావున నీ వీరులందఱును గృష్ణరాయనితో నచ్చటఁ గూడియుండిరని యూహించుటకు వీలుకలదు. రాయలు కళింగము మీఁదికి రెండుసారులో మూఁడుసారులో, దండయాత్ర వెళ్లినట్లు కానవచ్చుచున్నది. సింహాచలమునందుఁ గృష్ణరాయఁడు శా. శ. ౧౪౩౮ (క్రీ. శ. ౧౫౧౬) ధాత చైత్ర బ॥ ౧౨ దినమున నొకశాసనమును2, శా. శ. ౧౪౪౧ ప్రమాథి శ్రావణ శు॥ ౧౩ (క్రీ. శ. ౧౫౧౯) నాఁడొకశాసనమును వేయించెను. అందువలన మొదట సింహాద్రివఱకు దిగ్విజయము చేసి వచ్చినట్లును, రెండవసారి కటకమువఱకు వెళ్లినట్లును గానవచ్చుచున్నది. ఈరెండు కళింగదిగ్విజయములకు నడుమ నున్న కాలమునఁ గృష్ణరాయఁడు బెజవాడ మకాములోఁ దనసైన్యశిబిరము కొంత నిల్పియుంచినట్లును, తానును దన నాయకులును అటునుండి యిటు, ఇటునుండి యటు వచ్చి వెళ్లుచున్నట్లును గానవచ్చెడిని."3

ఇట్లు "కళింగదేశ విజిగీషామనీషన్ దండెత్తి" పోవుట ౧౫౧౫ మొదలు ౧౫౧౯ వఱకు జరిగినందునఁ గృష్ణదేవరాయలు శ్రీకాకుళమునకుఁ బోయిన దేసంవత్సరమో నిశ్చయముగఁ జెప్పుటకు వీలులేకయుండెను. కాని యిటీవల ఆంధ్రవిజ్ఞానసర్వస్వమున "అల్లాసాని పెద్దన్న" యను వ్యాసము వ్రాయుట

---

1. Epigraphical Reports S. Circle 329 of 1892.

2. Epi. R. No. 244 and 245 of 1899. ఈ రెండుశాసనముల నకళ్లు గురుజాడ శ్రీరామమూర్తిగారి కవిజీవితములో నీయఁబడినవి.

౩. ఆంధ్రవిజ్ఞానసర్వస్వము ౩-వ సంపుటము "అల్లసానిపెద్దన్న" అను వ్యాసములో నుండి తీసికొనఁబడినది.

.కునై నేను సాధనములను సేకరించుచుండఁగా, చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునందు నాకు "ఈలియట్సు కలెక్షన్" అను శాసనసమూహములో నీక్రింది శాసనము కానవచ్చెను. ఇది శ్రీకాకుళపుఁ దెలుఁగురాయనికిఁ గృష్ణరాయనిచే నీయఁబడిన దానశాసనము. నాకుఁ దెలిసినంతవఱకును ఈశాసనమందలి విషయము లిదివఱ కెవ్వరిచేతను జర్చింపబడియుండలేదు[1]. అందువలన, ఆంధ్రవాఙ్మయశోధకులకును, రాయలచరిత్రకారులకును నిది ముఖ్యమైనది యని తలఁచి దానిని దొరకినది దొరకినట్లు దిద్దకుండ నిచ్చుచున్నాను. లేఖకప్రమాదములచే నిందుఁ గొన్నితప్పులున్నను జరిత్రమునకు నక్కఱకువచ్చుభాగమున దోషములు లేనందునను, మఱియొకప్రతి దొరకనందున మనయిష్టము వచ్చినట్లు దిద్దుట తప్పని నాసిద్ధాంతమగుటచేతను ఈలియట్ కలెక్షన్‌లో నున్నట్లే దాని నిచ్చుచున్నాను. శ్రీకాకుళమునుండి దీనియొక్క పరిశుద్ధప్రతి యొకటి సంపాదించుటకు యత్నించుచున్నాడను. అది దొరకినతరువాతఁ బటముతోఁ గూడఁ బ్రకటింపఁగలను:—

"బందరుజిల్లా యిలాకా చల్లపల్లితాలూకాలోచేరిన శ్రీకాకుళంగ్రామం తూర్పున వేంచేసియున్న శ్రీకాకుళేశ్వరస్వామివారి ఆలయంమీదవున్న శిలాశాసనములు. గర్భాలయంమీద తూర్పుద్వారంకు వుత్తరం[2]."

"శుభమస్తు॥ హరేర్లీలావరాహస్య । దంష్ట్రాదండస్యపాతునః । హేమంశ్రీకలశాయత్ర । ధాత్రీఛత్రశ్రియందశా ॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౪౦ అగు నేటి బహుధాన్య నామ సం॥ర ఫాల్గుణ శుద్ధ౧౧ శుక్రవారం శ్రీకాకుళపు తెలుగురాయలకు శ్రీమన్మహారాజాధి

1. రాబర్టుస్యూయెల్ "అంటిక్విటిస్ వాల్యూం ౧" అను గ్రంథములో శ్రీకాకుళమునందు శా. శ. ౧౪౪౦ సంవత్సరపు శాసన మొకటి రాయలవారిది ఉన్నట్లు చెప్పెనే కాని అందలి విషయమును చెప్పలేదు. అది యిదియో మఱియొకటియో చెప్పఁజాలము.

2. ఈయుపోద్ఘాత మీశాసనమునకు నకలుౘ్రాసినవారిచే వ్రాయఁబడినదనుట స్పష్టము.

రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీకృష్ణదేవమహారాయలుంగారు దణ్డం సమర్పించి యిచ్చిన ధర్మశాసనం॥ స్వామికి కుంభసంక్రమణపుణ్యకాలమందు సందర్శించి కొండపిలి సీమకుం జేరి వొచ్చిన దేవరపుం గోటుస్థలం లోపలి యెర్లగడ్డగ్రామం ౧న్ని దేవపల్లిగ్రామం ౧న్ని శ్రీకాకుళానుస్వామి విప్రతిగ్రహలబ్ధమైన సత్రాలభూమి తోటలు నిత్యవసరాలు శ్రీరామానుజకూటము ద్వాదసులు సహితమయిన భూమిన్ని క్రాంతలంక చింతలంక వుండ్రసలుక పితాల్లంక పులుగడ్డలంక క్రోసూరు మండలివచ్చిన కంభాలదొడ్డిన్ని కొండవీటి సీమలోని పెదగాడిపట్టున్ను వినికొండ సీమలోని కారుమంచిన్ని స్వామి సన్నిధిని ధారాపూర్వకముగాను స్వామి నిత్యనైవేద్యాలకున్ను అంగరంగవైభవాలకున్ను యెడమడవక జరుగుటకై శ్రీకాకులని తెలుంగువల్లభునికి సమర్పిస్తిమి గనుక ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించేది ॥ స్వదత్తాద్ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం పరదత్తాపహారేణ స్వదత్తనిష్ఫలంభవేత్ ॥ ఈధర్మానకు యెవరుతప్పినాను గంగలోను గోబ్రాహ్మణవధ చేసినపాపాన పోందువారలు ఈ అయిదు గ్రామాలున్ను శ్రీవల్లభునికి సమర్పించి యీ అయిదుగ్రామాదులలో యిందువల్ల వచ్చిన నిత్యనైవేద్యంకట్టడి దధ్యోజనంపళ్లెలు ౮। అలంకారప్రసాదంపళ్లెలు ౮ అప్పాలు ౨౬ పళ్లెం ౧కి। అతిరసాలు పళ్లెం ౧। వడల పళ్లెం ౧॥ యిడ్డెనకుడుముల పళ్లెం ౧। పప్పుకూరలు నెయ్యి పచ్చళ్లు అర్కారంగాయలు తోడలు ఆరగించె పళ్లాలు ౬౦న్ని। ఆనబాలప్రసాద పళ్లాలు ౨। పెరసి ఆరగించె ౨౮ దెబ్బయినాలుగుయింటికి పళ్లెంవారి అమృతపడినిం।- లెక్కను। కస్తూరికర్పూర పరిమెళ సహితంగుండాలు''*

ఈ శాసనమునుబట్టిచూడఁ గృష్ణరాయఁడు శ్రీకాకుళమందాంధ్ర విష్ణువును సేవించినదినంబును, అతఁ డాతనికలఁ గాన్పించి యాంధ్రకావ్యము వ్రాయవలసినదని యానతిచ్చెనని యాముక్తమాల్యదలో వర్ణింపబడిన ప్రసం

* Elliot's Collection in the Government Oriental Ms. Library, Madras, page 547.

గము జరిగిన హరివాసరంబును శా. శ. ౧౪౪౦ అగు నేటి బహుధాన్యనామ సం॥ర ఫాల్గుణ శుద్ధ ౧౧ (ఏకాదశి) శుక్రవారమని స్పష్టమగుచున్నది. లెక్క వేసిచూడ నిది క్రీ. శ. ౧౫౧౯-వ సంవత్సరమందిలి ఫిబ్రేవరి నెలలోని ౧౧-వ తేది యగుచున్నది. కావున నాంధ్రమహాకావ్యములలో నొక్కటియగు నాముక్తమాల్యదరచన ప్రారంభింపఁబడిన దిన మింతసూక్ష్మముగను నిశ్చయముగను మనకుఁ దెలిసినందుకు మన మెంతయు సంతసిల్లఁ గలసియున్నది.

## ౨. ఆదిల్ షాహామీఁది దాడి.

వైశాసనముతో సంబంధము లేకపోయినను ఆముక్తమాల్యదయొక్క కాలనిర్ణయముతో సంబంధముండుటచే నాగ్రంథమందలి కొన్ని పద్యములలోని విషయములను గురించి యిచ్చటఁ గొంచెము విచారింపవలసియున్నది. ఉపోద్ఘాతమునందు నీక్రిందిపద్యము కలదు:—

మ. అలుకన్ఘోటకఘట్టికాఖురపుటీహల్య న్ఖురాసాని ప్ర
చ్ఛలు వోదున్ని చలచ్ఛమాగజమదాసారస్రుతి న్కీర్తిపు
ష్కలసస్యం బిడి యేకధాటి బళిరా కట్టించి తౌ దృష్టి కే
దులఖానోగ్రకపాల మగ్గసహరిద్బాహ్యాజాంగల శ్రేణికిన్.[1]

ఈపద్యమునుబట్టి చూడఁ గృష్ణరాయఁడు ఏదులఖాను నోడించినతరువాత నీగ్రంథము పూర్తిచేయఁబడె ననుట స్పష్టము. ఏదులఖానుఁడు క్రీ. శ.

1. ఈపద్యము సంస్కృతసమాసభూయిష్ఠము గనుక దీనితాత్పర్య మిచ్చెదను. ["ఓకృష్ణరాయ!] నీవు ఉత్తరదేశముపై దాడివెడలినప్పుడు అచ్చటిభూములలో (పొలములలో) ఖురాసాను దేశజులైన మహమ్మదీయు లనియెడు పుచ్చచెట్లు లేకుండఁగ నీసైన్యమందలి గుఱ్ఱములగిట్టలనెడు నాఁగండ్లతోఁ జెడదున్ని యేనుఁగుల మదధారలతో నాపొలములఁ దడిపి పదునుచేసి, యందు గీర్తి యను పైరును ఎక్కువగా నాటి, దానికి దృష్టిపరిహారముగా ఏదులఖానుని భయంకరమైన పుఱ్ఱెను వెఱ్ఱిబొమ్మవలెఁ గట్టించితివి"

౧౫౨౦ లో నోడింపఁబడియెఁ గావున నాసంవత్సరమునకుఁ దరువాతనే యీకావ్యము పూర్తిచేయఁబడినదని యిదివఱకు శ్రీ వీరేశలింగముగారును, ఇతర పండితులును, నేనును వ్రాసియున్నారము. కాని యిప్పుడు, ఏదులఖానుఁడు రాయలచే నెప్పు డోడింపఁబడియెనో యన్నవిషయము మరలఁ గొంతవఱకు విమర్శనీయ మని నాతాత్పర్యము.

ఏదులఖానుఁ డనఁగా బీజాపూరు (విజాపురము) నవాబు. కృష్ణరాయఁడు క్రీ. శ. ౧౫౦౯ మొదలు ౧౫౩౦ వఱకు రాజ్యముచేసెనని యిప్పటి చరిత్రకారులందఱు నొప్పుకొనియున్నారు[1]. కావున నీతనికాలమున విజాపురమున నిద్దఱునవాబు లుండి రని చెప్పవలెను. యూసఫ్ ఆదిల్ శాహ అనువాఁడు ౧౪౮౯ మొదలు ౧౫౧౦ వఱకు రాజ్యముచేసెను. అనఁగాఁ గృష్ణరాయలు రాజ్యమునకు వచ్చినతరువాత నీతఁ డొకసంవత్సరమువఱకైన నుండెను. ఇతఁడే స్వతంత్రుఁడై "ఆదిల్ శాహి" వంశమునకు మూలపురుషుఁ డయ్యెను. ఈతని కొమారుఁడు ఇస్మాయిల్ ఆదిల్ శాహ అనువాఁడు క్రీ. శ. ౧౫౧౦ మొదలు ౧౫౩౪ వఱకు రాజ్యమేలెను. అనఁగాఁ గృష్ణరాయనినిధనానంతర మీతఁడు నాల్గుసంవత్సరములవఱకు బ్రతికియుండెను[2]. ఈతఁడు రాజ్యమునకు వచ్చినప్పుడు పదునొకండేండ్లవాఁ డఁట.

---

1 రాయలు శా. శ. ౧౪౪౨ లో ననఁగా క్రీ. శ. ౧౫౨౯ లోనే కీర్తిశేషుఁ డయ్యెనని చెప్పుచాటుపద్య మొకటికలదు. (కవులచరిత్ర ౨-వ భా.) నాకు నిటీవల దొరకిన కొన్ని కాగితములనుబట్టి యీచాటువు నిజము చెప్పుచున్నదేమో యన్న యభిప్రాయము కలుగుచున్నది. కాని కొన్ని శాసనము లిందుకు వ్యతిరేకముగ నున్నందున, వానిమూలములను (originals) పూర్తిగఁ బరిశోధించి, ప్రమాణద్వయమునకుఁ గలబలాబలములఁ జక్కఁగఁ దూఁచిచూచి నా యభిప్రాయమును లోకమునకు వెల్లడిచేయఁ దలఁచినాఁడను.

2 ఈయంకెలన్నియు Beale's Oriental Biographical Dictionary నుండి తీసికొనఁబడినవి. ఈతఁడు ఫేరిస్టా మొదలయిన మహమ్మదీయ చరిత్రకారుల గ్రంథములనుండి వీనిని సేకరించెను.

ఆదిల్ శాహాతో జరిగిన ముఖ్యయుద్ధము రాయచూరుయుద్ధము. కాని రాయచూరునొద్ద రాయలకు నాదిల్ శాహాతో రెండుతడవలు యుద్ధము సంభవించినట్లు కానవచ్చుచున్నది. ఇందునగురించి సూయెల్ ఇట్లు వ్రాయుచున్నాఁడు. "కాల మనుకూల మని తలఁచి కృష్ణరాయఁడు ౧౫౧౨-వ సంవత్సరప్రాంతమున సుల్తాను రాజ్యముపై దండెత్తిపోయి రాయచూరుదుర్గముపైఁ బడెను. తుద కాదుర్గమందలి సైనికులు దానిని రాయలకు స్వాధీనపఱిచిరి; తనరాజ్యమందలి వ్యవహారములో నెక్కువగాఁ జిక్కియున్నందున ఆదిల్ శాహా సకాలమునకు సాహాయ్యముఁ బంపలేకపోయెను. ఇట్లు ఫెరిస్తా చెప్పుచున్నాఁడు."[1] ఈసమాచారమును ననిజ్ ఎత్తుకొనలేదు. ఆతనివ్రాఁతలఁబట్టి చూడ రాయలు ౧౫౨౦ లోనే మొట్టమొదట ఆదిల్ శాహామీఁదికి దండెత్తి పోయినట్లును, రాయచూరప్పుడు శాహాస్వాధీనమం దుండఁగా రాయలు దానిని సాధించుటకు వెళ్లినట్లును గానవచ్చును. ఇట్లు ననిజ్ కథకును ఫెరిస్తాయ కథకును భేదము కలదు. ఎందుకనఁగా, ౧౫౨౦ లోని దాడినిగురించి వ్రాయుచు ఫెరిస్తా, అంతకుఁ బూర్వము ౧౫౧౨ లో విజయనగరపురాజులచేఁ దీసికొనఁబడిన ముద్గల్లు, రాయచూరుదుర్గములను మరల సాధించుటకై ఇస్మాయిల్ ఆదిల్ శాహా యుద్ధసన్నద్ధుఁడయ్యెను అని వ్రాసియున్నాఁడు. ఈరెండుకథలలో నేది నిజమో నేను జెప్పలేను."[2]

ఇట్లు ననిజుమతమున ౧౫౨౦ లో నొక్కసారిమాత్రమును, ఫెరిస్తా మతమున ౧౫౧౨ లో నొకసారియు, ౧౫౨౦ లో రెండవసారియు రాయలకును శాహాసైన్యములకును యుద్ధము జరిగి విజయలక్ష్మి రాయలనే వరించెను.

ఆలోచించిచూడఁగా ఫెరిస్తామాటయే నిజమని తోఁచుచున్నది. కృష్ణదేవరాయవిజయము, రాయవాచకము[3] అను గ్రంథములలోఁ గృష్ణరాయఁడు

---

1. Scott's Trans. I. 236.
2. Forgotten Empire.
3. ఈగ్రంథములు చరిత్ర కంతగాఁ బ్రామాణికములు కావని నేనెఱుఁగుదును. కాని ప్రామాణికము లయినయితరగ్రంథములలోని కథలకు సహకారిగా నున్నప్పుడు వీనిలోనికథలను బూర్వమునుండి పరంపరగా వచ్చుచున్న యితిహాసములు (traditions) అని అంగీకరింపవచ్చును. వానిని ప్రామాణికగ్రంథమునకు సహకారులుగా గ్రహింపవచ్చును.

గజపతిమీఁదికి దండెత్తిపోక పూర్వము రాచూరుదుర్గమును బట్టుకొని యందుఁ దనసైన్యముల నుంచినట్లును, అహమదునగర విజాపుర గోలకొండ నవాబులతోఁ గృష్ణాతీరమునఁ బోరి వారిని నోడించినట్లును జెప్పఁబడియున్నది. ఇందును గుఱించి కృష్ణరాయవిజయమందలి తృతీయాశ్వాసమంతయుఁ జూడనగును. అందును నీ క్రిందివాక్యములు ముఖ్యములు:—

"......చండప్రతాపంబు మెఱయ రయంబున విజాపురంబు గడుదుర్గంబుల చాయం జనుదెంచు సమయంబున......"

"......తొంటి రఘుమహారాజుచందంబున నిఖిలరాజులు తనకు హస్తగతంబులు సేయ నాదవని ముదుగల్లు రాచూరు మొదలైన మహాస్థలంబుల నిజబలంబు లుంచి మించి......"

రాయవాచకమునుండి యీక్రిందివాక్యముఁ జూడనగును:—

"......నాయడిమూకలను జూచి విజయాపురం సరుమల నడుమ నంగ్గా సరుదుస్థలాలవుండి గురిమనుష్యులనున్ను దుర్గాలవుండ్డె రాణువనున్ను నిర్వహించలేక విడిచి పారిపోసాగిరి. గనక అందుండ్డి, రాచూరి (రి), ముదికల్లు, అద్దంకి, ఆదవని ఇవి మొదలైన స్థలాములకు ఠాణ్యములు వుంచి దినమొక్కటిగా సరిసడవగా......"[1]

ఇట్లు చెప్పుటయేగాక యీగ్రంథములు కృష్ణరాయఁడు తురకలను ఈతడవ గెలుచుట యాతనిప్రథమదిగ్విజయము[2] మన్నట్లుకూడఁ జెప్పుచున్నవి:—

1. ఆంధ్రసాహిత్యపరిషత్ పత్రికలో ముద్రింపఁబడిన "రాయవాచకము" (పుట. ౪౬.౪౭) చూడనగును.

2. ఇంతకుఁ బూర్వము కృష్ణరాయఁడు "ఉమ్మత్తూరు శివసముద్రస్థలంబుల సెసంగు గంగరాజు నోడయులనోడించె" నని యీగ్రంథములోనె చెప్పఁబడియున్నను ఆతఁడు కేవలము చేతిక్రింది సామంతుఁ డగుటచే దానిని స్వతంత్ర దిగ్విజయముగ నెంచలేదు. పరరాజుల గెలిచినది యిదియే మొదటితడవ.

"గనక కృష్ణరాయలున్ను నగర కట్టిపెట్టుమనిన్ని గుడారాలు నిశానులు నగారా మొదలైనది మొదటిజగడాన దొరికింది గనుక అదంతా నగరకట్టమని అప్పాజీ మొదలయిన నియోగ్యులతోనున్న......" [రాయ. 49 పుట]

దీనినిబట్టి చూడఁ గృష్ణరాయలు రాజ్యమునకు వచ్చిన కొద్దిదినములకే రాయచూరుదుర్గమును బట్టుకొని ఆదిల్ ఖానుతోఁ బోరాడెనని మనమూహింప వచ్చును. ఇఁక నీయుద్ధము ఫెరిస్తా చెప్పినట్లు ౧౫౧౨ లో జరగెనా లేక యంతకంటెఁ బూర్వమె జరిగెనా చూడవలయును.

ఆదిల్ శాహా చంపఁబడెను.

ఆముక్తమాల్యదనుండి పై నుదాహరింపఁబడిన పద్యమునందు నొకవిశేషము కలదు. అందలిరూపకమును మనము గమనింపవలెను. కృష్ణరాయఁడు ఏదులఖానునిపుత్తైను వెలిబొమ్మగా వ్రేలాడఁగట్టించె నన నేమియర్థము? ఏదులఖానుని జంపెనన్న యర్థము స్పష్టముగ స్ఫురించుచున్నదిగదా? ఇది యెట్లు? ఇతరచరిత్రకారు లెవ్వరును ఆదిల్ ఖానుని గృష్ణరాయలు చంపినట్లు వ్రాసియుండలేదు. కాని కృష్ణరాయలు తనగ్రంథములో, నప్పటివారికందఱకును దనకృతిగాఁ జూపు గ్రంథములో నసత్యము వ్రాయునా? బ్రతికియున్న తనప్రబలశత్రునిగుఱించి యిట్లు వ్రాయుట తటస్థించునా? కావున రాయలు నిజమే వ్రాసె ననిఁ దలఁపవలెను. కృష్ణరాయనిచేతనే చచ్చినను చావకున్నను ఆడాడిలో నొక ఆదిల్ శాహా చచ్చియుండవలెను. లేనియెడల వానిపుత్తై వ్రేలాడఁగట్టఁబడెనని రూపకముగనైన వ్రాయుట యెట్లు సంభవించును. ఫెరిస్తా యీసంగతి వ్రాయకపోవుటకుఁ గారణము కలదు. ఆతఁడు మహామ్మదీయపక్షపాతి. కావున నొకమహామ్మదీయసుల్తాన్ హిందూరాజుచేఁ జచ్చెనని వ్రాయుట యాతనికి నప్రియమైనపని. కావున నాతఁడు వ్రాయకయుండును.

ఇఁక నొక ఆదిల్ శాహా కృష్ణరాయలచేఁ జచ్చెనన్నఁ, జచ్చినవాఁ డెవ్వఁడు? ౧౫౧౦ లోఁ జచ్చిన యూసఫ్ ఆదిల్ శాహాయే యితఁడై యుండ

వలెను. కృష్ణరాయల తరువాతఁగూడ బ్రతికియున్న ఇస్మాయిల్ ఆదిల్ శాహ అయియుండఁడు. ఇది యే నిజమైనయెడల మొదటి రాయచూరుయుద్ధము ౧౫౧౦ లో జరిగియుండవలెను.[1] పద్యమునందు "ఏదులశాహోగ్రకపాలము" అనుపాఠ ముండుటకు బదులుగా నన్నిప్రతులలోను "ఏదులఖానోగ్రకపాలము" అని యుండుటయు నీయూహకు సహకారిగ నున్నవి. ఈయూసుఫ్ అను నతనికి మొదట యూసుఫ్ ఆదిల్ ఖాన్ అని పేరు. ఈతఁడు మొదట బహామనీరాజుల సేవకుఁడుగా నుండి విజాపురమునకు సుబే దారుగా నుండెను. ౧౪౮౯ లో స్వతంత్రుఁడై "యూసఫ్ ఆదిల్ శాహ" యన్న బిరుదము ధరించెను. కాని యింకను బహామని సుల్తా నులు పేరుకైనను నుండుటవలనను, కృష్ణరాయలు వారికి సాయముచేయ వలయునని తలంచుచున్నందునను, స్వామిద్రోహి యయిన యూసఫ్ ఆదిల్ ఖా నుని 'శాహ'గా ననఁగా స్వతంత్రరాజుగా నొప్పుకొనక, ఒకానొకఖానుఁగా నెన్నుటయే రాజనీతి యనుటకు సందేహములేదు. ఇందుచేతనే విజయనగరము వా రాతనిని ఒకానొక సేనాని యగు తురకగా నెంచిరేగాని స్వతంత్రుఁడైన రాజుఁగ నెంచలేదు. పెద్దనాదు లిందువలననే తమగ్రంథములలో నీతనినిగురించి చెప్పియుండక పోవచ్చును. గజపతి మొదలయిన మహారాజులయెదుట వీఁడు వారి కొకవర్ణనీయుఁడుగఁ గాన్పింపక పోవచ్చును.

ఆముక్తమాల్యదలో వ్రాసినట్లు కృష్ణరాయఁడు ఆదిల్ ఖానుని నిజముగఁ జంపినయెడల నీసమాచారము ౧౫౧౦-వ సంవత్సరప్రాంతమున జరిగియుండును. తరువాత మరల ౧౫౨౦ లోను, కృష్ణరాయలరాజ్య చరమదశయందును (౧౫౨౯) రాయచూరునొద్ద ఆదిల్ శాహకును కృష్ణరాయలకును బోరు జరిగి యందు శాహ ఫరారి యయ్యెను; కాని చావలేదు. ఆతఁడు రాయలతరువాతఁ గూడ బ్రతికియుండెను. కావునఁ జచ్చినవాఁడు మొదటివాఁడే యయియుండ

1. లేదా యూసుఫ్ ఖాన్ ౧౫౧౨ లో నైనఁ జచ్చియుండవలెను. ఈవిషయము శోధింపఁదగినది.

వలెను. తుదకు యుద్ధములోఁ జచ్చినను జావకున్నను, రాయ లాదేశముమీఁదికి దండెత్తిపోయినకాలమం దైనను జచ్చియుండవలెను. అట్లు కానిచోడల రాయలు "ఏకధాటి బళిరా! కట్టించి తా దృష్టి కేదులఖానొగ్రకపాల మస్థపహారిద్యూభజాంగలశ్రేణికిన్" అని వ్రాసికొనుట యెప్పుడును దటస్థింపదు.

ఈ యూసుఫ్ ఆదిల్ ఖానుఁడే తనచావునకుఁ గొలఁదిమాసములకుఁ బూర్వము గోవాపట్టణమును గోలుపోయె నని ఫిరంగివారు వ్రాసియున్నారు. కావున నట్లే యీతఁడు రాయచూరు మొదలయినదుర్గములనుగూడఁ బోఁ గొట్టుకొని యుండుట యాశ్చర్యముకాదు. అయినను ఇవన్నియు నూహలు. వీనిని గట్టిగ సిద్ధాంతీకరించుటకుఁ జరిత్రశోధకు లింకను శోధనలు చేయవలెను.

## 3 కలుబర్గాపై దాడి

కృష్ణరాయఁడు యవనులను గెల్చినట్లు వర్ణింపఁబడినపద్య మింకొక్కటి ఆముక్తమాల్యదలోఁ గలదు:—

సీ. సనకాదిదివిజమస్కరిఫాలగోపిచందనపుండ్రవల్లిక ల్నాకినాకి
సెలసిహాహాహూహూవులదండియలతంత్రిద్రెవ్వసింగిణులు గాఁచివిచితివిచి
సప్తర్షికృతవియద్ఝరవాలుకాలింగసమితి ముచ్చెలకాళ్లఁ జమిరిచమిరి
రంభాప్రధానాప్సరఃపృథూరోజకుంభంబు లెచ్చటఁ గన్నఁ బట్టిపట్టి
తిరుగుమారిపురి సురతరుసురల మరిగి, బహుళహాళహాళిభరితకల్బరిగనగర
నగరపురవరపరిబృఢ జవవయవన, పృతన భవదసి ననిఁదెగి కృష్ణరాయ *

* ఓ కృష్ణరాయా, కల్బరిగనగరమందును, నగరనగరమందును, ఉన్న తొందరపాటుగల యవనసైనికులు యుద్ధమునందు నీ ఖడ్గముచేఁ జచ్చి యింద్రలోకమునకుఁ బోయి యచ్చటికల్పవృక్షమునకల్లుద్రావమరిగి సనకాదిదేవమునుల నొసట నున్న గోపీచందనపునామములను నాకినాకి, హాహాహూహూ లనఁబడు దేవగాయకుల వీణెలు లాఁగుకొని, తీఁగలు తెగునట్లు వానిని వంచివంచి, ఆకాశగంగయొడ్డున సప్తఋషు లిసుకతో లింగములనుచేసి పూజింప వానిని తమముచ్చెలకాళ్లతో రాచిరాచి రంభ మొదలయిన యప్సరస లెచ్చటఁ గనఁబడిన వారి నచ్చటఁ బట్టుకొని వారి కుండలవంటికుచలములను ఒత్తి యొత్తితిరుగుచుందురు.

కృష్ణరాయలు కల్బర్గపురమును గెల్చినట్లు మనుచరిత్రమునందుఁగూడ నీ క్రిందిపద్యభాగమునఁ జెప్పఁబడినది:—

> ప్రళయఘనాఘనఘోషజయానక భాంకృతిభీమచపేటలురత్
> కలుబరగీకటకక్షితిరక్షక! ౪

ఈ పద్యములను బట్టిచూడ రాయలు కల్బరిగనగరమందును సగరపురమందును తురకలను సంహరించెనని తెలియుచున్నది. కల్బరిగ అనఁగా నిప్పుడు నైజాము రాజ్యమందు "గుల్బర్గా" యని పిలువఁబడునది. ఇది పూర్వము బహమనీరాజ్యమునకు రాజధాని, సగరపట్టణమనునది యిప్పుడు భీమానదికి నాతిదూరమున "నస్రతాబాద్ సాగర్" అను పేరిట గుల్బర్గాజిల్లాలోనే యున్నది. కాని యీయుద్ధ మెప్పుడు జరిగినది కనుఁగొనవలసియున్నది. ఏదులఖానుసంబంధమైన క్రిందటి పద్యమందలి విషయమును, కలుబరగను గుఱించిన యీ విషయమును ఒక్కదాడికిసంబంధించినవో లేక వేఱువేఱుదాడులకు సంబంధించినవో? పెద్దన కలుబరగినిగుఱించిచెప్పి వేఱుగ ఏదులఖానునిగుఱించి చెప్పకపోవుటయు, ఆముక్తమాల్యదలోని రెండుపద్యములును నొకదానితరువాత నొకటి కలసియుండుటయుఁ జూడ నివి యొక్కదాడిలోనివార్త లేయని తోఁచెడిని. అట్లయిన దీని కాలముఁ గనుఁగొనుటకు వీలుగలదు. గుల్బర్గాపట్టణమును యూసఫ్ ఆదిల్ ఖానుఁడు ౧౫౦౪-వ సంవత్సరమునఁ బట్టుకొనెను. అది ౧౫౧౪ వఱకు ఆదిల్ శాహాల స్వాధీనమం దుండెను. ఆసంవత్సరమున అమీర్ బేరిద్ దానిని సాధిం

---

1. The yet Remembered Ruler of a long Forgotten Empire by Mr. S. Krishnaswami Iyengar. p 22. ఈసాగర్ కోట కోటపేరు బహమనీరాజులచరిత్రములో నెన్నియోసారులు వచ్చును. ఇచ్చటఁ బెద్దదుర్గ ముండెను. కొందఱు బహమనీరాజు లిందు ఖైదుచేయఁబడిరి. ఈ సంగతి యిట్లుండ పైపద్యమునకు నర్థముఁవ్రాసినవారు సగరపురమనఁగా అయోధ్య అని వ్రాసియున్నారు. !!!

చెను అని యిదివఱకున్న చరిత్రములు చెప్పుచున్నవి[1]. కావున నీపట్టణము ౧౫౦౯-౧౫౧౦ లో యూసఫ్ ఆదిల్ ఖానుని స్వాధీనమందే యుండె ననుటకు సందేహము లేదు. ఆకాలముననే రాయలు గుల్బర్గామీదికి బోయె నని తలంపవలసియుండును. కాని రాయలవారు తిరుపతికి వెళ్ళినప్పు డచ్చటినుండి గుల్బర్గాకుఁ బోయివచ్చె నని రాయవాచకమునందుఁ జెప్పఁబడియున్నది:—

"కృష్ణరాయలవారు ఉత్తరాంతురకలకార్యం జయంచేసుకొని శీమకై తిరిగి తిరుపతికి రాంగా కల్యాణకలుబరిగె కోటలవారు గర్వితులై కోటమీద నుండి కూతలీంగా ఆవార్తలు రాయలవారు విని యెదిరితెగవారెది అడుగగా మ్లేచ్ఛులతెగవారు వున్నారు గనక కోటమీదికై అందులమగడించమని కలుబరిగకోట లగ్గబెట్టించి మూడుముక్కాలు ఘడియలలో కోట సాధించి ఆకోటలో వున్న యజమానుణ్ణి చేపట్టుగా పట్టుకొని ఆరువేలగుఱ్ఱాలవారినిన్ని గుఱ్ఱాలనున్ను ఏకవాగెగా బట్టుకొని ఆకోటను తాణ్యం గుజ్జరి కళ్యాణరావును వుంచి తిరుపతికి వచ్చి......" [పుట. ౭౧]

ఇదియె నిజ మనుకొనినయెడల రాయలు గుల్బర్గాను సాధించినయేఁడు ౧౫౧౪ అగును. రాయలు తిరుపతికి వెళ్లినయేఁడు శా. శ. ౧౪౩౭ అనఁగా, క్రీ. శ. ౧౫౧౪[2]. ఈసంవత్సరముననె అమీర్ బరీద్ అన్నవాఁడు గుల్బర్గాను విజాపురమువారియొద్దనుండి తీసికొనినట్లు చరిత్రకారులు వ్రాసియున్నారు. అందువలన బరీదు కృష్ణరాయలసాయము కోరినందుననో, లేక స్వయముగనో యనాథుఁడయిన బహామనీరాజునకు సాయముగ రాయలు ౧౫౧౪ లో వెళ్లి విజాపురమువారిని ఓడించి యుండును అని మనమూహింపవచ్చును. మహమ్మదీయచరిత్రకారులు కృష్ణరాయనిపేరు చెప్పక బరీదే గుల్బర్గాను గెలిచినట్లు వ్రాసియుందురు.

---

1. Imperial Gazetteer of India Gulburga.
2. Epigraphical Collections No. 53 to 55 of 1889

ఇంకొక వికల్పము. నూనెయెలుచే భాషాంతరీకరింపఁబడిన పోర్చుగీసు చరిత్రకారులు, కృష్ణరాయలు రాయచూరుయుద్ధము (౧౫౨౦) జరిగినతరువాత విజాపురమునకు వెళ్లెననియు,[1] నచ్చట ఖైదీలుగా నున్న ముగ్గురు బహమనీ రాజపుత్రులను బట్టుకొని, నందొకనిని బహమనిరాజుగఁ జేసెననియు వ్రాసిరి. ౧౫౨౨ లోఁ జచ్చిపోయిన రెండవ అహమ్మదుశాహ అనుబహమని సుల్తానునకు ముగ్గురు కుమాళ్లున్నమాట నిజము కాని వీరు ఆదిల్ శాహాల స్వాధీనమందు లేరు. అమీర్ బరీద్ స్వాధీనమం దుండిరి. బీదరులో నఁగా గుల్బగా రాజ్యమందు నుండిరి. కావున వీరిని గృష్ణరాయలు బరీదుచేతినుండి విడిపించియుండును. ముగ్గు రన్నదమ్ములలోఁ బెద్దవాఁడగు అల్లావుద్దీను అనువాఁడు ౧౫౨౧ లోఁ బరీదుచే రాజ్యార్హుఁడుగఁ జేయబడె నని యున్నది. కావున పోర్చుగీజువారి వ్రాఁతలే నమ్మినెడల గుల్బగా దండయాత్ర ౧౫౨౨ లో జరిగెనని తెలును.

ఇట్టిదండయాత్ర యెప్పుడు జరిగె నన్నవిషయమున మూఁడువికల్పములు కలవు. క్రీ. శ. ౧౫౧౦, ౧౫౧౪, ౧౫౨౨. వీనిలో ౧౫౧౪ అనునదియే యధికగ్రాహ్య మని నాతాత్పర్యము.

౪. కెంబావిపై దాడి.

రాయలు తురుష్కులను జయించినట్లు స్పష్టముగఁ జెప్పుపద్య మింకొకటి యాముక్తమాల్యదయొక్క ౫-వ ఆశ్వాసమునకుఁ జివర నున్నది:—

మ. ఇది యంధ్రోక్తి యథార్థనామయవనాస్పృశ్యార్ణకెంబావివా
రిదపద్ధత్యవరోధివప్రవలయశ్రేణీవిఘాతక్రియా
స్పదసేనాగ్రకృష్ణరాయమహిభృత్సంజ్ఞాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసము పంచమం బమరు హృద్యంబైన పద్యంబులన్[2].

---

1. Forgotten Empire. p. 157.

2. తెనుఁగుబాసలో శబ్దార్థము సరిపోవునట్లు తురకలరక్తముతో నిండిన 'కెంబావి' యను పట్టణమునందలి మేఘమార్గము నంటునంతటి యెత్తైన కోటలను బడఁగొట్టునట్టి సైన్యములకు నాయకుఁడైనగు కృష్ణరాయఁ డనునాచే రచింపఁబడిన యాముక్తమాల్యదయందలి పంచమాశ్వాసము రమ్యమైన పద్యములచే నొప్పును.

ఇంతకీ 'కెంబావి' యెద్ది? ఇచ్చటి కథను లెవ్వరు? 'కెంబావి' యనఁగా 'కెంబా' అనుపట్టణ మని టీకాకారులు వ్రాసియున్నారు. కెంబా యన నిప్పుడు "క్యాంబే" యనుపట్టణ మేమో యని యుచ్చారణసామ్యముచేఁ దోఁపవచ్చును. కాని హైదరాబాదు రాజ్యపటముఁ జూడఁగా "కెంబావి" అను గ్రామము గుల్బర్గాజిల్లాలోఁ గానవచ్చినది. ఇది గుల్బర్గాకు నైరృతి మూలను (S. W.) ౫౦ మైళ్లమీఁద నున్నది. షారాపురము, సాగర్ అను నవి దీనికి సమీపమందె యున్నవి శైని సురపుర మని చెప్పఁబడిన షారాపుర మునకు కెంభావి వాయవ్యమున ౧౪-౧౫ మైళ్లదూరమున నున్నది. సగరపుర మని చెప్పఁబడిన సాగర్ కెంభావికిఁ దూర్పున ౧౬-౧౭ మైళ్లమీఁద నున్నది. కెంభావి, షారాపుర్, సాగర్ ఈమూఁడును గుల్బర్గా జిల్లాలోనివి. ఈమూఁడును కృష్ణాభీమానదుల యంతర్వేది (దువాబ్) లో, కృష్ణకు నుత్తరమునను భీమకు దక్షిణమునను నున్నవి. రాయచూరునకుఁ గెంభావి వాయవ్యమూలగా ౬౦ - ౭౦ మైళ్లమీఁద నున్నది. రాయచూరు కృష్ణా తుంగభద్రల యంతర్వేదిలో నున్నదని చదువరు లెఱింగియున్నారు. ఈకెంభావి విజయనగరమునకు సూటిగ నుత్తరమున ౯౦ మైళ్లదూరమున నున్నది. కావున నాముక్తమాల్యద లోని కెంబావి యిది యనియే తలంచుట న్యాయ్యము. ఈశోధనతోడ "కెంబావి" యనఁగా "క్యాంబే" యగునేమో యన్నయూహ పూర్వపక్ష మగుచున్నది. నైజామురాజ్యములోని యీకెంభావి పూర్వ మొకప్పుడు ముఖ్యరాజధానిగా నున్నట్లు తెలియుచున్నది.[1]

రాయలవారు గుజరాత్ దేశమునకు దాడివెళ్లినట్లు మనుచరిత్రములోని యీక్రిందిపద్యము సూచించుచున్నది.

సీ. ఉదయాచలేంద్రంబు మొదల నెవ్వనికుమారతకుఁ గ్రౌంచాచలరాజమయ్యె

---

1. Epi. Ind. Vol. XII. p. 291. ఈశాసనముజాడ (reference) నామిత్రులైన శ్రీరంగనాథ సరస్వతిగారివలన నాకుఁ దెలిసెను. కావున వారికిఁ గృతజ్ఞుఁడ.

నావాడపతిశకంధరసింధురాధ్యక్షు లరిఁగాపు లెవ్వానిఖరతరాసి
కాపంచగౌడధాత్రీపదం బెవ్వాని కసివానుగా సేగునట్టిబయలు.

పై మూఁడు చరణములలోని 'ఉదయాచలేంద్రము' 'నావాడపతి' 'శకంధర' 'సింధురాధ్యక్షుఁడు' అను పదములచేఁ గవి కొన్ని చరిత్రాంశముల సూచించినాఁ డనుటకు సందేహము లేదు. 'ఉదయాచలేంద్ర' మనఁగా నెల్లూరుసీమలోని ఉదయాద్రి. 'సింధురాధ్యక్షు' అనఁగా గజపతి అని చెప్పిన టీకాకారుల యర్థమును మన మంగీకరింపవచ్చును. కాని యితరపదములవలన నే దేశమునుగాని యేరాజునుగాని గ్రహింపవలయునో టీకాకారుల వ్రాఁతలవలన నర్థబోధ యగుటలేదు. 'నావాడపతి'=నావాడదేశపురాజు; శకంధర=శకంధరుఁ డనురాజు; పంచగౌడధాత్రీపదము=కనోజిలు మొదలయినవారి ఉత్తరదేశము; అని టీకాకారులు వ్రాసియున్నారు. ఇంతకంటె నధికస్పష్టమైనయర్థ మేమైన నిందుండి లాగవచ్చునేమో యత్నింతము. ఇందలి 'శకంధర' శబ్దము 'శికందర్'* అను పారసీకశబ్దమునకు సంస్కృతరూప మని నాతాత్పర్యము. కృష్ణదేవరాయలకాలమున గుజరాతురాజ్యముపై శికందర్ అనునతఁ డుండెను. పెద్దనచేఁ బేర్కొనఁబడు గౌరవముంగన్న శకంధరుఁ డీతఁడే యగునేని, రాయలు గుజరాతుమీఁదికి క్రీ. శ. ౧౫౨౬ లో వెళ్లెనని చెప్పుటయే గాక, ఆయేఁడు ఫిబ్రెవరీ, మార్చి, యేప్రల్ ఈ మూఁడునెలలలో నెప్పుడో యొకప్పుడు వెళ్లెననికూడఁ జెప్పవచ్చును. ఎందుకన నీతఁడు మూఁడునెలలే రాజ్యముచేసెను. ఈకాలము మన మిదివఱకు నూహించిన కాలముతో సరిపోవుట లేదు. ఈరెండు కాలములలో నేది నిజమో శోధింపవలెను.

'ఆపంచగౌడధాత్రీపదము' లోని 'ఆఙ్' అనుదానికి మనము 'మర్యాద' యనియె యర్థము తీసికొనవచ్చును; 'అభివిధి' అని తీసికొన

---

* 'అలెగ్జాండర్' శబ్దమును పారసీకచరిత్రకారు లందఱును 'శికందర్' అని వ్యవహరించెదరు. దీనినే మనవారు 'శకంధర'గా మార్చి 'శక' శబ్దమునకును దానికిని సంబంధము కల్పించి రని నాయూహ.

నక్కఱలేదు. [ 'ఆఙ్ మర్యాదాభివిధ్యోః' పాణిని సూ. ౧-౧౩ ] 'ఆపంచగౌడ' అనఁగా పంచగౌడదేశమువఱకు నని యర్థము. పంచగౌడు లనఁగా సారస్వతులు, కాన్యకుబ్జులు, మైథిలులు, గౌడులు, ఉత్కళులు. గుజరాతీలు పంచద్రావిడులలోనివారే కాని, గౌడులుకారు. కావున ఆపంచగౌడ మనఁగా గుజరాతుదేశమువఱకును అని యర్థముచేయవచ్చును. దానికి గౌడదేశము తగిలియున్నది గనుక 'ఆపంచగౌడ' పద మిచ్చుట మర్యాదపరము. ఇట్టిపద్యము కృష్ణరాయుని యుత్తర (పశ్చిమోత్తర) దిగ్విజయయాత్రను సూచించుచున్నదని యర్థము చేసికొనవచ్చును. 'ఆపంచగౌడ' దేశ మనఁగా నర్మదకు నుత్తరమున నున్న హిందూదేశ మనియు సాధారణముగ నర్థముచేయవచ్చును. ఇందునుగుఱించి యింతకంటె నెక్కుడు చర్చించుటకు నధికసాధనము లేవియు లేవు.



# కృష్ణదేవరాయల నిధనకాలము *

ఇదివఱకుఁ జరిత్రకారు లందఱును కృష్ణదేవరాయలు క్రీ. శ. ౧౫౦౯ మొదలు ౧౫౩౦ వఱకు రాజ్యముచేసె ననియు, ౧౫౩౦లోఁ గీర్తిశేషుఁ డయ్యెననియు వ్రాయుచున్నారు. కాని యిందునుగుఱించిన శాసనాదులను మఱల నెక్కుడు శ్రద్ధతో శోధింపవలయు నని నా తాత్పర్యము. రాయలవారు ౧౫౩౦ లోఁ గాక ౧౫౨౯-౧౫౨౮ లోఁ గీర్తిశేషు డయ్యెనేమో యని నాకుఁ బ్రబలసంశయము కలుగుచున్నది. ఇందుకుఁ గల హేతువులను కొన్నిటి నిచ్చటఁ జర్చించెదను.

కృష్ణదేవరాయలు శా. శ. ౧౪౪౭ సరియయిన క్రీ. శ. ౧౫౨౯-వ సంవత్సరమునఁ గీర్తిశేషుఁ డయ్యె నని చెప్పునట్టి యీక్రింది చాటుపద్యము తెనుగుదేశమునందుఁ బరంపరగా వచ్చుచున్నది.

ఉ॥ బోరన యాచకప్రతతి • భూరివిపద్దశ నొందుచుండఁగా
నారయ శాలివాహనశ • కాబ్దములగ్రియుగాబ్ధిసోములం
దారణవత్సరంబున ని • దాఘదినంబున జ్యేష్ఠశుద్ధష
ష్ఠీరవివాసరంబున నృ • సింహునికృష్ణుఁడు చేరె స్వర్గమున్
ద్వారక నున్నకృష్ణుఁ డవ • తారసమాప్తము నొందునైపడిన్. †

ఈ చాటువునుబట్టి చూడఁగా కృష్ణరాయఁడు తారణసంవత్సరమగు నట్టి శా. శ. § ౧౪౪౭-వ యేఁట జ్యేష్ఠశుద్ధ షష్ఠి ఆదివారమునాఁడు కీర్తిశే

* ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. కాళయుక్తి సంవత్సరము సప్తమ సంపుటము పుట ౪౨౩.

† ఆంధ్రకవులచరిత్రము, ౨-వ భాగము.

§ ఇది గతాబ్దము కాదు. జరుగుచున్న సంవత్సరపుసంఖ్య యని నా తాత్పర్యము.

ష్ఠుఁడయ్యెనని కానవచ్చుచున్నది. దీని కనుకూలముగఁ జెన్నపట్టణమందలి ఓరియంటల్ లైబ్రరీలో నున్న 'లోకల్ రికార్డ్సు' యొక్క ౧౭-వ సంపుటములోని ౪౦౭-వ పుటలో రామరాజుచే నీయఁబడిన యీకౌలు కలదు:—

"చింతరాజుపల్లె పాళెం వెంకటపతిరాయనివద్ద నున్న కాగితపుకౌలుకు నకలు"—

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౪౮ అగునేటి వ్యయనామసంవత్సర వైశాఖ శు౧౫లు శ్రీమద్రాజాధిరాజ రాజకంఠీరవ రాజకందర్ప మహారాజాధిరాజపరమేశ్వర రాజపూజితులగుమహారాజ శ్రీరామరాజయ్యగారు విజయనగర సింహాసనమున పృథ్వీసామ్రాజ్యము చేయుచుండగాను గురుగింజకూటు నచులనేని కుమార పెద్దబుచ్చినాయనివారికి వ్రాయించి యిచ్చిన కౌలునిరూపం—మహారాజశ్రీ కృష్ణరాయులయ్యగారికిన్ని తరిగొండ తిమ్మానాయని కుమార రామానాయనికిన్ని విరోధం సంభవించినప్పుడు మీరు వారిలో కలస్తిరి అని సంశయించి మీకు నడుస్తువున్న గ్రామాదులు నశ్యజప్తీ చేయించిరి గనుక కోటకొండ పెద్దవోబుళరాజు విప్పపెంట కుమారజంగమరెడ్డి కడప గోపాలబుద్ధారెడ్డి వోగిమళ్ల పెద్దరెడ్డి వీరబల్లె యరమాచిరెడ్డి గండికోట బాగసాని పెద్దనల్లపరెడ్డి యీమొదలయిన దేశస్తులున్నూ మహారాజశ్రీ రాయలవారి ముద్రకర్త వుదయగిరి మలహరిశంకరపంతులు కొమారుడు ఆనందగోపాలపంతులవారు మాతో విన్నపంచేసిరి. గనుక చిత్తగించి మీకు నడుస్తువున్న గ్రామాదులు విప్పపెంటలోకి చెల్లె ఆరుగ్రామాదులున్నూ విప్పపెంట ౧—పాంశమాల్లె ౧—విరువల్లె ౧—సోమవరం పెద్దవీడు ౧—గండికోట ౧—చింతరాజుపాళెం ౧—మలనేనిపట్టం ౧, యీపద్ధాలుగు గ్రామములున్నూ మొఖా చెన్నూరుపర్గణే శిద్ధవటంతాలూకు యెనభైనాలుగు గ్రామాదులు. కావలి నిర్ణయం కాడ్రమగుంటుకుల్ ౨ మడకకుర్ ౨ మగ్గానకర్ ౨ వర్తకులయిద్దుకుర్ ౨ మడి అనిన్ని—ఆధాన్యం చెన్నూరుతాలూకు ౧౪ గ్రామాదులు శిద్ధవటం తాలూకు ౮ ౪ అనిన్ని గ్రామానకు...............

......మేడి సూర్యకోమారుని కనమరుసుము చేరి కట్టసరుసుము—దొంగల సాని రుసం—తిరుపతిభాట రుసం—పరపల్లె వఘిమాళ్లె వీటి రుసుములు వొక్కల పెరికెకుర్ ౦।౦ గసవుగాణవనగకుర్ ౦।౦ వస్రాలనగకుర్ ౦।౨ తిరుపతి పరుషకు స్వారికి నెర జనం ౧ కి నెబులు ౧ భూసాన్కుర్ ౦౪= యీ చొప్పున నడిపించుక మాకవులు నమ్మి సుఖానవుండమని వ్రాయించి యిచ్చిన కవులు నిరూపం."

ఈ కాలునుబట్టిచూడ శా. శ. ౧౪౪౮ వ్యయనామసంవత్సరము వైశాఖ మాసమునందు విజయనగరమున రామరాజు ప్రభుత్వము చేయుచున్నట్లును, అదివఱకే కృష్ణరాయలు కీర్తిశేషులైనట్లును గానవచ్చుచున్నది. ఈకాలు వై చాటువునకు సహకారిగనే యున్నది.

కృష్ణరాయలు తారణనామసంవత్సరముననే కీర్తిశేషులై యుండవచ్చు ననుటకు మఱికొన్ని శాసనములు కానవచ్చుచున్నవి.

1. తారణనామసంవత్సర మార్గశిర శు. ౨ వఱకుఁ గృష్ణరాయనికుమారుఁడైన తిరుమలరాయఁడు రాజ్యము చేయుచున్నట్లొకకన్నడశాసనము కలదు.[1] ఇది ముఖ్యముగఁ జూడఁదగినది గనుక దాని నిచ్చట నిచ్చుచున్నాఁడను.

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్ష ౧౪౪౬ నెయ తారణసంవత్సరద మార్గశిర శుద్ధ ౨ శని స్వస్తి శ్రీమాన్ మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరభుజబల ప్రతాప గజపతి అశ్వపతి భాడ శ్రీకృష్ణదేవ మహారాయ ఉదరాబ్ధిచంద్ర శ్రీతిరుమలదేవమహారాయర కాలదలు శ్రీమాన్ మహాసేన సాళువచతుస్సముద్రాధీశ్వర తిమ్మన్న దండనాయకర దేశదలు స్వస్తి శ్రీ అభినవకాంచీసమకలు ఊరవర్ వరదరాజ దేవర ఉత్తమసంధి దధ్యన్నదివసరకె శ్రీకృష్ణదేవమహారాయరిగె గంగోదక సేవితిరప్ప.....కోనపనాయ

1. Epi. Carnatica Vol. IX. p. 75, District Bangalore, Taluq Magadi. Inscription No. 82.

కరు, తిరుమల దేవమహారాయరిగె తిమ్మన్న దన్నాయకరిగె ధర్మవాగబెకు ఎందుమారయన హళ్లిగె ప్రతినామవాద నాయకపురవను కొనపనాయకరు వరద రాజదేవరిగె సమర్పిసిదరు తావుమాడిద సెవ ఆచంద్రార్క-స్థాయిగాగి నడెయ బెకందు మాడిదసేవె...............”

ఈశాసనము వ్రాయువఱకుఁ గృష్ణరాయలు మృతినొందెననియు, ఆతని కుమారుఁడగు తిప్పప్ప రాజ్యము చేయుచుండెననియు మనమూహింపవచ్చును ఇది మంత్రియైనసాళ్వ తిమ్మరసు రాజ్యమందుఁ జేయఁబడినశాసనము. కృష్ణదేవ మహారాయలకుఁ గోనపనాయకుఁ డనువాఁడు గంగోదకము సేవింపఁజేసె ననియు నిందుఁ జెప్పఁబడియున్నది. చరమావస్థయందు గొంతులో గంగబోయు నాచారము హిందూదేశమం దంతటను గలదు. కావునఁ గోనపనాయకుఁడు రాయలచరమదశయం దాతనిసేవ చేసి ధన్యుఁ డయ్యెనని మనము తలంప వచ్చును. పైచాటుపద్యమునందలి మరణతిథియె నిజమైనయెడల ఈశాసనము రాయలమరణానంతరమున ఆరునెలలలో వేయఁబడినది యగును.

2. శా శ. ౧౪౪౭-లో నచ్యుతరాయలు విజయనగరమందు రాజ్యము చేయుచున్నట్లు నెల్లూరుమండలమునందు నొకశాసనము కలదు[1]. దాని నిచ్చట వలయునంతభాగము మాత్ర మిచ్చుచున్నాఁడను:—

“ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శ. ౧౪౪౭ అగు నెటి (పార్థివసంవత్సర ఫాల్గుణ) శు. ౧౯ బు మున (శ్రీమన్మహామండలేశ్వర.........) అచ్యుతదేవమహారాయలువారు విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై ఏలుచుండ, వుదయగిరిపట్నంబున శ్రీమన్మహామండలేశ్వర (శ్రీ) రాజు చిన తిరుమల రాజులవారి కార్యకర్తలైన తిమ్మరాజులవారి కార్యకర్తలైన తిమ్మ రాజు నందయ్యగారు వేదాద్రి శ్రీనరసింహదేవుని దివ్యశ్రీపాదపద్మంబులకు

1. Butterworth and Venugopala Chetty: Nellore Inscriptions, Vol. II, p. 803. Nellore Taluq, Inscription No. 34-A.

సాష్టాంగ దండప్రణామంబులు సమర్పించి యిచ్చిన ధర్మశాసనక్రమ మెట్లి న్నను............”

ఈశాసనమునుబట్టి చూడ శా. శ. ౧౪౪౮-లో అచ్యుత దేవరాయలు విజయనగరమందు రాజ్యము చేయుచున్నట్లు, అనఁగా కృష్ణరాయలు కీర్తిశేషుఁడైనట్లు కానవచ్చుచున్నది.

3. శా. శ. ౧౪౪౬-లోఁ గృష్ణరాయనికుమారుఁడైనతిరుమలదేవరాయలు దానము చేసినట్లున్నది.[1]

4. శా. శ. ౧౪౫౦ (క్రీ. శ. ౧౫౨౮). ౧౪౫౧ (క్రీ. శ. ౧౫౨౯) సంవత్సరములలో నచ్యుతరాయశాసనములు కానవచ్చుచున్నవి[2]?

వీనినన్నిటినిబట్టి చూడఁగాఁ గృష్ణరాయలు శా. శ. ౧౪౪౬ -లోనో ౧౪౪౭-లోనో మృతి నొందినట్లును, అప్పటినుండియు శా. శ. ౧౪౫౨ (క్రీ. శ. ౧౫౩౦) వఱకు విజయనగరరాజ్యమును ఆక్రమించుకొనవలయునని అతని కుమారుఁడైనతిరుమలరాయలును, అల్లుఁడైనరామరాయలును, తమ్ముఁడైన అచ్యుతరాయలు ప్రయత్నించుచుండినట్లును[3] ఎవరికి వీలయినప్పుడు వారు శాసనములు వేయించుటు, కాల్చివ్రేయుట మొదలయిన పనులు చేయుచుండినట్లును, ఈకాలమునందు నెవరి యధికారమును స్థిరపడనట్లును దోఁచుచున్నది.

ఈయూహాలకన్నిటికి వ్యతిరేకముగ గృష్ణరాయనిశాసనములు పెక్కులు శా. శ. ౧౪౫౨ వఱకును గలవు! కావుననే సుయెల్ మొదలయిన తద్జ్ఞులు కృష్ణరాయలు శా. శ. ౧౪౫౨ (క్రీ. శ. ౧౫౩౦) వఱకును జీవించియుండె నని వ్రాసియున్నారు. కాని వారు, నేను బైనిజూపిన కాలునుగాని, శాసనములనుగాని జర్చించి సమన్వయించుటకు యత్నించియుండలేదు. ఇఁక మీఁదఁ జరిత్రవ్రాయువారు వీని నన్నిఁటిని సమన్వయింపవలసియున్నది. వీని నన్నిటిని నొకవిధముగా సమన్వయింపవచ్చునేమో! ౧౪౪౬-లోనే రాయలు

1. 139 of 1896 Epigraphical Collections.
2. Sewell : Antiquities, Vol. I pp. 93 ; 182 ; 322.
3. Ep. Carn. Vol. IX, Ma. 82.

ప్రతిని వ్రాయించియుండవచ్చును. తరువాత ౧౪౫౨ వఱకును అచ్యుతరాయరాజాదులు కలహపడుచు రాజ్య మరాజకముగా నున్నకాలమందుఁ గొందఱు నాయకులు తటస్థులుగ నుండి, వీరివైపుఁ జేరక వారివైపుఁ జేరక యుండవచ్చును. అట్టివారు శాసనాదులు వ్రాయించవలసివచ్చినప్పుడు ఆశాసనములలో, నప్పుడు రాజ్యమునకై పోరాడుచున్న వారిలో నెవ్వరిపేరు చెప్పుటకును చెల్లక అంతకుఁ బూర్వము నిశ్చయముగఁ బ్రఖ్యాతము చేసిన కృష్ణరాయల పేరే వ్రాయించియుందురు. ఇదియొకయూహ. ఈయూహ ననుసరించి శా. శ. ౧౪౪౭ తరువాతి రాయలశాసనము లన్నియు బహుసూక్ష్మదృష్టితో శోధింపఁబడవలెను. ఆపని యవకాశానుసారముగ నేను జేయుచునే యున్నాను. కాని యితరులును చేయుదురుగాక.

ఈవ్యాసము వ్రాయుటలో నాయుద్దేశము పైనుదాహరించిన కాలును తెలిపుచ్చి, దానినిబట్టి రాయలనిధనకాలము నిశ్చయించుటకు వీలుంటునేమో యాలోచింపుఁడని యీవిషయమున శ్రద్ధగలవారిని కోరికొల్పుటయే. కాని, యిది మిథ్యమని నిశ్చయించుటకుఁ గాదు. పైనుదాహరించిన కాలు నాల్గేండ్లక్రిఁద చింతరాజుపల్లె గ్రామం వెంకటపతిరాయనియొద్ద నుండెను. ఈగ్రామము దత్తమండలములలోని కడపజిల్లాలోనిది. వెంకటపతిరాయనివంశజు లెవ్వరైన నున్నయెడల వారు, ఈకాలు కాగితముయొక్క అసలు తమయొద్ద నున్నయెడల దానికి సరియయిన నకలు వ్రాసి నాకుఁ బంపుదురుగాక. లేక పత్రికలోనైనఁ బ్రకటింతురుగాక. ఇంకను నిందున గుఱించి వారియొద్ద నెట్టి కాగితపత్రము లున్నను వెలిపుచ్చి కృష్ణరాయల కాలనిర్ణయమునకును నాకాలమందలి యితర విషయముల నెఱుఁగుటకును గ్రొత్తసాధనములఁ దెలుఁగుదేశజులకు నొసంగి వారికృతజ్ఞతకుఁ బాత్రు లగుదురుగాక. చరిత్రవిషయమై శ్రద్ధగల దత్తమండలములలోని శోధకులు కొందఱిందునుగుఱించి శ్రద్ధవహించి, నూతనములైన కాగితపత్రములను గనుఁగొనుటకు యత్నించెదరని నమ్ముచున్నాను.

శాసనములను శోధించెడువా రందఱును కృష్ణరాయనిశాసనములు శా. శ. ౧౪౪౭ తరువాతివి శోధించునపుడు నేను రాయలనిధనకాలమును గుఱించి పైని వ్రాసిన విషయములను జ్ఞాపక ముంచుకొందురని నమ్ముచున్నాఁడను.

---

# చాళుక్యులు దాక్షిణాత్యులే *

చాళుక్యు లుత్తరదేశమునుండి వచ్చినవారనియుఁ, జంద్రవంశపు క్షత్రియులనియుఁ బెక్కు చరిత్రకారులు వ్రాసియున్నారు. కాని మనకుఁ దెలిసినంతవఱకుఁ జరిత్రలందు గానఁబడు చాళుక్యులకును, ఉత్తరదేశమునకును ఎట్టి సంబంధమును లేదనియుఁ, గదంబ, రాష్ట్రకూటాది వంశములవలె వీరును దాక్షిణాత్యులే యనియుఁ దెలియుచున్నది.

ఇచ్చట దాక్షిణాత్య శబ్దమునకుఁ గొంచెము నిర్వచనము చెప్పవలెను. మన పూర్వులచే హిందూదేశము రెండుఖండములుగా విభాగింపఁబడినది. ఒకటి ఉత్తరహిందూదేశము, రెండవది దక్షిణహిందూదేశము. ఈ రెంటికిని సరిహద్దు వింధ్యపర్వతము లేక నర్మదానది. ఈ పర్వతమునకు గాని, నదికిగాని దక్షిణమున నున్న భూభాగమున కంతటికిని దక్షిణాపథమనియు, లేక దక్షిణహిందూదేశమనియుఁ బేరు. ఇచ్చట నివసించువారు దాక్షిణాత్యులు. కాని యీ వ్యాసమునందు దాక్షిణాత్యశబ్దమును ఇంత వ్యాపకార్థమందు నుపయోగింపఁ దలఁచుకొనలేదు. ఆంధ్రదేశమును, దానిఁజుట్టును అంటి సరిహద్దులుగ నున్న దేశమును మాత్రము గ్రహింపఁదలఁచితిని. ఆదేశములలో నీశాన్యమున నున్న ఓఢ్రదేశమునుగూడ గ్రహింప నక్కఱలేదు. సరిహద్దుగ లేకపోయినను మళయాళదేశమునుగూడ నందుఁ జేర్పవచ్చును ఇట్లు దాక్షిణాత్యపదము వలన నాంధ్ర, కర్ణాట, ద్రావిడ, మళయాళ, మహారాష్ట్రదేశములు సూచింపఁబడును.

---

* ఈవ్యాసమును లక్ష్మణరావు పంతులుగారు పరమపదించు నాఁటి మధ్యాహ్నము ముగించిరి. ఇదియే వారి తుదివ్యాసము. శారద (సం ౨. సం ౧. రుధిరోద్గారి, భాద్రపదము) లో ప్రకటింపబడినది.

చాళుక్యులచరిత్ర కనుగొనుటకై యీనామములుగల వంశములు చరిత్ర గ్రంథములలో నెన్ని కలవో మొదటఁ జూడవలెను. చరిత్రకు సంబంధించినంతవఱకు వీరివంశము లయిదు కానవచ్చుచున్నవి.

౧. మొదటిది వాతాపి (బాదామి) యను పట్టణము రాజధానిగాఁగల వంశము. వీరు రమారమిగా క్రీ. శ. ౫౫౦ మొదలు ౭౫౦ వఱకు, రెండు వందల యేండ్లు రాజ్యముచేసిరి. ఈ వంశమే మిగిలిన యన్నివంశములకును మూల మని చెప్పవచ్చును.

౨. రెండవ వంశమువారు తూర్పు చాళుక్యు లను పేరుతో రాజమహేంద్రవరము రాజధానిగా ౬౧౦ మొదలు ౧౧౦౦ వఱకు రాజ్య మేలిరి.

౩. మూఁడవ వంశమువారు కన్నడదేశమందలి కళ్యాణపట్టణము * రాజధానిగ రమారమి ౯౭౦ మొదలు ౧౨౦౦ ల వఱకు రాజ్యముచేసిరి. మొదటి వంశమువారిని, మూఁడవ వంశమువారిని కలిపి సాధారణముగాఁ బశ్చిమ చాళుక్యు లందురు.♦

---

* వీరి రాజధానియైన కళ్యాణపట్టణము (దీనినే కటక మనుచుండిరి.) మహారాష్ట్ర దేశమందలిది యని శ్రీయుత జయంతి రామయ్యపంతులుగారు సాహిత్యపత్రికలో వ్రాసిరి. ఈమాటనే శ్రీయుత బ్రహ్మయ్యగారును, వారి శిష్యులును, మఱికొందఱును అనువదించుచున్నారు. కాని యీకళ్యాణము మహారాష్ట్రదేశమందలి రైల్ స్టేషన్ అయిన కళ్యాణ్ కాదు. కన్నడదేశమందలి కళ్యాణిపట్టణము. ఇది నైజామురాజ్యమునందు గుల్బర్గాజిల్లాలో నున్నది. **(Vide Imperial Gazetteer of India)**

♦ ఈ రెండు వంశములవారిలో విశేషవిభేదము చేయక, యుభయులను "కల్యాణచాళుక్యు" లనియు, పశ్చిమచాళుక్యు లనియుఁ జరిత్రకారులు వ్యవహరించి యున్నారు.

౪. నాల్గవశాఖయు, అయిదవ శాఖయు గుజరాత్ దేశము నేలిన చాళుక్యులు. నాల్గవవంశమువారు ౭౦౦ లు మొదలు ౯౫౦ వఱకు నున్నతి దశలో నున్నట్టు కానవచ్చుచున్నది.

౫. అయిదవశాఖవారు సోళంకులు అను పేరిట "అన్హిల్ వాడ" పట్టణము రాజధానిగ ౯౪౦ మొదలు ౧౧౪౩ వఱకు దొరతనము చేసిరి. కొందఱు చాళుక్యులు సోళంకులన్న పేరిట రాజపుత్రస్థానమునందును, బుందేల్ ఖండమునందును చిన్నచిన్న సంస్థానములను సంపాదించుకొనిరి. చిన్నచిన్న సంస్థానికులుగా అఱవదేశమునందును వ్యాపించినట్లు శాసనములవలన దెలియుచున్నది. కన్నడదేశమునందుఁ గూడఁ దరువాతికాలమున నీచాళుక్యులు చిన్నచిన్న జమీందారులుగ నున్నట్లు కానవచ్చుచున్నది.

ఇఁక వీరందఱి ఉత్పత్తినిగుఱించి విచారింపఁగా వీరందఱును దక్షిణదేశపువారే యనియు, వీరిలోనుండి కొందరు దక్షిణమునుండి యుత్తరమునకుఁ బోయిరేగాని, ఉత్తరమునుండి దక్షిణమునకు రాలేదనియు, వారి చరిత్రములును శాసనములును స్పష్టముగా నుద్ఘోషించుచున్నవి. అది యెట్లో చూతము. మొదటివంశమువారగు వాతాపి చాళుక్యులు కన్నడదేశజు లని వేరుగ జెప్పనక్కఱలేదు. వారి రాజధాని కన్నడదేశమునం దుండుటవలనను, వారిచ్చిన కొన్ని శాసనములు కన్నడమునం దుండుటవలనను, మిగిలినవి సంస్కృతమునందుమాత్ర ముండి ఇతరభాషలలో లేకపోవుటవలనను, వారికి మహారాష్ట్రదేశముమీఁద గొంత యధికారమున్నను అచ్చట వారిచ్చిన శాసనములు మహారాష్ట్రమునందు వ్రాయకపోఁగా, సంస్కృతశాసనములు గూడ వారు కన్నడాక్షరములతో వ్రాయించుటవలనను వారి మాతృభాష కన్నడ మనుట కెంతమాత్రమును సందియములేదు. తా ముత్తరదేశమునుండి వచ్చితిమని వా రెచ్చటను తమ శాసనములందు చెప్పుకొని యుండలేదు.

ఈబాదామిచాళుక్యులు మహారాష్ట్రు లని కొందఱు వ్రాసియున్నారు. మహారాష్ట్రులయినను, దాక్షిణాత్యులేగాన నావాదమునకు నేమియు భంగము

లేదు. కాని, మహారాష్ట్రులా, కర్ణాటకులాయనిన చర్చకు జవాబుగా, కర్ణాటకులేయని చెప్పవలసియున్నది. ఇందు కింకను ప్రమాణము కావలసినవారు రాష్ట్రకూటరాజైన దంతిదుర్గుఁ డనువాని సమానగడతామ్రశాసనము జూడ నగును.* ఇది శా. శ. ౬౭౫వ నాటిది. ఈరాజు బాదామివంశమును జయించినవాఁడు. ఈరాజుకూడ తాను జయించిన చాళుక్యులు కర్ణాటు లని యాశాసనమునందు స్పష్టముగ జెప్పెను. ఇట్లు శ్రీహర్షుని నర్మదానది యొద్దను నడ్డగించిన పులకేశి కర్ణాటకుఁ డని సమకాలమువారి యభిప్రాయ మనుటకు నేమియు సందేహము లేదు.

ఇఁక రెండవ చాళుక్యవంశమువారైన తూర్పు చాళుక్యులు వాతాపి చాళుక్యులలో నుండియే చీలినవారని సర్వవిదితము. పశ్చిమచాళుక్యరాజైన రెండవ పులకేశియు, తూర్పు చాళుక్య వంశస్థాపకుఁడైన కుబ్జవిష్ణువర్ధనుఁడును, అన్నదమ్ములు; అట్లే నాల్గవవంశమని పైని చెప్పఁబడినదియు, గుజరాతు దేశమునందు రాజ్యమేలినదియు నగు చాళుక్యవంశమునకు మూలపురుషుఁడు రెండవ పులకేశికిఁ దమ్ముఁడు. మూఁడవ వంశమువారైన కళ్యాణిచాళుక్యులును మొదటి వంశమునుండి పుట్టినవారే. ఈరెండు వంశములకుం గల సంబంధము ఫ్లీటుగారి గ్రంథమునందు ౩౭౯వ పుటలో నియ్యఁబడినది. ఇది కౌతేయము తామ్రశాసనము నుండి ఎత్తి వ్రాయబడినది. చూడనగును.

ఇఁక మిగిలినవారు అన్హిల్ వాడ రాజులైన సోళంకి నృపతులు. వీరును పశ్చిమచాళుక్యరాజవంశములోని యొకపురుషుని సంతతివారని చరిత్రకారులు చెప్పుచున్నారు. రాజపుత్రస్థాన చరిత్రవ్రాసిన కర్నల్ టాడ్ ఇట్లు వ్రాయుచున్నాఁడు.

**"They were Prnices of Kalian, on the Malabar Coast, which city still exhibits vestiges of ancient grandeur. It was from Kalian that a scion of the Solanki tree was**

---

*** Ind, Ant Vol. Xi, P 114.**

**taken and engrafted on the Royal stem of the Chawuras of Anhulwarra Putun" Vol I, P 81.**

"వారు కళ్యాణరాజపుత్రులు. ఈపట్టణ మిప్పటికిని తనపూర్వవైభవమును సూచించుచు మలబారు తీరమున నున్నది. ఇచ్చటి రాజు లనువృక్షము నుండి యొకకొమ్మ తెచ్చి అన్హిల్‌వాడ పట్టణపు రాజవృక్షముపై నంటునాటు వైనది." అని పైదాని కర్థము.

రాజపుత్రస్థానమందలి సోలంకీలు గుజరాతు సోలంకీలనుండి యుద్భవించినవారు. ఇందులకు గొన్ని యుదాహరణములు. రాజపుత్రస్థానము నంటుకొని 'టూనవాడా' అను సంస్థానమొకటి కలదు. ఇది యిప్పటి బొంబాయి రాష్ట్రములో జేర్పఁబడినది. ఇచ్చటి రాజు సోళంకియే. అన్హిల్‌వాడా సోళంకీలలోనివాఁడు.

**"The chief is descended from a Rajput dynasty that ruled at Anhilwada Patan... The chief 'Maharana' is a Hindu of the Solanki Rajput class."**

—IMPERIAL GAZETTEER OF INDIA.

"ఈరాజు అన్హిల్‌వాడ పట్టణమున రాజ్యముచేసినవారి వంశజుఁడు... ఈమహారాణా సోళంకివంశమువాఁడు" అని దీని కర్థము.

మధ్యహిందూస్థానమునందు రీవా యని యొక రాజపుత్ర సంస్థానము కలదు. అచ్చటివారు సోళంకులలోని బఘేళ్ అను శాఖవారును గుజరాతు నుండి వచ్చినవారే.

**"The chiefs of Rewah are Baghul Rajputs descended from the Solanki clan which ruled over Guzerat from the 10th to 13th Century."**

—IMPERIAL GAZETTEER OF INDIA.

“ రీవారాజులు, బఘేల్ రాజపుత్రులు. గుజరాతుదేశమునందు ౧౦ వ శతాబ్దమునుండి ౧౩ వ శతాబ్దమువఱకు రాజ్యముచేసిన సోళంకి వంశమున నుండియే వీరి యుత్పత్తి” అని యర్థము.

ఇట్లు ఉత్తర హిందూదేశము నందలి సోళంకుల పూర్వచరిత్రము పరీక్షించినయెడల వారంతయును గుజరాతునుండి వచ్చిన వారని స్పష్టముగాఁ దేలుచున్నది. గుజరాతు సోళంకులు కన్నడచాళుక్యులలోనుండి చీలినవారని ఇదివఱకే తెలిపియున్నాము. ఈలాగున చాళుక్యు లెచటనున్నను, ఏ పేరుతో నున్నను దక్షిణమునుండి యుత్తరమునకుఁ బోయినవారుగాఁ గానవచ్చుచున్నారే గాని యుత్తరమునుండి దక్షిణమునకు వచ్చిన వారుగా నేచరిత్ర వలనను గానరాదు.

ఇఁక వీరికొన్ని శాసనములలోను, గ్రంథములలోను ఈయఁబడిన వీరి యుత్పత్తికి సంబంధించిన గాథలను, ఉత్తరమునుండి వచ్చినారనిన గాథలను పరీక్షించెదము. వాతాపిచాళుక్యులు తాము ఉత్తరమునుండి వచ్చితిమని ఎచ్చటను, ఎన్నఁడును చెప్పకొని యుండలేదు. ఉత్తరపుగాథ అనఁగా అయోధ్యనుండి వచ్చితి మన్న కథ మొదట పదవ శతాబ్దములో పూర్వచాళుక్యులలో పుట్టినది. ఈయది మొదట రాజరాజుతండ్రి యయిన విమలాదిత్యుని రణస్థిపూండి శాసనములోఁ గానవచ్చును. ఈయది క్రీ. శ. ౧౦౧౧ వ సంవత్సరపు నాఁటిది. చాళుక్యుల మొదటి శాసనము ౫౫౦ ప్రాంతపుది. కావున ఈ వంశము రాజ్యమునకు వచ్చిన తర్వాత రమారమి ౫౦౦ ల యేండ్లవఱకును ఈగాథ ఎవరు నెఱుఁగరు. ఈగాథ చెప్పటలో తమ వంశము చంద్రవంశమని చెప్పకొనిరి. చంద్రవంశమునకును, అయోధ్యకును ఏమి సంబంధము? అయోధ్య ఎప్పుడును సూర్యవంశజుల రాజధాని. అచ్చటఁ జంద్రవంశజు లేలినట్లు పురాణములలో లేదు, చరిత్రములలోను గానరాదు. కావున నిది యొక యసంగతమైన గాథ. అసంగతమైనను సుసంగతమైనను ఇతర చాళుక్యుల గాథలతోఁ గలియుటలేదు.

కళ్యాణ చాళుక్యులలో గొప్పరాజైన విక్రమాంకదేవునిం గుఱించి బిల్హణుఁడను కవి విక్రమాంకదేవచరిత్ర మను ఒక కావ్యము రచించెను. అందుఁ జెప్పఁబడిన చాళుక్యోత్పత్తి కథకును పై శాసనాలలో చెప్పఁబడిన కథకును సంబంధము లేదు. రణస్థిపూండిశాసనమునందును, దాని ననుసరించి వ్రాయఁబడిన నందంపూఁడి శాసనమునందును, బ్రహ్మకు అత్రి, అత్రికిఁ జంద్రుఁడు పుట్టినట్లు చెప్పి అప్పటినుండి పాండవులవఱకును, తర్వాత ఉదయనునివఱకును వంశము చెప్పఁబడినది. ఉదయనునినుండి ఏఁబదితొంబది తరములవా రయోధ్యలో రాజ్యముచేసిరఁట. పిదప విజయాదిత్యుఁడను రాజు దక్షిణాపథమునకు వచ్చి త్రిలోచన పల్లవునిచే నిహతుఁ డయ్యెనట. ఆతనిభార్య గర్భవతి. విష్ణుభట్ట సోమయాజిచేఁ గాపాడఁబడి విష్ణువర్ధనుఁడను కుమారునిఁ గనెను. ఆతఁడు చళుక్యపర్వతము మీఁద తపస్సుచేసి, నందాదేవి వరప్రభావమువలన పల్లవునిఁ జంపి సేతునర్మదామధ్యస్థ మగు సార్ధసప్తలక్ష దక్షిణాపథము నంతయు నాక్రమించెను. చళుక్యపర్వతముపై తపస్సు చేయుటవలన నాతనికి చాళుక్యుఁ డన్న పేరు వచ్చెను.—ఇది ఈ శాసనమునందు గల పూర్వచరిత్ర భాగమునకు సారాంశము. ఈ శాసనములు వ్రాసినవారి మతమున ఉత్తర దేశమునం దున్నంతవఱకును ఈ రాజవంశమునకు చాళుక్యు లన్న పేరు లేదు. దక్షిణదేశమునకు వచ్చినతరువాతనే యీ పేరు వచ్చెను.

ఇఁక విక్రమాంకదేవుని యాస్థానకవి యైన బిల్హణుఁడేమి చెప్పెనో చూతము. ఒకదినము బ్రహ్మదేవుఁడు సంధ్యావందనము చేసికొనుచుండఁగా వచ్చుటకి నింద్రుఁడు వచ్చి ప్రపంచమునందంతటను పాపము హెచ్చుచున్నదని మనవిచేయఁగా బ్రహ్మ తన చులుకము (పుడిసిలి) వైపు చూచెను. అందుండి యొక క్షాత్రతేజము గల పురుషుఁడు పుట్టెను. వాఁడు చులుకములోనుండి పుట్టినవాఁడు గనుక చాళుక్యుఁ డాయెను. వాఁ డయోధ్యలో రాజ్యమేలెను. కొంతకాల మైనతరువాత నావంశమునందు హారీతిమానవ్య లనువారు పుట్టిరి. ఇట్లు రెండు కథలకును ఏవిధమైన సంబంధములేదు. ఈ కథప్రకారము చాళు

క్యులు చంద్రవంశజులు కారు. సూర్య వంశజులు కారు. అగ్ని కులజులు కారు. వారి మూలపురుషుఁడు బ్రహ్మమానసపుత్రుఁడు. ఆయనకే చాళుక్యుఁ డన్న పేరున్నది. గనుక యది దక్షిణమునకు వచ్చినతరువాత రాలేదు. వంశముపుట్టిన తోడనే పుట్టినది. దానికిని చాళుక్య పర్వతమునకును ఏవిధమైన సంబంధము లేదు. కణస్థిపూండి శాసన వంశమునందు మానవ్యహారీతులు లేరు. ఈ గ్రంథవంశమునందు పాండవాదులు ఉదయనాదులు కానరారు.

క్రీ. శ. ౧౦౭౬ సంవత్సరమునాఁటి ఇంకొక పశ్చిమ చాళుక్య శాసనమునందలి బ్రహ్మకుమారుఁడు స్వాయంభూమనువు. వానికొడుకు మానవ్యుఁడు. వాని కొడుకు హారీతి. వానికొడుకు పంచశిఖి హారీతి, వానికొడుకు చళుక్యుఁడు. వాని సంతతివారే చాళుక్య లని యున్నది. ఇట్లు చాళుక్య వంశోత్పత్తిని గురించియు, చాళుక్య శబ్దార్థమును గురించియు శాసనములును, గ్రంథములును పరస్పరవిరుద్ధమైన గాథలు వ్రాయుట చూడఁగా వీరు క్రొత్తగా రాజ్యమునకువచ్చిన దాక్షిణాత్యు లనియు, అంతకుఁ బూర్వచరిత్రము వీరికేమియు లేదనియు, క్షత్రియులమని చెప్పుకొనవలెనన్న కోర్కె మాత్రము వారికి గలదనియు, వారియొద్దనున్న పండితుల యిష్టప్రకారము చళుక్యశబ్దమునకు వ్యుత్పత్తియు, దానికిఁ దగినట్లు కథలును కల్పింపఁబడెనని స్పష్టమగుచున్నది.

దక్షిణములోని చాళుక్యులగాథ లిట్లుండగా నుత్తరమునందలి చాళుక్యు లనఁగా సోళంకులు తాము అగ్నికులక్షత్రియుల మని చెప్పుకొనసాగిరి. పవార్ (ప్రమార), పరిహారీ (ప్రతిహార), చౌహాణ్ (చాహుమాన) సోలంకి (చాళుక్య) ఈ నాల్గు క్షత్రియజాతులును అగ్నికులక్షత్రియు లని రాజపుత్రస్థానమం దనియెదరు. ఆబూ పర్వతముమీద వసిష్ఠుఁడు అగ్నికుండము స్థాపించి రాక్షసవినాశనమునకై తగిన పురుషుల నీయుమని శివుని గోరగా, పైన పేర్కొనఁబడిన నలుగురు పురుషుల నిచ్చెనట. వారిలో చులుకమునందుండి పుట్టినవాఁడు చాళుక్యుఁ డయ్యెను.

పైగాథ లన్నియుఁ జూడ వీరు మొదట క్షత్రియులు కారనియు, ప్రభుత్వము పెరిగినకొలదిని ఎవ్వరికిదోఁచిన గాథలను వారు కల్పించుకొని క్షత్రియులమని చెప్పుకొనదొడగిరనియు తేలుచున్నది.

ఇక వీరి " మానవ్యస గోత్రణాం, హారీతి పుత్రాణాం, కౌశికీ వర ప్రసాదలబ్ధ రాజ్యాణాం" అను బిరుదములవలన నైనను వీరి పూర్వోత్తర మేది యైన కనుగొనియెదమన్న, నా బిరుదములన్నియును వీరు వీరికంటెఁ బూర్వము రాజ్యముచేసిన కదంబులయొద్దనుండి తీసికొనినవిగాని క్రొత్తవి కావు. కదంబులను కొట్టి రాజ్యము తీసికొనినట్లే వారి బిరుదములను కూడ వీరు లాగుకొనిరి. కావుననంతకు పూర్వము చాళుక్యతెగకు ప్రముఖత గాని, రాజ్యము గాని, బిరుదములు కాని ఉండె ననుటకు నాధారములు లేవు.

### సల్కి—చళుక్య శబ్దవిచారము

చాళుక్య లుత్తరదేశమువారు కారనుటకు వారిపే రొకసూచకమై యున్నది. వారి మూలనామము దేశ్యమైన సలుక్కి, లేక సల్కి* అనునది. వీరికి రాజ్యము వచ్చి తాము క్షత్రియులమని చెప్పుకొనఁ దలఁచినప్పుడు వీరు దానికి సంస్కృతీకరణము గావించి చలుక్య, చాలుక్య, చౌలుక్యరూపములఁ

---

* ఇది చల్కి, చలుక్కి అనిన రూపములతోనైన నుండియుండవచ్చును. ఏకకాలమందు చల్కి, సల్కి రూపములుండుటయు నసంభవము కాదు. చకారము సకారముగా మారుటయు, సకారము చకారముగ మారుటయు నన్ని భాషలలోను గల మార్పే. ఇందు వింత యేమియు లేదు. అందరు వ్యుత్పత్తి శాస్త్రజ్ఞులును ఒప్పిన విషయమే. దీనికి ప్రమాణము లక్కరలేదు. కాని ఇందునుగురించి యేమియు నెరుఁగనివారు ప్రమాణముల నపేక్షింతురు. కావున వారికైనై కొన్ని యుదాహరణముల నిచ్చెద. తెలుఁగులో రెండు రూపములుగల శబ్దములును, సంస్కృతమున నొక రూపమును తెలుఁగున మరియొక రూపమును గల శబ్దములును, గౌడభాషలలో నొక రూపమును ఆంధ్ర

గల్పించిరి. ఇట్లు దేశ్యశబ్దములను సంస్కరించివానికి సంస్కృతవస్తువులను కల్పుట యప్పటినుండి ఇప్పటి కాలమువఱకును జరుగుచునే యున్నది. బందరును బృందావనపురము జేసిరి. సులతానును సురత్రాణుని గావించిరి. పంద్రెండేండ్ల క్రింద మూసీ యను పేరు హైదరాబాదుపట్టణమును ముంచివేసెను. అప్పు డానదియొక్క మాహాత్మ్యము హెచ్చి అది ముచికుందానది యయ్యెను! దానికి భాగవతమునందలి ముచికుందునితో బంధుత్వము కలిపిరి! కావున నిట్టి సంస్కృతీకరణములు మనకు నూతనములు కావు. ఇఁక సలుక్కి చాలుక్య శబ్దచరిత్రములను కొంత విచారింతము. ఈ క్రింద నీయఁబడిన పట్టికలో శాసనాధారములను బట్టి చలుక్కి, సల్కి రూపముల పురాతనత్వము తెలియఁగలదు.

సల్కివంశ పరంపర

| | కాలము | రూపము | ప్రమాణము |
|---|---|---|---|
| ౧. | ౭౦౯ | చలికి | కొక్కులి మహారాజు తామ్ర శాసనము. 1 |
| ౨. | ౭౩౯ | చలుక్కి | గుజరాతులోని చలుక్యరాజైన అవనిజనాశ్రయుని శాసనము. 2 |

మున మరియొక రూపమును, ద్రావిడభాషలలో నొక రూపమును ఆంధ్రమున మరియొక రూపమును గల శబ్దములను గొన్నింటి నుదాహరించెదను.

చాగు, సాగు; సను, చను; చెలువు, సలువు; చావు, సావు అనునవి తెనుగున నుభయరూపములతోఁ గానవచ్చుచున్నవి. చంపక, చూర్ణ, చమర, సార అను సాంస్కృతికములకు దెలుఁగున సంపెగ, సున్నము, సవరము, చారు అనునవి; హిందూస్థానీ మరాఠీలలో చావడి, తెనుగున సావడి; చుట్టు, చిప్ప, చలి, చేదు, చేరు అనునవి తెలుఁగులు; సుట్టు, సిప్ప, సలి, సేదు, సేరు అనునవి కన్నడములు; చెట్టి, చిఱు, చిన్న, చేయు తెలుఁగులు; సెట్టి, సిఱు, సిన్న, సేయ్ అనునవి అఱవములు.

1. C. P. 11 of 1908;

2. Proceedings of the Seventh International Congress of Orientalists; Aryan Section P 232 and Plate.

| | | | |
|---|---|---|---|
| 3. ౮౫౦ | సలుక్కి | గుణగవిజయాదిత్యుని గుంటూరు శాసనము. | 1 |
| ౪. ౮౫౦ | సలుకి | గుణగవిజయాదిత్యుని సాతులూరు శాసనము. | 2 |
| ౫. ౮౯౨ | సల్కి | ప్రథమచాళుక్య భీముని అత్తిలి శాసనము. | 3 |
| ౬. ౯౦౦ల ప్రాంతము | చల్కి | విక్రమచోళ మహారాజు నాటి శాసనము. | 4 |
| ౭. ౯౦౦ల ప్రాంతము | సల్కి | విక్రమచోళ మహారాజు నాటి శాసనము | 5 |
| ౮. ౯3౦ | సల్కి | యుద్ధమల్లుని శాసనము. | 6 |
| ౯. ౧౧వ శతాబ్దము | శలుక్కి | విష్ణువర్ధన మహారాజు శాసనము. | 7 |
| ౧౦. ౧3వ శతాబ్దము | చలుక్కి | నారాయణ మనుమసిద్ధి శాసనము. | 8 |

ఇట్లు చలుక్కి చలుకి, చల్కి రూపములు, వాని మారు టుచ్చారణ లనఁదగు సలుక్కి, సల్కి, రూపములు మిక్కిలి పురాతనకాలమునుండి అనఁగా చాళుక్యుల మొదటివంశమునాఁటినుండియు ౧౪-౧౫ వ శతాబ్దమువరకుఁ గాన వచ్చుచున్నవి. ఇంతియు కాదు. అన్ని దేశములలోను గానవచ్చుచున్నవి. చాళుక్యు లెచ్చటికిఁ బోయినను సల్కి యచ్చటఁ గానవచ్చును. గుజరాతు దేశమున, కన్నడదేశమున, తెలుఁగుదేశమున అఱవదేశమున ఈ రూపము కానవచ్చుచున్నది. ఇది వింత కదా! ఇది మూలరూపము కానియెడల చాళుక్యులవెంట సర్వత్ర ప్రసరించుట యెట్లు సంభవించును? "చలుక్కి" లోని "చ" అచ్చట "స" గ మారుటయును, పదమధ్యాక్షరములోని ఉకారము లోపించుటయును,

1. C. P no 5 of 1911-12;
2. ప్రకటింపబడలేదు. నాయొద్ద నున్నది.
3. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక, సం ౧౧, పుట ౨౪౧.
4. E p. Rep. Ins, No. 400 cf 1904.
5. E p. Rep No. 401 of 1904.
6. ఆం. సా. పరి. పత్రిక సం. ౬, పుట ౪౯.
7. Ep. Rep. No. 44 of 1896.
8. Nellore Inscriptions, Venkatagiri, no 19.

"క్కి" లోని రెండు కకారములలో నొక్కటి లోపించుటయు — అను మార్పులు పెద్దవి కావు, వింతలును కావు, సర్వసాధారణమైనవి. కావున చలుక్కి, సలుకి, సల్కి శబ్దములలో నేదియైనను మొదటినుండి వచ్చుచున్న దనుట సిద్ధము. వైజాతివారు చకారమును, క్రిందిజాతివారు సకారమును ఉచ్చరించుట సహజమే. ఇట్లు "సల్కి" శబ్దము మొదటినుండియు అసాధారణమైన యేమార్పును లేకయుండెనని తెలిసికొని, ఇఁక సంస్కృతి మనుకొనఁబడు "చాలుక్య" శబ్ద చరిత్రము జూతము.

## 'చాలుక్య' శబ్ద చరిత్రము

చరిత్రకారులు సాధారణముగా నన్నివంశముల చాళుక్యులను "చాళుక్యులు" అను దీర్ఘ చకారపూర్వకముగా వ్రాయుచుండుటవలన నీశబ్ద మీ రూపముతోడనే మొదటినుండియు నుండెనని కొందఱు భ్రమపడవచ్చును. కాని యది తప్పు. ఈశబ్దము సంస్కృతమువలె కానఁబడవలెనని యెన్నియో సంస్కారములను గనినది. ఇయ్యది మూలరూపము కాదనియు, సంస్కృతీకరణ రూప మనియు జెప్పుటకు నింతకంటె వేఱుప్రమాణ మక్కరలేదు. ఇఁక నీసంస్కరణములను కాలానుక్రమముగ విచారింతము.

౧. చల్క్య (క్రీ.శ. ౫ వ శతాబ్దము)—*ఇయ్యది మొదటి సంస్కృతీకరణరూపము. ఇది 'చల్కి' యను దేశ్యపదమునకు సంస్కృత కృత్రిమరూప మనుట స్పష్టము. ఇదియు గాక, మధ్యాక్షరములోని ఉకారము లోపించిన రూపముగూడ మొదటినుండియు నుండెనని దీనివలన మన మూహింపవచ్చును. "చల్కేరపత్య" మనియో, "చల్కస్యాపత్య" మనియో యర్థము చేసికొని యఞ్ ప్రత్యయము పెట్టగా నీరూపము సిద్ధించినదని తలంచిరి. "యాజ్ఞవల్క్య" ది శబ్దమువలె నిదికూడ సంస్కృతశబ్ద మయ్యెనని సంతసించిరి.

* —Badami cave Inscription, Ind. Ant, VI, P. 363.

౨. చలిక్య (ఆఱవ శతాబ్దము చివరం ఏడవ శతాబ్దము ప్రారంభము). తరువాత నీరూపము బాగుగలేదని తలంచి మంగళేశుని కాలమున "చలిక్య" రూపమును గడించిరి.—Ind. Ant. Vl Vol. xix, P 16.

3. చలుక్య* (౭ వ శతాబ్దము). అదియు బాగుగలేదని చివరకు రెండవ పులకేశికాలమున "చలుక్యరూపము" సిద్ధమాయెను. ఇటుతరువాత నీరూపమే వాతాపి చాలుక్యుల యన్ని శాసనములలోను గానవచ్చును. చకారమునకు దీర్ఘము గల చాలుక్యరూపము వారి ఏశాసనమందును గానరాదు. అంతియ కాదు. తూర్పు చాళుక్య శాసనములు పరీక్షించినను ౯ వ శతాబ్దముపఱకును వారి యన్నిశాసనములలోను "చళుక్య" రూపమే గానవచ్చును. "చాళుక్య" యను దీర్ఘరూపము మొట్టమొదట కలి విష్ణువర్ధనుని ( ౮౪౩-౮౪౪ ) అహాద నగరశాసనమునందు గానవచ్చును. ఇయ్యది, పూర్వపశ్చిమ చాళుక్యుల పెక్కు శాసనములను ప్రకటించిన డాక్టరు ఫ్లీటు మతము. ఫ్లీటు వ్రాసినతరువాత ప్రకటింపఁబడిన పూర్వపశ్చిమచాళుక్యుల శాసనములను నేను శ్రద్ధతో పరీక్షించితిని. ౯ వ శతాబ్దమునకు బూర్వపువానిలో " చాళుక్య " యను దీర్ఘరూపమెచ్చటను గానరాదు.

౪. చాళుక్య (౯ వ శతాబ్దము)——ఈరూపమును కళ్యాణపుర వంశమువారును, ౯ వ శతాబ్దము తరువాత బూర్వచాళుక్యులును యథేచ్ఛముగ వాడిరి. "చలుక్య" యనునది సరియయిన సంస్కృతీకరణము కాదనియు, యాజ్ఞవల్క్య శబ్దమునందలి మొదటి యకారమునకు వృద్ధివచ్చినట్లు చాళుక్య పదములోని మొదటి చకారమునకు వృద్ధి రావలయుననియుఁ దలచి సంస్కృతీకరణమునందు ఈ శబ్దమును ఇంకొక మెట్టెక్కించి యప్పటి పండితులు చాళుక్యరూపమును సాధించిరి. తరువాతి వారిరూపమునే ఎక్కువగా

* అన్నియెడలను ' ల ' కార ' ళ ' కారము లను భేదములేక వాడిరి. గనుక ' ళ ' కారరూపముల దేపతేప చెప్పనక్కరలేదు. అవి అంతటను ఉన్నవనియే యెఱుఁగునది.

వాడినను, పూర్వపు ‘చలుక్య’ రూపముగూడ నచటచ్చట తలచూపుచునే యుండెను.

౫. చౌలుక్య—ఈశబ్దసంస్కరణ మింతటితో నాగినదికాదు. సంస్కృతమున చల్క, చల్కి శబ్దములు లేవు. లేనిశబ్దములనుండి "చలుక్య" గాని, "చాలుక్య" గాని పుట్టుటయెట్లు అని తలంచి పశ్చిమచాళుక్యుల పండితులును, గుజరాతు చాళుక్యుల పండితులును "చులుక" మునుండి పుట్టెనన్న గాథ యొకదానిని గల్పించిరి. వారికి చాళుక్యరూపము సాధువుగాఁ గన్పింపలేదు. చులుకమందలి మొదటి ఉకారమునకు వృద్ధివచ్చినయెడల "చౌ" కావలయునే గాని "చా" ఎట్లగు? కావున సిద్ధదిగ్ధుని "చ"కు ఔత్వమిచ్చి చాళుక్యులను "చౌలుక్యులు" గావించిరి. ౫ వ వంశమువారగు గుజరాతులోని సోళంకీలు ఈరూపమునే విశేషముగ వాడిరి.

ఇట్లీశబ్దము చల్క్య, చలిక్య, చలుక్య, చాళుక్య, చౌలుక్య—యను అవతారముల నెత్తుచు పూర్తిగ సంస్కృతవేషమును ధరించితినని తలంచెను. ఈమార్పుల వలననే యిద్యాది మూలరూపము కాదనియు దేశ్యశబ్దమునకు నలంకారములు పెట్టి ప్రాయశ్చిత్తము లొసంగి సిద్ధముచేయబడిన కృత్రిమ సాంస్కృతిక రూపమనియు స్పష్టముగాఁ దెలియుచున్నది. దేశ్యశబ్దములకు, తద్భవశబ్దములకు భిన్నకాలములందును, భిన్నదేశములందును భిన్నరూపము లుండుట కలదు. కాని సంస్కృతశబ్దముయొక్క రూపము లిట్లుమాఱుట యెచటనైనను కలదా? ఆ మాఱుటలోను ఒక శబ్దమునకంటె మఱియొకశబ్దము కఠినమైనదిగా మాఱుట గొప్పవింత. కావున "చళికి" శబ్దము దేశ్యము; "చాళుక్య" శబ్దము పండితనిర్మితము అనుటకు సందేహము లేదు.

చాళుక్యులంగుఱించి క్షత్రియులని వ్రాయఁబడియున్నను పండితులకు వారి క్షత్రియత్వమునుగుఱించి సంశయముండినట్లు తోచుచున్నది. బిల్హణుడు విక్రమాంకదేవచరిత్రమునందు ఈ వంశాభివృద్ధినిగుఱించి వ్రాయుచు ఇట్లను చున్నాఁడు.

"క్రమేణ తస్మా దుదియాయ వంశః
శౌరేఃపదా ద్గాంగఇవ ప్రవాహః" [౧, ౫౭]

ఇచ్చట స్పష్టముగాఁ దెలియకుండగను, ధ్వనిమూలకముగాఁ దోచున ట్లును ఈజాతివారు శూద్రప్రాయులని చెప్పుటయే కవియొక్కయుద్దేశముగాఁ గానవచ్చుచున్నది. విష్ణుపాదమునందు పుట్టిన గంగాప్రవాహమువలె అతనివలన నావంశము క్రమముగా వృద్ధిచెందెనని కవి చెప్పుచున్నాడు. పైకిచూడ గంగతో పోల్చుట పవిత్రతను సూచించినను విష్ణుపాదోద్భవత్వము శూద్రత్వమును ధ్వనించును. శూద్రజాతిని వర్ణించినప్పుడు వారిని విష్ణుపాదోద్భవ మయిన గంగతో పోల్చి వర్ణించుట కవిసంప్రదాయ మయి యున్నది.

## ఇంకొక ప్రబల ప్రమాణము

అఱవమునందు "దివాకరమ్"అను పేరుగల కోశము గలదు. ఇది ౯,౧౦ శతాబ్దప్రాంతపుది. ఇది యింతకంటెను ప్రాచీన మని చెప్పువారును కలరు. ఇందు "చళిక్యవెందర్" "వెళ్కుల అరసర్" అను పదములు పర్యాయపద ములుగ నీయబడినవి. "చళిక్యరాజులు""వెళ్కులనృపతులు"అని యీపదముల కర్థము. అనగా ఆకాలమున చాళుక్యులు వెళ్కులమువారన్న నమ్మిక యుండె ననుట స్పష్టము. వెళ్కులమువారిని ఇప్పుడు "వెల్లాళ్" అందురు. వీరు శూద్రులు. తెలుగులోని వెలమవారు. కన్నడములోని 'వక్కలగర్' మొద లయిన జాతులు వెళ్ జాతులనియే చెప్పవలెను. వీరందఱును మొదట నొక్క జాతివారే. కాని దేశభేదముల బట్టి పేళ్లు మాఱుట సంభవించినది. దీనిని బట్టి చాళుక్యులు మొదట దాక్షిణాత్యశూద్రజాతివా రనియు, రాజ్యము వచ్చినతరు వాత క్రమముగ క్షత్రియత్వము జెంది రనియు స్పష్టమగు చున్నది.

## వీరే యననేల ?

ఒక్క చాళుక్యులను గురించియేయననేల? దక్షిణమునందుఁ బ్రఖ్యాతి చెందిన కదంబ, రాష్ట్రకూట, హొయసళ, చోళ, పాండ్య చేరాదులందఱును

మొదట వ్యవసాయము చేయువారలుగా నుండిరి. తరువాత వారిలోనుండి పరాక్రమశాలులు పుట్టి రాజులయి ప్రబలినపిదప తాము క్షత్రియులమని చెప్పుకొనసాగిరి. అనఁగా మొదట శూద్రులుగానుండి క్షాత్ర తేజమువలన క్షత్రియత్వము నొందిరి. కావున మేము సూర్యునినుండి పుట్టిరి: చంద్రునినుండి పుట్టిరి: ఇక్ష్వాకువంశజులు అని చెప్పినప్పుడు లేదని చెప్పవలసి వచ్చునేగాని క్షాత్ర తేజమువలన క్షత్రియత్వము సంపాదించినవారని చెప్పినయెడల ఎవ్వరును కాదని చెప్పుటకు వీలులేదు. ఏకాధ్యాయముగ ఆఱువందల సంవత్సరములవఱకు తెనుఁగు దేశమును కర్ణాటక దేశాదులను పెక్కువందల సంవత్సరములవఱకును ఏలి సమ్రాట్ శ్రీహర్షుని పాఱవోలిన చాళుక్యులు క్షత్రియులు కానియెడల మఱి యెవరు క్షత్రియులు?



# ఏకశిలానగర మోరుగల్లే.*

---

## సిద్ధాంతస్థాపనము

### ప్రథమహేతువు

బమ్మెరపోతరాజు ఆంధ్రభాగవతమును 'ఏకశిలానగరము'నందు వ్రాయఁ బ్రారంభించినట్లు ఆగ్రంథమునందే చెప్పఁబడియున్నది. పోతన ౧౪ - ౧౫ శతాబ్దములలోనివాఁడు.1 ఆకాలమున నాంధ్రదేశమందు 'ఏకశిలానగరము' అను నామము కాకతీయరాజుల రాజధాని యైన ఓరుగంటికి నుండె ననుట సుప్రసిద్ధము.2 అందఱు నొప్పుకొనిన విషయము. ఆకాలపు గ్రంథములవలనను శాసనములవలనను నిశ్చితము. ఆకాలమునం దీపేరు మఱియొకగ్రామమున కుండె ననుటకు నెవ్వరును సమకాలికప్రమాణ మేదియుఁ జూపి యుండ లేదు. కావున ఆంధ్రభాగవతరచన ఓరుగంటిలోనే ప్రారంభింపఁబడెననుట సిద్ధాంతము.

### (అ) పోతనకాలము.

వాదవిషయములు గాని స్వతంత్రప్రమాణములను బట్టి చూడ, పోతన తిక్కనసోమయాజిని పూర్వకవిగా పొగడెఁ గావున క్రీ.శ. ౧౩౦౦ లకుఁ దరువాతివాఁడనియు, కృష్ణరాయల చరమదశయందున్న అయ్యలరాజు రామభద్రునిచేఁ బొగడ్తగన్నవాఁ డగుటచే క్రీ. శ. ౧౫౦౦ లకుఁ బూర్వుఁ డనియు నిశ్చయముగఁ దెలిసికొనివచ్చును. ఈకవి యీ ౨౦౦ సంవత్సరములలో, నెప్పుడో

---

* అముద్రితము.

1. ఆంధ్రకవులచరిత్ర, ప్రథమభాగము. పుట ౫౫౧.

2. ప్రతాపరుద్రీయము.

పుట్టి యెప్పుడో కీర్తిశేషుఁ డయ్యె ననుట నిశ్చయము. ఇంతకంటె నిశ్చితముగఁ గాలనిర్ణయము చేయుటకు నైతిహ్యములు తప్ప వేఱుప్రమాణములు లేవు.1 వానినిబట్టియే పోతనకాలము ౧౪వ శతాబ్దముయొక్క చతుర్థపాదమును, ౧౫వ శతాబ్దముయొక్క పూర్వార్ధమును అని రమారమిగఁ జరిత్రకారులు నిర్ణయించియున్నారు. ఒంటిమిట్టవారుకూడ నీకాలమును అంగీకరించియున్నారు. [బం. పో. వి. ౧౯ పుట] కావున సాధారణముగఁ బోతనకాలము క్రీ. శ. ౧౩౮౦. ౧౪౬౦ వఱకని యీవాదమున గ్రహింతము. పోతనజన్మకాలమును, మరణకాలమును నిశ్చయముగఁ దెలియవు. కావున నిది రమారమికాలమని యెఱుంగునది. ఇట్లు పోతన ౧౪ - ౧౫ వ శతాబ్దములవాఁడగుట యుభయవాదులకును సమ్మతమగుటచే నాకాలమున "ఏకశిలానగర" మన్న పేరే పట్టణమున కుండెనో చూచుట యీవాదమునందలి ముఖ్యవిషయము. ఆకాలమునం దే నగరమునకు నీపేరుండెనని సమకాలప్రమాణ ముండునో యానగరమునందే పోతన భాగవతరచన కారంభించెననుట నిశ్చయము.

(అ) ఓరుగంటికి ఏకశిలానగరమన్న పేరున్నందుకుఁ బ్రమాణములు.

ఓరుగంటికి ఏకశిలానగరమన్న పేరు కాకతీయుల కాలమునుండి నేటి వఱకు సుప్రసిద్ధముగ వచ్చుచున్నదని అందఱును ఒప్పుకొనినవిషయమే. అనగాఁ బోతనకుఁ బూర్వమును, పోతనకాలమునను, తరువాతికాలమునను ఓరుగంటికి నేకశిలానగరమన్న నామము పరంపరగ వచ్చుచున్నదనునది జగద్విదితము. ఈసంగతి ఒంటిమిట్టవాదులును ఒప్పుకొనియున్నారు. [బం.పో.వి. ౯౧ పుట] కాని యట్లొప్పుకొనియు వారొకప్పుడు ఓరుగంటికి నేకశిలానగర నామమున్నందుకుఁ బ్రమాణమే లేదనికూడ వ్రాయుచుందురు! శ్రీయుత

1. సర్వజ్ఞ సింగమనీని కంకితముచేయబడిన భోగినీదండకము పోతరాజు కాలమును నిర్ణయించుటకుఁ బ్రబలమైన యాధారము. కాని యది ఒంటిమిట్టవాదులకును మాకును వివాదవిషయము గనుక దానినిగుఱించి యిచ్చటఁ జెప్పలేను. అందునగుఱించి ౮ వ హేతువులోఁ బూర్తిగఁ జర్చించెదము.

వావిలికొలను సుబ్బారావు పంతులుగారు తమ తృతీయవ్యాసమునందు ఒంటిమిట్టకుఁ బోతనకాలమున నేకశిలానగరమన్న పేరున్నందుకు బురాతనప్రమాణములఁ జూపఁబోయి క్రీ. శ. ౧౮౯౧ లో మ్యాక్లీనుదొరగారిచేఁ బ్రకటింపఁబడిన 'మద్రాస్ మ్యాన్యువల్ ఆఫ్ అడ్మినిస్ట్రేషన్' అను నింగ్లీషుగ్రంథమును స్వతఃప్రమాణముగ నుదాహరించి యింతగొప్పప్రమాణము తమకే గనుక దొరికె నని హర్షించి, చివర “ఇట్టి దోరుగంటికి నాకాశపుష్పము కదా?”1 యని పరిహసించిరి! ఏమీ? ఓరుగంటివాదులకుఁ బ్రమాణములే లేవా? నిజము. శ్రీ సుబ్బారావువంటి వాల్మీకులవారిమాట మేమేల యసత్యము చేయవలెను? వారి వాక్యమునకు “ఇట్టి కక్కుర్తిప్రమాణము లోరుగంటివారికి నాకాశపుష్పములే. వారి ప్రమాణములన్నియు నిట్టివానికంటె లక్షమడుంగులు యోగ్యతగల సమకాల, సమీపకాల, పరంపరాగత కాలములందలి యుద్గ్రంథములును, శిలాశాసనములును నిన్నటిదిన మూహాలతో వ్రాయఁబడినవు కావు.” అని యర్థము చేయుచున్నాము.

ఓరుగంటికి నేకశిలానగర మన్న పేరు ౧౩ వ శతాబ్దమునుండియుఁ గల దని చరిత్ర తెలిసినవారికి వేఱుగఁ జెప్పి ప్రమాణములను జూప నక్కఱలేదు. కాని చరిత్ర బాగుగఁ దెలియనివారు ఒంటిమిట్టవాదులు వ్రాసిన పైవ్రాతల వంటివానిఁ జూచి భ్రమపడుదు రేమో యని, కాకతీయుల రాజధానికి 'ఏకశిలానగర' మన్న పే రున్నందులకుఁ గొన్ని ప్రమాణములను ఈక్రింద జూపుచున్నారము:—

1. ఈవాక్యమునందు రెట్టింపు (Double) అసత్యమున్నది. (౧) ఒకటి మ్యాన్యుల్ కంటె లక్షమడుంగు లధిక ప్రామాణ్యముగల ప్రతాపరుద్రీయాది కోద్గ్రంథము లోరుగంటివారి కాధారములున్నవని తెలిసియు లేవని వ్రాయుట. (౨) రెండవది వీ రుదాహరించుచున్న మ్యాన్యూలులోనే, అదేపుటలో, అదే శీర్షికక్రింద నోరుగంటికిఁగూడ ఏకశిలానగరమన్న పే రున్నట్టు సూచింపఁబడినను, దానిని కప్పిపుచ్చి ఆప్రమాణము తమ కొక్కరికే చెల్లునట్లు వ్రాయుట!

(౧) క్రీ. శ. ౧౩౦౦ ల ప్రాంతము. ప్రతాపరుద్రీయము. సంస్కృత సాహిత్య లక్షణగ్రంథము, విద్యానాథప్రణీతము. సుప్రసిద్ధము. ద్వితీయ ప్రతాపరుద్రున కంకితము. ఈచక్రవర్తి క్రీ. శ. ౧౨౯౫ మొదలు ౧౩౨౩ వఱకు రాజ్యముచేసెను.

౨. క్రీ. శ. ౧౩౧౩ ద్వితీయ ప్రతాపరుద్రుని ఓరుగంటి శాసనము ప్రమాది. [Ep. R. Southern circle No 109 of 1902.]

౩. క్రీ. శ. ౧౩౧౬ ద్వితీయ ప్రతాపరుద్రుని కంచిలోని శాసనము శా. శ. ౧౨౩౮ [Ep. Ind. Vol VII P 130.]

౪. క్రీ. శ. ౧౩౬౯ రేచర్ల అనపోతనాయని శిలాశాసనము. ఓరుగంటికి సమీపముననున్న అయ్యనవోలు దేవస్థానమున నున్నది. [వెలుగోటివారి చరిత్రము. అనుబంధము పుట ౨౦.]

౫. క్రీ. శ. ౧౪౨౦ ప్రాంతము. క్రీడాభిరామము. ఆంధ్రకావ్యము. వల్లభరాయప్రణీతము. ఇది శ్రీమానవల్లి రామకృష్ణకవిగారిచేఁ బ్రకటింపఁబడినది.1

---

1. ఈ వాదమునం దీప్రమాణము చాల ముఖ్యమైనది. ఈకవియొక్క తండ్రి ౧౩౭౭ మొదలు ౧౪౦౪ వఱకు రాజ్యముచేసిన ద్వితీయ హరిహరరాయలయొద్ద రత్నభాండాగారాధ్యక్షుఁడుగ నుండెను. కావున నీతఁడు ౧౪౨౦ ప్రాంతమువాఁ డనుకొనవచ్చును. గనుక ఈకవి పోతనకు పరిసరకాలికుఁడో లేక పోతనఁ జిన్నవాఁడుగ నున్నప్పు డున్నవాఁడో యనుట స్పష్టము. ఈమాట ఒంటిమిట్టవారు కూడ నంగీకరించిరి. [బ.పో. వి. ౩౩ పుటలు] ఇంతియకాదు. ఈకవి కడపమండలమువాఁడఁట [బ. పో. వి, ౩౫ పుట] తథాస్తు. ఓరుగంటివాదమున కింకేమి కావలయును? కడపమండలము వాఁడు, పోతనకాలమువాఁడు అగు కవి ఓరుగంటిని ఏకశిలానగరనామముతో వర్ణించెను. పోతన తాను ఏకశిలానగరమున భాగవతము వ్రాయ నారంభించితి నని చెప్పెను. ఇట్టి యభేద్యమైన సమకాలికప్రమాణమును త్రోసివేసి, ప్రామాణ్యము లేని ౧౯౪౭ లోని "ఫుట్టునోటు"ను బట్టి ౧౪౪౦ ప్రాంతమున ఒంటిమిట్టకు ఏకశిలానగరమన్న పే రుండెననియు, నందే పోతన భాగవతము వ్రాసె ననియుఁ జెప్పుట వాదమా? వితండమా?

౬. క్రీ. శ. ౧౫౦౩: శా. శ. ౧౪౨౫ ఓరుగంటిలోని వేంకటేశ్వర దేవాలయ మంటపమందలి శాసనము. చిత్తాపఖానునిది [ Ep. R. No. 108 of 1902 దీనిప్రతి Local Record Vol. 45. లోఁ గూడఁ గలదు.]

౭. క్రీ. శ. ౧౬౩౦ ప్రాంతము సిద్ధేశ్వరచరిత్రము. కాసె సర్వప్పప్రణీతము ద్విపదకావ్యము. దీనిని ననుసరించియే సోమదేవరాజీయము వ్రాయఁబడినది. కావున నంతకంటెఁ బూర్వపుది.

౮. క్రీ. శ. ౧౭౩౦ ప్రాంతము. సోమదేవరాజీయము. ఆంధ్రకావ్యము కూచిమంచి జగ్గకవిప్రణీతము. దీని కాలనిర్ణయమునకై ఆంధ్రకవుల చరిత్రముఁ జూడఁదగును. ఇది కొంతవఱకు గురుజాడ రామమూర్తిగారిచే నచ్చొత్తింపఁ బడెను.

౯. క్రీ. శ. ౧౭౫౦ ప్రాంతము. ప్రతాపచరిత్రము. వచనము. ఏకామ్రనాథరచితము. ఆంధ్రపరిషత్ పత్రికలోఁ బ్రకటింపఁబడినది. కాలము నిశ్చయముగఁ దెలియదు.

౧౦. క్రీ. శ. ౧౮౦౦ ప్రాంతము. ఏకశిలానగరవృత్తాంతము. కర్నల్ మెకంజీచే ౧౮౦౦ ప్రాంతమున సంగ్రహింపఁబడిన కైఫీయతులలో నొకటి.

ఇట్లు ౧౩ వ శతాబ్దము చివరనుండి ౧౮ వ శతాబ్దము చివరవఱకును ఓరుగంటికి ఏకశిలానగరమన్న సంస్కృతనామము సుప్రసిద్ధముగ నుండెననుట స్పష్టము. ఈవిషయమై యింకను ఎన్నిప్రమాణములనైనఁ జూపవచ్చును. కాని జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జందె మేల యన్నట్టివి యనావశ్యకములని గ్రంథవిస్తరభీతిచే విరమించితిమి. మేము పైని చూపినప్రమాణములు పోతనకుఁ బూర్వకాలీనములు, సమకాలీనములు, సమీపకాలీనములు, పరంపరాగతకాలీనములు. ప్రమాణము లన్న నిట్లుండవలయును గదా?

(ఇ) ౧౪ - ౧౫ శతాబ్దములలోఁ గాని, తరువాత ౧౯ వ శతాబ్దము వఱకుఁ గాని, ఏకశిలానగరమన్న పేరు ఆంధ్రదేశమందు మఱియొకపట్టణమున

కున్నట్లు ఒంటిమిట్టవాదులు గాని, మఱియొకరు గాని ఏ ప్రమాణమును జూపి యుండలేదు. ఒంటిమిట్టకా పేరుండెనని వారు చూపిన మూఁడు ప్రమాణము లలో నొకటి ౧౫ వ శతాబ్ద మధ్యకాలమిది! మఱియొకటి ౧౫ వ శతాబ్ద అంత్యకాలమిది!! ఇంకొకటి ౨౦ వ శతాబ్దములోనిది!!! ఇది ౧౮-౧౯ వ శతాబ్దములలో నొంటిమిట్టకు నేకశిలానగరమన్న పేరుండె నని చూపుటకు నెంతి మాత్రమును పనికిరాదని మేము వేఱుగఁ జెప్పవలెనా? ఈ ప్రమాణముల యోగ్యతను గుఱించి "పూర్వపక్షఖండనము"లో విశేషముగఁ జర్చించెదము. ఇది యుఁగాక ఒంటిమిట్టకు నెల్లప్పుడను 'ఒంటిమిట్ట' యన్న పేరే తప్ప 'ఏకశిలా నగర' మన్నపే రెన్నఁడును లేదని పూర్వగ్రంథములవల్లను, శాసనములవల్లను స్పష్టపడుచున్నది. ఇందునగుఱించిన ప్రబలశాసనాదిప్రమాణములను పూర్వ పక్షఖండనమునందు 'ఒంటిమిట్ట యెప్పుడును ఒంటిమిట్టే' యన్న ప్రకరణమునఁ జూడనగు.

ఇది యట్లుండఁ దమకు లాభము లేకపోయినను, మావాదమునకు నష్టము కలుగునన్న యాశతో భోనగిరికిఁ గూడ ఏకశిలానగరమన్న పేరున్న దని ఒంటిమిట్టవాదు లొక ప్రమాణముఁ జూపిరి. [సు. ప్ర. వ్యా. అను ౯] ఇదియు ౧౫ వ శతాబ్దములోనిదే. కావున దీనికిని ౧౮-౧౯ వ శతాబ్దమును గుఱించి జరుగుచున్న యీవాదమునందు, ఒంటిమిట్టవారి నిన్నటి మూఁడు ప్రమాణములకంటె నెక్కుడుయోగ్యత లేదు ఈ ప్రమాణము యోగ్యతను గుఱించి పూర్వపక్షఖండనమున విపులముగ వ్రాయఁబడును.

ఇట్లు ౧౮ వ శతాబ్దము మొదలుకొని నేఁటివఱకును ఓరుగంటికి ఏక శిలానగరమన్న నామము వచ్చుచుండుటకుఁ బ్రబలమైనట్టియు, సమకాలికము లయినట్టియు సద్గ్రంథములును, రాజశాసనములును ఉండుటయు, మఱి యే గ్రామమునకును ౧౮ - ౧౯ శతాబ్దములలో నట్టి పేరున్నట్లు ప్రమాణము లేక పోవుటయుఁ జూడ భాగవతమునఁ బేర్కొనఁబడిన ఏకశిలానగర మోరుగల్లే నియు ఒప్పుకొని తీరవలయును.

ఈ యొక్క ప్రమాణముతోడనే ఓరుగంటివాదమునకుఁ బరిపూర్ణదిగ్విజయమును, ఒంటిమిట్టవాదమునకు సంపూర్ణపరాభవమును గలిగెననుటకు నెట్టి భ్రమైన సందేహమును లేదు. ఇట్టివాదమునంతను నుపసంహరించుటకు నీ యొక ప్రమాణమే చాలును. అయినను ఓరుగంటివారికిఁ గల యితర స్వతంత్రప్రబల ప్రమాణములనుగూడ నిందుఁ బొందుపఱిచెదము.

## ౨. ద్వితీయహేతువు.

### బొమ్మెర బమ్మెరయే.

ఓరుగంటికి ముప్పదిమైళ్లదూరమున 'బొమ్మెర' యను గ్రామము కలదు. పోతనయింటిపేరు 'బమ్మెరవా' రని భాగవతమే చెప్పుచున్నది. ఇట్టిపేరుగల యూరు తెలుఁగుదేశమునందు నెచ్చటను మఱియొకటి యున్నట్లు ఒంటిమిట్టివాదులుగాని, ఇతరులుగాని ప్రమాణములు చూపియుండలేదు. కావునఁ బోతన యోరుగంటిపైపువాఁ డనియు, బొమ్మెరను బట్టియే యాతని వంశమునకు బమ్మెరవా రన్న యింటిపేరు వచ్చెననియు నూహించుట సకల న్యాయశాస్త్రములసంప్రదాయము ననుసరించినసిద్ధాంతము.

(అ) ఇదియు, మొదటిదియు వేఱ్వేరు స్వతంత్రములైన హేతువులు. చరిత్రములయందు నొకానొక పురుషుని స్థలనిర్ణయము చేయుటకు నింతకంటెఁ బ్రబలమైన స్వతంత్రప్రమాణము లుండఁజాలవు. ఇందలి యొక్కొక్కటియు నోరుగంటివాదమును సిద్ధాంతపఱచుటకుఁ జాలును. ఇఁక రెండుఁ గలసిన సిద్ధాంత మత్యంతప్రబల మని మేము వేఱుఁగఁ జెప్పవలెనా?

"బొమ్మెర" గ్రామ మోరుగంటికి సమీపమున నుండుట ఓరుగంటివాదమునకు నత్యంతానుకూలమైనదనియు ఒంటిమిట్టి వాదమునకుఁ బరిపూర్ణ వినాశహేతు వైనదనియు నెఱిఁగి యాహేతువును ఎట్లైన నెగురఁగొట్టవలయు నని ఒంటిమిట్టవాదులు పన్నిన పన్నుగడలును, పడిన భ్రమవాదు

చూచినయెడల వారి ప్రమాణమును చూచి యెంత భయపడుచున్నదియు స్పష్టపడఁగలదు. వారి పూర్వపక్షములు:

(౧) పోతరాజుయొక్క యింటిపేరు ఊరినిబట్టి రాలేదట. 'బమ్మెర' భ్రమణశబ్దభవ మఁట! బమ్మెరవా రనఁగా భ్రమణము చేయుచుండువారు, బలాదూరు తిరుగువారు అని యర్థమఁట! పోతనయో, అతనిపూర్వులో తిండికిలేక దేశదిమ్మరులై తిరిగితిరిగి ఒంటిమిట్టకు వచ్చినందున ఈపేరు వచ్చెనఁట! ఎంత యాలోచించి వీరీయుక్తిని కుదుర్చుకొనిరో గాని ఇది వినుటకుఁ గాని చెప్పుటకుఁగాని ఇంపుగ లేదని మేము నొక్కి చెప్పగలము. పూర్వకవులు మాత్రము, 'బమ్మెర' గ్రామ నామమే యనియు, దానిని బట్టియే కవికి 'బమ్మెరవారు' అన్న యింటిపేరు వచ్చెననియు ననుకొనుచుండిరి. అందుకుఁ బ్రమాణముగ పట్టిమిట్టి సరస్వతీ సోమయాజి ఆంధ్రభాగవతకర్తను స్తుతించిన పద్యపాదముం గనుఁడు:—

'బమ్మెరపుర పోతరాజు ననమీకృతభోజు నుతింతు నెంతయున్'

దేశద్రిమ్మరితనమువలన వచ్చినదనియు, గ్రామనామముగా రాలేదనియు రాయిగుద్దువారివాదమున కింతకంటె నెక్కుడు పరాభవమే ముండును?

(౨) సరే గ్రామమునుబట్టి 'బమ్మెర' యను నింటిపేరు వచ్చిన రానిండు. గాని మీరు చూపునది 'బమ్మెర' కానే కాదు; అది 'బొమ్మెర'— అని ఒంటిమిట్టవాదు లసలుకే మోసము తేఁ దలంచిరి! కాని 'బమ్మెర' యను మాట గ్రాంథికరూపము, 'బొమ్మెర' యనునది వ్యావహారికరూప మని శబ్దరూపమును బట్టియే పక్షపాతము లేనివారెవ్వరైనను చెప్పకయే తెలిసికొనగలరు. ఇవి భిన్నశబ్దములు కావు; ఒక్కశబ్దమునే ఉచ్చరించు రెండువిధము లని తెలుఁగువారి కందఱకుఁ దెలియును. ఇదియుఁగాక 'బమ్మర'కే 'బొమ్మర' యన్న రూపము తెలుఁగుదేశమున వ్యవహారమునఁ గలదు. జనసామాన్యము బమ్మర పోతరాజును బొమ్మర పోతరా జనియే యనును. కొందఱు ఓకారమునకును 'బొ' కారమునకును మధ్యముగ నుచ్చరింతురు. ఇదియు నందఱకుఁ

దెలిసిన విషయమే. అయినను వాదము వచ్చినప్పుడు సిద్ధవిషయమును గూడ ఒప్పుకొనకపోవుట వాదులకు సహజము. కావున 'బమ్మెర'కు 'బొమ్మెర' యను రూపము తెలుఁగుదేశమున—సుబ్బారావుగారి దత్తమండలములోఁ గూడ—గల దనుటకుఁ బ్రమాణముఁ జూపెదము!

భాగవతము వ్రాసిన పోతరాజు ఇంటిపేరు 'బమ్మెర' గదా? ఇదియే తెలుఁగుదేశమందు 'బొమ్మెర' 'బొమ్మన'గ వాడఁబడుచున్నది యన్నదాని కంటెఁ బ్రబలప్రమాణ మేమి కావలెను? ఈ శబ్దమునకు నిట్టి రూప* మున్నందుకు దృష్టాంతములు:—

(i) కావలి వెంకటరామస్వామి విరచితమైన 'డెక్కన్ పొయెట్స్' అను గ్రంథమునందు నీకవి యింటిపేరు 'బొమ్మన' అని వ్రాయఁబడియున్నది. ఈతఁడు ఏలూరునివాసి. కావలిజమీందారుల మూలపురుషుఁడు. కర్నల్ మెకంజీయొద్ద నేదో యుద్యోగమునం దుండెను.

ఈగ్రంథము ౧౮౨౮ లో కలకత్తాలోఁ బ్రకటింపఁబడెనది. లార్డ్ కార్న్వాలిసుకు అంకితము.

(ii) "విల్సన్స్ క్యాటలాగ్ ఆఫ్ మెకంజి మ్యాన్యుస్క్రిప్ట్సు." పుట 321, 348. "Bommana Potaraju".

(iii) ఈ కింది ప్రమాణము సుబ్బారావుగారి ప్రథమవ్యాసములోనుండియే యెత్తి వ్రాయుచున్నాము:—

"Extract from the Hindu dated 27-8-1913 The Hon'ble Mr. P. Kesava Pillai of Gooty writes "Bommara Potharaju or Pothanna, as he is popularly known, lived some six centuries ago at Wontimitta in Cuddappah District, and sang his immortal and sweet poem."

---

*'This poet was of the Bommana family' Etc—'Dekkan poets' by C. Venkata Ramasawamy. P 123.

కేశవపిళ్లెగారు పోతనను గుఱించియు, ఏకశిలను గుఱించియు సరను ప్రామాణికులుగా సుబ్బారావుగారు తమ వ్యాసములో నుదాహరించిరి. కావున బమ్మెరకు 'బొమ్మెర' యన్న మాఱురూపము తెలుఁగు దేశమున నుండుటయేగాక దక్షిణమండలములలోఁ గూడ నున్న దని వారు చక్కఁగ నెఱుఁగుదరనుట నిశ్చయము. 'బమ్మెర పోతరాజు'ను 'బొమ్మెర పోత రాజు' అని అందుకనియు వారెఱుంగుదురు. ఎఱిఁగియెఱిఁగి యుఁకవాద మేల?

(1౪) 'గోలకొండ దేశములో వాడుకలోనున్న 'పాలకుర్తి నిలయా! సోమయలింగా పాదములకు శరణు! వురవుగ బొమ్మెర పోతరాజుకు మీరు కోరినవరములు కృపచేసినారఁట' అనుపాట. దీనిని శ్రీసుబ్బారావుగారే తమ ద్వితీయవ్యాసమునందు నుదాహరించినారు. [395 పుట] ఇంతియ కాదు. " ఈ పాట వీరభద్రవిజయకర్త కన్వయించును గాని భాగవతగ్రంథకర్త కన్వ యింపదు " అనియుఁ గంఠోక్తిగఁ జెప్పిరి. [393 పుట] ఇదియు మాకు నిష్ప్రాప త్తియె. భాగవత, వీరభద్ర విజయకర్తలు భిన్నులా, ఒక్కఁడా యన్నవాద మిచ్చటఁ బ్రస్తుతము కాదు. వాదసౌకర్యమునకై శ్రీసుబ్బారావుగారన్నట్లు కర్తలు భిన్నులేయనుకొన్నను, బమ్మెరకు బొమ్మెరయను గ్రామ్యరూప మున్నదా లేదా యనునదియే యిచ్చట వివాదాంశము. అది యీ బమ్మెర పోతరాజునకున్న దేమి, ఆ బమ్మెర పోతరాజునకున్న దేమి? 'బొమ్మెర బమ్మెర కాదు.' అన్నవారికిఁ గుఠారమే.

ఈ సంగతిని కొంతసేపటికిఁ దెలిసికొని శ్రీసుబ్బారావుగారదేవ్యాస మునందు నలుపదిపుటల తరువాతఁ దాము 395 పుటలోఁ జెప్పినమాటను ఎట్లైన నదప్పించుకొనవలయు నని, వేఱు ప్రత్యుత్తరమును యుక్తియు లేనందున 'శేషం కోపేన పూరయేత్' అన్నట్లు "అందలి బొమ్మెర పోతరాజుమున్న నేను సూచించిన శైవపోతురాజో. ఆఁబోతురాజో, దున్నపోతురాజో వీరభ

ద్రవిజయకర్తయును గాఁడు" [441 పుట] అని బూతులువోకి[1] కసిదీర్చుకొనిరి. ఇట్లు పరస్పర విరుద్ధములయిన వ్రాత లొక్కవ్యాసమునందే వ్రాసిరి! ఇందువల ననే వీరి వాదదౌర్బల్యముయొక్క ఘనత వెల్లడియగు చున్నది!!

(౩) బొమ్మెర బమ్మెరయైనఁ గానిండు. ఆగ్రామమును బట్టియే కవికి నింటిపేరు కలిగినఁ గలుగనిండు, కవి కాగృహనామము బొమ్మెరలోఁగాని బొమ్మెరయొద్ద గాని యుండగవచ్చియుండదు. కవిగాని, అతనిపూర్వులుగాని బమ్మెరవిడిచి, ఓరుగల్లు విడిచి, ఒంటిమెట్టకు వచ్చినతరువాతఁగాని ఈ యింటిపేరు గాజాలదు. ఏలయన ఏయూరివారి కాయూరిపేరు ఇంటిపేరుగ నుండదు." ఇది పూర్వపక్షము! ఒక పూర్వపక్షముకంటె వేఱొక పూర్వపక్షము విపరీతమైనది. అనగా నాంధ్రులయనుభవమునకు వ్యతిరేకమైనది. కాపురమున్న ఊరిపేరే గృహనామముగఁ గలవారు తెలుఁగు దేశమునందు వేనవేలుండగా నిట్టిసిద్ధాంతముఁజేయు దెనుఁగు వారుందురని మే మెన్నడును అనుకొనలేదు. తాము చెప్పినమాటకు వ్యతిరేకముగ నొక్క దృష్టాంతము దొరకినఁ దమ మాట వ్యర్థమగునని యైనను పంతులుగారు తలఁపరైరి. ఇప్పుడు తమ తప్పు తెలిసికొనియు నొప్పుకొన నొల్లక 'ఉన్న ఊరునుబట్టే యింటిపేరు వచ్చుటు కలదు. లేచివచ్చిన యూరునుబటి యింటిపేరు వచ్చుటకలదు. కాని రెండవ విధమున వచ్చినగృహనామముల సంఖ్య హెచ్చు' అని బదులు చెప్పుచున్నారు! ఇది ప్రతిజ్ఞాభంగముగాని ప్రత్యుత్తరము కాదు. మొదటఁ జెప్పినమాట పోయిన తరువాత 'మెజారిటి మైనారిటీ' లెట్లు వీరిమాట నిల్పఁగలవు? ఒక్క యపవాదము గానవచ్చినఁ బోయెడు సిద్ధాంతమును మెజారిటి యెట్లు రక్షింపఁగలదు? ఇట్లోడిపోయిన నప్పుడొప్పుకొనక మాట తప్పించుట వితండము.

---

1. ఈకవి సుబ్బారావుగారు చెప్పినట్లు మూఢపపోతన యైనను, శివునిచే వరములు గొన్న గొప్పభక్తుఁడని జనములచే నేఁటివఱకును పాటలలోను బద్యములలోను గీర్తింపఁబడుచున్న మహనీయుఁ డనుటకు సందేహము లేదు. అట్టి భగవద్భక్తుని, భక్తుల మనిపించుకొను సుబ్బారావుగారు 'దున్నపోతు' అని తిట్టుట కడు విచారకరము.

## 3. తృతీయ హేతువు

భాగవతమును బూరించినవా రచ్చటివారే. ఇంటిపేర్లను బట్టియు వేఱుప్రమాణములనుబట్టియుఁ జూడ భాగవతమందలి నష్టభాగములను పూరించినకవు లోరుగంటివైష్ణవు రని తెలియుచున్నందునఁ బోతనయు నటువైష్ణవుఁ డని యూహించుట సమంజసము.

పూరించినవారు

(అ) భాగవతమందు ఖిలములైన భాగములఁ బూరించినవారు గంగన, వెలిగందల నారయ, ఏర్చూరిసింగన, హరిభట్టు. గంగననుగుఱించి మన కేమియుఁ దెలియదు. వెలిగందల ఓరుగంటికి ౫౦ మైళ్లదూరమునను, కమ్మంమెట్టు ఒరంగలు జిల్లాలోనే ౬౦ మైళ్లదూరమునను, ఏర్చూరు నల్లగొండజిల్లాలో ౪౦ మైళ్లమీదను ఓరుగంటికిని, బమ్మెరకును చుట్టుపట్టున నున్నవి. వెలిగందల నారయ తాను పోతనప్రియశిష్యుండ నని వ్రాసికొనెను. శిష్యుఁ డోరుగంటి వైష్ణవుఁడయిన గురువును అటువైష్ణవుఁ డగుట సహజము, కాకపోవుట అసహజము. హరిభట్టు ఇంటిపేరు మనకుఁ దెలియకపోయినను ఆతఁడు కమ్మముమెట్టువాఁ డని యాతని వరాహపురాణమువలన స్పష్టము. కాని యతనికాలము మనకు స్పష్టముగఁ దెలియదు. నారయయు, ఈతఁడును ఏకాదశద్వాదశస్కంధములు స్వతంత్రముగఁ బూరించుటవలన నీతఁడును పోతనశిష్యుఁడేమో? ఇదంతయుఁ జూడ భాగవతము మొదట నోరుగంటి వైష్ణవులయిన కవుల చేతనే పుట్టెననియు, ఏకారణముచేతనో యందలి కొన్నిభాగములు ఖిలములై పోఁగా, వానిని ఆప్రాంతమువారే పూరించిరనియు, ఈపూరణ జరుగువఱకు భాగవతము లోకమున వ్యాపింపలేదనియుఁ దరువాతనే వ్యాపించె ననియు నూహించుట సహజము.

ఇందుపై పూర్వపక్షము

గుంటూరుమండలములో ఏల్చూరు న్నది. ఇది పూర్వ మేర్చూరు. నెల్లూరి మండలములో 'వెలిగండ్ల' యున్నది. కావున నివియే భాగవతము పూర్తి చేసిన కవులయూళ్లని యేల అనుకొనఁగూడదు?

జవాబు

వెలిగందల, ఏర్పూరు అను పరిశుద్ధమైన పేళ్లుగల గ్రామములు ఒకరింకటికి, బమ్మెరకు, కమ్మంమెట్టుకు సమీపమందుండగా వానినివదలి ఏసంబంధము లేనివియు, ఏర్పూరు, వెలిగందలకు మేనమానపోలికగలవియు నగు గ్రామముల నెవ్వరు గ్రహింతురు? ఇదియుఁగాక విడివిడిగ ఈ గ్రామములఁ గ్రహించినందున ఒంటిమిట్టవారి కేమిలాభము? తమకు లాభములేనిది, ఎదటివారొప్పనిది యగు వాదమున కేమి పేరు?

సారాంశము

బమ్మెర, వెలిగందల, ఏర్పూరు, కమ్మంమెట్టు, ఓరుగల్లు అను నైదు గ్రామములును ఒక్కనాటిలో సమీపమం దుండుటయు, నాంధ్ర భాగవత రచనకు సంబంధించిన కవులలోని ముగ్గురి యిండ్లపేళ్లు మొదటి మూఁడు గ్రామముల పేళ్లతోఁ గలియుటయు, నాల్గవగ్రామము నాల్గవకవి నివాసస్థానమగుటయు, అయిదవగ్రామమునకు భాగవతమందుఁ జెప్పఁబడిన 'ఏకశిలానగర' మన్న పేరును పోతనకాలమున ప్రసిద్ధముగ నుండుటయు విచారించి వీరందఱును ఒకదేశము వారేయని అనుమతిచేయుట పాశ్చాత్య పౌరస్త్య తర్కశాస్త్రములు సమ్మతించెడి సిద్ధాంతము. లోకానుభవసిద్ధము. అట్లుగాక వీరందఱును భిన్నదేశజులు, సంబంధము లేనివారు, వీరి యింటిపేళ్లకును నా గ్రామములకును నేమియు సంబంధము లేదు. వాని పరస్పరసాదృశ్యమును, ఈకవులే భాగవతమును పూరించుట సంభవించుటయు కాకతాళీయన్యాయమువంటివి అని వాదించుట విపరీతము, విరుద్ధము, అస్వాభావికము. వెలిగందల నారయ పోతనప్రియశిష్యుఁడగుటయు, హరిభట్టు కమ్మముమెట్టువాఁడగుటయు నోరుగంటి వాదమును దృఢపఱుచుచున్నది.

## ౪. చతుర్థహేతువు

పోతనయు, సింగమనీఁడును సమకాలికులు. బమ్మెర పోతరాజు భోగినీదండకమును రేచర్ల సింగమనీనికిఁ గృతి యిచ్చి చెప్పెను. ఇతనిది రాచకొండ.

ఇయ్యది బొమ్మెరయున్న నల్లగొండజిల్లాలోనే యున్నది. ఇంతియుగాదు. కాకతీయరాజుల ప్రభ తగ్గినపిమ్మట ౧౪-౧౫ శతాబ్దములలో నీ రేచర్ల వారు ప్రబలి ఓరుగల్లుకూడఁ దమ రాజ్యములో కొంతకాలము కలుపుకొని నట్లు కానవచ్చెడిని. కావునఁ బోతన ఓరుగంటిరాజ్యములోనివాఁ డని యూహించుటయే సమంజసము.

రేచర్లవారు ఓరుగంటిపై రాజ్యముచేసిరి

(అ) రేచర్లవారోరుగంటికిఁ గూడఁ బ్రభువులుగఁ గొంతకాల ముండి నందులకు దృష్టాంతములు కలవు. ఓరుగంటి సమీపమున నున్న అయ్యనవోలు దేవస్థానమున రేచర్ల అనపోతానాయునిచే శా. శ. ౧౨౭౧ లో (క్రీ. శ. ౧౩౪౯ లో) వేయించఁబడిన శిలాశాసనమునందు "అనపోతానాయనింగారు ఓరుగల్లు, శ్రీభువనగిరి, రాజుకొండ, సింగపురము మొదలైన తెలుంగు దేశము చంద్రతారక ముత్తరోత్తరాభివృద్ధిగాను, ధర్మరాజ్యము చేయుచును" అని యున్నది [వెలుగోటివారి వంశచరిత్రము, అను. పుట 24]. వచనసోమదేవ రాజీయము మొదలయిన గ్రంథములలోఁ గూడ రేచర్లవారోరుగంటిలోఁ గాకతీయులపిరువాతఁ గొంతికాలము రాజ్యము చేసిన ట్లున్నది.

ఇందుపైఁ బూర్వపక్షము

(అ) "భోగినీదండకము పోతనరచించినది కాదు కూటసృష్టి"-ఇట్లు తమ కడ్డమువచ్చువాని నన్నింటిని వీరు వెనుకముందుఁ జూడక 'కూటసృష్టి' యనియు, 'ఫోర్జరీ' యనియుఁ జెప్పుచున్నారు.1 కాని దానికిఁ దగిన హేతు

---

1. వీరభద్రవిజయము కూటసృష్టియనిరి! భోగినీదండకము కూటసృష్టి యనిరి! నారాయణశతకము కూటసృష్టియనిరి! ఇఁక భాగవతముగూడ-లేదా అందలి 'ఏకశిలానగరంబునకుఁ జని' అన్న భాగమైనను-కూటసృష్టి యనుట మిగిలియున్నది!! వీనినిగురించి యింక వ్రాసిన నసలువాదము మరుగుపడునని వేఱుగ్రంథము వ్రాయఁగలము. దండకమునుగురించి మాత్ర మిందు నెక్కుడు సంబంధము కలదు గనుక నిందే వ్రాసితిమి.

వులను మాత్రము చూపరు. వీరు చెప్పు కారణము: ‘పోతన గొప్పభగవద్భక్తుఁడు.’ ‘ఇమ్మనుజేశ్వరాధముల’ నన్న పద్యమందు నరాంకితము నిషేధించినాఁడు. కావున రాజుంచుకొనినభోగముదానిపై దండకము చెప్పునా?’ యనునది.

దానికిఁ బ్రత్యుత్తరము

పైహేతువు మనకుఁ దెలియని కొన్ని సంగతులను తెలిసినట్టులు గ్రహించుచున్నది గనుక నిది హేత్వాభాసము. పోతరాజుయొక్క చరిత్ర చిన్ననాఁటి నుండియుఁ జివరవఱకును మన మెఱుఁగుదుమా? చిన్ననాఁ డెట్టివాఁడో, ఏమి చేసెనో, పెద్దనాఁ డెట్టుమాఱెనో, లేదా యెల్లప్పు డొక్కపోలికగ నుండెనో మనకేమియుఁ దెలియదు. పూర్వవయస్సున రసికులై, స్త్రీలంపటులై, యద్వితీయ భక్తాగ్రేసరు లగువారు పెక్కురు గలరు. గోపీచందు, తులసీదాసు మొదలయినవారిచరిత్ర లిందుకుఁ దార్కాణములు. మొదట దమగ్రంథముల నరాంకితముచేసి, తరువాత దేవాంకితము చేసినవారి నెఱుంగుదుము తిక్కన, హరిభట్టు1 మొదలగువా రిట్టివారు. కావున రెండువిధములయిన రెండుగ్రంథములును

1. భాగవతమందలి ఏకాదశ, ద్వాదశ స్కంధములను పూర్తిచేసినవాఁడును, కమ్మంమెట్టువాఁడును అగు హరిభట్టు, మొదట వరాహపురాణమును నరాంకితము చేసి, తరువాత ‘ధనమునకై నరాధముల సన్నుతి చేయఁబొడమిన పాపము ల్చెడుటకొఱకు’ మత్స్యపురాణము దేవాంకితము చేసెను.

ఈదండకముచివర ‘పండితకీర్తనీయుఁ డగు ‘బమ్మెరపోత’’ అని ప్రథమపురుషముగఁ బద్య ముండుటచే నది పోతన వ్రాయలేదనియు, మఱియెవరో వ్రాసిరనియు విచిత్రవాద మొకటి శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు చేసిరి. కాని సంస్కృతమునందును, తెనుఁగునందును ఇతరభాషలయందును కవులు తమను గుఱించి చెప్పుకొనునప్పుడు ఉత్తమపురుషమునందుఁ జెప్పుకొనుట కలదు: ప్రథమపురుషమునందు చెప్పుకొనుట కలదు. ఇది భాషాసంప్రదాయము, కవిప్రౌఢత. ఇతరభాషలసంగతి వదలి తెనుఁగువైపు చూచినను నన్నయభట్టు, ఎఱ్ఱాప్రగడ, శ్రీనాథుడు, పోతరాజు(భాగవతములో),ముక్కుతిమన్న,అనంతుడు మొదలయినమహాకవులే యట్లు ప్రథమపురుషముగఁదమ్ముఁగుఱించి వ్రాసికొనియున్నారు. వీరి పేరిటనున్న కావ్యములు వీరిచే వ్రాయఁబడలేదనిఅనవలసినదేనా?

ఏకకర్తృకముగాఁ గానవచ్చుచుండగా నాకవినిగుఱించి పుక్కిటిపురాణములు తప్ప మఱేమియుఁ దెలియనప్పుడు, ఒకగ్రంథమును మాత్రము తత్కర్తృకముగ గ్రహించి అందుఁ గానవచ్చినటులె యాకవి జీవితకాలమంతయు నుండెనని స్వకపోల కల్పనముచేసికొని దానిని హేతువుగా జూపి రెండవ గ్రంథము తత్కృతముకాదని నిర్ణయించుట యద్భుతమైన హేత్వాభాసము. సాధింపవలసిన దానిని మొదట మాటుమాటలతో సాధించినట్లు గ్రహించుట, పిదప దానినే హేతువుగాఁ జూపుట! ఇది యొక కనుకట్టువిద్య.

కావున శబ్దప్రౌఢిమయందును, శబ్దార్థాలంకారములందును భాగవతరచనకు తగ్గని యీ దండకము పోతరాజకృతము కాదని చెప్పుటకు నేహేతువును లేదు.

అతఁడిట్టిగ్రంథమును రచించియుండకుండిన బాగుండునని కోరుటవేఱు; రచింపనే లేదని రాయిగ్రుద్దుట వేఱు.

ఇంకొక పూర్వపక్షము

సర్వజ్ఞ సింగమనీఁడే మిథ్య! ఇదొక పూర్వపక్షము. సర్వజ్ఞ సింగమనీఁడెవఁడో తెలియదఁట. ఇద్దఱు ముగ్గురా పేరుగలవాండ్రు కానవచ్చుచున్నారఁట. కావున నెవరికాలమునందును పోతనగాని, శ్రీనాథుఁడుగాని ఉండెనని అనుకొనఁగూడదఁట!! ఇఁక సర్వజ్ఞ సింగమనీని కాలమును గుఱించి విచారింతము.

సర్వజ్ఞ సింగమనీని కాలము

పోతనకాలము రమారమి ౧౩౮౦-౧౪౭౦ అని మనము గ్రహించితిమి. రమారమి అనగా ౧౦, ౨౦ ఏండ్ల వ్యత్యాస మిటుగాని అటుగాని ఉన్న నుండవచ్చును. కావున నీకాలములో రేచర్లవంశజు లయిన సింగమ నామధేయు లెవరైనఁ గలరా యని మనము చూడవలయును. వెలుగోటివారి వంశచరిత్రమును బట్టి చూడఁగాఁ బోతనకు మన మేర్పఱిచినకాలమునందు ముగ్గురు సింగభూ

పాలురు కానవచ్చుచున్నారు. ౭ వ, ౮ వ, ౧౦ వ తరమువారు[1]. ౭ వ ౧౦ వ తరమువారికి 'సర్వజ్ఞ' బిరుదున్నట్లు కూడ వ్రాయఁబడినది. ఇందు ౭ వ తరము సింగమనీఁడు రసార్ణవసుధాకర మను అలంకారగ్రంథమును సంస్కృతమున రచించెను. దీనినే సింగభూపాలీయ మందురు. దండకమునం దలి 'సింగమ' ను వెలుగోటివారి వంశమునందు గుర్తించుటకు నాల్గుగుర్తులు కలఁబడుచున్నవి.

౧. దండకమందలి సింగమ తాత సింగమ ('రావుసింగక్షమానాథపౌత్రున్').

౨. తండ్రి కుమారాన్నపోత ('కుమారాన్న పోతావనీనాథసూనున్')

3. తల్లి పోచమాంబ ('పోచమాంబాలసద్గర్భసంజాతునై).'

౪. ఇవిగాక. ఈతఁడు 'వసంతావనీనాథసంసేవితాంచత్పదాంభోజు'ఁడఁట.

౮ వ తరము చినసింగమనాయనికి నిందలి యొకలక్షణమును బట్టదు. కావున నాతనిని వదలివేతము. ౭ వ తరము సింగమనీనియందు మూడు లక్షణములు పట్టుచున్నవి. ఇతనితండ్రి అనపోతన ౧౩౮౦ వఱకు నున్నట్లును, ఓరుగంటి నేలినట్లును, సింగమకుమారుఁడైన మాదానాయఁడు ౧౪౨౭ లో నున్నట్లును శాసనములవలనఁ దెలియుచున్నది. [వె. చ. అను ౪, ౫, ౧౨. చూడనగును] కావున నతఁడు ౧౪౦౦ ల ప్రాంతమువాఁ డని మన మనుకొనవచ్చును. ఇది శ్రీనాథుని కాలమునకును పోతనకాలమునకును సరిపోవుచున్నది.

ఇఁక నితనికి సరిపోవు మూఁడులక్షణములను విచారించెదము. ఇతని తండ్రి అనపోత. కుమారశబ్దము లేనందున మనము సంశయింప నక్కఱలేదు. సింగభూపాలీయము మీతఁడు చేసిన గ్రంథమే. అందే కొన్ని పే శ్లోకచోట

1 ఈ తరములు వెలుగోటి చరిత్రము వ్రాసినవా రేయాధారమునుబట్టి నిర్ణయముచేసినది వ్రాయలేదు. మాకుఁజూడ ౧౦ వ తరమువాఁ డని చెప్పఁబడు సింగమ ౮ వ తరముననున్న అనపోతని కుమారుఁ డనియు, ౯ వ తరమువాఁ డనియుఁ దోఁచుచున్నది. కాని యందున గుఱించి యింకను ప్రమాణములను శోధింపవలసియున్నది. కావున నిప్పు డధికము వ్రాయనొల్లము. ౧౦ వ తరమువాఁడే యని గ్రహించెదము.

కుమారశబ్దముక్తముగను, తిరిగి యీపేళ్లే కుమారశబ్దము లేకుండగను ఉపయోగింపఁబడియున్నవి. ఏకనామము గలవా రిద్ద ఱున్నయెడల తరమునందుఁగాని, వయసునందుఁగాని చిన్నగా నున్నవారిని కుమార శబ్దముతోఁ బిలుచుట సహజము. ఇఁక నితనితాత సింగమయే. 'వసంతావనీశుఁడు' కొండవీటి కుమారగిరిరెడ్డి యని తలంచినయెడల నీతనికి సమకాలికుఁడే. ఇట్లు దండకములోని మూఁడు లక్షణము లితనియందుఁ జెల్లుచున్నవి. కాని యీ ౭ వ తరము సింగమ తల్లిపేరు సింగభూపాలీయమునుబట్టి 'అన్నమ'గాఁ గానవచ్చుచున్నది. 'పోచమ' గ లేదు. కావున నీతఁడు దండకమునఁ బేర్కొనఁబడిన సర్వజ్ఞసింగమ నీఁడు కాఁడని కొందఱు వాదించుచున్నారు. కాని 'అన్నమ' యనునది మాఱుపేరని యేల తలంపరాదు? వెలుగోటివారిచరిత్రయు, సింగభూపాలీయమును చూచినయెడల వీరి వంశమందు ఒక్కొక్క పురుషునకు మాఱుపేళ్లు పెక్కు గలవు. ఉదాహరణార్థము:-యాచమ (దాచా), అనంత (అనపోత), మాచా (మాధవ), దేవగిరి (సింగ), శివ (ధర్మరాయ) ఇట్లు పురుషులపేళ్ల కెన్నియో మాఱుపేళ్లుండ స్త్రీలకు మాఱుపేళ్లుండుటయందు నాశ్చర్యము లేదు.

లేదా 'పోచమ' అను పేరు పేలవముగ నున్నందున, 'పోచమ్మ' అనగా 'ప్రోచుఅమ్మ' అని యర్థముచేసికొని దానికి సంస్కృతరూపము 'అన్నమ' యని కల్పింపఁబడి యుండును.

'పోచమాంబాలసద్గర్భసంజాతు' అను మాటకు నింకొక యర్థము చేయవచ్చును. సింగభూపాలీయమునుబట్టి చూడ నందు మూలపురుషుఁడుగాఁ జెప్పఁబడిన యాచమనాయకుని భార్యపేరు 'పోచమ'. ఈమె యీ వంశమునకు మూలజనయిత్రి. పాతివ్రత్యాదికములచే విశేషవిఖ్యాతి చెందినదగుటచే నామెవంశమువార మని చెప్పుకొనుటయందు నాశ్చర్యము లేదు. కావున మూలజనయిత్రి యగు పోచమాంబాసంతాన మని పైవిశేషమునకు నర్థము చేయవచ్చును. ఈమెవిషయమై యీ వంశమువారికి పెక్కుడు భక్తి

యుండెననుటకు సింగభూపాలీయమునందు ఈ మ్లేనుగురించి చెప్పునపుడు 'పోచమాతా గుణోదారా'1 యని చెప్పుటయే సాక్ష్యము. ముత్తాత భార్యను 'మాత' యనుట ఆలోచింపదగినది కాదా?

ఇట్లు మూఁడులక్షణములు కలియుటయు, నాల్గవది సమన్వయించుటకు వీలుండుటయుఁ జూడ దండకమునకు నితఁడు నాయకుఁడని తలంచుటయందు విరుద్ధ మేమియు లేదనవచ్చును.

ఇంకొక సింగమనీడు

పై సింగమనాయని మునిమనుమఁడగు నింకొకసింగమనాయఁడు కలఁడు. ఈతనికాలము నిశ్చయముగఁ దెలిసికొనుటకు సాధనమేమియు లేదు. అయినను సింగభూపాలీయకర్త ౧౪౦౦ ల ప్రాంతమువాఁడని యనుకొన్నయెడల నాత నికి, అతని మునిమనుమనికిని నడుమ రెండుతరము లుండును. తరమునకు ౨౦ సం వత్సరముల చొప్పున2 లెక్కవేసిన ఈ సింగమనాయనికాలము ౧౪౪౧ లోఁ బ్రారంభమగును. కావున నిదియుఁ బోతనకాలమే. ఇతనియందును దండకము లోని లక్షణములు కాన్పించుచున్నవి. ఇతనితాత చినసింగమనీఁడు. తండ్రి అనపోత. తల్లి పేరు తెలియదు. తమ్ముఁడు వసంతనాయఁడు. కావున దండ కములోని సింగమనీఁ డితఁడైనను కావచ్చును.

పోతన పెద్దసింగమకాలీనుఁ డైనయెడల ౧౪౦౦ కుఁ బూర్వము జన్మించియుండవలెను. రెండవవాని కాలమువాఁ డైనయెడల ౧౪౦౪ లు తరు

1. వెంకటగిరివారిచేఁ బ్రకటింపఁబడిన సింగభూపాలీయముఁ జూడుఁడు.

2. తరమునకు ౨౦ తక్కువయని కొంద అనవచ్చును. కాని రేచర్లవారి చరిత్రమును బట్టిచూడ నింతకంటె నెక్కుడు సంఖ్య తరమునకు వేయ నక్కర లేదని తోచెడిని. వెలుగోటివారివంశచరిత్రమునందే నాలుగు తరములకు ౫౩ సంవత్సరములు ఈయఁబడినవి. [66 వ. పుట] అప్పుడు తరమునకు ౧౩¼ సంవత్సరములు పడ్డవి. ఇదియుఁగాక తరమునకు ౨౦ ఏండ్లు ప్రభుత్వకాలము గాని వయస్సు కాదు.

వాత జన్మించియుండవలెను. పోతన జన్మకాలము గాని, మరణకాలముగాని ఎన్ని యేండ్లు బ్రతికెనని కాని నిశ్చయముగఁ దెలియనందునఁ దప్పక అముకసింగముని కాలమునకుండెనని చెప్పుటకు వీలులేదు. దండకమునందలి వర్ణనము లిద్దఱకుఁ జెల్లును. కావున నెవ్వరి కాలమునందైన నుండితీరవలయును. ఎవ్వరి కాలమునను లేఁడనుట విపరీత సిద్ధాంతము.

సమకాలికులన్న జనశ్రుతిపురాతనము.

పోతనయు, సర్వజ్ఞసింగమనీఁడును సమకాలికు లన్న జనశ్రుతియుఁ బురాతనము. ఈ జనశ్రుతి ౧౭౩౦ ప్రాంతమువాఁడయిన కూచిమంచి తిమ్మకవి కాలమునకే ప్రాతదిగా నుండెననుటకు నాతని సర్వలక్షణసారసంగ్రహమందలి 'ఘనుఁడు పోతనమంత్రి' యను సీసపద్యమే సాక్ష్యము. నిన్నటి హయగ్రీవశాస్త్రిగారి యూహను పట్టుకొని పెనగులాడెడి ఒంటిమెట్టవారింత పురాతనకాలమునుండి వచ్చుచున్న ప్రబలజనశ్రుతిని నమ్మకల దని ఇతరులకు బోధచేయుట గొప్పవింత.

౧౫ వ శతాబ్దమువాఁడైన తాతంభట్టు భోగినీదండకమును తన లక్షణగ్రంథమునం దుదాహరించి యున్నాఁడు.[1]

౫. పంచమహేతువు

ప్రబలమైన జనశ్రుతి.

బొమ్మెరగ్రామమందును, చుట్టుపట్టును భాగవతము చెప్పిన పోతిరాజు బొమ్మెరవాఁడే యన్న వాడుకకలదు. ఆ గ్రామమునందు భాగవతకర్తయైన

1. ఆంధ్రకవుల చరిత్రము, 2 వ భాగము, తాతంభట్టు చరిత్ర. ఈకవి యొక్క 'కవిచింతామణి' యను లక్షణగ్రంథము మాకుఁ బూర్తిగ దొరకలేదు. కావున భోగినీదండక మందు నుదాహరించినది లేనిది మేము స్వయముగ జూడలేదు. వీరేశలింగముగారి గ్రంథమునుండి యీవిషయమును గ్రహించితిమి. మాకు దొరకినభాగములో నారాయణశతకమునుండి పద్యముదాహరింపఁబడినది. దానిని గుఱించి అధికముగ చెప్పుటఁ బ్రస్తుత మనవసరము.

పోతరాజువిగ్రహము కలదు. దానికి బ్రాహ్మణులు పూజచేయుదురు. ఇందు బోతరాజు మళ్లును కలవు. ఇంతియుకాదు. ఈ గ్రామమునకు స్వాములును పర్గణాకు దేశపాండ్యాలును అయిన నెల్లుట్లవారు భాగవతకర్తయైన పోతరాజు తమ వంశమువాఁడన్న ప్రతీతి తమవంశమునందుఁ బూర్వమునుండి పరంపరాగతముగ వచ్చుచున్నదని చెప్పుచున్నారు. దీనిని ధ్రువపఱచుటకు నెల్లుట్లవారి గోత్రమును పోతరాజు గోత్రమును ఒక్కటి కౌండిన్య. కావున బోతరాజు ఓరుగంటి వైపువాఁ డనుట సిద్ధము.

ఇం దెన్నియో ప్రమాణములు గలవు.

(అ) ఇందు నాల్గయిదు ప్రమాణములు కలవు. ఒంటిమిట్ట వారివలెఁ బ్రమాణముల సంఖ్య చూపుటకు నెక్కువగ వేసికొనవలయు నన్న నట్లు చూపవచ్చును గాని యివి యన్నియు జనశ్రుతి సూచకము లగుటచే నొక్కటిగ నిచ్చుట న్యాయమని మాతాత్పర్యము. ఇందు మూఁడుసంగతులు ముఖ్యముగ గమనింపఁదగినవి.

(౧) ఓరుగంటికి సమీపమందున్న బొమ్మెరగ్రామమునఁ బోతరాజుండెనని ప్రవాదముండుట.

(౨) ఆగ్రామాధిపతులవంశమున, పోతన తమవంశము వాఁడన్న ప్రవాద ముండుట. ఈ రెండే హేతువులయి యున్నయెడల నివి కేవలము జనప్రవాదము కనుక స్వతంత్రప్రమాణములు కావు. వీనిని దృఢపఱచు మఱియొక స్వతంత్రప్రమాణముతో నివి చేరినఁగాని వీనికిఁ బ్రామాణ్యము లేదు.

(3) అది పోతనగోత్రమును, నెల్లుట్లవారిగోత్రమును కౌండిన్యమగుట!

ఇన్ని హేతువులును కాకతాళీయన్యాయమునఁగూడిన వనఁగలరా? రాతి ప్రతిమలను, భూమిపేళ్లను, సంకల్పములను, తాంబూలములను వలయునేని క్రొత్తగఁ బుట్టించినఁ బుట్టింపవచ్చును గాని, ఒకానొక కుటుంబపు గోత్రమును పుట్టించుట శక్యమా? కావున జనశ్రుతికి సరిపోవునట్టు గోత్రము కలయుట, జనశ్రుతి సత్యత్వమునకుఁ బ్రబల నిదర్శనము. ఇంతకంటెఁ బ్రబల జనశ్రుతి మఱియొకటి యుండఁబోదు. దీనిముందు నొంటిమిట్టవారి జనశ్రుతి వెలవెలఁబారుచున్న దనుటకు సందేహము లేదు. అందునుగుఱించి పూర్వపక్షఖండనమునందు వివరముగ వ్రాయఁబడును.

## పూర్వపక్షము.

"బమ్మెరలోఁ బోతన భాగవతము వ్రాసిన ట్లిచటఁ బ్రవాదము కలదు. అయ్యది ఓరుగంటిలో వ్రాసెనన్న దానికి వ్యతిరేకము. ఈరెండును ఒకటి నొకటి విధ్వంసము చేయును. కావునఁ బోతన భాగవతము బమ్మెరలో వ్రాయలేదు. ఓరుగంటిలో వ్రాయలేదు. మా ఒంటిమెట్టిలో వ్రాసెను!"-అన్న యొక యపూర్వ పూర్వపక్షము కలదు.

ఇందు మనకుఁ దెలియని కొన్ని సంగతులు తెలిసినట్లు గ్రహించుట యను దోషము ప్రధానము. భాగవతగ్రంథము పెద్దది. కొలదికాలములోఁ బూర్తి యగునది కాదు. దానిని పూర్తిచేయుటకుఁ గనీసము ౧౦ సంవత్సరము లైనను పట్టియుండును. ఈ కాలమంతయు నాతఁ డొక్కస్థలమునందే కూర్చుండి యుండెనని మనకెట్లు తెలియును? ఏకశిలానగరమునందు ననఁగా నోరుగంటిలో బ్రారంభించెనని మాత్రము మన మెఱుఁగుదుము. కొంత యోరుగంటిలోను కొంత స్వగ్రామములోను వ్రాసియుండఁగూడదా? ఇదియునుగాక పోతనకును ఓరుగంటికిని నెట్టి సంబంధ ముండెనో మనకుఁ దెలియదు. గ్రామనామము వలనను, లోకమందలి వదంతివలనను, ఇప్పటి కరణముల కుటుంబవృత్తాంతము వలనను, గోత్రమువలనను పోతరాజుకుటుంబమును, ఆతఁడును బొమ్మెరవారని తెలియుచున్నది. భాగవతమునందలి వాక్యములను బట్టి యాతనికి నేకశిలానగరమం దనఁగ నోరుగంటిలోఁ గురువృద్ధ బుధబంధుజను లుండిరనియు తెలియుచున్నది. అందువలన నితఁడు పుట్టినప్పటినుండియుఁ జచ్చువఱకును ఒక్క యోరుగంటిలోఁ గాని, ఒక బమ్మెరలోఁ గాని ఉండవలయు నని నిర్బంధమా యేమి? ఈతఁడు కుటుంబమునకుఁ బెద్దవాఁడు కాఁడు. కావున గ్రామ కరణీక మీతనికుండదు. పండితుఁడును, కవియు, బీదవాఁడును అగు నీతఁడు సమీపమందున్న గొప్పపట్టణమునకుఁ బోయి బుజుమార్గముననే కొంతధన మార్జించి కుటుంబపోషణము చేయఁగూడదా? ఉండిన నొక్క యోరుగంటి లోనే, లేకపోయిన బమ్మెరలోనే యుండవలయునా? పుట్టినప్పటినుండి యు

జచ్చువఱకుఁ గదలక మెదలక ఒంటిమిట్టలోనే యున్నాఁడని చెప్పినంతమాత్ర మున నావాదమున కేమి యాధిక్యము వచ్చును?

కుటుంబములోని తెలివిలేనివారు కొందఱు మిరాసిగ్రామమును కని పెట్టుకొని యుండుటయు, తెలివిగలవారు చెన్నపట్టణమువంటి గొప్ప నగరము లకుఁ బోయి ధనార్జనము చేసి యింటికిఁ దెచ్చుటయు మన మిప్పుడు చూచుట లేదా? అట్లే పోతరాజు సమీపమందున్న ఓరుగంటి పట్టణమునకుఁ బోయి వచ్చుచుండఁ గూడదా? సుబ్బారావుగారు చెన్నపట్టణమున లేరా? వారిరామా యణము వారంతయు నొక్కయూరనే వ్రాసిరా? అట్లే పోతరాజు చేసి యున్న నేమితప్పు?

భాగవతరచనా ప్రారంభానంతరము పోతన ఓరుగంటిలోనే కాపుర మేర్పఱచుకొనెనని యనుకొన్నను, స్వగ్రామమున కప్పుడప్పు డైనను వెళ్లి యుండుట అసంభవమా? అట్లు వెళ్లియున్నప్పు డచ్చట భాగవతమందలి ప్రక రణములు రచించియుండుటయు నసంభవముకాదు. కావున నెట్లు చూచినను ఇందు వైరుధ్య మేమియు లేదు. వైరుధ్యము లేని రెండు ప్రమాణము లున్నపుడు వానిని సమన్వయించుకొనుట మీమాంసా సంప్రదాయముగాని తెలియని విషయములను తెలిసినట్లుగ గ్రహించి యా ప్రమాణములను ఆక్షేపించుట అదరగొండ మనిపించుకొనును.

పోతనకాలమునందు ననగా ౧౪-౧౫ శతాబ్దములందు నోరుగల్లు గొప్ప పట్టణముగనే యుండెను. ద్వితీయ ప్రతాపరుద్రుని తరువాత దాని పూర్వవైభవము తగ్గినను ౧౪౪౦ వఱకు గాకతీయవంశమువారో వెలు గోటివారో యచ్చట రాజ్యముచేయుచుండిరి. తరువాత నది కొంతకాలము పూర్తిగఁ దురకల రాజ్యమునఁ గలిసినను, చుట్టుపట్టుననున్న అయిదారు జిల్లా లకు గొప్ప పట్టణముగను వర్తకస్థానముగను ఉండెను. ఇప్పటికిని పూర్వ మోరు గంటిలోని వాడలుగనున్న హనుమకొండ, మట్టెవాడలు గొప్ప వర్తకస్థల ములు. లక్షాధీశులయిన కోమటు లచ్చటఁ గలరు.

తురకల క్రింద నున్నప్పుడును వారియొద్ద హిందువులు మంత్రులుగ నుండుటయు, వారు కవుల కాశ్రయ మిచ్చుటయుఁ ఘటిల్లించుచువచ్చెను. క్రీ. శ. ౧౫౦౩ వ యేట దగు చిత్తాఫఖానుని శాసన మొకటి ఓరుగంటిలోఁ గలదు. చిత్ర భారతము కృతినందిన పెద్దామాత్యుఁ డీఖానుని మంత్రియే. చరిగొండ ధర్మన కవికి నాశ్రయమిచ్చి చిత్రభారతము వ్రాయించినది ఈ మంత్రియే. ఈ కవి పోతన కొక తరము తరువాతివాఁడు.

కావున రాజున్నను లేకపోయినను, పెద్ద పట్టణమగుటచే పలువురు విద్వాంసులును, కవులును, రసికులగు శ్రీమంతులును ఉండుట సహజము. వారి సహవాసనిమిత్తమైనను పోతరాజచట నెక్కుడుగ నున్న నుండవచ్చును. వారిలో నొకానొక మహానుభావుఁ డీకవివర్యుని నాదరించిన నాదరించియుండ వచ్చును. కావున మనకుఁ దెలియని సంగతులను గురించి అసంభావ్యపు టూహల నేల పన్నవలయునో మాకుఁ దెలియదు.

ఒంటిమిట్టలోమాత్రము కొంత వ్రాయఁగూడదా?

ఇట్లు ఓరుగంటిలోఁ బ్రారంభించి, కొంత బమ్మెరలోను వ్రాసెనని మీరు చెప్పినపుడు మా ఒంటిమిట్టలోఁ గూడఁ గొంతయేల వ్రాసియుండఁ గూడదని ఒంటిమిట్టవా రడుగవచ్చును. వారిట్లడుగుట న్యాయమే. దానికి మే మభ్యంతరపెట్టము. . భాగవతమునందుఁ జెప్పఁబడిన ఏకశిలానగర మనగా ఓరుగల్లేయని సిద్ధాంత మంగీకరించిన తరువాత మఱి యెక్కడను భాగవతమందలి యేభాగమును పోతన వ్రాయఁగూడదు వ్రాసియుండఁడు. మొదటినుండి చివరకుఁదాను నోరుగంటి గోపాలదేవుని యాలయములోనే వ్రాసెనని మా బలవంత మేమియు లేదు. మీయూరువచ్చి వ్రాసెనని చెప్పుకొనిన మాకు సంతోషమేని చెప్పుకొనుఁడు. మే మడ్డమురాము. మీయూరువచ్చి కొంత చెప్పియుండవచ్చును. ఇంగ్లాండు వెళ్ళి కొంత చెప్పియుండవచ్చును. అమెరికాలోఁ గొంత చెప్పియుండును: చెప్పకయుండును. అనుకూలముగ గాని ప్రతికూలముగఁ గాని ప్రమాణములు లేనప్పుడు ఎవ్వరెన్ని చెప్పుకొనిన మాకేమి?

వీరేశలింగముగారి పూర్వపక్షము

కీర్తి శేషులయిన రావుబహాదరు కందుకూరి వీరేశలింగముగారు కొండొంగలు వాదులయినను ఒక్క విషయమై పూర్వపక్షము చేసియున్నారు. పోతరాజు నియోగియు, శైవుఁడును అగుటచేతను, వెల్లుట్లవారు గోలకొండ వేపారులును, వైష్ణవులును అగుటచేతను పోతన వీరి వంశమువాఁడు కాఁడని వారు వ్రాసిరి [ఆం. క. చ. ౧ భా. ౧ పుట ౫౮౬] (క్రొత్తకూర్పు). కాని వారి హేతువు సరియైనది కాదు. ఆఱువేల నియోగులలో నొక్క కుటుంబము వారిలో, ఒక్క యింటిపేరు గలవారిలోఁ దశరాత్రజ్ఞాతులలోఁ గొందఱు స్మార్తులయిన యద్వైతులుగను, కొందఱు లింగధారులయిన శైవవిశిష్టాద్వైతులుగను, కొందఱు నిలువు బొట్టుపెట్టువారుగను, ఇట్టివారిలోఁ గొందఱి పూర్వులకు వైష్ణవులు గురువులుగా నుండి కొన్ని తరములనుండి మాత్రము వీరు స్మార్తు లగుటయుఁ జూచుచున్నారము.

ఈ ప్రాంతమునఁ గొందఱు గోలకొండ వేపారుల కుటుంబములలోఁ గొందఱు ముద్రాధారణము గల వైష్ణవులుగను, కొందఱు స్మార్తాచారము గల వారుగను ఉండుటయు, ఒకప్పుడు వీరు వారుగను, వారు వీరుగను మారుటయు గలదు. ఉత్తర సర్కారులలోఁ దాము ఆఱువేల నియోగులమని చెప్పుకొను కుటుంబములు పెక్కులు మొదట గోలకొండ వేపారులుగనుండి, వైష్ణవులచేఁ జక్రాంకితములు చేయించుకొని నిలువుబొట్టు పెట్టుచుండెడివారు. ఇటీవల వైష్ణవగురువులను పరిత్యజించి స్మార్తాచారమునే అవలంబించియున్నారు. నియోగులు శైవమునుండి స్మార్తవము, అందుండి వైష్ణవము—ఈ తీరుగ మాఱుట యొకవింత కాదు. కావున, బమ్మెరవారు కొందఱు లింగధారులుగను, కొందఱు గోలకొండ వేపారులుగను ఉండుట యస్వాభావికము కాదు.

బమ్మెర పేరు విని భయపడుట

ఒంటిమిట్టవాదులు, బమ్మెరవాదమును ఓరుగంటి వాదమును వేఱు వేఱనియుఁ, బరస్పర విరుద్ధము లనియుఁ బైకి వాదమునకై చెప్పినను బొమ్మెర

గ్రామాస్తిత్వమును (ఉనికియు) అందలి జనశ్రుతియు, ఓరుగంటివాదమునకు ముఖ్యమైన ప్రమాణమనియు, అది యున్నంతవఱకు నొంటిమిట్టవాదము తల యెత్త నేరదనియుఁ బ్రతిపక్షులకు దృఢమైన నమ్మకము కలదనియు, బొమ్మెర నామము వినగనే వారు మిక్కిలి భయపడెదరనియుఁ దెలిసికొనుటకు శ్రీ శేషుబ్బారావుగారి యీ క్రింది వాక్యములు చూడవగును.

“నేను వెలిగందలను వదలెదను. తాము బమ్మెరను వదలుదురు గాక! తరువాత నోరుగంటివారి వాదమెన్ని కాళ్లనర్తింమనో చూతము” (సు. ద్వి. వ్యా. 3౼౩ పుట.)

“ఆయాధారము (బొమ్మెర జనశ్రుతి) పోయినయెడల నోరుగంటివారి వాదమున కాధారము క్రింద మన్ను, మీదమిన్ను, నడుమ సున్న యగును” (సు. తృ. వ్యా ౧౦౧ పుట.)

---

## పూర్వపక్షఖండనము

### నిన్నటి నిరాధార ప్రమాణములు.

ఇట్లు బమ్మెర పోతిరాజు ఓరుగంటిప్రాంతమువాఁ డని చూపుటకుఁ గల ప్రమాణములను ఇదివఱకుఁ జూపితిమి. వానిపైఁ బ్రతిపక్షులు తెచ్చు నాక్షేపములకును సమాధానము చెప్పితిమి. ఇఁక నొంటిమిట్టవాదులు పోతన ఒంటిమిట్టనివాసి యని చూపుటకుఁ దెచ్చిన ప్రమాణములను గుఱించి విచారింతము.

, ఒంటిమిట్టకుఁ బోతనకాలమున నేకశిలానగర మన్న పేరుండెనని చూపుటకు వీరు మూఁడు గ్రంథప్రమాణములను కనఁబఱచిరి. అందు మిక్కిలి పురాతనమైనది ౧౦౮౦ లోను, రెండవది ౧౮౯౩ లోను, మూఁడవది ౯౦౬ లోను వ్రాయఁబడినవి! ! ! కావున నివి ౧౮-౧౯ వ శతాబ్దములలో నొంటిమిట్టకు నేకశిలానగరమన్న పే రుండెననుట కె ట్లుపయోగించును? అదియుఁగాక ఓరుగంటివారు చూపునట్టి సమ, సమీప, పరంపరాగతకాలీనోద్గ్రంథ శాసనాదికము లనియెడు రత్నపుంజములయెదుట ఈ నిన్నటి, నేఁటి నిరాధారప్రమాణ

ములు గుడ్డిగవ్వయైనను చేయునా? ౧౪-౧౫వ శతాబ్దములం బుట్టిన గ్రంథ రాజములును, శాసనములును ఓరుగంటికి నేకశిలయన్న పే రున్నట్లు ఘోషించు చుండఁగా, వాని నన్నిఁటిని దృణీకరించి, యాధారమును జూపక నిన్నఁబుట్టిన యొక గ్రంథమందలి పీఠికలోని ' ఫుట్టునోట్టు ' ను పరమప్రమాణముగ గ్రహించి పోతనకాలమున ఒంటిమిట్టకు ఈపేరుండె నని గ్రహింపు మనిన నెవ్వరు గ్రహింతురు?

పోతనకాలమున నేగ్రామమునకు నేకశిలయను పే రుండె ననునది యిచ్చటఁ జర్చాంశము గాని, నిన్న మొన్న నెవఁడైన ఒంటిమిట్టకు ఏకశిల యనునది సంస్కృతరూపమని భ్రమపడెనా లేదా యన్నది చర్చాంశము కాదు. నిన్న నొకఁడు - అతఁ డెంతగొప్పవాఁడైనను కానిండు- ఒంటిమిట్టను ఏకశిల యన్నందున ౧౪ - ౧౫ వ శతాబ్దములలో నది ఏకశిలానగర మగునా? ఈ ముఖ్యాంశమును ఒంటిమిట్టవాదులు మఱచినందున, ౧౮౪౮ లోని "ఫుట్టు నోట్టు"ను జూచి వారు పరమప్రమాణముగ సంతసించుటకుఁ గారణమైనది. ఇఁక నీనూతనప్రమాణములయోగ్యతలను కొంచెము వివరముగఁ జూతము:—

### (అ) భాగవత పీఠికలోని ఫుట్ నోట్ (౧౮౪౮.)

క్రీ. శ. ౧౮౪౮ లో నాంధ్రభాగవతమును మొట్టమొదట హయగ్రీవ శాస్త్రిగారు ప్రకటించినారు. దానికి నొక పీఠికవ్రాసి యందుఁ బోతనచరిత్ర వ్రాసిరి. పీఠికయం దంతటను పోతన ఏకశిలానగరవాసి యైనట్టే వ్రాసి యున్నది. కావున నెద్దానిఁజూచి యాపీఠిక వ్రాయఁబడెనో యామూలగ్రంథ మందు ఏకశిలానగరము పేరే యున్న దనుట స్పష్టము. పీఠికలో నొకచోట ఏకశిలానగరశబ్దముపైఁ జుక్కపెట్టి పుటకడుగున "ఫుట్ నోట్," లో "ఈ గ్రామమునకు ప్రతినామము ఒంటిమిట్ట: ఇది కడపకు దక్షిణమున చెన్నపట్టణమునకు బోయే బాటలో మొదటి మజిలీస్థలముగా నుంటుంది" అని వ్రాసిరి. ఈ"ఫుట్ నోట్" శాస్త్రిగారి స్వాభిప్రాయమనుట స్పష్టము. కానియెడల పై పీఠికలోని చరిత్రములో వ్రాయక క్రింది "ఫుట్ నోట్" లో వేయుట యేల?

'కాదు-కాదు. ఈ "ఫుట్ నోట్" గూడ శాస్త్రిగారికి దొరకిన పురాతనగ్రంథమునందుండె' నని ప్రతిపక్షు లనుచున్నారు! ఎట్టి విపరీతపు సంగతులనైనను జెప్పుటకు వారు వెనుదీయరు. పురాతనగ్రంథమందు చెన్నపట్టణము ఘాటు, మజలీలుండునా? అట్లున్న నది ప్రాచీనగ్రంథ మగునా? అని యైనను ఆలోచింపరైరి!

ఇది ౧౮౪౭ లో హయగ్రీవశాస్త్రిగారి యభిప్రాయము. ఒంటిమిట్టకు సంస్కృతనామము ఏకశిలానగరమని వా రి ట్లభిప్రాయపడుటకు హేతువు లెవ్వియో వారు వ్రాయలేదు. కావున నొంటిమిట్టవాదుల కీప్రమాణమువలన నేమిలాభము? 'ఒంటిమిట్ట' యను తెనుఁగుపేరునకు సంస్కృతభాషాంతరము 'ఏకశిలానగరము' అగునని ఊహించి వా రట్లు వ్రాసియుండవచ్చును. ఇట్లు చేయుట యొకవింత కాదు. పూర్వ గ్రామనామములను పోల్చుకొనవలసి వచ్చినప్పుడు వేఱుమార్గము లేనియెడలఁ బండితు లిట్టియూహాలు చేయుచుండుట సహజమే. అట్లే వారు యోచించియుందురు. లేదా ఒంటిమిట్టవాదులకు ననుకూలముగ నూహింపవలెనన్న ఆ కాలమందు వారు ఒంటిమిట్టలోని జనశ్రుతి విని వ్రాసియైనను వ్రాసియుందురు. మొదటి యూహ నిజమైనయెడల వారి తర్కమే యిందుకు హేతువు. రెండవ యూహ నిజమైనయెడల నొంటిమిట్ట యందలి ౧౮౪౭ లోని జనశ్రుతియే యిందుకు హేతువు. ఏది హేతువైనను ౧౮-౧౯ వ శతాబ్దమునందు నొంటిమిట్టకు నేకశిలానగర మన్న పేరున్నట్లు చెప్పుటకు ఈ "ఫుట్టునోట్టు" ఉపయోగపడునటు వింతలోనివింత. ఇయ్యది ౧౮౪౭ లో జనశ్రుతి యుండెనని చూపినఁ జూపునేకాని అంతకంటె నిందు నధికప్రామాణ్య ముండదు. 1

---

1 జనప్రవాద మొంటిమిట్టలో ౧౮౪౭ కిఁ బూర్వము లేదనియు, నందువలన్న హయగ్రీవ శాస్త్రిగారి "ఫుట్టునోట్టు" పుట్టిన తరువాతనే యీ జనశ్రుతి పుట్టినదనియు మా యభిప్రాయము. 'ఒంటిమిట్ట కైఫీయతు'వలన ౧౯౦౦ ల ప్రాంతమున నీ జనశ్రుతి లేదనుట స్పష్టము. ఈ సంగతి 'ఒంటిమిట్ట యెప్పుడును ఒంటిమిట్టయే' యన్న శీర్షిక క్రింద నధికముగఁ జర్చింపఁబడును.

(అ) మ్యాక్‌లీన్స్ మాన్యుఅల్ (౧౮౮౩).

ఒంటిమిట్ట వారి రెండవ గ్రంథస్థప్రమాణము ౧౮౮౩ లో మ్యాక్‌లీన్ దొరచే నింగ్లీషునఁ బ్రకటింపఁబడిన 'మ్యానుయల్ ఆఫ్ అడ్మిని స్ట్రేషన్ ఆఫ్ ది మద్రాస్ ప్రెసిడెన్సి' (Manual of Administration of the Madras Presidenc.) అను గ్రంథముయొక్క మూఁడవ సంపుటము. ఇది కోశ (Glossory) రూపము. ఇందు "వొంటిమిట్ట"1 శబ్దము క్రింద నొంటిమిట్టకు నేకశిలానగర మను పే రున్నట్టు వ్రాయఁబడియుండెనని ఒంటిమిట్టవాదులు చెప్పుచున్నారు. అం దట్టి యర్థము స్పష్టముగ లేదని మా తాత్పర్యము. ఆ యర్థమును గుఱించి తరువాత విచారింతము. కాని వాద సౌకర్యార్థ మిదియే యర్థ మని గ్రహించినను ఇందుపై ఈ క్రిందియాక్షేపణములు కలవు:—

(౧) ౧౮౮౩ లో నెవరో దొర యేప్రమాణమును ఈయక వ్రాసిన మాట ౧౫ వ శతాబ్దమందు నొంటిమిట్టకు నీపేరుండె నని యెట్లు స్థిరపఱచును?

(౨) ౧౮౭౪ లోని హయగ్రీవ శాస్త్రిగారి "పుట్టునోట్టు" తరువాతఁ బుట్టినది కావున దీనికి దానికంటె నెక్కుడుప్రామాణ్య మెట్లువచ్చును? కావున దీనిని దానికంటె స్వతంత్రప్రమాణముగ నుదాహరించిన నేమి లాభము?

(3) ఈ ప్రమాణమునందే ఓరుగంటికిఁ గూడ నేకశిలానగర మన్న పే రున్నట్టు సూచింపఁబడెఁ గావున నీప్రమాణమును గుఱించి యొంటిమిట్టకు నాధిక్యత యెట్లు?

---

1. ఒంటిమిట్టవారిధోరణినే మే మవలంబింపఁదలచినయెడల నిది "వొంటిమిట్ట" కాని "ఒంటిమిట్ట" కాదని మొండివాదము ప్రారంభింపవచ్చును. మాకు ఛలజల్పవితండములతోఁ బనిలేదు. ఇదియుఁ గాక ప్రమాణాప్రమాణతారతమ్య జ్ఞానము కలవారందఱును ఇట్టిప్రమాణమును నికృష్టప్రమాణముగా నెంచుదురు. కావున, దీనిని గుఱించి యెక్కువ వాద మనావశ్యక మని మాతాత్పర్యము.

(౪) ఓరుగల్లువారు ౧౯౯౩ లోఁ దమ గ్రామమునకు ఏకశిలానగర మన్న పేరుండెనని యీ ప్రమాణమును జూపినయెడల, మా గ్రామమునకుఁ గూడ నాయేటి నీనామము కలదని చెప్పుటకు నొంటిమిట్టివారికి ప్రమాణమును చూపినఁ జూపవచ్చునేగాని మఱియొందుకును ఇది పనికిరాదు.

ఇఁక మూలమునందు నేమున్నదో చూచి దానియర్థమును విచారింతము:—

"Vontimittah (వొంటిమిట్ట vontimitta, Tel) From (Onti, tel. single+mitta, tel. mound) [or].Sanskrit name, (ekasilanagara),meaning single rock city [Warangal.] ...''

ఈ పై యింగ్లీషు వాక్యముల కేమి యర్థము? "వొంటిమిట్ట"కు 'ఏక శిల' యను పేరు గలదనియా? లేక వరంగంటికిఁ గలదనియా? లేక 'ఒంటి మిట్ట'కుఁ గూడ 'వరంగల'న్న నామము గలదనియా? అర్థము సందిగ్ధ మన్న మాట నిజము. మిట్టశబ్దము వచ్చినచోట దానికి Mound (దిబ్బ) అని యర్థము చేసియు, ఏకశిలలోనిశిలకు Rock అని అర్థమిచ్చినచోట ఒరంగంటి పేరుదాహరించుటయువలన నవి వేఱువేఱనియే యతని తాత్పర్యముగఁ గనఁబడుచున్నది.

ఒరుంగంటి శబ్దమునొద్దఁగూడ [Vontimitta][1] అని యిచ్చినాఁడు. గనుక నివి కేవలము "క్రాస్ రిఫరన్సులు" అనఁగా నొకదానిని చూచినతరువాత మఱియొకదానిని, వాని సామ్యమువలనఁ జూడు మని గ్రంథకర్త తాత్పర్యమందురా? మాకు నిష్టాపత్తియే. అప్పుడు రెంటికి ఏకశిలానగరమన్న పేరున్న

---

1 "Warangal (ఒరుంగల్లు Orungallu Tel.) From (Oru Tam. Single + Kal, Tam, stone) [Or] Sanskrit name (Varnakula), meaning caste + collection; (ekasilanagari) meaning one + stone + city; from the single stone wall round the town [Vontimitta]. Ancient capital of The Andhram [q. v.] country [Charitram]. the Hyderabad teritory" [Maclean's manual.]

దని అతఁడు స్పష్టముగ వ్రాసెనని ఒప్పుకొనవలెను. అట్లైన ఈ ప్రమాణమును గుఱించి వ్రాయునపుడు సుబ్బారావుగారు "ఇట్టి దోరుగంటికి నాకాశ పుష్పము కదా?" యని వ్రాయుట యేమి న్యాయము? ఇతరు లిట్లు వ్రాసి యుండిన వీ రెన్ని తిట్లు తిట్టియుందురో?

(ఇ) మూఁడవ గ్రంథరాజము తప్పులతడక. క్రీ. శ. ౧౯౦౬!

ఇఁక వీరి మూఁడవ గ్రంథరాజమును చిత్తగింపుఁడు. దీనికిఁ బేరు 'ఒంటిమిట్ట లేక యేకశిలామాహాత్మ్యము' !! ఇది ఒంటిమిట్టకు సమీపమున నుండు ఓబిలి గ్రామ నివాసియగు కోపూరు రామదాసుగారిచే ౧౯౦౬ సం॥ అక్టోబరు నెలలో వ్రాయఁబడినది! ఇంత పురాతన గ్రంథ మొంటిమిట్ట వాదులకు దొరకిన తరువాత నోరుగంటి వాద మాగఁగలదా! ఇది తప్పుల తడక. వచ్చిరాని తెనుఁగుతో నీ కవి (?) ఒంటిమిట్టగౌరవము హెచ్చించుటకై వ్రాసిన పొత్తము. దీనిని 'గ్రంథము' లేక 'కావ్యము' అనుటకును యోగ్యతలేదు. కాని దాని యోగ్యతతో మన కిచ్చటఁ బనిలేదు.1 దీని ప్రామాణ్యవిచారమే ప్రస్తుతము. ఇందు ఒంటిమిట్టకైఫీయతులోని కథలును, భాగవత పీఠికలోని కథలును కలిపి పిచ్చిపద్యములుగ నల్లఁబడినవి. ఒంటిమిట్టకు నేకశిలానగర మన్న పేరుండిన ట్లిందు నుండుటయేగాక, అయ్యలరాజు తిమ్మరాజు చరిత్రమును, బమ్మెర పోతరాజు చరిత్రమును, ఇమాం బేగు అను తురకవాని చరిత్రమును, ఒంటుడు మిట్టుడి చరిత్రమును—ఇట్లెన్నియో గలవు! అయినను స్కాంద పురాణములో నున్నదని యెవరో ధూర్తు వెంకటాచలమయ్య తనకుఁ బంపిన తెలుఁగువచనమును బట్టి యీ కావ్యము వ్రాసితి నని ఈ కవి వ్రాసెను కావున వేదవ్యాస రచితమైన స్కాందపురాణములో నీ కథలన్నియు నుండె నని మనము నమ్మవలెనఁట!

---

1 ఈ గ్రంథము తప్పులతడక యని శ్రీ సుబ్బారావు పంతులుగారే వ్రాసియున్నారు (చూడు. మొదటి యుపన్యాసము. ఆం. సా. ప. ప. సం. ౬. పుట ౧౫౭.)

ఇట్టిది ప్రమాణముగ నొంటిమిట్టవాదులు చూపుటవలననే వారి ప్రమాణ దారిద్ర్యము స్పష్టమగుచున్నది. ఔను! పాపము! వేఱుగతిలేనప్పు డేమిచేయఁ గలరు? సముద్రమున మునుఁగుచున్నవానికి గరికెపోఁచ యైనను గొప్ప నావ వలెఁ దోఁచుఁగదా!

ఇవి స్కాందపురాణములోనివి యని యెవరో చెప్పినని కవి వ్రాసెగాన (తాను చూచితి ననియుఁ గాదు) సంస్కృత స్కాందపురాణములోని యా భాగములు దొరకనిదే దీనిని ఎవండైనను ప్రమాణముగఁ దీసికొని ౧౪-౧౫ వ శతాబ్దముల లోని ప్రస్తుతస్థితిని నిర్ణయించుకొనునా? గ్రంథకర్త తన గ్రంథ ప్రాశస్త్యమునకై వ్రాసినంతమాత్రమున మూలగ్రంథము దొరకనిదే, వేదవ్యాసులనాఁటికే ఒంటిమిట్ట యుండె ననియు, అందుఁ బోతరాజును, ఇమాంబేగును కాపురముండిరనియు నమ్మవలెనా? ఇంతకంటె విపరీతవాదము మఱి యొకటి యుండదు! ఈ యొక్క వాదమువలననే, స్థాలీపులాకన్యాయముగ, మనము వీరి ప్రమాణబలమును వాదపద్ధతియుఁ దెలిసికొనవచ్చును.

స్వతంత్రములా? వాదమునకుఁ బూర్వపువా!

"ఈ స్వతంత్ర (?) ప్రమాణములు మూఁడును నీ వాదము విజృంభించుటకు ముందే పుట్టినవి. కావున ననాదినుండి యొంటిమిట్టకును నేకశిలానగర నామ ముండుట నిస్సందేహము" అని సుబ్బారావుగారు మొదటి వ్యాసము నందు వ్రాసిరి.!!!

ఇవియా స్వతంత్ర ప్రమాణములు? నిన్న పుట్టిన యా పొత్తములే ౧౪-౧౫ వ శతాబ్దములలోని సంగతులకు స్వతంత్రప్రమాణము లయినయెడల నిఁక దేనికి నేది స్వతంత్రప్రమాణము కాదు? నేఁడెవఁడైనను నాలుగు పంక్తులు వ్రాసి దానికి ఢిల్లీ మాహాత్మ్య మని పేరుపెట్టి ఒంటిమిట్టకు స్ట్రాట్ ఫర్డ్ అను నామము గలదనియు, అందు షేక్స్పియరు పుట్టెనని నాలుగు కాగితములు వ్రాసియుంచిన నది స్వతః ప్రమాణ మనియే మనము గ్రహింపవలెను. అయితే

ఆ కవి మాత్రము ఈ మాహాత్మ్యము స్కాందపురాణాంతర్గత మని వ్రాయుటకు మఱవఁగూడదు. ఇంతియ ఒంటిమిట్టవారు కోరునది!

ఆయా గ్రంథకర్తల కాలమునఁ గొంద ఱట్లనుకొనుచుండి రనుటకు నీ గ్రంథములు స్వతఃప్రమాణములందురా మా కిష్టాపత్తియే.

ఇవి యీ వాదము విజృంభించుటకుఁ బూర్వమే పుట్టినవఁట. ఈ వాద మనఁగా సుబ్బారావుగారికి రామయ్యగారికి నిప్పుడు జరిగిన వాద మని కాఁబోలును వీరి తాత్పర్యము. కాని పోతరాజు స్థలనిర్దేశవిషయమైన వాద మింతకుఁ బూర్వమే పుట్టినది. గురుజాడ శ్రీరామమూర్తిగారు ౧౮౮౨ లోనే తమ కవిజీవితములందు హయగ్రీవ శాస్త్రిగారి "పుట్టునోట్టు"ను అనఁగా ఒంటిమిట్టవాదమును పూర్వపక్షము చేసి ఒరంగల్లువాదమును నిల్పియున్నారు. ఒంటిమిట్టవాదుల కీసంగతి తెలిసియు శ్రీరామమూర్తిగారి యితర వ్రాతల విషయమై యీ వాదమునందే యుదాహరించియు, ఈ సంగతిదాచిపెట్టిరి. 1 ౧౮౯3 లోను, ౧౯౦౬ లోను ఎవఁడో వ్రాసిన వ్రాతలు ప్రమాణము- స్వతంత్ర ప్రమాణము- కాఁగా ౧౮౮౨లో నాంధ్ర కవుల జీవితములను వ్రాసిన- శ్రీరామమూర్తిగారు చర్చించి వ్రాసినవ్రాత యేల ప్రమాణముగాదు? కావున నీ మూఁడిటిలోను ౨ వ, 3 వ ప్రమాణము లీవాదముపుట్టిన తరువాతనే పుటినవి.

---

1 ఇట్లు దాచియుంచుటకుఁ గారణములేకపోలేదు. వీరియొద్ద ప్రత్యుత్తరము లేకపోవుటయే యిందుకుఁ గారణము. శ్రీరామమూర్తిగారు హయగ్రీవ శాస్త్రిగారి 'పుట్టునోటు'ను పూర్వపక్షము చేయఁగా, దానిని మించిన హేతువు వీరివద్ద లేనందున వీ రాపూర్వపక్షమును కప్పిపెట్టిరి. దానిని వెలిపుచ్చిన యెడల హయగ్రీవ శాస్త్రి మాట నిలువపుటకు వీరియొద్ద "క్రింద మన్ను, పైన మిన్ను, నడుమ సున్న' తప్ప మఱి యే పురాతన ఆధారములు కలవు? హయగ్రీవ శాస్త్రికి హయగ్రీవ శాస్త్రే ఆధారము!

ఇట్టి ప్రమాణము లెప్పుడుపుట్టిన నేమి? ఎన్ని యున్న నేమి? ఈవాద మునకు అక్కఱవచ్చునవికావు. ప్రమాణకోటికి నెక్కు అర్హత వానికి లేదు.1

"అనాదినుండి యొంటిమిట్టకును నేకశిలానగరనామ ముండుట నిస్సందేహ"మంట. క్రీ. శ. ౧౮౫౭ వ సంవత్సరమే సృష్టియొక్క ఆదియనియో, అనాదియనియో యని ఒంటిమిట్టవారలు నిశ్చయించుకొనినయెడల నెవ్వరు వల దందురు?

## ఒంటిమిట్ట యెప్పుడును ఒంటిమిట్టయే.

ఇట్లు ఒంటిమిట్టకు ౧౫ వ శతాబ్దము మొదలు ౧౯ వ శతాబ్దము వఱకును ఎప్పుడైనను ఏకశిలానగర మన్నపే రుండె నని చూపుటకు నొంటిమిట్ట వారు లేప్రమాణములను చూపలేదు. గనుక వారివాదము పోయిన దనుట స్పష్టము. ఇంక దానివిషయమై యధికము వ్రాయనక్కఱలేదు. కాని ఒంటిమిట్టకుఁ బూర్వ మెన్నఁడును ఏకశిలానగరమన్నపేరు లేదనియు, ఎల్లప్పుడును ఒంటిమిట్టయన్న పేరేయుండెననియుఁ జూపుటకు గ్రంథ, శాసనప్రమాణములు కూడఁ గలవు. వీనిని ఇదివఱకు నెవరును ఉదాహరింపకపోవుటచేత మే మిచ్చటఁ జూపుచున్నారము.

౧. క్రీ. శ. ౧౫౩౩ ప్రాంతము. ఒంటిమిట్ట రఘువీరశతకము. అయ్యలరాజు తిప్పయామాత్యప్రణీతము. ఈ కాల మొంటిమిట్టవా రొప్పుకొనినదే. ఈతఁడు పోతనకు సమకాలికుఁడు. ఈ శతకమునం దిచ్చటవచ్చినను ఒంటి

*1. ఒంటిమిట్టవారివలె ఈ వాదము పుట్టకమును పనగా ౧౯౧౨ కుఁ బూర్వపు గ్రంథములలోనుండి యే-అనఁగా నిటీవలి గ్రంథములలోనుండి ఓరుగల్లుకు ఏకశిలానగరమన్న పే రున్నట్లు ప్రమాణములను మేము ఈయఁదొడఁగితిమా, Indian Antiquary, Epigraphia Indica, Epigraphia Carnatica, మొదలయిన గ్రంథములలోనుండి యిటీవల వ్రాసిన లేఖ లసంఖ్యములు ఈయఁగలము. కాని అవి ప్రస్తుతవాదమున కనిష్టప్రమాణములు గనుక ఈయలేదు.

మిట్టపేరు వచ్చునేగాని ఏకశిలపేరురాదు. ఈ సంస్కృతనామమే అప్పుడా నగరమున నున్నయెడల ౧౦౦ పద్యములకు మించిన యీ శతకమునందు నొక్క చోటనైనను రాకుండునా! సంస్కృతపదములతోఁ గలిపి చెప్పవలసి వచ్చినప్పుడు కూడ 'ఒంటిమిట్ట పురనాథా!' 'ఒంటిమిట్ట రఘువీరా' అని సంబోధించునే గాని 'ఏకశిలారఘువీరా' అని యనఁడు. వృత్తభంగ మగుఁగానఁ జెప్పలేదందురేమో? వీరి మతమున "శిలాశైల" ము లొక్కటియే గదా "ఏక శైల రఘువీరా" యని యేల అనఁగూడదు. అదియుఁగాక యిమడ్చవలయు నన్నఁ గవి వృత్తములలో 'ఏకశిలా' శబ్ద మిమడ్చలేఁడా?

ఇతఁడు పోతనసమకాలికుఁడు. కావున నీసమకాలికవ్యతిరేకప్రమాణ మొంటిమిట్టవాదమునకు మూలకుఠారము వంటిది. ఒక సమకాలిక సమదేశిక కవి (వల్లభామాత్యుఁడు) ఓర్గంటిని ఏకశిలానగరమని పేర్కొనుటయు, వేఱొకసమకాలికుఁడును, ఒంటిమిట్టవాఁడును అగుకవి ఒంటిమిట్టను ఒంటిమిట్ట యనియే శతకమునం దంతటను పేర్కొనుటయు నొంటిమిట్టవాదమునకు రెండు వైపుల లాగు నురిత్రాడనియే చెప్పవలయును.

౨. క్రీ. శ. ౧౫౩౦ ప్రాంతము. రామాభ్యుదయము. ఆంధ్రకావ్యము అయ్యలరాజు రామభద్రప్రణీతము. ఈతఁడు కృష్ణరాయలయంత్యదశయందు నున్నవాఁడు. రామాభ్యుదయ కావ్యమునందు నాశ్వాసాంతమున 'శ్రీమదొంటిమెట్ట రఘువీరశతక నిర్మాణకర్మఠ జగదేకఖ్యాతిధుర్యాయ్యలరాజు తిప్పయ మనీషి పర్వతాభిధాన పౌత్ర...' యని గద్య-పద్యము కాదు- వ్రాసికొని యున్నాఁడు. ఆకాలమున నీయూరికి నేకశిలానగర మన్న అభిధాన మేయుండినయెడల శ్రీమత్ అను సంస్కృతపదమును, ఒంటిమెట్ట యను తెనుఁగు పేరుతోఁ గద్యయందు కూడ నేల కలుపును?

3. క్రీ. శ. ౧౫౫౫. ఒంటిమిట్టలోని శాసనము* సదాశివరాయలనాఁటిది. శా. శ. ౧౪౭౭. 'వొంటి మిట్ట శ్రీరఘునాయకులకు' 'వొంటి మిట్ట లోని' [Epi. Rep. No. 412 of 1911. Local Records Vol. 18. p. 321.]

౪. క్రీ. శ. ౧౫౫౮. ఒంటి మిట్టలోనిది. సదాశివ రాయలనాఁటిది. శా. శ. ౧౪౮౦ "వొంటి మిట్ట రఘునాయకులకు" "వంటిమెట్ట గ్రామమున్ను" [Epi. Rep. No. 411 of 1911 L. R. Vol. 18. p. 318.]

౫.* క్రీ. శ. ౧౫౫౯. గంగ పేరూరి శాసనము. వంటిమిట్ట రామస్వామికి గ్రామమిచ్చినట్లున్నది. ఏకశిలానగర మని లేదు. శా. శ. ౧౪౮౧ [Local Records Vol. 18. p. 26.]

౬. క్రీ. శ. ౧౫౬౦. ఒంటిమిట్టలోని తామ్రశాసనము. శా. శ. ౧౪౮౨ "వొంటిమెట్ట" [Local Records Vol. 18. p. 405.]

౭. క్రీ. శ. ౧౭౦౯. మట్లి అనంతరాజు శిలాశాసనము. 'వొంటిమిట్ట రఘునాయకుల' [Local Records Vol. 18. p. 326.]

౮. క్రీ. శ. ౧౭౯౧. చెన్నూరు సీనప్పతామ్రశాసనము. శా. శ. ౧౭౧౪ "వంటిమిట్ట" [Local Records Vol. 18. p. 406.]

---

* ఒంటిమిట్టలోఁ బెక్కు శాసనములు గలవు. వాని కన్నిటికి ౧౮౦౦ ప్రాంతముననే నకళ్లు వ్రాయించి, ప్రాచ్యలిఖితపుస్తకాలయమునందు నుంచినారు. ఈ గ్రామమునకు సంబంధించిన శాసనములనకళ్లు ౧౮ వ సంపుటమునందున్నవి. అవి ౧౬ వ శతాబ్దము మొదలు ౧౮ వ శతాబ్దము చివరవఱకుఁ గల కాలమును వ్యాపించును. అన్నిటిలో నీగ్రామనామ మొంటిమిట్ట యనియుండుసేగాని ఒక దానియందైనను ఏకశిలయని యుండదు. అందు స్పష్టముగ తేదులు తెలిసిన వానిని ౪ మొదలు ౮ వ ప్రమాణమువఱకు నిచ్చియున్నాము. ఇందు మొదటి రెండును ఎపిగ్రాఫీవారును సంగ్రహించిరి.

౯. క్రీ. శ. ౧౮౧౦. ప్రాంతము. ఒంటిమిట్ట కైఫీయతు. ఆగ్రామపు మునసబుల (రెడ్లు) కరణములచే వ్రాయఁబడినది.* ఇందు గ్రామోత్పత్తి మొదలైన విషయములన్నియుఁ జెప్పఁబడినవి. అందంతటను ఈ గ్రామమునకు ఒంటిమిట్టయన్న ఒక్క పేరే వాడఁబడుటయేగాక మాఱుపేరున్నట్టును చెప్పఁబడి యుండలేదు. ఇంతియ కాదు. ఒంటిమిట్టయన్న పేరు ఒంటుఁడు మిట్టుఁడు అను నిద్దరు బోయలవలన వచ్చినట్టు చెప్పఁబడినది. శిలవలనఁ గాని శైలమువలనఁ గాని వచ్చినట్టు లేదు. బమ్మెర పోతరాజు సమాచారములేదని వేఱుగఁ జెప్ప నక్కరలేదు. కావున మెకన్‌జీ కాలమున్న నీగ్రామమునకు నేకశిలానగర మన్న పేరున్నట్టుగాని, పోతన యున్నట్టుగాని ఈ గ్రామమునందు జనశ్రుతి లేదనుటకు నింతకంటె నేమిప్రమాణము కావలెను?

ఇట్లు పోతనకాలమునుండియు ౧౯ వ శతాబ్దమువఱకును ఈ గ్రామమున కెన్నఁడును ఏకశిలానగర మన్న పేరు లేదనుట స్పష్టము. "గ్రామమునకు రెండు పేళ్లున్నను ఒక్క పేరే ఉదాహరించిరి. అంతమాత్రమున రెండవ పేరు లేదని చెప్పఁగూడదు." అని ప్రతిపక్షు లనవచ్చును. ఒక్క స్థలమందయినయెడల రెండవ పేరుదాహరింపనంత మాత్రమున, అది లేదనుట సరిగాక పోవచ్చును. కాని ౧౧౫౦ మొదలు ౧౯ వ శతాబ్దమువఱకు వ్రాయఁబడి ఈ గ్రామనామము వచ్చిన యన్నిగ్రంథములలోను, శాసనములందును ఏకరీతిగ నొక్క పేరే యుండుటవలనను, ఎచ్చటను మాఱుపేరు కానరాకపోవుటవలనను-ఒరంగంటి కీరెండు పేళ్లును అభేదముగఁ గానవచ్చుటవలనను- ఇట్లన్వయవ్యతిరేకపరంపరలవలన, నీగ్రామమునకు నెప్పుడును ఒంటిమిట్ట యను ఒక్క పేరే యుండెనని మనము నిశ్చయింపక తప్పదు. ఇంతకంటె బలమైన వ్యతిరేక

* ఆ కాలమున నొక్కొక గ్రామమునకు నొక్కకరికంటెఁ బెక్కు కరణములును మునసబులును ఉండిరి. ఈ కైఫీయతు నల్గురు కరణములచేతను నల్గురు రెడ్లచేతను వ్రాసి యీయఁబడినది. [Oriental Ms. Library Book No. 15-4-33 L. R. 13]

ప్రమాణము మఱియొకటి యుండఁబోదు. ఇదియుఁ గాక యెన్నఁడును ఎవరును ఉపయోగింపని పేరున్నదని చెప్పి నేమిప్రయోజనము?

## నూతనప్రమాణము: క్రొత్తసృష్టి.

౧౯౧౯ నవంబరులోఁ బుట్టిన ప్రమాణము.

(ఈ) ఒంటిమిట్టకే యేకశిలానగర మన్న పేరుండెననుటకు నవ హేతువు క్రొత్తగ ౧౯౧౯ వ సంవత్సరము నవంబరు నెలలోఁ బుట్టినది! 'బమ్మెరపోతరాజు విజయము' న మొట్టమొదటఁ జూడఁజూపినది. అది యేదియన ఒంటిమిట్టి "దేవాలయమున వర్షాసమయమునఁ జెప్పఁబడు సంకల్పవిధానమున 'దండకారణ్యే ఏకశిలానగరే' యను వాక్యము తెలుపుచున్నది." (౯౨ వ పుట.)

ఈ వాదమునకై యిది క్రొత్తగఁ బుట్టిన హేతు వని చూపుటకు నొంటిమిట్టవారి వాదపరంపరలే సాక్ష్యము.

(౧) వావిలికొలను సుబ్బారావుగారి ప్రథమోపన్యాసము కడపలో ౧౯౧౭ ఏప్రిల్ లో నీయఁబడినది. అప్పుడచ్చట పరిషత్ వార్షికోత్సవమును జరిగెను. కొందఱు సభాసదులును సుబ్బారావుగారును ఒంటిమిట్టకు వెళ్లివచ్చిరి. ఒంటిమిట్టయందలి జనశ్రుతి మొదలయినవానినిగుఱించి కడపవారు సాక్ష్యమిచ్చిరి. ఈవ్యాసము పరిషత్పత్రికలో పింగళి సం॥ ఆషాఢ మాసానంతరమున (౧౯౧౭ జూలై) ప్రకటింపంబడియె. అందు ఈహేతువులేదు. వీరికి కడపవారికి ఒంటిమిట్టవారికి అప్పు డీహేతువు తెలియదన్నమాట తేలుచున్నది గదా?

(౨) వా. సు. గారి ౨ వ వ్యాసము ప. పత్రికలో ౧౯౧౮ మార్చి తరువాత ముద్రింపఁబడె. అందును ఈహేతువు లేదు.

(3) వీరి మూఁడవవ్యాసము ౧౯౧౮ శెప్టెంబరులో వెలువడె. అందును ఈమాట లేదు!

(౪) ౧౯౧౦ చివరనో ౧౯౧౧ ప్రారంభమందో వా. సు. గారు తమ వాదమునంతను సంగ్రహించి మధ్యవర్తుల యభిప్రాయమునకై యొక చిన్న పొత్తమును ప్రకటించిరి. అందును ఈ హేతువును కానము.

ఇన్ని సంవత్సరములును, ఇన్ని ఉపన్యాసములలోను లేని హేతువును నేఁడు వీరు బయటఁబెట్టిన నెవ్వరు నమ్మఁగలరు? ఇది యిన్ని దినములు వీరికిని, కడపవారికిని తెలియకుండుటెట్లో, నేఁడు బయటఁబడుట యెట్లో? కావున నిది యెన్నఁడును లేదనియు, వేఱు ప్రమాణము లేనందునఁ దమవాదమునకుఁ బూర్ణ పరాజయము కలిగినదని తెలిసికొని, ఒంటిమిట్టవారీ ప్రమాణాభాసమును నిర్మించుకొని రనుటకు సంశయము లేదు.

(౫) ఈ సంకల్పము క్రొత్తసృష్టి యనుటకు నింకను హేతువులుకలవు. పై పొత్తమునందే రెండుపుటలలో నీసంకల్పము రెండువిధముల నీయఁబడినది. పైని చూపినట్లు ౧౩ వ పుటలో 'దండకారణ్యే ఏకశిలానగరే' అనియు, ౪౫ పుటలో 'దండకారణ్యక్షేత్రే ఏకశిలానగరే' అనియు నున్నది. ఇట్లొక పొత్తమునందే రెండుచోట్ల రెండువిధములుగ నిచ్చుటచేతనే ఇందలి 'ఏకశిలానగరే' పదము నూతనసృష్టి యనుట స్పష్టము. ఇదివఱకు 'క్షేత్రే' యని యున్నది. మొదట నట్లు వ్రాసి దానికి 'నగరే' కల్పిరి. కాని తరువాత నాలోచింపగా 'క్షేత్రే,' 'నగరే' రెండు ఉండుటవలన దొంగతనము బయటుపడునని 'క్షేత్రే'ను అణచివేసిరి.

(౬) గ్రామనామము సంకల్పమందుఁ జెప్పు నాచార మెచ్చటనున్ను లేదు. సంధ్య యింకను వార్చుచున్నవారందఱును ఇందుకు సాక్ష్యము చెప్పఁగలరు. కాని యింగ్లీషు ప్రభుత్వములో వారు నవనాగరికులై సంధ్యమరచిరి గాన నీ మోసమును ఎవరును కనిపెట్టలేరని తలంచిరేమో! మేమింకను సంధ్య మానలేదు. కావున నీమోసము వెంటనే తెలిసికొంటిమి.

(౭) పోనిండు. క్షేత్రములోనైన గ్రామ, నగర, పట్టణ నామములను చెప్పుదురేమో యని తిరుపతి, అహోబలము, రామేశ్వరము మొదలయిన క్షేత్ర

ములకు వ్రాసి కనుఁగొంటిమి. ఎచ్చటను సంకల్పమందు ' నగరే ' ' గ్రామే ' ' పట్టణే ' యని రాదు.*

(౮) అట్లే, ' దండకారణ్యే ఏకశిలానగరే ' అనునవి పరస్పరవిరుద్ధపు మాటలు. ఏకకాలమందుఁ బుట్టఁదగినవి కావు. దండకారణ్యమందు గుడికట్టఁ బడెనందురా ' ఏకశిలానగర ' శబ్దంబు లెట్లు సంకల్పమునందు వచ్చును? నగర నిర్మాణానంతరమున సంకల్పము పుట్టినదందురా దండకారణ్య మెట్లు వచ్చును? వేఱువేఱు కాలములయందుఁ రెండువచ్చిన వందురా నిన్ననే ' ఏకశిలానగర ' మేల యందుఁ జేరియుండఁగూడదు?

(౯) వాదమునకై ' ఏకశిలానగరే ' యన్న శబ్దము ౧౯౧౯ కంటెఁ బూర్వమందున్న దన్న, ఎంతపూర్వము? ౧౮౮౮ కంటెఁ బూర్వముకూడ నుండె నని చూపినయెడలఁ గాని ప్రయోజనకారి కాదు. ఇప్పటి జనశ్రుతికంటె దీనికి నెప్పుడు యోగ్యత లేదు. ఇచ్చటి గుడిలోనిసంకల్పమందే ' ఏకశిలానగర ' మన్న పేరు వచ్చుచుండినయెడల ఈగుళ్లలో వేయఁబడిన శాసనములలో "వంటి మిట్ట" యని యేల వ్రాయఁబడియుండు? ఇట్టి ప్రబలహేతువులను బట్టి మన మిది 'పోర్జరి' యని నిర్ధారణ చేయవచ్చును.♦

---

* ఉదాహరణార్థము: తిరుపతి వేంకటేశ్వరస్వామివారి సన్నిధిని చదువఁబడు సంకల్పమును ఇందు నిచ్చుచున్నాము. "..........భరతవర్షే భరతఖండే మేరోః దక్షిణదిగ్భాగే శ్రీశైలస్య ఆగ్నేయప్రదేశే, కృష్ణాకావేర్యోః మధ్యదేశే దండకారణ్యే ఆదివరాహక్షేత్రే అస్మిన్ శ్రీవెంకటేశ్వరస్వామి సన్నిధౌ వ్యావహారిక చాంద్రమానేన..........తిథౌ". దీనితో ఒంటిమిట్టవారిచ్చిన సంకల్పమును పోల్చిచూచిన వారు క్షేత్రశబ్దమునకుఁ బూర్వమున్న పేరొకటి తీసివేసి "ఏకశిలానగరే" అను మాటలను క్రొత్తఁగ జేర్చిరనుట స్పష్టము.

♦ ఇట్లు కూటసృష్టిని నిర్భయముగఁ జేసి, ఎదటివారే కూటసృష్టికిఁ గర్త లని వాదించుట మగనిఁగొట్టి మొరపెట్టుకొనుటయే.

## భోనగిరి

ఈ యేకశిలానగరవాద ముపసంహరించుటకుఁ బూర్వము భోనగిరిని గుఱించి కొంత వ్రాయవలెను. తమవాదమునకు సహకారి గాకపోయినను, ఓరుగంటివాదమునకుఁ నష్టము గలుగునన్న భ్రమతో భోనగిరి యను గ్రామమునకుఁ గూడ 'ఏకశిలానగరము' అను పేరుండెనని ఒంటిమిట్టవాదు లొకయప్రయోజకప్రమాణముఁ జూపిరి. (సు. ప్ర. వ్యా. ౧౭౮ పుట.)

'సర్వోపనిషత్సార సంగ్రహ' మను తప్పులతడిక యగు సంస్కృత పుస్తక మొకటి సాహిత్యసభవారిసంగ్రహమునందుఁ గలదు. అది శా. శ. ౧౭౩౦ లో వ్రాయఁబడినట్టు దానిమీద నెవరో వ్రాసియుంచిరి. అందు "ఏకశిలానగరీ నామక భువనగిరి రితి పుణ్యక్షేత్రం ప్రసిద్ధం" అని యున్నది. ఈ వాక్యమునకు 'భువనగిరి యను గ్రామమునకు ఏకశిలానగరీ యను నామాంతరము కలద' ని అర్థము చేయవలయునఁట. కావున ౧౪-౧౫ వ శతాబ్దముల లోఁ బోతన ఓరుగంటిలో లేఁడఁట. ఒంటిమిట్టలో నున్నాఁడఁట! ఈతర్కము మాత్ర మపూర్వము. ఇందుకు జవాబు:—

(౧ పైసంస్కృతవాక్యమునకు ఏకశిలానగరమునకు భువనగిరి (ప్రపంచమందలి శ్రేష్ఠమైనగిరి) యన్న పేరున్నదని యేల యర్థము చేయఁగూడదు? ఇందువలన ఓరుగంటికి భువనగిరి యన్న పే రున్నదని తేలును. అట్లనుకొనక భువనగిరికి 'ఏకశిలానగరీ' యన్న మాఱుపే రున్నట్టు అర్థ మేల చేయవలెను? 'ఏకశిలానగరీ' అని యుండుటచే దీనిని విశేషముగ నెంచుటకు వీలులేదు. కాని 'భువనగిరి'నే విధేయముగ నేల యెంచఁగూడదు?

(౨) పోనిండు. మీరు చెప్పిన ట్లర్థము చేసినను 'భువనగిరి' భోనగిరి ఒక్కటని, బమ్మెరబొమ్మెరలు, భిన్నము లనుచున్న మీ శేముఖముతో- జెప్పఁ గలరు?

(3) పోనిండు. అదియు నొప్పుకొన్నను, శా. శ. ౧౭౩౦ లో నఁగా క్రీ. శ. ౧౮౦౮ లో వ్రాయఁబడిన గ్రంథము ౧౫ వ శతాబ్దములో భోనగిరి

కీ పేరుండెనని యెట్లు స్థాపింపఁగలము? సమకాలికప్రమాణముల నెట్లు ఖండింపఁగలము? ఈ గ్రంథముయొక్క యోగ్యత యెట్టిదైనను, ౧౫ వ శతాబ్దమున కొందఱు భువనగిరికి ఏకశిలానగరమన్న పేరున్న దని యనుకొనిరి. అన్నదానికంటె దీనికి నధికప్రామాణ్య మెట్లు ప్రాప్తించును? ఊరుపేరు లేని యొకానొకటి యీ పదిపత్రముల పిచ్చి సంస్కృతపు పొత్తము ౧౪ వ శతాబ్దమునందలి ప్రతాపరుద్రీయముకంటెను ౧౫ వ శతాబ్దమునందలి క్రీడాభిరామముకంటెను, అప్పటి రాజశాసనములకంటెను, ఎక్కుడుప్రమాణ మగునా?

(౪) ఒకవేళ నేకసమయమందు రెండు గ్రామములకు నొక్కనామమే యుండెనని వాదమున్నకై యెంచినను, అన్యప్రమాణము లేనియెడల నందలి యధికప్రఖ్యాతి గలవానినే గ్రహింపవలెననుట స్పష్టము. ౧౯ వ శతాబ్దమున నొకఁడు "నేను చెన్నపట్టణమున గ్రంథము వ్రాసితిని" అని యన్నయెడల నా "చెన్నపట్టణము" మద్రాస్ అనియే గ్రహింపవలెను. 'కాదు-చెన్నపట్టణమను పల్లె మాయూరియొద్ద నున్నది. అదే యిది-మద్రాస్ కాదు' అని యాక్షేపించు నధికారము అందఱకుఁ గలదు. లేదని మేము చెప్పము. కాని అట్లాక్షేపించు వారిపై అట్టి పేరుగల యూ రొకటి తమ గ్రామమునొద్ద ౧౯ వ శతాబ్దమున నుండెనని రుజువుచేయుభార ముండు నని మాత్రము మఱవఁగూడదు. ఇంతియు కాదు. అందే యాగ్రంథకర్త యుండెనని కూడ రుజువుచేయవలెను. ఈ రెంటిలో నేది రుజువుచేయకపోయినను వానివాదము పోయినట్టే. కావున ౧౪-౧౫ శతాబ్దములలో భోనగిరికి 'ఏకశిలానగర' మన్న పేరున్నట్టును, అందు పోతన భాగవతము వ్రాసినట్టును ఎవరైనఁ జూపినఁగాని ఆవాదము ఓరుగంటి కడ్డము రాఁజాలదు. అంతవఱకు నోరుగంటివాదులు వేఱుగ జవాబుచెప్ప నక్కరలేదు. జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జందె మేమిటన్నట్టు, ఓరుగంటికి నేకశిలానగర మన్న పేరుండుట లోకప్రసిద్ధము. ఆవిషయమై యితరగ్రామములవారు మాతో స్పర్ధించుట 'మెఱుగుడుపురుగు సూర్యునితో స్పర్ధించుటయే?

## నేటి జనశ్రుతి.

ఇ ట్లొంటిమిట్టకుఁగాని, భోనగిరికిఁగాని పోతనకాలమున నేకశిలానగర మన్న పే రుండుట కల్ల యని తేలినందున భాగవతమందుఁ జేర్పఁబడిన 'ఏకశిలానగర' మీ రెంటిలో నేదియైన నొకటి యన్నమాటయుఁ గల్లయయ్యె.

ఇక బమ్మెరపోతరా జొంటిమిట్టలోఁ గాపురముండెననుటకు వీరి కేమి యాధారములున్నవో చూతము. ఇందుకు వారికి జనశ్రుతి తప్ప వేరు అధారము లేవియులేవు. దానినే వీరు చిన్నెలు వన్నెలతోఁ బలుదెఱంగులఁ జెప్పుచుందురు.

### జనశ్రుతిస్వభావము.

ఏ ప్రమాణము లేనప్పుడు జనశ్రుతి ప్రమాణముగఁ దీసికొనవచ్చును. అది కడగొట్టుప్రమాణ మని మాత్రము మరవఁగూడదు. కాని యది యనన్య సామాన్యమయినదిగను, చిరకాలాగతమయినదిగను నుండవలెను. ఒంటిమిట్ట వారి జనశ్రుతికి నీరెండు లక్షణములును పట్టవు. ఇయ్యది ఈ గ్రామమునకు ననన్యసామాన్యము కాదు. అనఁగా నొక యీ యూరికి మాత్రమే లేదు. మఱి యొక యూరికిగూడ, బొమ్మెరకుఁ గూడఁ గలదు. ఒక్క జనశ్రుతి ప్రమాణ మునే తీసికొనినయెడల రెండును సమానము లయినవి. కావున నిచ్చటనే యుండెననిగాని, అచ్చటనే యుండెననిగాని చెప్పుటకు వీలుండదు. ఒంటిమిట్ట వాదులకు జనశ్రుతి తప్ప వేఱుప్రమాణ విషయమును గుఱించినది లేదు గాన వారి వాదము నిరాధారమైనది.

### ఈ జనశ్రుతి యెంతపురాతనము ?

జనశ్రుతినే నమ్మి మఱి యేయాధారములు లేకయే వాదించు ఒంటిమిట్ట వారి జనశ్రుతియైనను ఎంత పురాతనమో చూతము. ఎటుబోయి వీరికిఁ బురాతనములోఁ బురాతనప్రమాణము హయగ్రీవశాస్త్రిగారి "పుట్టునొట్టు." దీనిని బట్టియే జనశ్రుతి కలిగినదని మేమనుచున్నాము. 'కాదు కాదు. జనశ్రుతియే దీనికిఁగారణ' మని వారనుచున్నారు. కాని ౧౮౭౪ కిఁ బూర్వ మీజనశ్రుతి

యున్నట్లు వారే ప్రమాణమును చూపియుండలేదు. ఈ జనశ్రుతి ౧౮౭౮ కి పూర్వము లేనట్లు మేము ఎన్నియో ప్రమాణములఁ జూపియున్నారము. వానిలో ఒంటిమిట్ట కైఫీయతు అనునది యీ కాలమునకు సన్నిహితమైనది. ఇది ౧౮౦౦ ప్రాంతమున, ఒంటిమిట్ట కరణములచేతను, రెడ్లచేతను వ్రాయఁబడినది ఆకాలముననీజనశ్రుతియే యున్నయెడల నా గ్రామకరణములకు మునసబులకుఁ దెలిసియుండదా? పిచ్చిగాథలన్నియుఁ జెప్పువారు దీనిని జెప్పకపోవుదురా? చిన్నపల్లెలో నలుగురు కరణములకు, నలుగురు రెడ్లకుఁ (మునసబులకుఁ) దెలియనిది అది యెట్టి జనశ్రుతి? ఒంటిమిట్టవారల మనశ్శ్రుతియే గాని జనశ్రుతి కాదు. కావున నా కాలమున జనశ్రుతి లేక యుండుట నిజము ఇట్లు ఇటీవలి జనశ్రుతికి హయగ్రీవశాస్త్రిగారి వ్రాతయే కారణ మనుట స్పష్టమయ్యె.

## జనశ్రుతికి మాఱువేషములు

ఒక నీజనశ్రుతికి నొంటిమిట్టవారు వేఱువేఱు వేషములు వేసి హేతు ప్రమాణసంఖ్యను ఎక్కించు విధమును, ఆ జనశ్రుతికిని, బొమ్మెరజనశ్రుతికిని గల పోలికను భేదమును చూతము. ఒంటిమిట్టవారు విజయభేరీఘోషలో నిట్లు చెప్పిరి.

" బమ్మెరపోతరా జొంటిమిట్టయం దుండెననుటకు నాధారములు (౧)హయగ్రీవశాస్త్రిసముద్ధృత ప్రాచీన పండిత లిఖితగ్రంథవిషయము లొంటిమిట్ట విషయమునకే సార్థకమై యుండుటయు, నందలి విషయము లోరుగంటికి నన్వయింపకపోవుటయు, మాతృక యిప్పుడు కానరామి నిది ప్రమాణము గా దనుట సరిగాదు.

"(౨) పోతన్న మడులయునికి.

"(౩) పోతరాజు బంధువులయునికి.

"(౪) పోతరాజునకుఁ బ్రత్యక్షమైన కోదండరాముల యునికి.

"(౫) పోతరాజువిగ్రహము నునికి.

ర

"(౬) పోతరాజ ప్రయుక్తకోసగ మిత్యాది పదములు కడప మండల
"(౭) ఆంధ్రదేశమందలి చిరకాల జనశ్రుతి. [మందలి యునికి.
"(౮) ఒంటిమిట్ట కోవెల మర్యాదలందుఁ బోతనభాగవతమునకుఁ దాంబూలమర్యాద." (౯౩ పుట)

## ఇంకొక నూతనసృష్టి

ఇందలి (౬) ఆఱవది తప్ప మిగిలినవన్నియు జనశ్రుతికి మాఱువేషములు. వానిలో (౮) ఎనిమిదవ హేతువు నూతనసృష్టి యని నొక్కివక్కాణింప వలెను. ఇదివఱకు సుబ్బారావుగారీ హేతువును గుఱించి వ్రాసిన యే వ్యాసమునందును దీనిని ఉదాహరింపలేదు. నేఁడు ౧౯౧౯ నవంబరులోఁ బుట్టుకొనివచ్చినది! నేఁటివఱకు సుబ్బారావుగారీహేతువును తెలిసి చెప్పలేదా? తెలియక చెప్పలేదా? ఈ ప్రశ్న వారికి నుభయతస్పాశారజ్జువు.

## పేరులేని గ్రంథమునకు పేరులేని గ్రంథమే జవాబు

ఇఁక మిగిలిన హేతువులను గుఱించి విచారింతము:—

(౧) శాస్త్రిగారి వ్రాత వొంటిమిట్టకే యన్వయించునఁట. పోతరాజు చిన్ననాఁడు పశువులఁ గాయుట మొదలయిన కథలను గుఱించియా యీమాట? అట్లయిన దిబ్బలుగాని, గుట్టలుగాని గల ప్రతిగ్రామమునకును ఈ కథలన్నిటిని అన్వయింపవచ్చును. గుట్టలు, గుహలుగల ఓరుగంటి కేల యన్వయింపవు? ఒంటిమిట్టకే యన్వయించుననుట కిందు విశేషమేమియు లేదు. లేక క్రింది "ఫుట్టునోటు"ను గుఱించియా యీమాట? అట్లేని యది ప్రాచీన పండిత లిఖితములలోనిది కాదని యందలి 'చెన్నపట్టణము,' బాట,"మజిలీ"లే చెప్పుచున్నవి. "ఫుట్టునోటు" యోగ్యతయుఁ బైని చర్చింపఁబడినది. ఇఁక నా శాస్త్రిగారికి సాధారమైన గ్రంథము పేరైన వారు చెప్పకపోయినను, ఆ గ్రంథ మిప్పుడు మనకుఁ గనఁబడకపోయినను, దాని ప్రామాణ్యమును పరీక్షించుటకు వీలులేకపోయినను దానిని మనము పరమప్రమాణముగ గ్రహింపవలెనఁట!

పేరు నూరుం దెలియని గ్రంథమును, ఏకాలమున నెవరిచే వ్రాయఁబడినది తెలియని గ్రంథమును పరమప్రమాణముగ నెంచవలసినయెడల నోరుగంటివారములకు నిట్టిదే యొకటిగలదు. దానిని మీరు నమ్మరాదు. రామయ్యగారి ప్రథమోపన్యాసమందలి అనుబంధములో ఎల్లంభట్ల రామకృష్ణశాస్త్రులు గారు "ఏకశిలానగరంబునకు దక్షిణభాగంబున కనతిదూరంబున బొమ్మెర యనే గ్రామంబున పోతరాజుగారు' అని యేదో వక గ్రంథం చూచినట్టు జ్ఞాపకము కలదు" అని వ్రాసినారు ఇంకేమి కావలయును? ఊరు పేరులేని మీ పురాతనగ్రంథమునకు నూరు పేరులేని యీ పురాతనగ్రంథమే జవాబు! నిజముగాఁ జూడ నిట్టి యోగ్యతాశాలిన ప్రమాణములను ఉదాహరించుటయు, వానిని ఆక్షేపించిన యెడలఁ గతు పెంచుటయుఁ గడు శోచనీయము.

## ఏ పోతరాజు

(౨) పోతన్నమడులు ఒంటిమిట్టలో నున్నవఁట. గ్రామములోఁ 'బోతరాజుమడులు' అందురేగాని 'బమ్మెర పోతరాజుమడులు' అని యనరు. "భాగవతము వ్రాసిన బమ్మెరపోతరాజుమడులు" అని అసలనరు. ఇఁక నీపోతరాజెవఁడో తెలిసికొనుట యెట్లు? తెనుఁగుదేశమందు 'పోతరాజు' అని గ్రామదేవత యుండుటయు, నాదేవత పేర పెక్కుగ్రామములలో పొలములపే రుండుటయు నందరెఱిఁగినవిషయమే. ముత్తేలమ్మపొలము, పోతరాజుపొలము ఇత్యాదినామము లాంధ్రులకుఁ జిరపరిచితములే. కావున గ్రామమునఁ బోతరాజుమడు లున్నంతమాత్రమున భాగవతకర్తయే యాపొలము దున్నెననియు అప్పటినుండి ఆపేరట్లే వచ్చుచున్నదనియుఁ దలంపవలసినయెడలఁ బోతరాజెన్ని గ్రామములందైనను ఉండవలసివచ్చును.

స్పష్టముగ భాగవతకర్తచే వ్రాయఁబడినవి యని యున్న వీరభద్రవిజయాదిగ్రంథములే యతనివి కావని వాదించు వీరు 'పోతరాజు మడులు' అన్నమాటలో భాగవతకర్త యా గ్రామమునందుఁ బుట్టి పెరిగెనన్న చరిత్రమంతయు నున్నదని చెప్పుట వినోదకరము!

పోటీకిఁ బోటీ కావలయునన్న, బొమ్మెరలోను పోతరాజుమడు లున్నవి. ఆమడులు ఈమడులు ద్వంద్వయుద్ధము చేసికొనుఁగాక.

ఇట్టి ప్రమాణము లెవరివాదమునకును నుపయోగించునవి కావని మా తాత్పర్యము.

### ఏవీ పోతరాజు బంధువులు?

(3) పోతరాజుబంధువులయునికి. ఎవరీబంధువులు? వీరియూరేది? పేరేమి? ఇంతరహస్యమేల? ౫౦౦ ల యేండ్లక్రింద నున్న పోతరాజుయొక్క బంధువు లిప్పుడుండుట యెట్లు సంభవించును? పోతనవంశమువారిబంధువు లని కాఁబోలు వీరి తాత్పర్యము! ఒంటిమిట్టలో నొక ముసలమ్మ యున్నదఁట. ఆమె తన మేనమామలు పోతనవంశమువా రని చెప్పుచుండెనఁట. ఎవ రాముసలమ్మ? ఆమె పేరేమి? ఆమె మేనమామ లెవరు? వారెక్కడ నున్నారు? ఇవన్నియు రహస్యముగను, గుట్టుగను నేఁటివఱకు దాఁచియుంచుట యేల? ఇట్లు పేరూరులయంతు చిక్కనీయకుండ, ఒంటిమిట్టలోని యొక ముసలమ్మ, తన మేనమామలు పోతరాజువంశమువా రని చెప్పుచుండె- అని సోది చెప్పి నట్టు చెప్పిన నది ప్రమాణమగునా? ఇట్లు ముసలమ్మ పేరు, ఆమె మేనమామల పేళ్లు రహస్యముగ రక్షింపఁబడుటవలన నిది యంతయు మిథ్య యని ప్రపంచము తీర్మానించుకొన నక్కఱలేదా?

నిజముగఁ బోతనవంశమువా రుండిన, వా రందఱును పూజ్యులు. వారిని అందఱకుఁ దెల్పక దాఁచి యుంచువా రుందురా?

ఇట్టి సందర్భముననే ఓరుగంటివాదు లెంత నిష్కపటముగను, స్పష్టముగను, 'ఇదుగో వీరు, తామును, పోతనయు ఒకవంశమువారమే యని అనుచున్నారు' అని చెప్పి గోత్రనామములతోఁ బురుషులఁ జూపించిరి. చూచితిరా? ఓరుగంటిజనశ్రుతికిని, ఓరుగంటివాదుల ప్రవర్తనమునకును, ఒంటిమిట్టవారి జనశ్రుతికిని, ప్రవర్తనమునకును గల తారతమ్యము? ఇట్టివిషయమున

ఓరుగంటివారి వాదము నిర్భయముగను బహిరంగముగను వచ్చినది. ఒంటిమిట్ట వాదులది భయపడుచు, తడఁబడుచు, అసలువారిని చూపక దాఁచిపెట్టివచ్చినది అనియు స్పష్టముగఁ గనఁబడుచున్నది.

వాదకంపము

(౪) పోతరాజునకుఁ బ్రత్యక్షమైన కోదండరాముల యునికి! ఏ మేమీ? పోతనకుఁ బ్రత్యక్షమైన రాములను కనే; ఇంకొక రాముఁడు కాఁడు అని ఒంటిమిట్టిలోని ప్రతిమ గారా యూరివారికిఁ జెప్పుచుండెను గాఁబోలును?

దీనిని హేతువుగ నిచ్చుట యొకగొప్ప హేత్వాభాసము (Fallacy). సాధ్యమునే (సాధింపవలసినదానినే) హేతువుగఁ జెప్పుట. దీనినే యింగ్లీషులో (Pelitio Principle) అందురు. 'పోతరాజునకుఁ బ్రత్యక్షమైన రాముఁడు ఒంటిమిట్టవాఁడే. ఇంకొక గ్రామమువాఁడు కాఁడు' అన్నది సాధ్యము (సాధింపవలసినది) గాక సిద్ధమైన (ఋజువు అయిన) హేతువే అగు గాని ఈవాద మెట్లు పుట్టును? వాదము వచ్చినదే దానికొఱకు. మీ రగు ననుచున్నారు; మేము లేదనుచున్నారము. కావున దానినే హేతువుగ నిచ్చిన 'పోతరాజు ఒంటిమిట్టవాఁడు; ఒంటిమిట్టవాఁడు గనుక.' అన్నవాదమువంటిదే యగును. పోతన నివాసస్థల మెద్ది? అతఁ డంకిత మిచ్చినరాముఁ డెక్కడివాఁడు? అనునదియే చర్చావిషయము. దానినే మాఱుమాటలతో హేతువుగ నీయవచ్చునా?

రాతిదేవుఁడు కాఁడు

ఇదియుఁ గాక పోతరాజునకుఁ బ్రత్యక్షమైన కోదండరాము లొంటిమిట్టలో నున్నవాఁడే యనుటలో నర్థ మేమి? పోతనకు 'రామభద్రుఁడు' కానిపించినది గంగయొడ్డున. గంగ యెక్కడిదైనను కానిండు. ఎక్కడివాఁడైనను రామభద్రుఁ డొక్కఁడే యుందురా, కానిపించినవాఁ డొంటిమిట్టవాఁడే యనుటయందు నర్థము లేదు. ఒంటిమిట్టవాఁడువాఁడే, భద్రాద్రివాఁడు వాఁడే,

మఱి యింకొకచోటివాఁడు వాఁడే. లేదా, రాములగుడి యుండు నొక్కొక్క గ్రామములోని రాముఁడు వేఱువేఱుందురా? ఒంటిమిట్టిలోని విగ్రహము గంగయొద్దున నెట్లు కనఁబడుట సంభవించును? ఈ విగ్రహ మచ్చటికి నడచి వెడలెనా?

భాగవతమునఁ బోతన తనకుఁ గాన్పించిన రామభద్రునకు మూపునవిల్లుండె నని చెప్పెను. ఒంటిమిట్టిలోని రామునకు అనఁగా విగ్రహమునకు మూపున విల్లున్నది. కావునఁ బోతనకుఁ బ్రత్యక్షమైన రాముఁడు ఒంటిమిట్టవాఁడే యని వీరి యపూర్వపూర్వపక్షమైనట్లు కానవచ్చుచున్నది!

వీరి ఈ యపూర్వసిద్ధాంతమునే ఒప్పుకొన్నయెడలఁ దెనుఁగు కవులెచ్చట రాముని ధనుర్ధరునిగ వర్ణించినను అది ఒంటిమిట్ట కోదండరాముని గుఱించిన వర్ణనముగనే యెంచవలెను!

తెనుఁగుదేశమునందుఁ గోదండరామస్వామి విగ్రహములు గల గ్రామములు వందలకొలఁది నున్నవి. ఆ గ్రామము లన్నిటియందును పోతన యుండెనని అనుకొన నక్కఱలేదా? ఇట్లతివ్యాప్తిదోషభూయిష్ఠమైన హేతువును చెప్పుటవలన నేమి ప్రయోజనము?

పోతనకుఁ గలలోఁ గనఁబడినవాఁడు ఒంటిమిట్ట కోదండరామస్వామి యనువారి యుద్దేశ మేమి? అతనికి రాతివిగ్రహము కనఁబడె ననియా? పురుషాకారముఁ గలిగి మాటలాడఁ గలిగిన 'రాజముఖ్యుఁడు' కనఁబడె నని భాగవతమునం దున్నదే గాని మూగగ నుండిన పొట్టిశిలావిగ్రహము కనఁబడె నని లేదు. ఒంటిమిట్టలో రాములగుడి యున్నంతమాత్రమునను, భాగవతము రామునికంకితము చేసినంతమాత్రమునను పోతనా జొంటిమిట్టవాఁడని యనుకొనవలసినయెడల భాగవతమునందు వస్త్వంతము లన్నియుఁ గృష్ణపరముగ నుండుటయు, ఓరుగంటిలో గోపాలకృష్ణునిగుడి యుండుటయు మన మెఱుఁగుదుము గనుక ఆ గోపాలకృష్ణునకే అంకిత మిచ్చె నని యేల యనఁగూడదు!

ఇంతను నిట్టి యుక్తుల నటుండనిచ్చి, భాగవతమును చదివినయెడల, భాగవతకృతిభర్త ఒకానొక విశిష్టనామము గల గళ్లో రాతిదేవుఁడుగఁ గాన రాఁడు. రాముఁడు, కృష్ణుఁడు, విష్ణువు అను దేవతల కభేదముగ సంకితము కానవచ్చుచున్నది రాముఁడు తన కంకిత మిమ్మని యడుగ షష్ఠ్యంతములు కృష్ణునకీయఁబడినవి. కొన్ని ఆశ్వాసాంతపద్యములలో విష్ణువు సంబోధింపఁబడెను.

గుడిలోని రాతి విగ్రహమునెదుటఁ గూర్చుండి పోతరాజు భాగవతము వ్రాయలేదనియు, మనస్సులో నీశ్వరసన్నిధానముఁ గల్పించుకొని యింటఁగూర్చుండియే వ్రాసె ననియు, నాంధ్రభాగవతమందలి యీక్రింది వాక్యములవలన స్పష్టపడుచున్నది. "నేను నాచిత్తంబున శ్రీరామచంద్రుని సన్నిధానంబుఁ గల్పించుకొని, ఉ॥ హారికి నందగోకులవిహారికి......గోపికా నివహమందవిహారికి శేషశాయికిన్॥ సమర్పితంబుగా నే నాంధ్రంబున రచియింపఁ బూనిన శ్రీమహాభాగవతపురాణంబునకుం గథాప్రారంభం బెట్టిదనిన."

దేవుని సన్నిధానంబునందే యున్నవాఁడు మరలఁ జిత్తంబున నాదేవుని సన్నిధానము కల్పనచేసికొనుట యెందుకు? ఇందువలన నా భగవద్భక్తుఁడు కృతి యిచ్చినది మనోమయుఁడగు సర్వేశ్వరునకుఁగాని శిలామయుఁ డగు సుబ్బారావుగారిదేవునకుఁ గా దనుట నిశ్చయము. తిక్కనయు నిట్లే దేవుని సన్నిధానము కల్పించుకొనెను. ఇంకను భగవద్భక్తులెందరో తామున్నచోటనే ఈశ్వరసన్నిధానము కల్పించుకొనిరి. అవి యట్లుండె.

(౫) పోతరాజు విగ్రహమునునికి! ఒంటిమిట్టలో నొక విగ్రహ మున్న బొమ్మెరలో నింకొకటి యున్నది. మీయెక్కువయేమి? ఈ విగ్రహములు భాగవతము వ్రాసిన పోతరాజువియే యని యితర ప్రమాణములవల్లఁ దెలిసెఁ గాని యవి స్వతంత్రప్రమాణకోటిలోఁ జేరలేవు. అంతవఱకు జనశ్రుతికంటె వానికి నెక్కుడుయోగ్యత లేదు. ఇదియుఁగాక సుబ్బారావుగారు చెప్పెడి ఒంటిమిట్టలోని పోతనదియను విగ్రహము పోతనది కాదనియు, వేదాంతదేశికు లదియనియు నచ్చటి పూజారియె చెప్పినట్లు రామయ్యగారు వ్రాసియున్నారు. [రా. ద్వి. వ్యా. ౩౭౫] ఇం కేమున్నది! ఆ జనశ్రుతి కూడఁ బోయెను!

(౬) కోసరాదిశబ్దము లోకకడపమండలమువారి సొత్తే కాదు. కావున నదియు నతివ్యాప్తికి లోఁబడినహేతువు.

(౭) ఏడవహేతువు 'ఆంధ్రదేశమందలి చిరకాలజనశ్రుతి' యఁట! కోటలుదాటునట్టి యిట్టిమాటలు వ్రాయుటవలననే వాదము గెలియునట్టయిన నింకేమి కావలయును? 'ఈ చిరకాలము' ఒంటిమిట్ట కైఫీయతుతో 'అచిర'-మయ్యెఁగదా? ఇఁక వీరు ౧౮౪౮ కిఁ బూర్వమందీజనశ్రుతి యున్నట్టు చూపినఁగదా జవాబు చెప్పవలెను. ౧౮౦౦ లో జనశ్రుతి ఒంటిమిట్టలోనే లేకపోయిన నింకొకచోట నెట్లుండు? ఆంధ్రదేశమందంతట నుండెనని యెవరు నమ్మెదరు?

ఒంటిమిట్ట 'ఏకశిల' యెట్లగును?

'ఏకశిల' అనునది 'ఓరుగల్లు' అను పదమునకు సరియైన సంస్కృతము కాని "ఒంటిమిట్ట"కుఁ గాదు. 'ఒంటిమిట్ట'కు 'ఏకశైల' లేక 'ఏకపర్వత' అనునవి సంస్కృతరూపము లగును. కావున నొంటిమిట్టవారి వాదము శబ్దస్వరూపమునుబట్టియే అసందర్భముగ నున్నదని ఖండింపగా, ఒంటిమిట్టవాదులు 'శిలా శైల' శబ్దంబులు సమానార్థకంబు లని జవాబు చెప్పిరి! మాటకు మఱియొకమాట చెప్పినఁ బ్రత్యుత్తర మని వీరి తాత్పర్యము. "తాటిచె ట్టెందుకు నెక్కితివిరా? అనఁగా దూడగడ్డికొఱకు—" అనునది వీరి వాదధోరణి. ఒంటిమిట్టవారు చెప్పిన ఈజవాబులో రెండసత్యములు, రెండు మోసములు, రెండు అజ్ఞానములు కలవు:—

(1) శిలాశైల శబ్దములు సమానార్థకము లని, సంస్కృతమునందు ఓనమాలు రానివాఁడు చెప్పనే గాని మఱియొకఁడు చెప్పఁడు. తిలతైలంబు లెప్పుడు సమానార్థకము లగునో అప్పుడు శిలాశైలంబు లేకార్థకంబు లగును. అంతవఱకుఁ గావు. 'శిలా' శబ్దమునకు 'అణ్' ప్రత్యయమువచ్చి, 'శైల' మయ్యె. శిలలు కలది శైలము. ఇందుకుఁ బ్రమాణము:—

(౧) "శైల—శిలాః సన్తి అస్య(ప్రజ్ఞా. అణ్ పర్వతే."

"శిలా—పాషాణే"—వాచస్పత్యము.

(౨) "శైలః పుం. శిలాః సన్త్యస్యేతి. శిలా + జ్యోత్
స్నాదిత్వా దణ్ పర్వతః"—శబ్దకల్పద్రుమము.

(౩) మహీధ్రే శిఖరి క్ష్మాభృ దహార్య ధరపర్వతాః ।
అద్రి గోత్ర గిరి గ్రావాచల శైల శిలోచ్చయాః ॥
"పాషాణప్రస్తర గ్రావోపలాశ్మానః శిలా దృషత్"—ఇత్యమరః.

ఇట్లు మహామహాకోశములు శిల యనఁగా పాషాణ మనియు, శైల మనఁగా పర్వత మనియుఁ గంఠోక్తముగఁ జెప్ప వాని వ్యుత్పత్తిఁ జెప్పుచుండఁ 'శిల'యు, నందుండి పుట్టిన 'శైల' శబ్దమును సమానార్థకము లని సంస్కృతమున మహాపండితు లగు సుబ్బారావుగారు తప్ప మఱియెవ్వరును చెప్ప సాహసింపరు. వ్యర్థమైన అర్థాంతరమును చెప్పునట్టి యిట్టి యసత్యవాక్యములవలన వాదము గెలుచునని తలంచుట పండితలక్షణమా? పామరలక్షణమా?

(2) వాదసౌకర్యమునకై 'శిలా' 'శైల' శబ్దములు సమానార్థకము లని అనుకొన్నను ఇప్పటివాదముతోఁ దాని కేమి సంబంధము? "మిట్ట" అను తెనుఁగు పదమునకు "శిల" అను సంస్కృతపదము సమానార్థక మని చూప వలయును గదా. ఈ ఒంటిమిట్టవాదులు అట్లు చూపలేక పోయినందున, ఆ మాట తప్పించి 'శిలాశైల' శబ్దములు సమానార్థకము లని సంబంధములేని మాట చెప్పుట, కనుకట్టువిద్య యగునే గాని నిజమైన జవాబు కాదు. 'శిలాశైల'ము లేక మంటిరి: సరే. ఏ యర్థమందు? పాషాణార్థమందా? పర్వతార్థమందా? లేక మీవాదప్రకారము పర్వతపాషాణములకుఁ గూడ నర్థమందు, అనుభవమందుఁ గూడ భేదము లేదా? 'శిలాశైల'ము లేకార్థము లన్నందున మీ వాదము గెలువదు: 'మిట్ట' అన్న అర్థమందు శిలాశైలము లేకార్థము లని చూపుటవలన గెలుచును. అట్లు మీరు చేయలేదు. ఏకోశములును చెప్పుటలేదు. వ్యుత్పత్తికి విరుద్ధము. అర్థమునకు విరుద్ధము. మీమాటే నిజమేని 'శ్రీశైల'మునకు 'శ్రీశిల' అనియు, "దుబ్బరాతి"ని 'దుబ్బశైల' మనియుఁ జెప్పవలెను.

---

# లక్ష్మణరాయ వ్యాసావళి

## భాషా విషయములు

---

### 'త్రిలింగము'నుండి 'తెలుఁగు' పుట్టెనా?
### లేక
### 'తెలుఁగు'నుండి 'త్రిలింగము' పుట్టెనా? *

ఇదివఱకు సాధారణముగా గ్రంథకారు లందఱును 'త్రిలింగ'శబ్దమునుండి తెలుఁగుశబ్దము పుట్టిన దని వ్రాయుచున్నారు. శ్రీశైలము, కాళేశ్వరము, ద్రాక్షారామము అను స్థలములందుఁ గల మూఁడు లింగములకు నడుమ 'తెలుఁగు' దేశ మున్నందున దానికి 'త్రిలింగ' దేశ మని పేరు వచ్చెనఁట. 'త్రిలింగమే' 'తెలుఁగు'గా మాఱెనఁట. 'తెలుఁగే' 'తెనుఁ'గయ్యెనఁట. 'తెలుఁగు' గ్రంథకారులంద ఱిట్లు ఒక్కపాఠమునే పాడుచున్నారు. కాని దీనిసత్యాసత్యతలు చక్కఁగఁ బరిశీలించినవారు కారు.

'త్రిలింగ'మను పదము మొదట లేదనియు, 'తెలుఁ'గనుపదమే మొదటినుండియు వాడుకలో నుండె ననియు, ఇటీవలి సంస్కృత పండితులు 'తెలుఁగు' అను ఆంధ్ర పదమునకు సమానోచ్చారణ గల సంస్కృతపదముగా నుండవలయు నని 'త్రిలింగ'పదమును నూతనముగా నిర్మించి రని నా యభిప్రాయము. బందరు పురమునకు బృందావనపుర మనియు, బెజవాడకు విజయ

---

* 'ఆంధ్రపత్రిక'- మొదటి సంవత్సరాదిసంచిక (౧౯౧౦). పుట ౮౧.

వాడ యనియు, కమ్మంమెట్టుకు స్తంభపుర మనియు ప్రౌఢనామములు నూతనముగ కల్పింపఁబడుట మన మెఱింగిన విషయమే. అట్టిదే ఈ 'త్రిలింగ' శబ్దము. పదునొకండవ శతాబ్దమునందు అనఁగా నన్నయభట్టు కాలమున ఈ శబ్దము వాడుకలో లేదు. ఇందుకు 'తెలుఁగు' మహాభారతమే సాక్షి. అందు 'ఆంధ్ర', 'తెలుఁగు', 'తెనుఁగు', 'వేఁగినాడు', అను పదములే యుపయోగింపఁబడినవి కాని, 'త్రిలింగ' పదము భాష యను నర్థంబునందు గాని, దేశ మను నర్థంబునందుఁ గాని వాడఁబడి యుండలేదు. తిక్కనకాలమునందును ఈ పదము వాడుకలో నున్నట్టు కానఁబడదు. తిక్కనగాని ఆతని సమకాలికులగు కేతనాదులుగాని 'త్రిలింగ' శబ్దమును ఉపయోగించియుండలేదు. కావున ఆ కాలమం దీశబ్దము పుట్టలేదని మన మూహింపవలసియున్నది. అట్లయిన ఈ శబ్ద మెవ్వరిచే మొదట నిర్మింపఁబడెనో మనము కనుఁగొనవలసి యున్నది.

కాకతీయ ప్రతాపరుద్రుని యాస్థానపండితుఁ డగు విద్యానాథ మహాకవియొక్క బుద్ధివైభవమే ఈ నూతనశబ్దనిర్మాణమునకు హేతు వని నా యొక్క తాత్పర్యము. ప్రతాపరుద్రుఁడు పదునాల్గవ శతాబ్దారంభమున నుండెను. కావున విద్యానాథకవికాలముకూడ నదియే. ఆకాలమందు 'త్రిలింగ' శబ్దమును నిర్మించుటకును దానికి నొక వ్యుత్పత్తి కల్పించుటకును ఒక కారణము గలదు. ఓరుగల్లు రాజధానిగాఁ గల కాకతీయరాజుల రాజ్యవిస్తారమును ఈ మూఁడులింగములును కొంతవఱకు దెలుపుచుండెను. అనఁగా ఈరాజ్యపు సీమయొక్క మూఁడువైపుల నీ మూఁడులింగము లుండె నని చెప్పవచ్చును. కావుననే విద్యానాథుఁడు ప్రతాపరుద్రీయమునందు ప్రతాపరుద్రమహారాజు నుద్దేశించి ఈ ప్రకారము చెప్పియున్నాఁడు:—

(నాటకప్రకరణము చతుర్థాంకము ౪౪-వ శ్లోకము.)

"స్వామిం స్త్రిలింగదేశపరమేశ్వర!"

శ్లో. "యైర్దేశ స్త్రిభిరేవ యాతి మహతీం ఖ్యాతిం త్రిలింగాఖ్యయా।

"యేషాం కాకతిరాజకీర్తివిభవైః కైలాసశైలాః కృతాః॥

"తేదేవాః ప్రసరత్ప్రసాదమధురా శ్రీశైల కాళేశ్వర।
"ద్రాక్షారామనివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రేయసేజాగ్రతు॥"

అర్థము:—స్వామీ! త్రిలింగపరమేశ్వరా! ఎవరిచే, ఈదేశమునకు 'త్రిలింగ'మను పేరు వడసి మిక్కిలి ఖ్యాతిని చెందెనో, కాకతీయరాజుల కీర్తి వైభవముచే ఎవ్వరి (తెల్లని) కైలాసశైలములు చేయఁబడెనో, వ్యాపించిన యనుగ్రహముచే కమనీయులగు శ్రీశైల, ద్రాక్షారామ, కాళేశ్వర నివాసులైన యాదేవతలు నీ శ్రేయస్సు విషయమై ఎల్లప్పుడును జాగరూకులై యుండుదురు గాత

పైని ఉదాహరింపఁబడిన ప్రతాపరుద్రీయ శ్లోకమువలన 'త్రిలింగ' సంబంధములైన మూఁడులింగములును కాకతీయరాజ్యమునకు సంబంధించిన వని స్పష్టముగ తెలియవచ్చుచున్నవి. ఇచ్చట కాళేశ్వరమును గుఱించి మనవారు పడుచున్న పొరపాటు చూపవలసి యున్నది. కాళేశ్వర మనఁగా శ్రీకాళహస్తి యని కొందఱు వ్రాసియున్నారు. అట్లు వ్రాయుటకు భూగోళజ్ఞానము లేమియే కారణము. ఈ త్రిలింగ సంబంధమైన కాళేశ్వరము నైజాము రాజ్యములో మంథెనగ్రామమునొద్ద నున్నది. కావుననే దానిని సాధారణముగా మంథెనకాళేశ్వర మనియెదరు. అచ్చట కాళేశ్వరుఁ డను దేవుఁడు కలఁడు. ఈ కాళేశ్వరము మంథెనకాళేశ్వరము గాక శ్రీకాళహస్తి యైనయెడల ఈ మూఁడులింగములమధ్య నున్న దేశము మిక్కిలి చిన్నది యై యందు కాకతీయరాజుల రాజధాని యైన ఓరుగల్లు కాని, ప్రస్తుతపు నైజాము రాజ్యమునందున్న 'తెనుఁగు' దేశము అంతయుగాని అనఁగా 'తెనుఁగు' దేశములో రమారమి సగముదేశము త్రిలింగములోనికి రాకపోవుటయే గాక యీకాలమందు ఇంగ్లీషువారి స్వాధీనమునందున్న 'తెనుఁగు' జిల్లాలలోని కృష్ణాజిల్లా యొక్క పశ్చిమార్ధముకూడ నందుండ నేరదు. కావున కాళహస్తిహద్దుగా గల దేశము, విద్యానాథునిచే వర్ణింపఁబడిన త్రిలింగ మెప్పటికినిఁ గా నేరదని 'తెలుఁగు' దేశపుఁ బటము చూచినవారందఱికిని స్పష్టమగును. ఇదియునుఁగాక

తెలుఁగుదేశపుఁ బశ్చిమసీమమీద కాళేశ్వర మను క్షేత్ర మొకటి యుండఁగా దానిని విడిచి కాళేశ్వర మనఁగా కాళహస్తి యని కొందఱు పండితు లేల చెప్పెదరో తెలియకున్నది. ఇంతటితో కాళేశ్వరవాదము చాలించి మన మూలవిషయ మైన త్రిలింగశబ్దోత్పత్తిని గుఱించి విచారింతము.

'త్రిలింగ' మనుండి 'తెలుఁగు' పుట్టినమాటయే వాస్తవ మైనయెడల ఒకానొక కాలమందు ఈ దేశమునకు త్రిలింగ మను వాడుకపేరు ఉండి యుండవలెను. భాషకు త్రిలింగి యను నామ ముండవలయును. మహారాష్ట్ర దేశపు భాష మహారాష్ట్రి, మగధదేశపుభాష మగధి. ఇట్లే త్రిలింగిభాష ఎచ్చటనైనఁ జెప్పఁబడి యున్నదా? 'త్రిలింగ' శబ్దము విద్యానాథునికి పూర్వము వ్రాయఁబడిన గ్రంథములలో నేను జూచినంతవఱకుఁ గానరాలేదు. కొన్ని పురాణములలో త్రిలింగశబ్దము దేశపరముగా వ్రాయఁబడియున్నది. కాని పురాణరచనాకాలము నిశ్చయముగఁ దెలియనందునను, కొన్ని పురాణములు పురాతనములని తెలిసినను వానిలో నూతనముగా ప్రక్షిప్తశ్లోకము లనేకములు కలుపఁబడినందునను, 'త్రిలింగ' సంబంధమైన చర్చ పురాణములఁ బట్టి నిశ్చయించుటకు వీలులేదు. తదితరగ్రంథములఁబట్టి నిశ్చయింపవలయును.

పైని చెప్పఁబడిన మూఁడు లింగములవలన 'తెలుఁగు' దేశమునకు 'త్రిలింగ' మనునామము రాలేదనుటకు మఱియొక కారణము కూడ కలదు. ఈ మూఁడులింగములకు వెలుపల మూఁడువైపులను తెలుఁగు దేశము వ్యాపించి యున్నది. ఈ మూఁడులింగములు గల స్థలమును మూడుకోణములుగా భావించి యొక కల్పితత్రిభుజను నిర్మించుకొని చూచినయెడల దీనికి పశ్చిమమున్న నైజాము రాజ్యములోని కొంత 'తెలుఁగు' దేశమును, ఈశాన్యమున గోదావరి జిల్లాలోని సగభాగమును విశాఖపట్టణముజిల్లాయును గంజాములోని కొంత భాగమును ఆగ్నేయమున గుంటూరు జిల్లాలోని చాల భాగమును నెల్లూరు ఉత్తర ఆర్కాడు, కడప, కర్నూలు, అనంతపురము, బళ్ళారి జిల్లాలును, ఈ మూఁడులింగములకు వెలుపలనుండును. అనఁగా నివన్నియు త్రిలింగములోనివి

కావు. శ్రీశైల, ద్రాక్షారామ, కాళేశ్వరములకు వెలుపల నింత తెలుఁగుదేశ ముండఁగా ఈ మూఁడులింగములనుఁబట్టి ఈ దేశమునకు త్రిలింగదేశమ్ము వచ్చె ననియు, నందుండి తెలుఁగు పుట్టె ననియుఁ జెప్పుట యెట్లు పొసఁగును?

కావున పైని చూపఁబడిన కారణముచే మనదేశమునకు మొదటినుండి 'తెలుఁగు' దేశ మనియే నామము కలదనియు, 'త్రిలింగ' మను నామ మెన్నఁడును లేదనియు, సంస్కృతపండితులు తెలుఁగనుపదమునకే తమ పాండిత్య ప్రకర్షణార్థమై 'త్రిలింగ' మను సాంస్కృతికరూపము నొసంగి రనియు, ఆ పదము శ్రీశైల, ద్రాక్షారామ, కాళేశ్వరములలోని లింగములవలనే కలిగె నని యొక కాల్పనికవ్యుత్పత్తిని మొదట కల్పించినవాఁడు విద్యానాథుఁ డనియు, అట్లతఁడు కల్పించుటకు ఓరుగంటిరాజ్యములో మూఁడుదిక్కుల మూఁడు లింగము లుండుటయే కారణ మనియు నాయొక్క యభిప్రాయము. పండితులు దీనినిఁ జక్కఁగ పరిశోధింతురుగాక.

క్రొత్త విషయమును చెప్పిన దానిని మన పండితులు కొందఱు నిందించుట సహజము కావున నన్ను కొందఱు ప్రస్తుతవిషయమును గుఱించి దూషింతు రని నే నెఱుంగుదును. కాని వారి దూషణభూషణములతో నాకు ప్రయోజనము లేదు. సత్యాన్వేషణమే నాపని. కావున నెవరైన ఈ విషయమును ఖండింపఁ దలఁచిరేని సప్రమాణముగ వ్రాయఁ బ్రార్థితులు. నన్నయభట్టు, తిక్కనసోమయాజులచే రచియింపఁబడిన గ్రంథములలోఁ గాని, పదునాల్గవ శతాబ్దమునకుఁ బూర్వము రచింపఁబడిన మఱి యే గ్రంథమునందైఁ గాని త్రిలింగశబ్దప్రయోగమును ఎవరైన చూపినయెడల నేను నా యభిప్రాయములను మార్చుకొనుటకు సిద్ధముగ నున్నాను. ప్రక్షిప్తభూయిష్ఠము లైన పురాణముల నుదాహరించిన లాభము లేదని నే నిదివఱకే వ్రాసియున్నాను. సత్యాభిమానమే వలయునుగాని పక్షాభిమానము వలదుగదా.

---

# యుద్ధమల్లుని బెజవాడ శాసనము *

(అఱవమునందలి ழ అను వర్ణము తెనుఁగున నుండుట)†

యుద్ధమల్లుని శాసనమును గుఱించి ౧౯౧౩ లోఁ దెనుఁగు పత్రికలయం దుఁ బ్రబలవాదములు జరిగినందున నీ బెజవాడశాసనము తెలుఁగు వారందఱును జక్కఁగ నెఱిఁగియుందురు. దీనిని ఇటీవల శ్రీయుత జయంతి రామయ్యపంతులు గారు ‡పరిషత్పత్రికలో విపులవ్యాఖ్యానముతోఁ బ్రకటించియున్నారు. ఇయ్యది ఆంధ్రభాషావ్యుత్పత్తి (Philology) శాస్త్రమునకు నెంతయో యుపయో గకరమైనది కావున దీనిని బ్రకటించినందులకు నాంధ్రు లందఱును పంతులవారి యెడలఁ గృతజ్ఞులు.

ఆంధ్రవిజ్ఞాన సర్వస్వమునకు నాంధ్రభాషను గుఱించి వ్యాసము వ్రా యునిమిత్తమై నే నీశాసనము చదువుట తటస్థించినది. అప్పుడిందు నా కొక వింతయక్షరము కానవచ్చెను.

అఱవమున ழ అను నొకవింతయైన యుచ్చారణ గల యక్షరము కలదు. దీనిని వేఱు వేఱు దేశముల అఱవవారు వేఱు వేఱు విధముల నుచ్చరించుచుందురు.

---

* "ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక":—సిద్ధార్థి సం॥రము సంపుటము ౯, సం ౪.

† ఈ వాదము పండితులచేత నామోదింపఁబడినది. ఉదా: చూడుఁడు: ఎపి. ఇండి. సం ౧౫ పుట. ౧౫౦ [సం]

‡ ఇది పరిషత్పత్రిక ౬ వ సంపుటము ౨ వ సంచికయందును, బ్రత్యేక ముగఁ బుస్తక రూపమునను బ్రకటింపఁబడినది. జిజ్ఞాసువు లా పుస్తకములందలి శాసన ప్రతిబింబములఁ జూడనగును.

కొన్ని స్థలములం గొంచెము హెచ్చుతక్కువగ 'ష'వలెను, కొన్నిచోట్ల 'డ'వలెను, మఱికొన్ని తావుల 'ళ'వలెను ఉచ్చరింపఁబడును. ఈయుచ్చారణమును, అక్షరమును మలయాళమునందును గలవు. కాని కన్నడమునందును, తెనుఁగులోను ఇప్పుడు లేవు. కన్నడమునందలి వాఙ్మయమును జూడఁగా ౧౩వ శతాబ్దమువఱకును ఈ వర్ణమును, దీనికి 'ఱ'అను ప్రత్యేకాక్షరమును ఆభాషయందు నుండినట్లు స్పష్టపడుచున్నది. ఇది మనబండిఱలోని అడ్డుగీటు తీసివేసిన నక్షర మెట్లుండునో, లేక వ్రాయునెడ మనము వ్రాసెడి 'ఱ' జుట్టులేనియెడల నెట్లుండునో అట్లు ఉండును. కేశిరాజు అనువాఁడు ౧౩ వ. శతాబ్దమున శబ్దమణిదర్పణ మను లక్షణ గ్రంథ మొకటి కర్ణాటకభాషను వ్రాసియున్నాఁడు. అప్పకవి శకటరేఫము కలశబ్దములకు జాబితా వ్రాసిన ట్లితఁడును 'ఱ'కారముగల శబ్దముల పట్టిక యొకటి యిచ్చినాఁడు. శబ్దమణిదర్పణమందలి ౧-వ అధ్యాయములోని ౨౩వ సూత్రము చూడనగును. ఇందువలన, నాకాలమునఱకే యీయక్షరముయొక్క స్వతంత్రోచ్చారణము నశించి, ఏది 'ఱ' అయినది, ఏది 'ళ'అయినది తెలియక కొంద ఱట్లు, కొందఱిట్లు వ్రాయుచుండిరనియు లక్షణవేత్తలింకను ఈయక్షరమును విడువఁజాలక పెనఁగులాడుచుండిరనియుఁ దెలియుచున్నది. తరువాత నీయక్షరమును బండిఱాయుఁ గన్నడమునుండి జాఱిపోయినవి. కాని యీధ్వనియు, నక్షరంబును తెనుఁగున నెన్నఁడైన నుండెనని యెవరు ననుకొనలేదు. ఈ శాసనము వలన నాసంగతి క్రొత్తగ ఘనపడుఁ దెలియుచున్నది. కావున నీశాసనముయోగ్యత హెచ్చైనదని యెంచవలెను.

ఈ వర్ణమునుగుఱించి మొదటఁ గొంచెము తెల్పెదను. అఱవమున ழ ఈ యక్షరముచేఁ జూపఁబడు నుచ్చారణ గలశబ్దములు, కన్నడమున నిప్పుడు 'ళ'కారముతోను, తెనుఁగున 'డ'కారముతోను ఉచ్చరింపఁబడుచున్నవి. ఇందుకుఁ గొన్ని యుదాహరణములు:—

| అఱవము. | కన్నడము. | తెలుఁగు. |
|---|---|---|
| కోఴి | కోళి | కోడి |
| సుఴి | సుళి | సుడి |
| పాఴు | పాళు | పాడు |
| కూఴు | కూళు | కూడు |

కేశిరాజు తనవ్యాకరణమందు ఴకారముతోఁ జూపిన శబ్దకము లిప్పటి కన్నడమున ళకారముతో వ్రాయఁబడును. తెనుఁగున డకారముతో వ్రాయఁబడును:—

| ప్రాఁతకన్నడము. | ఇప్పటికన్నడము. | తెలుఁగు. |
|---|---|---|
| తెగఴు | తెగళు | తెగడు |
| పొగఴు | పొగళు | పొగడు |
| మగఴు | మగళు | మగడు |

ఈ ప్రకారముగ నీద్రావిడవర్ణము మూఁడుభాషలలో మూఁడువిధములుగ మాఱిపోయినది.

ఇఁక శాసనమునకు వత్తము. తెనుఁగుభాషయందు నీవర్ణము యుద్ధమల్లునిశాసనకాలముకంటెను నుండెననుట స్పష్టము. ఈ యక్షరము ౯వ శతాబ్దము మొదలు ౧౩వ శతాబ్దమువఱకును కన్నడమున ఈరూపముతోనే వ్రాయఁబడుచుండెను. ఈరూపమే యీశాసనమునందు మూఁడుచోట్లఁ గానవచ్చుచున్నది. ౧౮వ పంక్తిలో 'ఴస్సి' అనియు, ౨౧ పంక్తిలో '[అ]ఴిపిన' అనియు, ౩౫వ పంక్తిలో 'యఴిపుటు' అనియుఁ గలదు. ఈ మూఁడుచోట్లను శ్రీయుత జయంతి రామయ్యపంతులుగారు ఈ యక్షరమును 'డ'కారముగనే చదివినారు. అందుచే వారిపుస్తకమున నివి 'డస్సి,' 'అడిపిన'; 'యడిపుటు' అన్నరూపముతోనె కనఁబడును. కాని యీశాసనము వ్రాసినవానిమతమున నిది 'డ'కారము కాదనుట స్పష్టము. ఏలయన నిశ్చయముగ 'డ'కార మని చెప్పుటకు వీలుఁగల యక్షర మింకొకటి యిందు నెన్నియో సారులు వచ్చియు

న్నది. ఇది విడిగా ౧౧ సారులును, ఇంకొక యక్షరముతోఁ గలిసి క్రిందిభాగ మున ౧౭ సారులును ఈశాసనమునందు వచ్చినవి.

స్వతంత్రముగ వచ్చినస్థలములు ౧౧:—పం. ౭, బెజవాడ; పం. ౮. గుడి; పం. ౧౧ విడిసి; పం. ౧౫ విడిసి; పం. ౨౩ బెజవాడ; పం. ౨౮ గుడి; పం. ౩౦ యేలెడు; పం. ౪౧. ఓడ్డు; పం. ౪౨ మాడు; పం. ౪౫. వోడంబడి.

సంయుక్తాక్షరములో వచ్చిన స్థలములు:—పం. ౩ పుల్లుణ్డు; ౪ యుణ్డు ౫ నుణ్డు; ౬ కుణ్డు; ౭ణ్డిన్; ౮ భక్తుణ్డు; ౯ ధాముణ్డు; ౧౨. ణ్డువారు; ౧౪ ణ్డుని; ౬౨ నుణ్డి; ౨౪. నుతుణ్డొణ్డు; ౨౭ పల్లణ్డు; ౩౧. రొణ్డు; ౪౩ ణ్డు; ౪౪ తేజుణ్డు.

ఇట్లు నిజమైన'డ'కార మీశాసనమునందు ౨౮ తడవల వచ్చినవి. కావున దాని స్వరూపమునుగూర్చి సంశయము లేదు. దాని రూపమును చూచినను ఇప్పుడు మనము వ్రాయుచున్న'డ'కారమునకు నది పూర్వరూపమనుట స్పష్టము. కావునఁ బైని ఉదాహరించిన మూఁడుతావులలోని అక్షరము 'డ' కార మనుట కు వీలులేదు. దీనియాకారమునకును, ఈ శాసనమునందలి బెజవాడాది పదము లలోని 'డ'కారముయొక్క యాకారమునకును సంబంధము లేదు. ఇది తద్భి న్నమైన యక్షరము.

ఒక్క శాసనమునందే ఒక్క యుచ్చారణమునకై రెండుభిన్నాక్షరము లుపయోగింపఁబడిన వని చెప్పుటయు యుక్తియుక్తము గాదు. కావున నీయ క్షరముచే భిన్నమైన వర్ణోచ్చారణమె సూచింపఁబడుచుండె నని ఊహింప వలెను.

అఱవమందలి ழ అను అక్షర మేయుచ్చారణమును సూచించునో అదే యుచ్చారణను ఈ యక్షరము సూచించుననుటకుఁ గర్ణాటవాఙ్మయమే సాక్ష్య ము. ఈయక్షర మీరూపముతోనే పురాతనకన్నడమునందుఁ గానవచ్చుచున్నది. ఇది మనబండిఱావలెనె యుండి నడుమ అడ్డగీటు లేక యుండును. ఈ యక్షర

ముసుగుఱించి వ్రాయవలసివచ్చినప్పుడు ఇప్పటి కన్నడపువారును, ఈ రూపమునె వాడుదురు. అచ్చుపడిన శిష్టశాసనవర్ణనము, కిట్టెల్ రచిత కోశముఁ జూడఁదగును.

యుద్ధమల్లుని ఈ శాసనము ౯ వ శతాబ్దమునాఁటిది అని రామయ్యపంతులవారు వ్రాసియున్నారు. ఈ కాలమునాఁటివి, అనఁగా ౯ వ శతాబ్ది ప్రాంతపువి అగు కన్నడశాసనములలోఁ గూడ నీరూపము చూడఁదగును.*

ఇఁక, మనశాసనమందు నీయతుఱయుక్తముగ వచ్చిన శబ్దముల ఉత్పత్తిని గుఱించియు, అర్థమును గుఱించియు విచారింతము.

ఇందు 'ఱ' కారముతోఁ గలసివచ్చిన శబ్దములు మూఁడు. ౧౮వ పంక్తిలో 'ఱస్సి' (ఢస్సి); ౨౧ వ పంక్తిలో '[అ]ఱిసిన' (అడిసిన); ౩౫ వ పంక్తిలో 'యుఱిపుట' (అడిపుట).

ఇందలి మొదటిశబ్దమునకు మూలము అరవమునందుఁ గాని, కన్నడమునందుఁగాని కానరాలేదు. కాని ౨ వ, ౩ వ శబ్దములు ఒకధాతువునుండి పుట్టినవియే. అరవమునందు அழி (అడి) అనుధాతువు కలదు. దానిని సకర్మకముగను, అకర్మకముగను ఉపయోగించెదరు. దానికి నాశము చేయుట, పాడుచేయుట, ధ్వంసము చేయుట, కూల్చుట ఇత్యాద్యర్థములు కలవు†. పురాతన

---

* Fleet's Cannada Inscriptions; Kittels' Grammar p. 15. ft; Epi. Ind. Vol. V. p. 151. ఇది ౧౦వ శతాబ్దమునాఁటిది; Alupa Canarese inscriptions at Udiyavara (7th to 11th Centuries; Epi. Ind. IX p. 15. క్రమణ జిల్లాలో నున్న ద్వితీయ మారసింహుని శాసనమునందు నీయతుఱ మీరూపమునసే, నోళంబ చోళశబ్దములలోఁ బెక్కుసారులు వచ్చును [Ep. Ind. V. p. 176] ఇది క్రీ. శ. ౯౭౫ నాఁటి సంస్కృత కన్నడ శాసనము.

† *அழி* : to blight, blast, ruin, injure, damage, annihilate, destroy, demolish exterminate, efface [Winslows' 'Tamil English Dictionary'.

కర్ణాటకమందును ఈ ధాతువు ఴీధ్వనితోనే యుండెను. కేశిరాజు వ్యాకరణమందలి ధాతుపాఠమున ఈ ధాతువు ‘వినాశే’ అను నర్థమున ఈయఁబడినది. కిటెల్ కోశమందును ఈ యర్థమందె ‘అೞిసు’ అను ధాతువును ‘అೞువు’ అను విశేష్యమును ‘ೞ’ కారముతోడనె యిచ్చియున్నాఁడు. కావున ఈ ధాతువు పురాతనకాలమందు అన్ని ద్రావిడభాషలలోను ఴ అను ధ్వనితో నుండెననియు, అది క్రమముగఁ గన్నడమున ‘ళ’గను, తెనుఁగున ‘డ’ గను మాఱెననియు నిశ్చయింపవచ్చును. యుద్ధమల్లుని శాసనము వ్రాసినప్పుడు దానికి ‘డ’ కారోచ్చారణము లేదు. వచ్చియున్నయెడల ‘బెజవాడ’ శబ్దములోని ‘డ’ వంటి యక్షరమే దీనిలోను వ్రాయఁబడియుండును. అట్లు ఴ కారోచ్చారణ ముండుటవలన ఆంధ్రకర్ణాటాక్షరములలో దీనికి బదులుగ నేర్పడిన ‘ೞ’ అక్షరము వాడఁబడినది. ‘లింగంబు ೞిసిన పాపంబు’ అనఁగా లింగమును పీకిపాఱవేసినఁ గల్గు పాపము, లింగమును ధ్వంసముచేసినఁ గల్గు పాపమును; ‘దప్పి యఱిపుటు’ అనగా దప్పిలేకుండ జేయుట.

ఇట్లిందలి రెండుశబ్దముల మూలమును, అర్థమును జూచి ఈ శాసనమందలి యీ శబ్దములలోని అక్షరము అఱవమందలి ఴ కును, కన్నడమందలి ‘ೞ’ కును సరియైనదని నిర్ణయింపవలసి యున్నది.

ఇఁక నీయక్షర మీ యొకశాసనమునందే యున్నదా, యింకను ఇతర శాసనములందును గలదా యని చూడవలయును. ఇందును గుఱించి శోధింపఁగా ౧౧ వ శతాబ్దమునకుఁ బూర్వపు తెనుఁగుదేశపు శాసనములలో నీ యక్షరము కానవచ్చుచున్నది. అవి యెవ్వి యన:—

౧. విజయాదిత్యుని ఏడూరు శాసనము. [Epi. Ind. Vol. V. p. 118] ఇది ౭౯౯–౮౪౩ కాలపు శాసనము. ఇది సంస్కృతమునందున్నను, ౨౦వ పంక్తిలో ఒకమనుష్యుని పేరు ‘చోఴి’ యనామా’ అని యున్నది. అందువలన నాకాలమునఁ దెనుఁగుదేశమున ఈధ్వనియు, అక్షరమును గలవనుట స్పష్టము.

౨. సత్యాదిత్యుని మలపాడు శిలాశాసనము. [Epi. Ind. XI. p. 345] ఇది తెలుఁగు శాసనము. దీనికాలము స్పష్టముగఁ దెలియకున్నను, ౧౦ వ శతాబ్దమునకుఁ బూర్వపుది యని తద్‌జ్ఞులయభిప్రాయము. ఇందు 'చోఴ' (చోళ) [౧వ పంక్తి], ఏఴు(ఏడు) [౫వ పంక్తి] అనుశబ్దములుకలవు. 'చోళ' శబ్దము సాధారణముగ నిప్పుడు 'ళ' కారముతో వ్రాయఁబడినను బురాతన కాలపుటఱవమున ఴకారము గలదిగనె యుండెనని అప్పయార్యుడు మొదలయిన వారి వ్రాఁతలవలనఁ దెలిసికొనవచ్చును. లక్షణయుక్తముగ వ్రాయువా రిప్పటికిని ఈ యక్షరమునే ఉపయోగించెదరు. తెలుఁగుశాసనములలోఁగూడఁ గొన్నిచోట్ల 'ఴ' అను అక్షరముతోఁగూడ వ్రాయఁబడియున్నది. [చూడు: మలపాడులోని పుణ్యకుమారుని తామ్రశాసనము: Epi. Ind. Vol. XI. p.337] అట్లే 'ఏఴు' (ఏడు) అనుదానికి అఱవమున సరియైన శబ్దము కలదు. ఈ ఴ ఉచ్చారణము ఈ శాసనము నాఁటికిఁ దెలుఁగు దేశమునఁ గలదనుట స్పష్టము.

3. బెజవాడలోని యింద్రకీలపర్వతముమీఁది శాసనము [No. ౪౮౩ of 1917 Epi. Collection]. దీనిని రామయ్యపంతులు గారు పరిషత్పత్రికయొక్క ౭ వ సంపుటము, ౪ వ సంచికలోఁ బ్రకటించియున్నారు. ఇందలి నాల్గవపంక్తిలో ఈయక్షర మున్నది. దీనిని మఱల రామయ్యపంతులుగారు 'డ' కారముగనె చదివియున్నారు. 'పడిఏడగు' అని వ్రాసిరి. ఇందలి 'డ' కారమునకు బదులు శాసనములో 'ఴ' కారమున్నది. కన్నడమున పూర్వము 'ఏడు' కు 'ఏೞ್' అనుపద ముండెను. ఇప్పటికిని అఱవమున ఈపద మున్నది. ஏழு= ఏడు. ఈ శాసనకాలము ౯౦౯ ప్రాంత మని రామయ్యగారే చెప్పియున్నారు.

౪. విజయాదిత్య ద్వితీయ అమ్మరాజుయొక్క కలవచెర్లశాసనము [Epi. Ind. Vol. VIII] ఇందలి 3౯వ పంక్తిలో ఈఅక్షర మున్నది. శాసనము సంస్కృతమయమైనను మనుష్యునిపేరులో నీయక్షరము కలదు. ఈ చాళుక్య రాజు ౯౪౫ మొదలు ౯౭౦ వఱకు రాజ్యము చేసినట్లు కానవచ్చుచున్నది.

౫. రెండవ చాళుక్యభీముని తామ్రశాసనము. [Epi. Ind. Vol. V. p. 134] ఈ రాజు ౯౩౪-౯౪౫ కాలమున రాజ్యముచేసెను. శాసనము సంస్కృతభాషయం దున్నను ౧౭ వ పంక్తిలో 'వేఙ్గరాంబా' యన్న పేరు వచ్చినది.

౬. నెల్లూరు మండలమందలి నలజనంపాడు శాసనము. దీని కాలము స్పష్టముగఁ దెలియదు. కాని అక్షరములు మాత్రము యుద్ధమల్లునిశాసనమువలెనే యున్నవి. ఇందు ౧౮వ పంక్తిలో 'ఱచ్చిన' ౨౦-౨౧ పంక్తులలో 'శ్రీపర్వతంబు ఱచ్చిన.' ౨౩వ పంక్తిలో 'ఱాళుకొడుకు' అని యున్నది. ఇది తెలుఁగుశాసనము: యుద్ధమల్లునిశాసనములో నున్న 'ఱస్సి' శబ్ద మిచ్చట 'ఱచ్చి' గ నుండుట యొక విశేషము. (N.I. ka ౨౫. p ౬౭౭)

౭. విజయాదిత్యునిది యైన కోలవెన్ను శాసనము. [South Indian Inscriptions Vol. I. p. 45; Epi. Ind. VII. p. 182 Ft. 1.] దును మనుష్యనామమందు ఈయక్షరము కలదు.

౮. ప్రథమవిష్ణువర్ధనుని తిమ్మాపురము శాసనము. [Epi. Ind. IX p. 317] ఈ పూర్వచాళుక్య రాజు, ౬౧౫ మొదలు ౬౩౩ వఱకు రాజ్యము చేసినట్లు కానవచ్చుచున్నది. ఈ శాసనము సంస్కృతమునం దున్నను, ౧౧వ పంక్తియందు 'ప ఱ కి విషయ' అని యొకనాఁడు పేరు కలదు.

౯. పశ్చిమచాళుక్యరాజయిన ౧ వ విక్రమాదిత్యుని నెల్లూరు తాలూకాలోని తలమంచి తామ్రశాసనము [Epi Ind. IX. p. 98]. దీని కాలము ౬౬౦ అని ఊహింపఁబడుచున్నది. ఇదియు సంస్కృతముననె యున్నది. ఇందు గ్రామనామమున ఈ అక్షరము కలదు. ౨౨వ పంక్తి 'కొఱ్ఱచుంకొన్ఱు' అను గ్రామము పేర్కొనఁబడియె.

ఈచివర రెండుశాసనములలోను ఈ యక్షరముయొక్క రూపము మిగిలినశాసనములందలి యక్షరములకంటెఁ బురాతనముగ నున్నది. రెండు నున్న అను ఒక దానిప్రక్క మఱియొకదాని నుంచి జోడించిన నెట్లుండునో యది యా

యక్షరముయొక్క మొదటిరూపము. ఇందు, అడ్డగీటు గీసిన నడి బండి 'ఱ' అగును. ఇదియె క్రమముగ 'ఒఱ'గను 'ఱ' గను మారినవి.

ఆంధ్రకర్ణాటలిపి అశోకలిపినుండి పుట్టినదని పండితులయభిప్రాయము. కాని ఉత్తరదేశభాషలలో 'ళ', 'ఱ' ఈ రెండువర్ణములు లేనందున, ఆంధ్రకర్ణాటకు లీయక్షరములను స్వతంత్రముగా గల్పించుకొనవలసివచ్చినది. ఆకల్పించుకొనుటలోను ఈ రెండక్షరములకు కొంచెము భేదముతో నొక్కరూపమే కల్పించుటయుఁ జూడ నిరెండును కొంతసంబంధము గల శుద్ధద్రావిడవర్ణము లనుట స్పష్టపడుచున్నది.

ఈశాసనమందలి యింకొకశబ్దము.

యుద్ధమల్లుని శాసనమున ౩౯, ౪౦ పంక్తులను రామయ్యపంతులుగారు 'స్వమతాత మల్లపరాజు వేరదుదానం గట్టించె' అని చదివియున్నారు. 'వేరదు' అనశబ్దము సందేహాముగ నున్నదనియు వ్రాసినారు. ఈ 'వేరదు' అనుదానిని 'వేరఱు' అని చదువవలయునని నాతాత్పర్యము. రామయ్యగారు 'దు'అని చదివిన అక్షరము 'దు' కాదు, 'ఱు' కాదు. అడ్డగీటు స్పష్టముగాఁ గానవచ్చుచున్నది. కాన నది 'ఱు' అనుట స్పష్టము. కావున నీశబ్దము 'వేరఱు' అన నేమి? మూలశబ్దము 'పేరఱు' ఇందలి పకారము వకారముగ మారినదని నాతాత్పర్యము. ౪౨వ పంక్తిలో 'ప్రత్యుత్తు'శబ్దము 'వ్రత్యుత్తుము' అని వ్రాయఁబడినది. అట్లే యిదియు నని యెఱుంగునది. ఇఁక 'పేరఱు' అన నేమి యని విచారింతము. ఇందు పేర్ + అఱు అను రెండుశబ్దములు కలవు. పేర్ అనగా పెద్ద, అఱు అనగా ధర్మము. పేర్ శబ్దమునకు పెద్ద అను అర్థము అఱవము, కన్నడము తెలుఁగు అను మూడు భాషలయందును కలదు. అఱు అనుశబ్దము తెనుఁగునఁ గానరాదు. మిగిలిన రెండుభాషలలోను కలదు. కన్నడమున 'అఱు' అనురూపముననే కలదు. అఱవమున 'అఱ' అను రూపమున నున్నది. ఈమాటలకు నాయాభాషలలో ధర్మము, దానము అని అర్థము కావున 'పేరఱు' అనగా గొప్ప ధర్మము అని యర్థము చేయవలెను.

---

# ద్రావిడభాషలలోని ఉత్తమపురుషవాచక సర్వనామము*

ఏ రెండుభాషలకును గల సంబంధమును గనుఁగొనవలయు నన్న నా భాషలలోని సర్వనామరూపముల కెట్టి సామ్యము కలదో చూచుట యావశ్యకము. భాషయొక్క బాల్యమునందే పుట్టి సాధారణముగ నెక్కుడు మార్పులను జెందక చివరవఱకును భాషలో నిమిడి యుండెడు శబ్దసంగ్రహములోఁ బురుషవాచక సర్వనామములు ముఖ్య మైన వని చెప్పవచ్చును. ఎంతయు నాగరకభాష లైనను ఉత్తమమధ్యమపురుషములను సూచించుపదములు లేక యుండవు. కొంచెము హెచ్చుతక్కువగ భాషోత్పత్తితోడనే యవియుఁ బుట్టును. అట్లు పుట్టిన భాష యభివృద్ధి చెందినకొలఁది నవియుఁ గొలఁదిగ మాఱుచుండునే గాని, పూర్తిగ మాఱిపోయి భాషయొక్క వేఱువేఱవస్థలలో వేఱువేఱు పురుషవాచక సర్వనామము లుండుట సాధారణముగఁ దటస్థింపదు. ముఖ్యముగ నీ నియమ ముత్తమమధ్యమపురుషవాచక శబ్దములకుఁ జెల్లును. కావున వేఱువేఱు భాషలలోని యిట్టి పదములను మనము పోల్చి చూచినయెడల నాయాభాషలకుఁ బూర్వసంబంధము కలదా లేదా యని తెలిసికొనవచ్చును. ఇప్పుడు ముఖ్యముగ ద్రావిడభాషలలోని యుత్తమపురుష వాచకసర్వనామముయొక్క రూపములను గుఱించి విచారింపవలసియున్నది.

తెలుఁగు:— తెలుఁగున నేకవచనమునందు నేను అను రూపమును, బహువచనమునందు మేము, మనము అను రూపములును సర్వసాధారణము లై యున్నవి. ఇవి వ్యావహారికభాషయందును, గ్రాంథికభాషయందును గానవచ్చును. అట్లే పురాతనకాలపు గ్రంథములందును, నాధునికగ్రంథములందును

* 'ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక'— రౌద్రినామ సంవత్సరము సంపుటము ౯. సం 3.

గలవు. ఇవి గాక ఏను, ఏము, నేము అను రూపములు గూడఁ బూర్వకాల మున్నట్టు మన గ్రంథములవలనఁ గానవచ్చుచున్నది.

శబ్దమునకుఁ జివర నున్న హల్లులకు 'ఉ'కారము చేర్చి వ్రాయునట్టియుఁ బలుకునట్టియు నాచారము మన భాషలో మొదట లేదు. ఇది తరువాత వచ్చిన యాచారము. పూర్వము మన భాషలో హలంతశబ్దములు కలవు. కావున నుత్తమపురుషసర్వనామములు మొదట, ఏకవచనమున ఏన్, నేన్, ఏమ్, మేమ్, మనమ్ అను రూపములు కలిగి యుండెడి ననుట స్పష్టము. మొదట వీనిలోని యేకవచనరూపములను గురించి కొంచెము విచారింతము.

'నేన్' అను రూపము ప్రథమావిభక్తియందే కానవచ్చుచున్నది గాని మిగిలిన యన్ని విభక్తులందును 'నాన్' లేక 'నన్' అను రూపమే యుపయోగింపఁబడును. ద్వితీయ నన్ను, తృతీయ నాచే, చతుర్థి నాకొఱకు, పంచమి నావలన, షష్ఠి నాయొక్క, సప్తమి నాయందు. ఇట్లు తెలుఁగుభాషయందు 'నాన్' అను రూపమునకే యెక్కుడు వ్యాప్తి గలదు. కావున నీ శబ్దముయొక్క మొదటి రూపము 'నాన్' అనునదే యనియుఁ, గాలక్రమమునఁ బ్రథమైకరూపము మాత్రము 'నేన్'గా మారెననియుఁ దోఁచుచున్నది. ఇందుకు దృష్టాంతముగఁ బూర్వాంధ్రులు 'నేను' అనుటకు మాఱుగ 'నాను' అనియె యనుచున్నారు.

ఇంకను సూక్ష్మముగ నాలోచింపఁగా నీ శబ్దము మొదట 'నాన్' అని గాని 'నేన్' అని గాని స్పష్టముగ లేక 'న్యాను' అన్న యుచ్చారణ గలిగి యుండెడి నని తోఁచుచున్నది. 'న్యాన్' లోని యచ్చు తెలుఁగునకుఁ గ్రొత్తది కాదు. అది 'తాట్యాకు' 'పుల్ల్యాకు' అనుపదములలోని యచ్చు వంటిదే.

ఇఁక 'ఏన్' అను రూపమును గురించిన వింత చూడుఁడు. దీనికిఁ దెలుఁగునఁ బ్రథమావిభక్తియందుఁ దప్ప నితర విభక్తులలోఁ బ్రయోగము లేదు. 'ఏన్' పదముయొక్క షష్ఠీరూపము చెప్పుమని యడుగుటకు వీలు

లేదు. అప్పుడు 'నాకు' అన్న 'నాఙ' పదముయొక్క షష్ఠిరూపము చెప్ప వలెనే గాని వేఱురూపము కానరాదు. కావునఁ దెనుఁగున 'ఏఙ' రూపము లన్నియు (ఒక్క ప్రథమ తప్ప) నశించినవి. 'నాఙ' రూపములే మిగిలి యున్నవి.

బహువచనరూపములను గుఱించియు నిట్టి విశేషములే కలవు. 'ఏము' రూపము ప్రథమయందే కానవచ్చును. ఇతర విభక్తులలో నీ రూపము కాన రాదు. 'నేము' అనునది ప్రాచీనగ్రంథములలోఁ గూడ నరుదుగ వచ్చును. ప్రథమావిభక్తిలో 'మేమ్' అన్న ఏకారయుక్తరూప మున్నను నితర విభక్తు లలో 'మా' అను రూపమే కలదు. 'మనము' అనునది యుత్తమ మధ్యమ పురుషులను సూచించును.

ఇఁక నితర ద్రావిడభాషలలోని రూపములను విచారించి పోల్చి చూతము.

అఱవము:—అఱవభాషలోని మిక్కిలి పురాతనరూపములు ఏకవచ నమునందు 'యాఙ' బహువచనమునందు 'యామ్', 'నామ్'. ఇవి 'తొల్ గాప్పియమ్'* లోని రూపములు. ఇవి మనతెలుఁగులోని 'ఏఙ' 'ఏమ్' అను రూపములకు సంబంధించిన వని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. 'నాఙ' అను

---

*ఇయ్యది అఱవమందలి మిక్కిలి పురాతనవ్యాకరణము. ఇది క్రీ. శ. ౨వ శతాబ్దములోని దని సాధారణముగ నందఱు నొప్పుకొనియెదరు. కాని యిది యింకను బురాతన మనియు క్రీ. శ. మునకుఁ బూర్వపుది యనియుఁ గొందఱు పండితు లిటీవల వాదించుచున్నారు. వారివాద మింకను జర్చింపఁ బడవలసి యున్నది. తొల్ గాప్పియమ్ అనుదానిలోని 'గాప్పియమ్' అను నది కావ్యమ్ అనుసంస్కృతపదమునకుఁ దద్భవము. తొల్ కాప్పియమ్ అను నాఁ బ్రథమకావ్య మన్నమాట. అఱవవారి వింతతద్భవముల కిది యొకయుదా హరణము.

రూపము మొదట నెనిమిదవ తొమ్మిదవ శతాబ్దములలోని వాఙ్మయమునందుఁ గానవచ్చును. ఆభాషయందు మొదట 'నాన్' అనురూపము వ్యావహారిక భాషలో మాత్ర ముండెననియుఁ గొన్నిదినములవఱకు లాక్షణికులు దానిని గ్రహింపలే దనియుఁ, బిదప గ్రహించి రనియు, 'యామ్' అను బహువచనరూపమును మొదట గ్రహించి పిదప 'యాన్' అను నేకవచనరూపమును గ్రహించి రనియుఁ దజ్ఞులయభిప్రాయము †

ఇట్లు అఱవమునందు 'ఏన్' 'నాన్' అనురూపములు రెండు నున్నను నివి తెనుఁగులోవలెనే ప్రథమావిభక్తికడకే గానవచ్చును. ఇతరవిభక్తులందు, ఏకవచనమునందు రెండురూపములు కనఁబడుటకు మాఱుగా, ఒక్క 'ఏన్' రూపములే కానవచ్చుచున్నవి. తెలుఁగులోనువలె 'నాన్' రూపములు కానవచ్చుట లేదు. ఎన్నై, ఎన్నాల్, ఎనక్కు, ఎన్నిడత్తిల్, ఎన్నుడయ, ఎన్నిల్ అనునవి అఱవమునందు, గ్రామ్య గ్రాంథికభాషలలోఁ గలద్వితీయాది రూపములు 'నాన్' రూపము లెచ్చటను గానరావు. కావున మూలద్రావిడ భాషలో 'ఏన్' 'నాన్' అను రెండురూపము లుండెననియు, నందుండి చీలి నప్పుడఱవవారు 'ఏన్' రూపమును గ్రహించి రనియుఁ, దెలుఁగువారు 'నాన్' రూపమును గ్రహించి రనియు మన మూహింపవచ్చును. ప్రథమావిభక్తియందు నీరెండురూపములు నీరెండుభాషలందు గ్రంథాదులలో నేఁటివఱకును గలవు. కాని వ్యావహారికభాషయందుమాత్ర మీరెండుభాషలలోను 'ఏన్' రూపము లోపించి 'నాన్' 'నేన్' రూపమే నిల్చి యున్నది.

ఇఁక ననేకవచనరూపములను విచారింపగా, యామ్, నామ్, నాంగళ్ అనునవి కానవచ్చుచున్నవి. కాని 'యామ్' అనురూపము, అనఁగా మన తెలుఁగులోని 'ఏమ్' అనురూపమునకు సజాతీయమైనరూప మిప్పటిభాషలో లేదు. ఇది పురాతనరూపము. 'నాంగళ్' అనునది ఆధునికరూపము. ఇది యిప్పుడు 'మేమ్' అనిన యర్థమునందు వాడఁబడుచున్నది. పూర్వము 'యామ్'

† **Dravidic Studies No. II.**

అనునది వాడఁబడుచుండెను. 'నామ్' అనునది 'మన' అనునర్థమునందుఁ బ్రయోగింపఁబడును. ఇది తెనుఁగు 'నేమ్' అనుదానికి సంబంధించినరూపము. ఇది ప్రథమావిభక్తికి సంబంధించిన నియమము. ద్వితీయాదివిభక్తుల బహు వచనమునందు ఏం, నాన్ రూపములు కలవు. ఏం రూపములన్నియు 'మేమ్' అనునర్థమందును 'నాం' రూపములన్నియు 'మనము' అనునర్థమునందును వ్యవ హరింపఁబడుచున్నవి.

కన్నడము:—కన్నడమునందలి మిక్కిలిపురాతనరూపము ఏకవచనము 'ఆన్'. అనేకవచనము 'ఆమ్', ఇవి తెనుఁగులోని ఏన్, ఏమ్ తోఁ సజాతీయ ములు. ఇందువలనఁ జూడ నీశబ్దము ఆన్, ఆ్యన్, ఏన్ అని మూఁడువిధముల నుచ్చరింపఁబడు చుండెననియు, ఆన్ అను రూపము కన్నడమువారిదని, ఏన్ అనురూపము తెలుఁగువారిదని, ఆ్యన్ అనురూప మఱవవారిదియు నని కాన వచ్చుచున్నది. ఈయుచ్చారణములే నాన్, న్యాన్, నేన్ లోఁ బ్రతిఫలించి నవి. న్యాన్ రూప మిప్పు డేభాషలోను సలక్షణరూపముగ గ్రహింపఁబడుట లేదు. గ్రామ్యభాషయందుఁ గానవచ్చుచున్నది. ఈ 'ఆ్యం' మరల 'ఏన్' రూపమును గ్రహించెను. ఇట్లు ప్రథమావిభక్తిరూపములను గుఱించి విచారించి ద్వితీయాది రూపములకు వత్తము. 'ఏన్' అనునది ద్వితీయాదివిభక్తు లన్నిటి యందును ఎన్ అను హ్రస్వరూపమును దాల్చును. ఎన్నం, ఎన్నిం, ఎనగె, ఎన్నత్తణిం, ఎన, ఎన్నోళ్ - ఇవి పురాతనపు ద్వితీయాద్యేకవచనరూపములు. ఎమ్మం, ఎమ్మిం, ఎమగె, ఎమ్మత్తణిం, ఎమ అనునవి బహువచనరూపములు.

కన్నడమునందు నొకవిశేషము. ద్రావిడులలో భాషావిషయమై అఱవ వారు 'ఏన్' తెగవారనియు, తెలుఁగుశాఖవారు 'నాన్' తెగవారనియు నే నిదివఱకుఁ జెప్పియున్నాను. కన్నడమువారు మొదట 'ఏన్' తెగలోఁ జేరినవారుగ నుండి తరువాత 'నాన్' తెగలోనికి వచ్చి చేరిరి. పురాతనకాలపు కర్ణాటకవాఙ్మయమునందు నాన్ రూపము లేదు. అంతటను ఆం, ఆన్, ఏన్ రూపమే కానవచ్చును. ౧౧, ౧౨ వ శతాబ్దములతరువాత 'నాన్' రూప

ము ప్రవేశించెను. అయినను పెక్కుదినములవఱకును లాక్షణికులు దానిని వెలి వేసియే యుండిరి. ౧౭, ౧౮ వ శతాబ్దములలో వ్రాయఁబడిన వ్యాకరణ గ్రంథములలోఁగూడ 'ఏఁ' రూపములనే యుదాహరించిరి. భట్టాకలంకుఁ డనువాఁడు కర్ణాటభాషకు సంస్కృతమున శబ్దానుశాసన మన్న గొప్పవ్యాకరణము వ్రాసెను. అది యనేకవిధముల నాంధ్రభాషావిదులకు నుపయోగకరమైనది యని నాతాత్పర్యము. అందు నే 'ఏఁ' 'నాఁ' రూపములను గుఱించి చెప్పఁబడినవిషయము ద్రావిడభాషాచరిత్రపరిశోధకులు చక్కఁగ గమనింపఁ దగినది. ఇది ౧౭వ శతాబ్దమున వ్రాయంబడిన గ్రంథమైనను ౨౮౭వ సూత్రము నందు 'ఏఁ' రూపములే యీయఁబడినవి. కాని యీతనికి 'నాఁ' రూపములు గూడ సమ్మతములే. అయినను వానిని స్పష్టముగా నొప్పుకొని మూల-సూత్రములో వానికిఁ దావిచ్చినయెడల నితరవైయాకరణులు తనను నిందింతురన్న భయమునకో మఱి యేహేతువునకో సూత్రములో నీరూపముల నీయక అందుపై తానే వ్రాసినటీకలో మాత్ర మీరూపముల నుదాహరించి, యివిగూడ నంగీకరింపఁదగిన వని చర్చించినాఁడు. అందలి కొన్ని వాక్యముల నిచ్చట నుదాహరించుచున్నాను.

“అత్ర తనాదిప్రకరణే అస్మదర్థవాచకో 'నఁ' శబ్దః కశ్చి దస్తి. ప్రక్రియాపి తస్య తనాది సాధారణోక్తలక్షణేన నవిలక్షణా. రూపనిష్పత్తిశ్చ నాఁ, నామ్; నన్నుం, నమ్మం; నన్నిం, నన్నిందె; నన్నిందుం......ఇత్యాది ప్రయోగాశ్చ” అని యీరూపములు ప్రామాణికకవులచేఁ బ్రయోగింపఁబడిన వని చూపుటకుఁ గొన్నిప్రయోగములఁ జూపెను. 'ఇతి బహుశ మపి లభ్యతే' అని కొన్ని పూర్వపక్షముల ఖండించి యిట్లనియెను. “అతోఽత్రాస్మదర్థవాచకో నఁ శబ్ద ఏవ అభిమన్తవ్య ఇతి. తథాపి స కైశ్చిదే వాఙ్గీక్రియతే ఉత్తరమార్గానుగామిభిః కవీశ్వరై నఁ సర్వైః. దక్షిణమార్గానుయాయిభి స్తైరనంగీకారాత్. ఏ వ్వక్షపాతినో హిదాక్షిణాత్యాః కవిజనాఇతి.”

పైవాక్యములవలనఁ గన్నడకవులలో నుత్తరసంప్రదాయమువారనియు, దక్షిణసంప్రదాయమువా రనియు రెండుతెగ లుండెననియు, వారిలో నుత్తర సంప్రదాయమువారు మాత్రము 'నాను' రూపము నంగీకరించి రనియు, దక్షిణ సంప్రదాయమువారికి 'ఎన్' రూపమునందే పక్షపాత మనియు స్పష్టపడుచు న్నది. కన్నడదేశమందలి యుత్తరభాగము తెనుఁగుదేశమునకు సమీపముందుం డుటయు, దక్షిణభాగ మఱవదేశము నంటుకొని యుండుటయు సువిదితమే. కావునఁ దెనుఁగువారినుండి కన్నడమువారు 'నాన్' రూపము నిటీవల— అనఁగా ౧౦, ౧౧వ శతాబ్దములనుండి—గ్రహించిరనియు, నంతకుఁబూర్వ మఱవదేశములో వాడుకలోనున్న 'ఏన్' రూపము కొంతకాలము ఆం (ఆన్) రూపముగాను, తరువాత 'ఎన్' రూపముతోను కొంతకాలముండి తరువాత క్రమముగ లోపించి, నేఁడు కన్నడదేశమునందు 'నాన్' రూపమే మిగిలినద నియు 'ఏన్' రూపము పూర్తిగ లోపించిన దనియు మన మూహింపవచ్చును. ఇట్లు తెలుఁగుభాష కన్నడముపైఁ దనముద్ర వేసెను.

మొదట ద్రావిడభాష యనుమహానది రెండుశాఖలుగఁ జీలెను. ఒకటి 'ఏన్' శాఖ, రెండవది 'నేన్' లేక 'నాన్' శాఖ. మొదట కన్నడము 'ఏన్', శాఖలోనుండి చీలినపాయయె. కాని తరువాత పాఱుచువచ్చి, 'నాన్' శాఖ లోనో, అందుండి చీలివచ్చిన పాయలోనో కలిసినది. కృష్ణాగోదావరులు స్వతంత్రనదులైనను వానిలోనుండి వచ్చిన కాల్వలు కలిసికొనుట మన మెఱింగిన విషయమె.

మళయాళాదిభాషలు:—మలయాళభాషయందలి యీశబ్దముల రూపములను విచారించినను, అందును నాన్, ఏన్ రూపములు కానవచ్చుచున్నవి. ఏకవచనమునందు 'ఞాన్' అనురూపము గలదు. బహువచనము నామ్, నోమ్, నమ్మల్, ఞాఙ్ఙల్, ఎఙ్ఙళ్. చివరరూపమునకు గ్రామ్యమునందు నెక్కుడు ప్రచార మున్నది.

తుళుభాషలో ఏకవచనము 'యాను', బహువచనము 'యెంకుళు'. [illegible] బహువచనప్రత్యయము. ఏకవచనమునందలి 'యాను' అనునది పురాతన

కాలపు తుళువమునందలి రూపముతో సమానమైనది. బహువచనమునందలి రెంటను లోని మొదటిరూపమే సత్యము, కావున 'ఏన్' అరవభాషలోఁ గలరూపమును, 'యాన్' అనిన అఱవములోఁ గలరూపము 'అం' 'అన్' అన్న కన్నడరూపములును ఏకశబ్దభవము లనుట స్పష్టము. అట్లే 'న్యాన్, నేన్, నాన్ అన్న రూపములుగూడ నొక్కటిలో నుండి మఱియొక్కటి జనించిన వనియుఁ జెప్పవచ్చును.

ఇట్లు ముఖ్యములైన ద్రావిడభాషలలో నన్నింటిలోను ఏన్ రూపము, 'నాన్ రూపము కలదు. కొన్నిటిలో నాన్ రూపప్రాధాన్యమును, కొన్నిటిలో ఏన్ రూపప్రాధాన్యమును గానవచ్చుచున్నది.

ఇఁక ద్రావిడశాఖలోని అనాగరకభాషలను గుఱించి విచారించినయెడల, కోలవభాషలలో ఏకవచనము నా, నాను; బహువచనము నాగ. నైకాడిభాష ఏక. నా, నాన్; బహు. నానాగ్. తోదభాష ఆన్, అన్, ఓమ్' ఎమ్. కురుఖ్ భాష ఏక. ఏన్; బహు. ఏమ్, నామ్. మాల్టోభాష ఏక. ఏన్. బహు. ఏమ్. ద్వితీయాదిరూపములలో నన్ రూపము వచ్చును. ఇది అఱవ సంప్రదాయమునకు వ్యతిరేకము. అందు నాన్ రూపము ప్రథమావిభక్తియందు మాత్రము గానవచ్చును. ఇతర విభక్తులలో ఏన్ రూపమే ప్రధానము. కోయభాష, ఏక. ఆను, బహు ఆము, ఆజు. ద్వితీయాది విభక్తులలో 'నన్, నా' రూపములు. బహువచనమందు మన్, మా. గోండిభాషలో ఏకవచనమందు నన్నా, అన్నా అను రెండు రూపములు గలవు. బహువచనమందు మమ్మాట్ అను ఒక రూపమే కలదు. ద్వితీయాది రూపములలో నేకవచనమునందు 'నా' బహువచనమునందు 'మా' రూపములు కలవు.

ఇట్టి వేఱువేఱు భాషలలోని రూపములను దెలిసికొనిన తరువాత వీనికిఁ గల భేదములను సంబంధములను గుఱించి విచారింతము. ఈ రూపము లన్నియు నొక్కచోటఁ గనఁబడుటకై ప్రక్కపుటలోఁ బట్టికగ నిచ్చినాఁడను.

మొదట నేకవచన రూపములను గుఱించి చూడఁగాఁ దెనుఁగు, అఱవము, కన్నడము, మళయాళము ఈ నాలుగు నాగరక ద్రావిడభాషలలోను ఏన్ నాన్ ఈ రూపములు రెండును గానవచ్చుచున్నవి. అఱవమునందు నిప్పుడు ప్రథమైకవచనమునందు 'ఏన్' లేకపోయినను పూర్వకాలమునందు 'యాన్' అను రూప ముండెను. కన్నడమునందు 'ఆన్' రూప ముండెను.

'ఏన్' 'నా' అను రెండు రూపములును మొదటినుండి యుండెనా? లేక యొకదానినుండి మఱియొకటి పుట్టెనా? ఉత్తమపురుషవాచక సర్వనామములు భాషలో నొకటికంటె నెక్కుడుండవలసిన యావశ్యకత లేదు. ఒక్కటి యుండినఁ జాలును. కావున మూలభాషలో మొదట నొక్కటియే యుండెననియుఁ, దరువాత నందుండి రెండవది పుట్టెననియు నూహింపవలెను. రెండును స్వతంత్రము లని యనుకొనుటకు వీలులేదు. కాని యీ రెండు రూపములును మిక్కిలి పురాతనకాలమునుండియుఁ గానవచ్చుచున్నవన్నమాట మఱవరాదు. ద్రావిడభాషాగ్రంథములలో మిక్కిలి పురాతనమైన తొల్గాప్పియమునందు నాన్, యాన్ ఈ రెండు రూపములును గలవు. కురళ్ గ్రంథమునందు యామ్, నామ్ అను రెండు బహువచనరూపములును గలవు. కావున మొట్టమొదట నొక్కరూప మున్నను ఈ రెండు రూపములును మిక్కిలి పురాతన కాలముననే యేర్పడిన వని తలంపవలెను. గ్రంథము లేర్పడు వఱకు నీ రెండురూపము లున్న వన్నంతమాత్రమున నవి మొదటినుండియు నుండె నని తలంపఁ గూడదు. తొల్గాప్పియం క్రీ. శ. ౭ వ శతాబ్దపు నాఁటి దని కొందఱు చెప్పెదరు. మఱికొందఱు అఱవభాషలో మిక్కిలి పురాతన కాలముననే వాఙ్మయము ముండెనని చెప్పువారు, ఈ కావ్యము క్రీ. శ. ౧ వ శతాబ్దమునాఁటి దని యనియెదరు. ఈ వాద మెట్లున్నను ద్రావిడభాష యంతయుఁ బూర్వము కనీసము ౧౦౦౦ సంవత్సరముల క్రిందనైన నుండి తీరవలయును. కావున నేకరూపము గల కాలము వాఙ్మయము పుట్టుట కెంతయో పూర్వపుది యై యుండవలెను. వాఙ్మయము పుట్టువఱకే యీ

రెండు రూపములు పుట్టియున్నను నందు మొదటిది యెద్ది తరువాతిది యెద్ది యని కనుఁగొనుటకు వాఙ్మయమునందు సూచనలు కలవు.

| భాష. | ఉత్తమపురుష వాచక సర్వనామము. | | ద్వితీయాదికముల ప్రాతిపదిక రూపము. | |
|---|---|---|---|---|
| | ఏక వచనము. | బహువచనము | ఏకవచనము. | బహువచనం |
| ౧. తెలుగు . | ఏను, నేను, | ఏము, నేము, మేము, మనము | నా. | మా. |
| ౨. అఱవము . | యాన్, నాన్. | యామ్, నామ్, నాంగళ్. | ఎన్. | ఎన్, నమ్, |
| ౩. కన్నడము . | ఎన్, ఆం, (ఆన్), నాన్. | ఆం, ఆవు, నావు. | ఎన్, నన్. | ఎమ్, నమ్. |
| ౪. మలయాళము. | ఞాన్. | నామ్, నోమ్, నమ్మళ్, నుమ్మళ్ | ఎన్. | నన్, నమ్. |
| ౫. తుళు . | యాన్. | ఎంకులు, నమ. | యెన్. | నమ్. |
| ౬. గోండి . | అన్నా. | అమ్మాట్. | నా. | మా. |
| ౭. కోదు . | ఆను. | ఆజు, ఆము. | నన్. | మన్. |
| ౮. కురుఖు . | ఏన్. | ఏమ్, నామ్ | ఎన్. | ఎమ్. |
| ౯. సంస్కృతము. | అహం. | వయమ్. | మ. | అస్మ. |
| ౧౦. హిందీ . | మైఁ. | హమ్. | మేరా | హమారా. |
| ౧౧. బంగాలి . | ముయ్, ఆమి. | ఆమరా, మోరా. | ఆమా. | ఆమాది. |
| ౧౨. మరాటి . | మీఁ. | ఆమ్హీఁ. | మా. | ఆమ్. |
| ౧౩. పాలి . | అహం | మయం, అమ్హే. | మ. | అమ్హా. |
| ౧౪. ప్రాకృతము. | అమ్మి. | అమ్హే. | మ. | అమ్హా |

'అణ్' 'నాణ్' లో మొదటఁ బుట్టినది యెద్ది? 'యాణ్' కు మొదట 'న' కారము చేరి 'నాణ్', పుట్టెనా? లేక 'నాణ్'లోనుండి మొదటి 'న' కారము జాఱి 'యాణ్' లేక 'అణ్' (ఏణ్) * అయెనా? మొదటిది 'ఏణ్' రూపమే యనియు, నాణ్ లేక నేణ్ తరువాతిది యనియుఁ దోఁచుచున్నవి. ఇందుకుఁ గారణములు:—

౧. పురాతనగ్రంథములలో 'యాణ్' 'నాణ్' రూపములు రెండును గానవచ్చినను 'యాణ్' రూపమున కెక్కుడు ప్రచారమును గౌరవమునుగలదు. ప్రాఁతగ్రంథములలో బహువచనరూపము 'నామ్' కానవచ్చునేగాని యేకవచనరూపము 'నాణ్' కానరాదు. 'యామ్' అనునదియుఁ గానవచ్చును. 'నాం' అయినను విశేషపర్యాయము లుపయోగింపఁబడెను. కుఱళ్ అనుగ్రంథరాజమందు 'యామ్' అను పదము ౧౫ సారులువచ్చెను. 'నామ్' అనునది ఒక్కపర్యాయమే వచ్చెను. నాలుగైదు శతాబ్దముల తరువాతఁగాని 'నాణ్' అను నేకవచనరూపము ప్రచారమునకు రాలేదు.

౨. కన్నడమున మొదట 'నాణ్' అను రూపము లేనేలేదు. పూర్వగ్రంథములలో నన్నింటిలోను 'ఏణ్' రూపములే గలవు. ౧౦–౧౧వ శతాబ్దములందుఁగాని 'నాణ్' రూపములు వాడుకలోనికి రాలేదు.

3. కుయి, కొలామి, కురుఖ్, మాల్టో భాషలలో నేకవచనమందు నేఁటివఱకును 'నాణ్', రూపములు లేవు. 'అణ్', 'ఏణ్', రూపములే యున్నవి.

౪. తెనుఁగునందు 'ఏణ్' రూపములు లోపించినను పురాతన గ్రంథములలో 'ఏణ్', రూపము (ప్రథమ) ఉండుటయు, దానికి మనభాషలో 'నేణ్'

* ఈరూపము లన్నియు అఱవము, కన్నడము, తెలుఁగు మొదలగున భాషలలో ఒకే శబ్దమును ఉచ్చరించు వేఱువేఱు విధములు గనుక వానిఁ బ్రత్యేకముగ వ్రాయుచున్నాను.

కంటె నెక్కుడు గౌరవ మునుటయుఁ జూడ 'ఏన్' పురాతన మని తోఁచు చున్నది.

ఈకారణములఁబట్టి, మూలద్రావిడభాషలలో మొదట 'ఏన్' రూప మొక్కటియే యుండె ననియు, మూలభాష వేఱువేఱు శాఖలుగా మాఱు నాఁటికి దానికి 'నాన్' రూపము రా మొదలిడె ననియుఁ, గొన్ని యారూపమును, గొన్ని యీరూపమును, గొన్ని యుభయరూపములను గ్రహించె ననియు, 'నాన్' పక్షపాతు లాంధ్రులనియు, 'ఏన్' పక్షపాతులు ఉఱవవార నియు మన మూహింపఁగలము.

ఇట్లు 'ఏన్' అనునది మూలశబ్ద మని తెలిసికొనిన పిదప దీనిస్వరూప మును గుఱించి విచారింతము. అఱవమున యాన్, తెనుఁగున ఏన్, కన్నడ మున ఆన్, అని యివి యుచ్చరింపఁబడును. అఱవమందలి యాశ్రుతి లఘువుగాన నది 'ఆ' కారముతో సమానమే. అఱవమందలి ఆకారము తెనుఁగునందు ఏకా రముగ మాఱిన యుదాహరణములు పెక్కులు కలవు. ఆఱు, ఏఱు; ఆళు, ఏలు; తా తే; అఱుక, ఎఱుక; అప్పు, ఏను ఇత్యాది. కాని యీయక్షరము తెనుఁగునందు మాత్రము ఏగా మాఱి యూరకుండలేదు. అఱవమునసే ద్వితీయా దివిభక్తులనుండి 'ఏన్' రూపమునే గ్రహించినది. కురుఖ్, మాల్టొభాషలలో ఏన్ రూపమును బొందినవి. కావున మూలభాషలలో నీయక్షరము కేవలము ఆకారముగ మాత్రముండెనని తోఁపదు. ఆకారమునకు ఏకారమునకు మధ్య గానుండి యుండవచ్చును. అందుచే నది కొన్ని చోటుల ఆకారముగను, కొన్ని చోటుల ఏకారముగను మాఱినది. ఒక్క భాషలోనే కొన్ని రూపములలో ఆకా రముగను, కొన్ని రూపములలో ఏకారముగను మాఱినది. తెనుఁగునందు 'నేను' లో ఏకారముగను, నాకు నాయొక్క యిత్యాదులలో ఆకారముగను మాఱినది. కావున నీధ్వనియొక్క మూలోచ్చారణ నేను పూర్వము సూచించినట్లు, 'కాట్యాకు' లోని రెండవస్వరములాగున నుండి యుండును. భాషకు నాగరకత వచ్చి యక్షరసమామ్నాయము లేర్పడు నప్పుడీ ధ్వనిని లక్షణ

వేత్త లంగీకరింపక విడిచివేసిరి. ఈయుచ్చారణ యిప్పటికిని గ్రిందితరగతిజాతులవారిలోఁ గానవచ్చుచున్నది. 'నేను' అనుటకుఁ గొందఱు 'న్యాౝ' అందురు.

ఇఁక నీ స్వరము హ్రస్వమా, దీర్ఘమా యని విచారింపవలెను. కర్ణాట వ్యాకరణాదులలో 'ఎౝ' 'నిౝ' 'తౝ' అనునవి మూలశబ్దము లయినట్లును, ఏౝ, నీౝ, తాౝ అనునవి ప్రథమారూపము లయినట్లును వ్రాయఁబడియున్నది. అఱవమునందలి ద్వితీయాదిరూపములలో హ్రస్వ ఎౝ రూపమె కానవచ్చుచున్నది. ప్రాఁతకన్నడమునందును, తుళువునందును, మాల్టో భాషలోను ద్వితీయాదుల కీ రూపమే కలదు. తెనుఁగున నన్ని విభక్తులందును దీర్ఘముగ నున్నను ద్వితీయయందు 'నను' అను హ్రస్వస్వరము కానవచ్చుచున్నది.

కొందఱు మతమున మొదట ఏౝ అన్న దీర్ఘరూపమె కల దనియుఁ, దరువాత ద్వితీయాదిప్రత్యయములు తగిలినప్పు డూఁత రెండవ యక్షరముపైఁ బడినందునఁ గ్రమముగ మొదటియక్షరము హ్రస్వమై పోయెననియు అనఁగాఁ బూర్వము తెనుఁగున నాను అనురూప ముండి తరువాత నను ఆయెను అని. మొదట 'ఎౝ' అనుహ్రస్వరూపమె యుండెనని కాని, ఏౝ అనుదీర్ఘరూపమె యుండెనని కాని నిశ్చయముగఁ జెప్పుటకువీలులేదు. ద్రావిడభాషలన్నిటిలోని రూపములను బరికించిచూడఁగా 'ఏౝ' అను దీర్ఘరూపమె మొదటినుండి యుండెనని తోఁచుచున్నది.

ఇఁక మన నిత్యపరిచితమైన 'నాౝ' రూపమును గుఱించి విచారింతము. ఇది 'నేౝ' అను ఏత్వముగలిగి యొక్క తెనుఁగులోనే కానవచ్చుచున్నది. ఇతర భాషలలో 'నాౝ' అను ఆకారరూపమె గలదు. తెనుఁగునందలి ద్వితీయాది విభక్తిరూపములలోని మూలశబ్దమును జూచినను 'నాౝ' రూపమె కానవచ్చును. కావున మొదట 'నాౝ' లేక 'న్యాౝ' రూప ముండవచ్చును.

'నాౝ' లో లేక, నేౝ లో మొదట నొకనకారమును జివర నొకనకారమును గలవు. ఇవి రెండు మొదటినుండి యుండెనా? ఇవి శబ్దస్వరూపము

నను నాకర్మకము లని యెంచఁబడుచుండెనా? మొదటిది ఏన్ శబ్దమనియు దానికి మొదట నకారము చేరి నేన్ అయ్యెననియు మన మిదివఱకుఁ దెలఁసితిమి. ఇందుకు నింకొక దృష్టాంతము కలదు. ద్రావిడభాషల నన్నింటిలోను క్రియాపదముల చివర ప్రత్యయములు పురుషవాచక సర్వనామములను బట్టి వచ్చినవి. అందు అఱవ, మలయాళ, కన్నడ, తుళు, కుయి, గోండి మొదలయిన యన్నిభాషలలోను ఎన్ గా నాన్ గా నెన్ గా లేదు. తెనుఁగునఁ గూడ ఏన్' ఇ' అన్ అను ప్రత్యయములే కలవు. కావున నకారము వెనుక నుండివచ్చినదని మనము నిశ్చయింపవచ్చును. ఇట్లు శబ్దారంభమున అచ్చులుగ నున్న యుత్తమములకు మొదట నకారము వచ్చి చేరుట మఱికొన్నిశబ్దముల యందుఁ గానవచ్చుచున్నది. మధ్యమపురుషవాచకములు ఈవు, నీవు అనునవి యిట్టివియే. తెలుఁగున ఈఁదు అనుశబ్దము కలదు. దీనికి నఱవమున నీన్దు అన్న రూప మేర్పడినది. ఇట్లే ఏన్ నేన్ అయి యుండవచ్చును. ఇందు నొకనియమము కానవచ్చుచున్నది. మొదటియచ్చు తరువాత నకార మున్నయెడల దానిసాహచర్యమునుబట్టి అచ్చునకు బూర్వమందును నకారము వచ్చి చేరును. ఈఁదు లో నఱసున్న యున్నది. కావున నది మొదట ఈన్దు నదే మనున్న నకారప్రభావమునఁ బూర్వమందు నొకనకారము వచ్చెను. న్ + ఈన్దు = నీన్దు' ఇట్లే ఈవు నీవుల గుఱించి యెఱుఁగవలెను. ఇందచ్చునకుఁ దరువాత నకారము లేదని చదువరులు సంశయింపవచ్చును. కన్నడమునందు ఏకవచనము నీను (నీన్) బహువచనము నీవు. కన్నడమందలి బహువచనమే తెనుఁగున ఏకవచన మయ్యెను. మొదట గౌరవార్థముగ నుండు మధ్యమపురుషబహువచనము తరువాత నేకవచనముగ మాఱుట పెక్కుభాషలలోఁ గలదు. ఇంగ్లీషునందు యూ (you) అనుబహువచనము ఇప్పుడు ఏకవచనార్థమందు వాడుచున్నారు. అట్లే తెనుఁగున మొదట నీన్ అను ఏకవచనమును నీవు అను బహువచనమును

ఉండెనోపు*. నీన్ యొక్క మొదటిరూపము ఈన్ అనుట స్పష్టము. ఇట్లు 'ఈన్' లోని చివర నకారప్రభావమున బూర్వమందు నొక నకారము వచ్చి చేరెను. కావున నీయుదాహరణములవలన నైనిమును మేర్పడుచున్నది.

ఇక 'నేన్' లోని రెండవ నకారమును గుఱించి విచారింతము. ఇది శబ్దస్వరూపములోనిదా? ప్రత్యయమువంటిదా? ఇది శబ్దస్వరూపములోనిది కానట్టు కానవచ్చుచున్నది. ఇది యేకవచనమునందే కాన్పించును. బహువచనమునందు గాన్పింపదు. నేను నేము మేము, ఏను ఏము. అఱవమునందును మఱి కొన్ని ద్రావిడభాషలందును 'న్' అనునది పుల్లింగమును సూచించునట్టి యేక వచన ప్రత్యయము. ఏక. రామన్, బహు. రామర్. తెనుఁగున నీ నకారము ద్రుతము. అనఁగా నిది లోపించి 'నే' 'ఏ' అను రూపములు మాత్రము నిల్చి యుండుట గలదు. ఇట్టి కారణములఁ బట్టి మూడవ నిది మొదట నేకవచన సూచకముగ వచ్చిన దని తోఁచుచున్నది.

ఇట్లు మొదటి నకారమును జివరి నకారమును బోఁగా నిక మధ్య 'ఏ'కారము నిల్చినది. ఇదియే మొట్టమొదటి యుత్తమ పురుషైకవచన సర్వనామము. ఇది కొన్ని భాషలలో 'ఏ' గను, కొన్నిఁటిలో 'యా' లేక 'ఆ' గను నుండుటచే దీని యుచ్చారణము మొదట 'ఆ' అని గాని 'ఏ' అని గాని స్పష్టముగా లేక యా రెండిటికిని మధ్యగా 'ఆ్య' 'యా' అని యుండె నని యూహింపవచ్చును. ఈ విధముగ మొదట నుత్తమపురుష సర్వనామమునకు 'ఆ్య' అను అచ్చును మధ్యమపురుష సర్వనామమునకు 'ఈ' అను అచ్చును ప్రథమపురుష సర్వనామమునకు 'ఆ' అను నచ్చును సూచకములుగ నుండినట్లు కానవచ్చుచున్నది.

---

*కొన్ని దినములకు బహువచనమే యేకవచనముగ మాఱి, ఏకవచన రూపము లోపించెను. అంతఁ గొంతకాలమునకు నిది బహువచన మన్నమాట పూర్తిగ మఱుఁగుపడి దానికి 'మీరు' అనిన క్రొత్త బహువచనము పుట్టెను. ఇది ఈర్ శబ్దమునకు మకారాదేశమై పుట్టెను.

ఇఁక బహువచనరూపములను గూర్చి విచారింతము. మేము, ఏము, నేము, అనునవి బహువచనరూపములు. వీనిలో ఏమ్ నేమ్ అనునవి యిప్పటి భాషలో లేవు. పురాతనభాషయందును వీని ప్రయోగములు తక్కువ. ఇవి యైనను ప్రథమావిభక్తియందె కానవచ్చుచున్నవి. కాని యితర విభక్తులకు సంబంధించిన రూపములు కానవచ్చుట లేదు. మేము, మనము అనినరూపములకే వ్యాప్తి కలదు.

'నేము' 'ఏము'లతోఁ బోల్పఁదగినవి, అఱవమందలి 'నామ్' 'యామ్' రూపములు. కన్నడమున నీరూపములు కలవు. 'మ'కారము బహువచనప్రత్యయము. వీనిలో 'యామ్' పురాతనము: 'నామ్' ఇటీవలిది. కాని తెలుఁగున ఈ 'నాం' లేక 'నేమ్' కూడఁ బురాతనమే. ఇట్లు తెలుఁగు 'ఏం, 'నేం' రెంటిని బరిత్యజించి 'మేమ్' 'మనమ్' అను శబ్దముల గ్రహించెను. ఈశబ్దముల విశేష మేమనఁగా బహువచనసూచక మగు చివరమకారము గాక యిందు మొదటి మకారముఁ గలదు. ఇట్టి తొలిమకార మితర ద్రావిడభాషలలో నెచ్చటను సర్వనామబహువచనమునందుఁ గానరాదు. ఇది తెలుఁగునందు మాత్ర మెట్లు వచ్చెను? కొంత శోధించి చూతము.

తెలుఁగునందలి 'మన' శబ్దమును తీసికొందము ఈపద మెదుటివానిఁ గూడఁ గల్పుకొని మాటాడిన ట్లర్థమిచ్చును. ఇది యుత్తమ, మధ్యమపురుష సూచకము. ఈ యర్థమునందే యఱవమున 'నామ్' శబ్దము వాడెదరు. 'మేము' అన్న యర్థమునందు 'నాంగళ్' రూపము వచ్చును. కన్నడమున నిప్పుడు వాడుకలోని రూపము 'నమ్' అనునదియే (ప్రథమతప్ప). ఈ శబ్దముయొక్క వేఱుభాషలలోని యీ క్రింది రూపములు చూడనగును.

| | తెలుఁగు. | అఱవము. | కన్నడము. |
|---|---|---|---|
| ద్వి. | మన(ను) | నమ్మ(ఐ) | నమ్మ(న్ను) |
| చ. | మన(కు) | నమ(క్కు) | నమ్మ(గె) |
| ష. | మన | నమ్ | నమ్మ |

ఈ రూపములను బట్టి చూడఁగా అఱవములోని 'నమ్' కన్నడము లోని 'నమ్మ' శబ్దములే (లేక వీనిపూర్వరూప మగు 'నమ' అనునదియో) అక్షరక్రమము మాఱి తెనుఁగులోని 'మన' అయిన దనుట స్పష్టము. తెనుఁగు నను, నితర ద్రావిడభాషలలోను (కొన్ని యార్యభాషలలోను) షష్ఠీ రూపమె ప్రాతిపదికము. దానిమీఁదనే యితర విభక్తిప్రత్యయములు వచ్చును. 'మన' అనునది ప్రాతిపదికముగ నేర్పడినతరువాత సర్వనామసంబంధమైన బహు వచనప్రత్యయమగు 'మ్' కూడ దానికిఁ దగిలించిరి. ఇట్లు 'మనము' నందలి రెండు మకారములును తెనుఁగునను సిద్ధించెను.

ఈతీరున "మనము" అన్న శబ్దమునకు వ్యాప్తి కలుగఁగా బహువచ నమునందు మొదట 'మ' కార ముండవలయును గాని, 'న' కారముండఁగూడదని తలఁచి 'నేము' శబ్దమును జాఱవిడిచి, 'మేము' శబ్దమును బుట్టించిరి. క్రమముగ 'మేము' 'మీరు' శబ్దములకే వ్యాప్తిగల్గి ఏము నేము శబ్దములు భాషనుండి లోపించెను.

మేము, మనము అను రెండురూపములు తెనుఁగున నున్నట్లే అఱ వము, మలయాళము మొదలయిన కొన్ని ద్రావిడభాషలలోఁ గలవు. కాని కన్నడమునందును, గోండిభాషయందును నిట్టి రూపద్వయము లేదు. సంస్కృ తమునందును ప్రాకృతమునందును గానరాదు. హిందీలో 'అపన్' మహారాష్ట్ర మున 'ఆపణ్' అను రూపము లీ యర్థమునందుఁ గానవచ్చుచున్నవి. కాని మొత్తముమీఁద నీ రూపములు గౌడీయభాషలందును విశేషముగ వ్యాపించి లేవు. ఇట్లు ద్రావిడభాషలకుఁ గాని యార్యభాషలకుఁ గాని చెందని యీ రూపద్వయ మెచ్చటిది యై యుండును? ఉత్తరమందలి యార్యభాషలకును, దక్షిణమందలి ద్రావిడభాషలకును నడుమ 'ముండ' నామము గల కొలేరియన్ భాషలు కలవు. ఆ భాషలలో నుత్తమపురుషబహువచనమందు నీ రూపద్వ యమును గలదు. కావున వారి సంపర్కమునఁ గొందఱు ద్రావిడులును, ఈ రూపమును గ్రహించియుందు రని కొంద ఱభిప్రాయ మిచ్చియున్నారు.*

*Grierson-Linguistic Survey of India Vol. IV.

కొంత ఆర్యులును వారి సంపర్కమున నిట్టి రూపములనే తీసికొనిరని నా తాత్పర్యము. ఇచ్చటఁ దీసికొని యున్నది శబ్దరూపము గాదు; శబ్దార్థము.

### సంస్కృతముతో సంబంధము.

ఇఁక సంస్కృతమందలి ఉత్తమపురుష సర్వనామమునకును, ద్రావిడ భాషలలోని దానికిని నేమైనఁ బూర్వసంబంధ ముండెనో యుండెనేమో విచారింతము. హిందూదేశమందలి భాషలన్నియు నార్య, ద్రావిడభాషలుగాఁ జీలి యున్నను నీ రెండు కొమ్మలును మఱియొక పెద్దశాఖలోనుండి చీలియుండిన నుండవచ్చును! ఇప్పుడు సంస్కృతము భాషగూడఁ బూర్వమున్న మఱియొక మూలభాషయొక్క వికృతియై యుండెనో. ద్రావిడభాషలకు మూలమైన భాషకూడ దాని చెల్లెలై యుండ నోపు. నిశ్చయముగఁ జెప్పుటకు వీలులేదు. అల్పస్వల్పమైన సాదృశ్యము లున్నందున నిట్లు లూహింపవలసి వచ్చుచున్నది. ఇఁక సాదృశ్యకల్పముల వెతికెదము.

అహమ్' అను పదమునకును, అఱవమందలి 'యాం' కన్నడమందలి 'అం' పదమునకును గొంత సామ్యము కలదని కొంద ఱనుకొనవచ్చును. తెలుఁగులోని 'ఏం' దీనిని పోలినది. ఇవి ద్రావిడభాషలలో బహువచనమును సూచించును. 'అహం' ఏకవచనమును బోధించును. కాని హిందీలోని 'హం' మరాటీలోని 'ఆమ్హీఁ' అనునవి 'అహం' భిన్నము లనుట సిద్ధము. అవియు బహుత్వమునె సూచించును.

*సంస్కృతమునందు నుత్తమపురుష బహువచనమునందు 'నః' అను ఒక రూపము కానవచ్చును. ఇది ద్వితీయా, చతుర్థీ షష్ఠీ విభక్తులయందుఁ గాన్పించును. ఈ విభక్తులందైనను ఇది రెండవరూపముగ వచ్చును. ద్వి. అస్మాన్, నః; చ. అస్మభ్యం, నః; ష. అస్మాకం, నః. ఈనకారమె ద్రావిడబాషలలోని 'నా' యను దానికి సజాతీయ మని కొంద ఱనుకొనవచ్చును.

అట్లె సంస్కృతమున ఏకవచనమునందు ద్వి. మా; చ. మే; ష. మే అను వైకల్పికరూపములు కలవు. అవియే 'మేమ్' 'మా' అను తెనుఁగు పద

ములకు సంబంధముకలవియని కొంద ఱభిప్రాయపడవచ్చును. ఇచ్చటను వచన వ్యత్యాసము కలదు. సంస్కృతమున 'మా' అనునది ఏకవచనము. తెలుఁగున బహువచనము. కాని యొక్క భాషలోనుండి మఱియొక భాషలోనికి మాఱు నప్పుడు వచనములు తాఱుమాఱగుట యొకవింత కాదు. ఇట్టియుదాహరణము లెన్నియో కలవు.

కాని 'నః' 'మా' అను రూపములు సంస్కృతమున వైకల్పికములు; సహజములు కావు అపవాదముపంటివి. సహజరూపములుండగా మీఁదుమిక్కిలి తెచ్చిపెట్టుకొనునవి. అన్ని విభక్తులలోను నీ రూపము కానరాదు. అహం యొక్క విభక్తిరూపము లన్నియుఁ గ్రింద నిచ్చుచున్నాఁడను.-

| | | | |
|---|---|---|---|
| ప్ర. | అహం | ఆవాం | వయం |
| ద్వి. | మాం, మా | ఆవాం, నౌ | అస్మాకం, నః |
| తృ. | మయా | ఆవాభ్యాం | అస్మాభిః |
| చ. | మహ్యం, మే | ఆవాభ్యాం, నౌ | అస్మభ్యం, నః |
| పం. | మత్ | ఆవాభ్యాం | అస్మత్ |
| ష. | మమ, మే | ఆవయోః, నౌ | అస్మాకమ్, నః |
| స. | మయి | ఆవయోః | అస్మాసు |

కావున నీ రూపములు సంస్కృతములోనికిఁ గ్రొత్తగ వచ్చినవనుట స్పష్టము. మొదట నుండినవి కావు. అందుచే ద్రావిడులయొద్దనుండియె సంస్కృత మీరూపములను గ్రహించెనని యేల తలంపరాదు? ద్రావిడభాషలలో నీరూపములు సహజములు. ఇవితప్ప వేఱు రూపములు లేవు. సంస్కృతమున వేఱురూపము లున్నవి. ఇవి మూఁడు విభక్తులందు మాత్రము సహజరూపము లను జతగా నున్నవి. 'నః' అనునది మూఁడు విభక్తులందును నేకరూపముగానె కలిగియున్నది. ఇది సంస్కృతమందలి మూలరూపమె యయినయెడల దీనికి భిన్నవిభక్తులలో భిన్నరూపము లుండవలెను. కావున దీనిని సంస్కృతము ప్రాకృతమునుండియైనను గ్రహించియుండవలయును లేదా యీ రెండుభాష

లకు జనని యైన మఱియొక పురాతనభాషలోనుండి యైనను నివి పుట్టియుండ వలెను.

మఱియొక సాదృశ్యము. ఈసాదృశ్యము గాక సంస్కృతమందలి యేక వచనరూపములను జూచితిమేని, ప్రథమా విభక్తియందుం దప్ప, నితర విభక్తు లన్నింటియందును 'మ'కారము ప్రాతిపదికముగా గానవచ్చును. గౌడభాషల లోను నీ యంశము ప్రాతిపదికముగా గానవచ్చును. కొన్నిటిలో 'మ'కారము గను, మఱికొన్నిటిలో 'మె'కారముగను నుండును. మరాటీ మలా (నాకు), మాఝా (నా). హిందీ మేరేకో (నాకు), మేరా (నా). ఈ మకార మిత రార్యభాషలలోను గలదు. తుద కింగ్లీషులోని మి (me) మై (నా) అను రూపములు మనకుం బరిచితములే. కాని యీ రూపములన్నియు నేకవచన మందే కానవచ్చును. తెలుంగులోను వలె బహువచనమునందుం గానరావు. తెనుంగు బహువచనమందలి యీ 'మ'కార మార్యభాషలలోనుండి వచ్చినదను కొనినయెడల, నేకవచనము ద్రావిడభాషలలోనుండియు, బహువచన మార్య భాషలలోనుండియు వచ్చినదనుకొనవలెను. అది యంతగ నొప్పుకొనం దగినది కాదు. కావున నీ సాదృశ్యము సహజమైనదా, లేక యసహజమైనదా యని చర్చ జరుగవలసియున్నది. ఇందును గుఱించి పండితు లెవరును నింకం జర్చించినట్లు లేదు.

---

# లక్ష్మణరాయవ్యాసావళి

## శాస్త్రవిషయములు.

---

### దేశభాషలలో శాస్త్రపఠనము*

తల్లిపాలు ద్రావి పెరిగిన బాలునకును, దాదిపాలు ద్రావి పెరిగినబాలునకు నెట్టిభేద ముండునో స్వభాషయందు శాస్త్రాభ్యాసము చేసినవారికిని బరభాషయందు జ్ఞానార్జనము చేసినవారికి నట్టిభేదమే యుండును. అన్య భాష మొదట నేర్చుకొని పిదప నాభాషయందు శాస్త్రములఁ గళలఁ జదువుకొనుట ద్రావిడప్రాణాయామమువంటిది. కాని యిట్టిప్రాణాయామమే మనదేశమునందుఁ బ్రస్తుతము జరుగుచున్నది. తర్కవేదాంతాదిపూర్వశాస్త్రముల నేర్చుకొనవలయు నన్న సంస్కృతము నేర్చుకొనవలెను. రసాయనపదార్థవిజ్ఞానాది శాస్త్రముల నభ్యసింపవలెనన్న నింగ్లీషు నేర్చుకొనవలయును. ఈభాషల నభ్యసించుటకుఁ గొంతకాలము వ్యయపఱుపవలెను. ఇవి మనమాతృభాషలు కానందున వీనినిఁ జక్కఁగ నభ్యసించుటకు విశేషముగాఁ బరిశ్రమము, కాలవ్యయమును, ధనవ్యయంబును గలుగుననుటకు సందేహములేదు. స్వభాషయందే యన్నివిద్యల నేర్చుకొనుమార్గము లుండినయెడల నీవ్యయప్రయాసములన్నియు దప్పిపోవునుగదా! ఉగ్గుపాలతో నేర్పఁబడిన స్వభాష సహజముగఁ బ్రతిమనుష్యునకు వచ్చును. కొద్ది పరిశ్రమతో దానినిఁ బ్రతిమనుజుఁడు నభ్య

---

* 'ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక'—ప్రమాదీచ సంవత్సరము, సం ౨, పుట ౧౭౮.

షించి యంతుఁ బండితుఁడు కావచ్చును. ఎట్టికఠినమైనగ్రంథమునైనను, విద్య నైనను, కళనైనను, దనభాషలో నుండెనేని మానవుఁడు సులభముగ దెలిసి కొనఁగలఁడు. అంతియె కాదు. ఆభాష నెఱింగిన వారియందఱిలో నాయా విద్యలు సులభముగను త్వరితముగను బ్రచరించి జనుల యున్నతస్థితికిఁ గారణ భూతములగును.

స్వభాషయందు విద్యలులేక పరభాష నభ్యసించి విద్యలసాధింపవలసిన వాఁడింటఁ దన్నములేక పొరుగిండ్లు తిరిగి యన్నమును సంపాదించినవానితో సమానుఁడు. మనదేశములో మనకు, అనఁగా బ్రాహ్మణులకు మొదటినుండియు బరాన్నమునుగోరుట విహితమైన ధర్మముగ నున్నందున మనవారికి యొకగొప్ప తప్పుగ నెంచకపోవచ్చును. కాని ప్రాణముతోనున్న పాశ్చాత్యదేశములవంక జూడుఁడి. విద్యావిషయమున నితరదేశములకంటె వెనుకఁ బడకుండుటకై వారు చేయుప్రయత్నములు చూచిన నెవ్వరిమానస మాశ్చర్యానందముల మునుంగక మానును? విద్యావిషయమై వారి కింతకతు యేల! కారణముస్పష్టము. నేఁడు గలసిన విద్యలన్నియు నేర్పు విద్యాపీఠములును, గ్రంథరాజములును ఇంగ్లండుదేశ మునం దున్నందున వేఱు దేశమునకుఁ బోకయ వేఱుభాష నేర్చుకొనకయ, వారి కన్నివిద్యలును, కళలును, వృత్తులును నేర్చుకొనుటకు వీలున్నవి. దైవము యొక్క యద్భుతఘటనచే శాస్త్రసంబంధమయిన ఇంగ్లీషుగ్రంథములన్నియు నేఁడొక్కపెట్టున నశించిన వనుకొనుఁడు. పాప మిట్టిదురవస్థ యేదేశమునకు నెప్పుడును రాకయుండునుగాక! వచ్చినయెడల నింగ్లీషువారి విద్యాభ్యాసస్థితి యేమగును? ఏవిద్య నేర్చుకొనవలయునన్నను బరభాషయైన జర్మనీభాషనో ఫ్రెంచిభాషనో మొదలభ్యసించి తద్ద్వారమున నిష్టవిద్యను గాని, కళలను గాని, వృత్తులను గాని నేర్చుకొనవలెను. అప్పుడు వారిసాంపత్తికస్థితి యిప్పుడున్న ట్లుండఁగలదా? పొగబండి నడుపువిధములఁ దెలిసికొనుటకు జర్మనీదేశమునకు, నావికశాస్త్ర మెఱుంగుటకు ఫ్రాంసుదేశమునకు, నాకాశయానము నభ్య సించుటకు 'ఇటలి' దేశమునకు 'దేహి' యనిపోవలసిన యింగ్లీషువారు తమ

దేశాభివృద్ధి యెట్లుచేయఁగలరు? కావున స్వస్వమాతృభాషలలో సకలవిద్యా సాధనము లుండుట నాగరకరాష్ట్రములయొక్క మొదటిలక్షణము.

ఇంగ్లీషు నేర్చుకొనుట.

అట్లన నెవ్వరును సంస్కృతమునుగాని యింగ్లీషునుగాని నేర్చుకొనఁ గూడదాయనియు, నాయాభాషల నేర్చుకొని విద్యలను సాధించుటకు వీలున్న ప్పుడు మాతృభాషలో లేవన్న చింత మనకేలయనియుఁ గొందఱు అనఁగవచ్చును. సంస్కృతభాషనుగాని, యింగ్లీషు భాషనుగాని, ఫ్రెంచి మొదలయిన తదితర భాషలనుగాని చేతనైనవారు, ధనమున్నవారు, వీలుగలవారు నేర్చుకొనవలయు ననియే నాతాత్పర్యము. వానిలోను, రాజభాషయయినందునను, లోకమందలి యితరభాషలకంటె ననేకవిధములను గ్రంథభాండారమునం దిత్యధికమైనదని ప్రఖ్యాతిచెందినదియు, నగుటచే నింగ్లీషుభాషను నేర్చుకొనుట మననాగరక తాభివృద్ధికిని దేశోన్నతికి నత్యంతావశ్యకమని నాయభిప్రాయము. కాని యది యెంతవఱకు సాధ్యమో! జనసామాన్యమున కంతకు నింగ్లీషుభాష చక్కఁగ వచ్చుటయు, నందు వారు సకలవిద్యలను సాధింపగలుగుటయు నిఁక వేయి సంవత్సరముల కయినను హిందూదేశమునందు సంభవించునా? ఎప్పటికిని సంభ వింపనేరదు. అట్లే సంస్కృతము. ఇది దేవభాషయని మనకు భక్తియున్నను దేశమునం దెందఱు సంస్కృతపండితులు కలరు? సంస్కృతము దేశభాషాభి వృద్ధికి సాయముగా నుండవలసినదే కాని మరల నది దేశభాషయగు నన్నమాట కలలోనివార్త. సంస్కృతముగాని యింగ్లీషుగాని హిందూదేశములోని దేశ భాషాస్థానము నాక్రమించుకొననేరవు. దేశభాషలలో విద్యనేర్పుటకంటె ఈ భాషలలో విద్యనేర్పుట యెప్పుడును నేర్చుకొనువారికిని, నేర్పువారికిని నెక్కుడు కష్టముగా నుండఁగలదు. కావున నాయాభాషలవారికి నాయా భాషలలోనే విద్యాదానము చేయుమార్గముల నిర్మించుట యావశ్యకము.

ఇప్పుడు మనదేశస్థులు వేలువేలువిద్యల సాధింపనెంచి కొందఱింగ్లండు నకును, గొందఱు జపానునకును, గొందఱమెరికాకును పోవుచున్నారు. దేశము .

యొక్క భావిపురోభివృద్ధి కిది మంచిచిహ్నమే. కాని యీలాగున నెందఱు పోఁగలరు? లక్ష కొక్కఁడుగాని వేయి కొక్కఁడుగాని వెళ్లఁగలఁడా? వేల కొలఁదిధనము వెచ్చించి యిట్టిబాధల కోర్చి లక్ష కొక్కఁడు వెళ్లివచ్చిన నేమిప్రయోజనము? మిగిలిన తొంబదితొమ్మిదివేలతొమ్మిదివందలతొంబదితొమ్మిది మందికి వివిధవిద్యలబ్బుట యెట్లు? వీరిలోఁ గొందఱు కొంచె మింగ్లీషు నభ్యసించెద రనుకొందము. మిగిలినవారిగతి? వారికి జ్ఞానార్జనము చేయుటకున్న కోర్కె పాడయినను జ్ఞానము లభించుమార్గము లేదా? అట్టిసాధనముల నిర్మించుట దొర తనమువారియొక్కయు, విద్యాధికులయొక్కయు, ధనాధికులయొక్కయు నవశ్య కృత్యము కాదా? ప్రజలందఱకును విద్యనేర్చుకొనుటకు వీలయిన సాధనములను నిర్మించుట రాజధర్మము. ఈయుద్దేశముతోడనే శ్రీశ్రీచక్రవర్తిగారు పట్టాభి షేకమహోత్సవకాలమందుఁ బ్రాథమికవిద్యకై ౫౦ లక్షల ధన మొసంగిరి. కాని యీధనములో నేమి యెన్నవవంతు దేశాభివృద్ధికై కర్చుపడునో చూడ వలసియున్నది. మనము కేవలము రాజసాహాయ్యము నమ్మియే యుండఁగూడదు. వారు చేయుసాయమునకై కృతజ్ఞులమగుచు మనము స్వతంత్రప్రయత్నములను జేయుచుండవలెను. ఈమార్గమునఁ బోయిన బాగుగనుండునని ముందంజవేయు టకు విద్యావంతులును, విద్యావంతులచే నారంభింపఁబడిన కార్యములు శాశ్వత ములుగ నుండునట్లుచేయుటకు ధనవంతులును సంసిద్ధులై యుండవలెను. శాస్త్ర జ్ఞానాభివృద్ధికై మనదేశమునందు జరుగవలసిన పనినిగూర్చియు, జరుగనున్న పనినిగూర్చియు విచారించెదము.

## సాధనములు.

దేశమందంతట శాస్త్రజ్ఞానాభివృద్ధి కావలయునన్న దేశభాషయందు గ్రంథములు, నాశాస్త్రములను బోధించుపాఠశాలలు నుండవలయును. కేవలము విద్యాపీఠము లుండి గ్రంథములు లేకపోయినను బ్రయోజనములేదు. కేవలము శాస్త్రము లుండియుఁ జెప్పువారు లేకపోయిన నుపయోగము లేదు! ఇందుకు దృష్టాంతముగ నొకచిన్నయుదాహరణమిచ్చెదను. చెన్నపట్టణమునందు నాయు

ర్వేదపాఠశాల యున్నదని మీరెఱిఁగినవిషయమే. అందు నింగ్లీషుపద్ధతిప్రకారము శారీరశాస్త్రము (Physiology and Anotomy) అను విషయమొకటి విద్యార్థులకు బోధించెదరు. పాశ్చాత్యవైద్యశాస్త్రమునం దారితేరిన డాక్టర్లే యీవిషయమును బోధించెదరు. కాని యీవిషయమును బోధించు గ్రంథము దేశభాషలందు లేనందున, విషయబోధచేయుటలో నుపాధ్యాయులకును, విషయమును బోధచేసికొనుటలో విద్యార్థులకును మితిలేని పరిశ్రమ కలుగుచున్నది. తెలుఁగునందు శ్రీ వీరేశలింగము పంతులుగారిచే రచింపఁబడిన చిన్న శారీరకశాస్త్రము కలదు. కాని యది యీతరగతికిఁ జాలదు. ఇంతకంటె నెన్నియోమడుంగులు విపులముగ వ్రాయఁబడినగ్రంథము కావలయును. అట్లే శస్త్రవైద్యమునుగుఱించిన గ్రంథము తెలుఁగులో లేనేలేదు. ఇతరదేశభాషలందును లేదు. కావున నది నేర్పుటయే యసంభవమైనది. ఆవిషయము నాయుర్వేద వైద్యశాలలో నేర్పువిషయములలోనుండి తీసివేసిరి. అట్లే యాయుర్వేదసంబంధమైనయుగ్రంథములు సంస్కృతమునందే కలవు. తెలుఁగునఁగాని యితర భాషలందుఁగాని లేవు. కావున సంస్కృతము చక్కఁగ రానివారికి నాగ్రంథములవలన విశేషలాభముకలుగదు. ఈయిక్కట్టు నాలోచించియే శ్రీభిషజ్మణి పండిత గోపాలాచార్యులవా రాయుర్వేదగ్రంథమాల నొకదానిని స్థాపించి గీర్వాణగ్రంథములను దెలుఁగుచేసి యాంధ్రులకృతజ్ఞతకుఁ బాత్రులైరి. మచిలీపట్టణములో స్థాపింపఁబడిన జాతీయకళాశాలాధికారులుకూడ భిన్నభిన్న కళాకౌశల్యములు నేర్పుటకుఁదగిన గ్రంథములు లేనందున నేగ్రంథములు పఠనీయములుగా నేర్పఱుపవలయునాయని త్రొక్కులాటపడుచున్నారు! ఇది చదువుచెప్పువారుండి చదువుకొను గ్రంథములు లేనందునఁ గలుగు నిబ్బంది. ఇట్లే కొన్నియెడల గ్రంథము లున్నను వానిఁ జదువువారుగాని, చెప్పువారుగాని యుండరు. ఉపయోగములేక పుస్తకములు చెదలుపట్టిపోవును. తెలుఁగులో బీజగణితము (Algebra) న్నది. క్షేత్రగణితము (mensuration) ఉన్నది. అట్టి గ్రంథములకు విశేషప్రచారము లేక, యవి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందు మూలదాగి యేలయుండవలయును? వాని నుపయోగించుగురువులు, నభ్యసించు

విద్యార్థులుపు లేక. అట్లగుటచేఁ దెలుఁగులోఁ గూడ 'నాల్జెబ్రా' చెప్పవచ్చు నా? తెలుఁగులో 'జ్యామెట్రి' నేర్పఁగలమా? Progressions చెప్పిన ఇంగ్లీషులోఁ జెప్పవలయునే గాని తెలుఁగులో నేర్పుటకు వీలులేదు అని మన వారే వాదింపఁ జొచ్చిరి! ఇంగ్లీషు గణితమునకుమాఱుగా లీలావతిగణితమునే మనపాఠశాలలలోఁ జెప్పుచుండినచో నిట్టి సంశయములు మనవారి కేల పుట్టును? ఇప్పుడు మనపిల్లవాండ్రు ఎఫ్,ఎ. తరగతిలో నేర్చుకొనుచున్న ప్రొగ్రెషనులు, 'ఘనము సేయుట', 'కాంబినేషనులు' మనపిల్లలు నాలుగవ యయిదవతరగతులలో "శ్రేఢీవ్యవహారము, అంకపాశవ్యవహారము" అను పేళ్లతో నేర్చుకొని యుం డుదు. నా తాత్పర్యము పాశ్చాత్యగణితశాస్త్రము మనగణితశాస్త్రమున కంటెఁ దక్కువయభివృద్ధిలో నున్నది యని చెప్పుటకు కాదు. ఇటీవలిగణితజ్ఞుల బుద్ధిసూక్ష్మతచేఁ బాశ్చాత్యగణితశాస్త్రముయొక్క క్షేత్ర మత్యద్భుతముగ వైశాల్యముఁ జెందినదియని నే నెఱుంగుదును. కాని యావిద్యయంతయుఁ దెనుఁ గునఁ జెప్పరాదా? జ్ఞాన మొకభాషయొక్క యబ్బసొమ్ము కాదు. ఏభాష మూలముననైనను దానిని సాధింపవచ్చును. ఎవరి మాతృభాషలో వారు సులభ ముగను గొలఁది కాలములోను, గొలఁది శ్రమలోపలను దెలిసికొనవచ్చును. పరభాషలో నభ్యసించినయెడల నెక్కుడు కాలము, నెక్కుడు శ్రమయు, నెక్కుడు ధనవ్యయమును బట్టును. ఈభేదము కనిపెట్టి యింగ్లీషువిద్యలన్ని యు మనభాషలోనికిఁ దెచ్చి లోకులకు బోధించుట సమంజసము. అట్లు చేయక పరభాషలలోఁ జెప్పుట స్వభావవిరుద్ధము.

ఇఁక నిప్పటి విద్యాభ్యాసపద్ధతి చూతము. 1-వ ఫారముగాని 2-వ ఫారముగాని మొదలుకొని మనపిల్లవాండ్రకు భూగోళము, అంకగణితము, రేఖాగణితము, పదార్థవిజ్ఞానము మొదలయిన విషయములన్నియు నింగ్లీషునఁ జెప్పఁ బ్రారంభించెదరు. అప్పటి బాలునికి నింగ్లీషుజ్ఞాన మెంతవఱకుండును? తప్పులు లేకుండ రెండువాక్యములుకూడ వ్రాయుసామర్థ్యము వాని కుండదు. తనమనస్సులోని యూహల నింగ్లీషునందుఁ జెప్పఁజాలఁడు. అట్టివానికి నింగ్లీషు

నందు రేఖాగణితము చెప్పిన నేమి ప్రయోజనము? A point is that which has no dimension అనినవాక్యమునకు నర్థము చక్కఁగఁ జేసికొనలేనివానికి 'యూక్లిడు' భూమితి యింగ్లీషులోఁ జెప్పినందునఁ బ్రయోజనమేమి? భట్టీపెట్టుట, యనఁగా నర్థము తెలిసినను దెలియకపోయినను వల్లించి తూచా తప్పకుండ నొప్పగించి పరీక్షలలోఁ గృతార్థులగుట, యిందువలన సిద్ధించుచున్నది. చెప్పినదానికి నర్థముచేసికొనుటఁ గాని మనస్సునందలి యూహలఁ జెప్పుటకుఁ గాని తగినంత భాషాజ్ఞానము లేనివారు గ్రుడ్డిపాఠములు చేయక పరీక్షలోఁ గృతార్థులగుటకు వీలున్నదా? లేదు. కావున నింగ్లీషులో నీవిషయమును నేర్పి మనము మన విద్యార్థులయొక్క బుద్ధివైభవమును దగ్గించుచున్నామని నాయొక్క దృఢనిశ్చయము. ఇప్పుడు ప్రవేశపరీక్షవఱకుఁ జదువుచున్న విద్యార్థుల ధారణాశక్తియంతయు, నింగ్లీషునందు భిన్నవిషయముల నింగ్లీషుభాషలో వల్లించుటయందే వ్యయమగుచున్నది. స్వభాషయందు వారికీవిషయముల నేర్పిన నింతపరిశ్రమ యుండదుగదా. వారికి విషయము బహు సులభముగా బోధపడును. ఒక్కసారి బోధపడినతరువాత విద్యార్థి గ్రంథమునంతయు వల్లింపఁబనిలేదు. ప్రశ్నలకు విద్యార్థి ప్రత్యుత్తరము చెప్పునపుడు తనమాటలలోనే చెప్పఁగలఁడు. తనమాటలలోనే వ్రాయఁగలఁడు. అందుకై వేఱుపరిశ్రమగాని ప్రయత్నముగాని యక్కఱలేదు. వచ్చిరాని ఇంగ్లీషులో నేర్చుకొనుటకంటెను, బదులు చెప్పుటకంటెను, స్వమాతృభాషలో నేర్చుకొనుటయు బదులు చెప్పుటయు నూఱురెట్లు సులభతరము. ప్రతిపాఠశాలలోను ప్రవేశపరీక్షవఱకును, నింగ్లీషు, సంస్కృతము మొదలగు వాఙ్మయ విషయములుతప్ప మిగిలినవిషయములన్నియు, అంకగణితము, బీజగణితము, రేఖాగణితము, క్షేత్రగణితము, పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము మొదలయినవన్నియు, బాలకుల మాతృభాషలయందు నేర్పినయెడల, నిప్పుడు బి. ఏ. వారి కీవిషయములందు నెంతప్రవేశముకలదో యంత ప్రవేశము ప్రవేశపరీక్షలోని విద్యార్థులకుఁ గలుగుననియుఁ గనీసము మూఁడు సంవత్సరముల కాలము కలిసివచ్చుననియు, నందుకయ్యెడు వ్యయప్రయాసలు తప్పుననియు

వారియొక్క దృఢమైన యభిప్రాయము. బడిజీతములు భరించుటకు వీలులేకుండఁ జెరిగినయీ కాలమున నొక్కొక విద్యార్థికి మూఁడుసంవత్సరములనఁగా వేయి రూపాయలని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. నలుగురు పిల్లలు గలవారికి నాలుగు వేలాదాయము గదా!

ఒక యాక్షేపము.

కాని యిట్లు చేసినయెడల నింగ్లీషుభాష మనవారికిఁ జక్కఁగ నలవాటు కాదు. దానియందు మనవిద్యార్థులకుఁ గలుగుచున్న ప్రజ్ఞావిశేషంబులు తగ్గును. అందుచే నింగ్లీషుభాషాధ్యయనమువలన మనకు నిప్పుడు గలుగుచున్న యద్భుతమైన మానసోన్నతియు, నాదర్శోపదేశములును వొలఁగి మనకు మిక్కిలి హాని సంభవించునని కొందఱనవచ్చును. ఇంగ్లీషువిద్యార్థు లింగ్లీషు వాఙ్మయంబు నధికముగా నభ్యసింపవలయు నన్నమాట నాకును సమ్మతమే. ఆ యద్వితీయవాఙ్మయప్రభావమును నే నెఱుంగుదును. దాని నభ్యసించి మనభాష నంతస్థితికిఁ దెచ్చుటయే విద్యాధికులయవశ్యకృత్య మని నాతాత్పర్యము. కాని యాభాషయందు గణితమును బీజగణితమును గమ్మరమును, గుమ్మరమును, నేర్చినఁగాని యాభాష చక్కఁగా రాకపోవునని నేను దలపను. కావ్యములను, వ్యాసములను, జర్నలను, జరిత్రలను, రాజకీయోపన్యాసములను, నుద్గ్రంథములను, దత్త్వగ్రంథములను జదివిన భాషాప్రావీణ్య మలవడునేగాని గణితాదికములు చదివినందునఁగాదు. కావున నింగ్లీషు చక్కఁగ రావలయునన్న నిప్పు డింగ్లీషువాఙ్మయము దినమునకు నొక్కగంట చెప్పుచున్నయెడల నిఁక ముందు రెండుగంటలు చెప్పవచ్చును. శాస్త్రములు తెలుఁగులోఁ జెప్పవచ్చును. ఇట్లింగ్లీషువాఙ్మయమును జక్కఁగఁ బూర్తిగ నేర్చుకొనవచ్చును. శాస్త్రములను సాధింపవచ్చును. ఇప్పు 'డితో భ్రష్ట స్తతో భ్రష్ట' అన్నట్టు మనబాలకులకు నింగ్లీషు బాగుగ వచ్చుటలేదు. శాస్త్రములు చక్కఁగఁ దెలియుటలేదు. ఇఁకముందు నేను జెప్పిన యేర్పాటు చేసినయెడల విద్యార్థు లన్నివిషయములందును పాండిత్యము కలవారగుదురు. ఇప్పుడు పరభాషలో శాస్త్రముల నేర్చుకొ

నుటకుఁ బట్టుచున్న పరిశ్రమకే, యింగ్లీషువాఙ్మయమును వశపఱచుకొనుటకు-నుపయోగించితిమేని యింగ్లీషుగ్రంథకారులతోఁ దులతూఁగునట్టి యాంగ్లసాహితి మనకుఁ దప్పక యలవడఁగలదు.

ఇంగ్లీషువిద్యను గఱపుబడులలోనే శాస్త్రములను దెలుఁగునందుఁ జెప్పుచున్నపుడు ప్రాథమికపాఠశాలల నన్ని విషయములును దెలుఁగునందే నేర్పవలెనని వేఱుగఁ జెప్పవలెనా? ఇంగ్లీషు రాకయే మనవారు బీజగణితమందలి వర్గ సమీకరణము (quadratic Equation) అనేకవర్ణసమీకరణము (simultanious Equations) రేఖాగణితమందలివృత్త (circle) దీర్ఘవృత్త (Ellipse) సంబంధమైన సిద్ధాంతము లను భౌతికశాస్త్రమందలి విద్యుత్ప్రవాహకములను గుఱించిన సిద్ధాంతములును జేటతెలుఁగున నొకనితో నొకరు సంభాషించుసమయము తెనుఁగు దేశమున కెప్పుడేని యగునది మనదేశాభ్యుదయమునకు నిశ్చయమైనచిహ్నమని చెప్పవచ్చును. ఇది మనలోఁ గొందఱకు విశేషముగా నింగ్లీషుభాషాతత్వజ్ఞానార్జనమునకు వేఱుసాధనముండునా యని తలంచువారికి నేనుగోరిన కోర్కె గొంతమ్మకోర్కెవలెఁ దోఁచినఁ దోఁపవచ్చును. కాని మహారాష్ట్రదేశమునకు వెళ్లి చూచినయెడల నిం దేమియు వింతలేనట్లు స్పష్టపడఁగలదు. నేను పదార్థవిజ్ఞానశాస్త్రమును మొదట మహారాష్ట్రమునందె చదివితిని. ఎఫ్. ఏ. పరీక్షకుఁ జదువు విద్యార్థులకు బీజగణితమందలి కొన్ని లెక్కలను మరాటీబోధచేయునట్టి యింగ్లీషు రానట్టి నార్మల్‌స్కూల్ మరాటీవిద్యార్థుల నేనెఱుఁగుదును. కొన్ని దినములక్రిందట విజ్ఞానసర్వస్వము నిమిత్తమై యార్యగణితమును గుఱించి కొన్ని సంగతులు తెలిసికొనుటకుఁ జెన్నపట్టణమందలి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునకుఁ బోవుట తటస్థించెను. అప్పుడు నే నచ్చట బీజగణితములోని $\frac{(n+1)}{2}$, $\frac{n(a+e)}{2}$ అను సూత్రములను గాగితముమీఁద వ్రాసికొని లెక్కలు వేసికొనుచుండఁగా నొక్క వైష్ణవుఁడు వచ్చి యిదియేమని నన్నడిగి విషయము కొంచెము తెలిసికొని వెంటనే వానితో సమానములైన సూత్రములను సంస్కృతములోఁ జదివి నాకెంత

యము విస్మయమును గలుగఁజేసెను! ఈవైష్ణవున కింగ్లీషు రాదు- సంస్కృతము, అరవము, కొంచెము తెలుఁగు మాత్రము వచ్చును. ఈ పైగణితశాస్త్రము లాతఁడు వీధిబడిలో నేర్చుకొనెనఁట! కావున నెట్టి కఠినమైనశాస్త్రము లైన నాంధ్రమున బోధచేయవచ్చును. ఆంధ్రమున వ్రాయవచ్చును.

## గ్రంథనిర్మాణము

కావున మనము మొట్టమొదటచేయవలసినపని శాస్త్రీయగ్రంథములనిర్మించుట. శ్రమపడి యిట్టిగ్రంథములను వ్రాసిన నేమిప్రయోజనము? ఎవరు చదివెదరు? గ్రంథకర్త కేమిలాభము? అనికొందఱనఁగవచ్చును. దాని కన మిట్లు నష్టజాతకముల గుణించుచు నెన్నినాళ్లు ఉండఁగలము? ఇట్లు నష్టజాతకము గుణించినవా రెవ రేమి యన్నను దానిని ఖండించుటకు సిద్ధముగానుందుము. పాఠశాలలలోఁ దెలుఁగున శాస్త్రములు చెప్పఁదగినదనిన ప్రథమ మీరుఁ దెలుఁగులో శాస్త్రగ్రంథము లేవియని యడ్డము చెప్పుదురు. శాస్త్రగ్రంథములు వ్రాయుఁడనఁగానె 'ఆగ్రంథముల నుపయోగింతు, బల్లేవోయి' యని వీరె మఱలనడ్డమువచ్చెదరు. వీరి సిద్ధాంత మనుసరించినఁ బిచ్చికుదిరినఁగాని పెండ్లి కాదు; పెండ్లియైనఁగాని పిచ్చి కుదురదు. వీరివాదము వినుచుండినఁ బిచ్చియుఁ గుదురదు; పెండ్లియుఁ గాదు. కావునఁ బరస్పరాశ్రయదోషభూయిష్ఠమైన వీరివాదమును చూచి మనము భయపడవలదు.

ఇదియుఁగాక క్రొత్తగా నిర్మింపఁబడు గ్రంథములు వ్యర్థముగా మూల పడియుండు నని గ్రంథకర్తలు తలఁపవలదు. దొరతనమువారివలనఁ బ్రోత్సాహము కలిగినయెడల విశేషమే. అట్లు ప్రోత్సాహము కలుగకపోయినను బాఠశాలలలోఁ బఠనీయముగా నియమింపకపోయినను యోగ్యతగల గ్రంథము- అది నవలగానిండు, చరిత్రగ్రంథము కానిండు, కఠినమైనశాస్త్రము కానిండు- ఆంధ్రలోకము తప్పక యాదరించు ననియే నాతాత్పర్యము. ఇటీవల నాంధ్ర దేశమునందు భాషాభిమానము కలిగినది. పూర్వ మైదుసంవత్సరములలో నొక గ్రంథముయొక్క ౫౦౦ ప్రతు లమ్ముడుపోవుట దుర్లభముగా నుండెను. ఇప్పు

డొక్కొక్క గ్రంథముయొక్క ౨౦౦౦, ౩౦౦౦ల ప్రతులు విక్రయమగుటయే గాక రెండుకూర్పులు, మూడుకూర్పులు అచ్చగుట తటస్థించుచున్నది. ఏ పాఠశాలయందును బఠనీయగ్రంథములుగా లేకపోయినను విజ్ఞానచంద్రికాగ్రంథమాలలో నిదివఱకుఁ బదునొకండు శాస్త్రీయగ్రంథములు ప్రకటింపఁబడినవనియు, నందుఁ బెక్కులు రెండుసారు లచ్చొత్తింపఁబడినవనియు, నేగ్రంథమును ౩౦౦౦ల ప్రతులకంటెను దక్కువయమ్ముడు పోలేదనియు, రసాయనశాస్త్రమువంటి కఠినశాస్త్రమునుగూడ నింగ్లిషు రానిస్వర్ణకారులు కొందఱు చదివి యుపయోగించుకొను చున్నారనియు, నింగ్లీషురానివారు పెక్కండ్రు గవర్నమెంటు టెక్నికల్ పరీక్షలకై యీ గ్రంథముల నుపయోగించుకొను చున్నారనియు నందఱకు బాహాటముగాఁ దెలిసినవిషయమే. కావున గ్రంథములమ్ముడు పోవన్నభీతి గ్రంథకర్తలు మానవలయును. ఒకానొక పుస్తకము మంచి దగునేని యది పఠనీయగ్రంథము కాకపోయినను, "ఆగ్రంథము నుపయోగింపవద్దు; మాకిష్టమైన యీగ్రంథమునే యుపయోగింపుఁ" డని ఇన్‌స్పెక్టర్లు చెప్పుచున్నను నుపాధ్యాయులును, శిష్యులు నీమంచిపుస్తకమునే తెప్పించి చదివెదరు. ఇన్‌స్పెక్టరు వచ్చినప్పుడు దాచిన దాచెదరేమోగాని యోగ్యమైన గ్రంథములఁ జదువుట మానరు.

ఒకవేళఁ గొన్ని గ్రంథములకు లోకాశ్రయము లేకపోయినను, నాంధ్రదేశమందలి రాజులు, మహారాజులు మొదలయినవారును, శ్రీమంతులును విద్యాసంఘములు నిట్టి గ్రంథకర్తలకు సాయముచేసి వివిధశాస్త్రములను గుఱించిన గ్రంథములను వ్రాయింపవలెను. భాషయందుఁ బ్రబంధములు, నాటకములు, నవలలు మొదలయిన లలితవాఙ్మయ మభివృద్ధిఁ జెందుట యొక యెత్తు; శాస్త్రజ్ఞానాభివృద్ధి కనుకూలములైన గ్రంథములు నిర్మాణ మగుట యొకయెత్తు. ఇట్టి గ్రంథములు దేశదారిద్ర్యవినాశకములు.

ఇప్పుడు మనదేశమునందు దేశభాషాభివృద్ధికిఁ గొంతప్రయత్నము జరుగుచున్నను, లలితవాఙ్మయాభివృద్ధియందే యెక్కుడు శ్రద్ధ కానవచ్చుచున్నది.

ప్రకృతిశాస్త్రనిర్మాణమునకు నొకటి రెండు సంఘములు తప్ప నితరములు ప్రయత్నించుటలేదు. ఇది యెంతయు శోచనీయము. భాషాభివృద్ధికై మన వారు చేయుప్రయత్నములలో సగము ప్రయత్నము శాస్త్రజ్ఞానాభివృద్ధికిని, సగము ప్రయత్న మితర లలితగ్రంథాభివృద్ధికిని వ్యయపడునట్లు చూచుచుండవలెను. ఒకానొక సంఘము పదిగ్రంథములను ప్రకటింపఁదలఁచెనేని వానిలో నైదు భౌతికాదిశాస్త్రప్రవర్తకములుగను, మిగిలిన యయిదు వేఱువిషయములను ప్రతిపాదించునవిగను నుండునట్లు చూడవలయును. ఒకానొక జమీందారుగారు గ్రంథకర్తలకు బహుమతు లీయఁదలఁచిన నందు సగముధనము శాస్త్రములకును, సగముధన మితరవిషయములకును బంచియీవలయును. శాస్త్రగ్రంథములు వందలకొలఁది వెలువడినతరువాత నీ నియమమును బాటించినను బాటింపవచ్చును. కాని యంతవఱకు నీ నియమమును మనవారు శ్రద్ధతోఁ బాటించినఁగాని యీదేశముయొక్క యార్థికావస్థ యభివృద్ధిఁ జెందనేరదు. ఇప్పుడిప్పుడు కొన్ని ప్రకృతిశాస్త్రగ్రంథములు వెలువడినవి. కాని వెలువడినవి స్వల్పము. వెలువడవలసినవి యసంఖ్యములు. వేలకొలఁది గ్రంథములు పుట్టవలసినచోటఁ బది యిరువది పుట్టిన నేమూలకువచ్చును? బంగాళీభాషయందును మరాటీభాషయందును వ్రాయఁబడిన భౌతికశాస్త్రగ్రంథములను జూచిన నెట్టివాని కైనను విభ్రమము కలుగక మానదు.

## పారిభాషికపదములు.

దేశభాషలలో శాస్త్రీయగ్రంథములు వ్రాయుటకు శాస్త్రీయపదముల యభావ మొకప్రబలకారణమని కొందఱు చెప్పుచున్నారు. కాని శాస్త్రీయపదములకై యెవ్వరు నాగనక్కఱలేదు. ఇదివఱకుఁ గొందఱిచే నేర్పాటు చేయఁబడిన పదము లుండెనేని వానినే స్వీకరించి గ్రంథము వ్రాయవచ్చును. 'ఇదివఱకున్న పదములు బాగుగ లేవు' అని మూతివిరుచువారు పెక్కురు గలరు. అట్టివారి కీక్రిందివిధమున "The Twentieth century English Maratta Dicticnary (Literary, Scientific and Technical)'

అనుమహాకోశముయొక్క కర్త యిట్లు ప్రత్యుత్తర మిచ్చియున్నాఁడు. "It may be that a word newly coined by two or three experts may be found fault with as inaccurate by a fourth one. This fourth expert will offer his own coinage as an improvement forgetting all along that there will be others who will find similar fault with his own creation... what happens at present is that every new writer arbitrarily mints his own technical terms not taking pains to see what his predecessors in the same department, have done. It is easy to say for one that a certain word is not an accurate rendering of its corresponding English word but if this very objector is requested to make his own suggestion and from every point of view a faultless one, he often finds himself unable to do it and then at-once gives in his adhession to the old proposal.'' ఇట్లు వీరిపదములు వారికిఁ బనికిరావు: వారిపదములు వీరికిఁ బనికి రావు. వీరికందఱకుఁ బనికివచ్చుపదము లేర్పడువఱకు గ్రంథములు వ్రాయకుండఁ గూర్చుండినయెడలఁ గాలాంతమువఱకు నిట్లే యుండవలెను! కావున బుద్ధిమంతులు చేయవలసినపని యేమనఁగా నిట్టి గ్రంథములు వ్రాయునపు డనివఱకు గ్రంథములు వ్రాసినవారిచే నుపయోగింపఁబడిన పదములనే వీలయినంతవఱకు వాడవలెను. అట్టి పూర్వగ్రంథములు లేకపోయినపుడును, నితరులపదముల నుపయోగించుటకు నిష్టము లేనప్పుడును స్వయముగాఁ బదముల నిర్మింపవచ్చును. అదియును నిదియుఁ జేతకానప్పు డింగ్లీషు పారిభాషికపదములనే తీసికొని గ్రంథము వ్రాయవచ్చును. కాని పదములు లేవని, శాస్త్రగ్రంథములు నిర్మించుట మానవలదు. శాస్త్రములు మొదటఁ బుట్టును, పారిభాషికపదములు పిదప స్థిరపడును. ఇవియే యితరదేశమందలి శాస్త్రవాఙ్మయాభివృద్ధియొక్క మర్యాద. పాశ్చాత్యదేశమందు జంతుశాస్త్రము మిక్కిలి యభివృద్ధి నొంది, యందలి పారిభాషికపదములు పండితపరిషత్తులచే నిర్ణయింపఁబడు చున్న

వని వీరందఱు నెఱింగిన విషయమే. అట్టి శాస్త్రముయొక్క పారిభాషిక పదములు నప్పుడప్పుడు మాఱుచునే యున్నవి. ౧౭౬౬ లిన్నాయిస్ అనుశాస్త్రజ్ఞుఁడు జంతువుల వర్గీకరణ మేర్పఱచి యొకపరిభాష యేర్పఱిచెను. ౧౭౯౮ లో కువియరు అనువాఁడు దానిని గొంతవఱకు మార్చి క్రొత్తపరిభాష నిర్మించెను. ౧౮౩౫ లో ఓకెన్ అను శాస్త్రజ్ఞుఁడు మఱల నవర్గీకరణమును దిద్దెను. ౧౮౪౮లో ఆర్. ల్యూకార్టు అనువాఁడును, ౧౮౫౫ లో హాక్సిలె, కెఫర్స్టెన్ అనువాఁడును, ౧౮౫౭లో అగాజిజ్ అనువాఁడును, ౧౮౬౬ లో హెకల్ అనుశాస్త్రజ్ఞుఁడును ౧౯౧౦లో ల్యాంకెస్టరు అనువాఁడును మఱియెందఱును జంతుశాస్త్రములందలి వర్గీకరణ పరిభాష నిష్టమువచ్చినట్లు మార్చిరి. తుదకు ఎన్సైక్లోపీడియా బ్రిటానికాయొక్క ౧౧వ కూర్పునందు జంతుశాస్త్రమను ముఖ్యవ్యాసము వ్రాసిన లేఖకునకు నాశాస్త్రసంబంధమైన యితరవ్యాసములు వ్రాసిన లేఖకులకును వర్గీకరణమును గుఱించియుఁ, బారిభాషికపదములను గుఱించియుఁ బెక్కుభిప్రాయభేదములు కలవు! కావున నేఁడే యందఱకు సమ్మతములైన శాస్త్రీయపదములు గూడినఁగాని గ్రంథములు వ్రాయవలెననుట గాని, వ్రాయవద్దనుటగాని వెఱ్ఱితనము. కావున శాస్త్రమునందును, భాషయందును నభిమానముగలవారు నిర్భయముగఁ దమచేతనైనంతవఱకు శాస్త్రీయగ్రంథముల నిర్మించి యితర గ్రంథకర్తలకును, నూతనముగాఁ బుట్టుచున్న, పుట్టనున్న భాషావిషయకపరిషత్తులకు మార్గదర్శకు లగుదురుగాక! యని నమ్ముచున్నాను.

పారిభాషికపదములను గుఱించి యింకొక చిన్నసంగతి చెప్పవలసియున్నది. హిందూదేశమునందుఁ బ్రస్తుతము శాస్త్రీయపదములను సృజించుటకై మహాప్రయత్నములు చేయుచున్నవారు కాశిలోని నాగరీప్రచారిణీసభవారు; రెండవవారు ట్వెంటియత్ సెంచురీ డిక్షనరీ సంపాదకులును. మొదటిదానిలో ప్రొఫెసరు రే, ప్రొఫెసరు బోస్, ప్రి. సీల్ వంటి ఆంగ్ల, సంస్కృత భాషలయందును, పాశ్చాత్య శాస్త్రములయందును, మహామహోపాధ్యాయు

లనిపించుకొనువారు కలరు. ట్వెంటియత్ సెంచురీ డిక్షనరీలో ప్రొ. గజ్జర్, డాక్టర్ సర్ బాలచంద్రవంటివారును గలరు. కావున మనభాషలో నూతనముగా శాస్త్రవాఙ్మయమును బుట్టింప నెంచినవారు తప్పక యీ రెండుగ్రంథముల జూడదగును.

ఇంక నొకపూర్వపక్ష మున్నది. కొందఱు నూతనపదములను మనము సృష్టింప నక్కఱలేనేలేదు; ఇంగ్లీషుపదములనే గ్రహించుట మంచిదని వాదించెదరు. కాని దీనికి నేను వేఱుగ జవాబు చెప్పనక్కఱలేదు. జర్మనీవారే చెప్పఁగలరు. యూరోపుఖండమునం దిప్పుడు నిర్మింపబడుచున్న శాస్త్రీయపదములు గ్రీకు ల్యాటిన్ భాషాభూయిష్ఠమై మూరెడుమూరెడు పొడవుగ నుండునని శాస్త్రజ్ఞు లెఱుఁగుదురు. గ్రీకు ల్యాటిన్ భాషలు దేవభాషలుగాఁ గల జర్మనీవారికి వీని నంగీకరించుటకు నభ్యంతర ముండఁగూడదుకదా? కాని వారీదీర్ఘపదములకుఁ దమభాషలో మాఱుపదములను గల్పించుకొని విద్యార్థులనిమిత్తమై వ్రాయఁబడు పొత్తములలో వానినే వాడుచున్నారు! జర్మనీ దేశజులే యిట్లు చేయఁ, బూర్తిగ భిన్నభాషాసంప్రదాయము గల మన మాకర్కశపదంబులనే సంస్కారమైనఁ జేయక తీసికొనవలె ననుట వింతగను, విపరీతంబుగను గనఁబట్టుటలేదా? కావున మనము వీలయినంతవఱకు దేశ్యపదములను, వాడుకలోనున్న సంస్కృతపదములను వాడవలయును. అట్టిపదములు లేనప్పుడు సంస్కృతవాఙ్మయమునుండి సమానార్థకముల నిచ్చుపదముల నుపయోగించుకొనవలెను. అట్టిపదములను దొరకనప్పు డింగ్లీషుపదములఁ దీసికొనుట యపవాదము (Exception)గాను, స్వభాషాపదముల నుపయోగించుట సామాన్యనియమము (General Rule)గను నెంచవలయును. అనఁగా విధిలేనప్పుడు మాత్ర మన్యభాషాపదములఁ దీసికొనవలయును.

విద్వాంసులారా! భాషాభిమానులారా! మీ రిఁకనైన నౌదాసీన్యము మాని మహోత్సాహముతో శాస్త్రీయగ్రంథరచనకుఁ బూనుకొనియెద రని వేఁడుచున్నాను.

---

# ప్రకృతిశాస్త్రములు*

ఇదివఱకు మన తెనుఁగువారికిఁ బ్రకృతిశాస్త్రములతో నంతగాఁ బరిచయము లేదు. కావునఁ బ్రకృతిశాస్త్రములకును ఆధ్యాత్మికశాస్త్రములకును గల తారతమ్యమును, ప్రకృతిశాస్త్రములలోని ముఖ్యసిద్ధాంతములను ఈ యుపోద్ఘాతముయొక్క పూర్వార్ధమునందు వివరించెదను. జీవశాస్త్రమును గుఱించి కొద్దిలో సంగ్రహించి యుపోద్ఘాతముయొక్క యుత్తరార్ధములో వర్ణించెదను.

## ప్రకృతిశాస్త్రము లన నెవ్వి?

ఈ చరాచరాత్మకమైన విశ్వములో నెచ్చటఁ జూచినను అసంఖ్యపదార్థములు వ్యాపించియున్నవి. అందుఁ గొన్ని కనులకుఁ గానవచ్చును. కొన్ని త్వగింద్రియమాత్రగోచరములు అనఁగా శరీరమునకుఁ దగులుటవలన మాత్రము తెలిసికొనఁ దగినవై యున్నవి. కొన్ని ముక్కుచేతను, కొన్ని నాలుకచేతను, కొన్ని చెవులచేతను తెలిసికొనఁ దగినవి. కొన్ని పదార్థములు ఒక యింద్రియముచేతనే గాక రెండు మూడు ఇంద్రియములచేఁ దెలిసికొనఁబడును. ఇట్లు రూపరసగంధశబ్దస్పర్శలు విషయములుగాఁ గల నేత్రాది పంచేంద్రియములలో నొక్కదానిచేఁ గాని పెక్కువానిచేఁ గాని మనకు నొక్కొకపదార్థముయొక్క యస్తిత్వమును (ఉనికి; Existence) గురించియు, దాని ధర్మములను గురించియు జ్ఞానము కలుగుచున్నది. కావుననే యీపంచేంద్రియములకు జ్ఞానేంద్రియము లని పేరు. చిన్ననాఁటనుండియు నీయింద్రియములు మనకుఁ బదార్థములధర్మములఁ దెల్పుచుండును. దీపముమీఁదఁ జెయ్యి

* జీవశాస్త్రసంగ్రహము (వి. చం. గ్ర. ౮) నకు ఉపోద్ఘాతము.

పడి చుఱుక్కునినపుడు దీపమునందు వేఁడిమి కలదని బాలుఁడు తెలిసికొనును. అగ్నిపై నీరు పడి యది చల్లారఁగాఁ జూచి జలమునందు వేఁడిమి చల్లార్చు గుణము గలదని పిల్లవానికిఁ దెలియును. ఇటులనే యితరపదార్థముల గుణ ధర్మములను గనుఁగొనును. మానవులకుఁ బదార్థవిషయికజ్ఞాన మంతయు నీలాగున ఇంద్రియముల ద్వారా కలిగినది. ఇట్టి యథార్థజ్ఞానమును ప్రత్యక్షజ్ఞాన మనియెదరు. ఇదియంతయు నొక్కచోఁ జేర్చినయెడల నదియే ప్రకృతిశాస్త్ర మనఁబడును. ప్రకృతిశాస్త్రములకు భౌతికశాస్త్రము లని మాఱుపేరు.

## ఆధ్యాత్మికశాస్త్రములు

మన దేశములో శాస్త్రము లనుపేరిట మిక్కిలి విఖ్యాతిఁ జెందియున్నవి భౌతికశాస్త్రములు కావు. వేదములు, స్మృతులు, పురాణములు మొదలగువానిని మనవారు శాస్త్రము లనియెదరు. వానికి ఆధ్యాత్మికశాస్త్రములు (Metaphysical Sciences) అని పేరు. ఇవి యింద్రియములకు గోచరము కాని సంగతులను బోధించును. పరమాత్మ, జీవాత్మ, స్వర్గము, నరకము, ముక్తి, పుణ్యము, పాపము అను అతీంద్రియవిషయము లీశాస్త్రము లందుఁ జర్చింపఁబడును. ఇందు వర్ణింపఁబడిన విషయములు ప్రత్యక్షానుభవ సిద్ధములు కావు. ఇందు బహుస్వల్పముగా యుక్తియు, విశేషముగా నాప్త వాక్య మని నమ్మికయుఁ బ్రధానము లయి యున్నవి. ఆప్తవాక్య మనఁగాఁ బెద్దలు చెప్పినమాట: వేదము, బైబిల్, కురాన్ మొదలయినవి.

## భౌతికశాస్త్రములకును, ఆధ్యాత్మికశాస్త్రములకును గల భేదము.

ఇట్టి యాధ్యాత్మిక శాస్త్రములకును భౌతిక శాస్త్రములకును గల భేదము చదువరులు చక్కఁగఁ గనుఁగొనియెదరు గాక. ఈ భేదము చక్కఁగ దెలియుటకై యీ క్రింద రెండు ఉదాహరణము లిచ్చెదను:—

(౧) ఇనుము, బంగారము అను లోహములలో నేది యెక్కువబరువ గలది యని యిద్దరికి వాదము కలిగెను. ఒకఁడు బంగారు మెక్కువ బరువని

గను, రెండవవాఁడు ఇనుము ఎక్కువబరువనియు యుక్తిప్రయుక్తులచే సిద్ధాంతీకరింపఁ జొచ్చిరి. అప్పుడు మఱియొకబుద్ధిమంతుఁడు వచ్చి 'వ్యర్థవాద మెందుకు? ప్రత్యక్షముగాఁ జూచి చూడరాదా?' యని యొక ఘనాంగుళము బంగారమును, ఒక ఘనాంగుళము ఇనుమును దెచ్చి తూచి చూచెను. అప్పుడు బంగారము ఇనుముకంటె ఘనమైనది యగుటచే నధికమైన బరువు కలది యని వారికి నిశ్చయముగాఁ దెలిసెను.

(౨) జగత్తును సృష్టించినవాఁడు ఎద్దు నెక్కినవాఁడా లేక గ్రద్ద నెక్కినవాఁడా యని యిద్దఱు పురుషులకు వివాదము కలిగెను. వివాద తీర్పుటకు నింకొక్కఁడు వచ్చి 'నీ వనుమాట నిజమని యెట్లు' అని యడిగెను. 'నే నన్నమాట లింగపురాణములో నున్నది' యని యొకఁ డనినతోడనె 'నేను చెప్పినసంగతి శ్రీమద్భాగవతములో నున్నది' అని రెండవవాఁ డనెను. అంతనె 'భాగవతము ప్రమాణము కాదు' అని మొదటివాఁ డుత్తరము చెప్పెను. 'లింగపురాణ మంతకంటె నమ్మఁదగినది కా' దని వెంటనే రెండవవాఁడు ప్రత్యుత్తర మిచ్చెను. ఇట్లు తెగని యావాదము విని మూఁడవవాఁడు 'మీ యిద్దరి పురాణములును అసత్యములు. సృష్టికర్త ఆకాశములోఁ బెద్ద వెల్తురు నడుమఁ గూర్చుండును. ఇందుకుఁ బ్రమాణమిదిగో యాతఁడు స్వయముగాఁ బంపిన శుభవర్తమాన (Gospel) మని పలికి యొక బైబిలు గ్రంథమును బైటఁ బెట్టెను! అందుపై మొదటి యిద్దఱును మూఁడవవానితోఁ బోరాడసాగిరి. ఇట్టి శైవ వైష్ణవ క్రైస్తవాది మతవాదములు వేలకొలఁది సంవత్సరముల నుండి జరుగుచున్నను నేఁటివఱకుఁ దెగలేదు. ముందెన్నఁడైనను దెగునన్నెడి యాశలేదు.

పైని ఒకదానితో నొకటికి సంబంధములేని రెండు ఉదాహరణములు వ్రాయఁబడినవి. అందు మొదటిది భౌతికశాస్త్ర సూచకము. రెండవది ఆధ్యాత్మిక శాస్త్ర సూచకము. ఈ భిన్నశాస్త్రములకుఁ గల భేదము తెలియుటకై మఱియొక యుదాహరణ మిచ్చెదను.

గడియారములు క్రొత్తగాఁ బుట్టి వానిని గుఱించి జనులకు నేమియుఁ దెలియని కాలమందు నలుగురు పల్లెవాండ్రు ఒకానొక గడియారమును జూచుట తటస్థించెను. అందులో నొకఁడు 'ఇది యేమి వింత పురుగురా'? యనెను. అందుపై వా రది యెట్టి పురుగని విచారింపఁ జొచ్చిరి. ఒకఁ డది క్రిమి యనియు, నొకఁడు కీటకమనియు, మఱియొకఁడు జంతువనియు వాదింప సాగిరి. అందుఁ గొంచెము బుద్ధిమంతుఁడు 'ఇది పురుగు కాదు. వెండిరేకుతోఁ గప్పఁబడినది పురు గెట్లగును?' అనెను. 'అలాగైన నిందులోపల నొక దయ్యము కూర్చుండి ఈ ముండ్లను త్రిప్పుచు ధ్వనిచేయుచున్నది' అని యొక్కఁ డూహించెను. అందుపై వారిలో నొక్కఁడు బుద్ధిమంతుఁడును, విద్యావంతుఁడును నగువాఁ డిట్లు తర్కింపఁ దొడంగెను. 'ఇందులోపల మిక్కిలి ప్రజ్ఞగలవాఁడును, ప్రతిభాశాలియు నగు జీవుఁడున్నాఁడు. ఏలయన అట్లు లేనియెడల గంట గంటకు శబ్దముచేయుట యెట్లు తటస్థించును? ఇట్లు గంటగంటకు ధ్వనిచేయునది వేఱువేఱు పదార్థము గాక ఒక్కటే పదార్థము. ఎందుకన నది మొదట ఒక్కగంట కొట్టి కొంతకాలమునకు రెండుకొట్టును. తరువాత మూఁడు, నాలుగు ఈ ప్రకారము క్రమముతప్పక కొట్టుచుండును. కనుక ఇన్నికొట్టితి నన్న స్మృతి లేనియెడల నిటుల జరుగనేరదు. కావున లోన ఒకయాత్మ ప్రవేశించి యీ ముండ్లను నడుపుచున్నదనినమాట నిశ్చయము. ఇట్లు దూరమునఁ గూర్చుండి గడియారమును ముట్టియైనను జూడక యూహాలపై నూహాల నల్లువారు ఆధ్యాత్మికశాస్త్రముల నభ్యసించువారు. ఇఁకఁ బ్రకృతిశాస్త్రపద్ధతి ననుసరింపఁ దలఁచినవాఁడు ఆగడియారమును విచ్చి, యందలి చక్రములను బరీక్షించి, యాచక్రముల పరస్పర సంబంధములను గనుఁగొని యీయన్నిచక్రములయొక్క సాముదాయికపరిణామమ మీ గడియార మని నిశ్చయించును. ఇదియు వీరిద్దఱికిఁ గల భేదము.

పై యుదాహరణములవలనఁ జదువరులకు నాధ్యాత్మిక, భౌతిక శాస్త్రములకుఁ గల భేదము కొంతవఱకు బోధపడి యుండును. కొంచెము అను

మానము (తర్కము, యుక్తి, Inference), మిగిలినవంతయు 'శబ్దము' అధ్యాత్మికశాస్త్రములకు ఆధారము. శబ్దమనఁగా బూర్వులు చెప్పినది విశ్వసించుట. సృష్టియందుఁ గానవచ్చెడి పదార్థముల గుణధర్మములను దెలిపెడి భౌతికశాస్త్రములకుఁ బ్రత్యక్షానుభవమే సర్వాధారము. విషము తినినఁ గడుపులో నొప్పి యగును అని యనుభవమువలననే తెలిసికొంటిమి. ఇది వైద్యశాస్త్రములోని యొక చిన్నవిషయము. అనేక సంవత్సరములనుండియు నాకాశములోని చంద్రునివైపు చూచి మానవులు శుక్రచంద్రాది గ్రహోపగ్రహముల గమనములు కనిపెట్టి వానియనుభవము వ్రాసి యుంచియుండుటనే కదా యిప్పుడు మనము ఈ దినమున చంద్రుఁడిన్నికళలు కల్గి యాకాశమున నిచ్చోటి నుండునని చెప్పఁగలము. జ్యోతిశ్శాస్త్ర మీరీతిన నభివృద్ధిఁ జెందెను. మానవ శరీరమును అనేకరీతులఁ బరీక్షించి చూచి తలలోఁ బుద్ధిగ్రహింప మస్తిష్కము మున్నదనియు, నదియే జ్ఞానమునకు మూలాధారమనియు, అది చెడినచో మానవుఁడు పిచ్చివాఁడగుననియుఁ గనుఁగొనిరి. ఇది శారీరశాస్త్రము (Physiology) యొక్క విషయము. నీరు మిక్కిలి కాచినయెడల ఆవిరియై వాయురూపముఁ జెందును. నీటిలోనుండి వేఁడిమిని దీసివేసి చల్లఁదనమును హెచ్చించినయెడల అది మంచుగడ్డయై ఘనరూపమును (solid) దాల్చును. ఈ సంగతిఁ గనిపెట్టి 'పదార్థములను ఉష్ణము యనుశక్తి వాయురూపముగా మార్చును. శీతలము పదార్థమును ఘనరూపముగా మార్చును' అని సిద్ధాంతీకరించిరి. ఇది పదార్థవిజ్ఞానము (Physics) లోనియొకశాఖ. అనఁగాఁ బైని వర్ణింపఁబడిన వైద్య,జ్యోతిష,శారీర,పదార్థవిజ్ఞానశాస్త్రములును ఇతరప్రకృతిశాస్త్రము లన్నియు అనుభవసిద్ధములు. అనేక సంవత్సరములు కష్టపడి స్వయముగా నెన్నెన్నియో ప్రయోగములు (శోధనలు : experiments) చేసినఁగాని యొక్కొక్క పదార్థముయొక్క గుణధర్మములు తెలియవు. ఆవిరియంత్రముఁ గనుఁగొనుటకును, నేఁడు మన మెక్కుచున్న పొగబండ్లయుక్తి పూర్తియగుటకును ఎందలసంవత్సరములు పట్టినవి. విద్యుత్ (మెఱుపు)

ను గురించి రెండువందల యేండ్లనుండి శోధనలు జరుగుచున్నవి. అందుచే జనుల కనేక లాభములు కలుగుచున్నవి. క్రొత్తక్రొత్తయంశములు తెలియు చున్నవి. ఈ భౌతికశాస్త్రములకు సంబంధిన శోధనలన్నియు సకలజనులకు సాధ్యములు, ప్రత్యక్షములు, ఇంద్రియగోచరములు, ఒకరికిఁ గానవచ్చి మఱియొకరికిఁ గానరాకుండునవి కావు. ఆధ్యాత్మిక శాస్త్రములలోని సిద్ధాంతములు అతీంద్రియములు; ఇంద్రియములకుఁ దెలియునవి కావు; ఏశోధనలకును లొంగబడవు. కావుననే యాధ్యాత్మికశాస్త్రములలోని సిద్ధాంతములను గుఱించి జనులందఱికి నొక్కయభిప్రాయ ముండఁజాలదు. అందువలననే జగత్తునం దన్నిమతములును, మతభేదములును గలుగుటకుఁ గారణమైనది. ప్రత్యక్షముగా స్థిరపడనిది భౌతికశాస్త్రములలోని యేసిద్ధాంతమైనను శాస్త్రజ్ఞు లొప్పుకొనరు. భౌతికశాస్త్రములలోని శోధనలు అందఱు జనులకును అన్నికాలములయందును సాధ్యములు. ఇదియే భౌతికశాస్త్రములకును ఆధ్యాత్మికశాస్త్రములకును గల భేదము.

ప్రకృతిశాస్త్రములకుఁ బ్రత్యక్ష మనఁగా నింద్రియజన్యజ్ఞానమే ప్రధానమగుటవలన ఆ శాస్త్రములలో అనుమానప్రమాణము ఎంతమాత్రము గ్రాహ్యముగాదని చదువరు లనుకొనఁగూడదు. అనుమాన మనగాఁ దర్కము, యుక్తి. దానిసహాయము భౌతిక శాస్త్రజ్ఞులు కొంతవఱకుఁ దీసికొనియెదరు. కాని యెంతవఱకు? ప్రత్యక్షమునకు సహకారిగాను, అవిరోధిగాను ఉన్నంతవఱకు. ఇట్టి యనుమానములను ఈ శాస్త్రజ్ఞులు 'ఊహ' (Hypothesis) లనియెదరు. ఇట్టి యూహాలఁ జేయుటలోఁ బొరపాటయినయెడల భౌతిక శాస్త్రములును ఆధ్యాత్మికశాస్త్రములవలెనే అతీంద్రియము లయిపోవును. కావున ఊహాలఁ జేయవలసినవిధమును, ఎట్టి యూహాలు భౌతికశాస్త్రజ్ఞులు ఒప్పుకొనునదియు అను విషయమును గుఱించి బహునూత్నునిబంధన లేర్పఱుపఁబడినవి. ఊహాయొక్క సత్యత్వమును గుఱించి యెంతమాత్రము సంశయము వచ్చినను శాస్త్రజ్ఞులు దానిని వదలివేయుదురు.

## ప్రకృతిశాస్త్రప్రకరణములు.

ప్రత్యక్షానుభవమే ఈశాస్త్రములకు ముఖ్యాధారమని చదువరులు పైని వ్రాసిన సంగతులనుబట్టి గ్రహించి యుందురు. ఈ ప్రత్యక్షానుభవము శాస్త్రజ్ఞులకు రెండువిధములఁ గలుగును. ఒక విధమునకు అవలోకనము (Observation) అనియు, రెండవదానికి ప్రయోగము (Experiment) అనియు నామములు. అవలోకనమునకు నిరీక్షణ మనియు ప్రయోగమునకు శోధన, పరిశోధన అనియు నామాంతరములు.

### ౧. అవలోకనము.

సృష్టిలోని పదార్థములను, వాని వ్యాపారములను గుణధర్మములను, కార్యకారణసంబంధమును, సృష్టినియమములను కనుఁగొను నిమిత్తమై సృష్టి చమత్కారములను శ్రద్ధతోఁ జూచుట అవలోకన మనఁబడును. గ్రహణము లెప్పుడు వచ్చునో లెక్కవేయువిధము జ్యోతిష్కులెట్లు కనుఁగొనిరి? అవలోకనమువలననే. గ్రహణము లెప్పుడు పట్టునో కనిపెట్టుచుఁ గొన్ని దినములవఱకు నవలోకనముచేసి సూర్యగ్రహణ మమావాస్యనాఁడును, చంద్రగ్రహణము పౌర్ణిమనాఁడును తప్ప నితర దినములలో రా దని నిశ్చయించుకొనిరి. కొన్ని సంవత్సరములవఱకు గ్రహణావలోకనము చేయుచు తుదకు గ్రహణచక్రము ౧౮ సంవత్సరముల ౧౧ దినముల ౭ గంటల ౪౨ నిమిషము (minutes)లకొకసారి తిరుగుచుండును; అనఁగాఁ బదునెనిమిది సంవత్సరము లయినతరువాత మరల మరల ఆయాగ్రహణములే వచ్చునని తెలిసికొనిరి. అందుచేఁ గొన్ని గంటలు హెచ్చుతక్కువగా గ్రహణములు లెక్కవేయుట యెఱిఁగిరి. మఱి యనేక సంవత్సరములు గ్రహణఘటికలను గనిపెట్టి నిమిషభేదము గూడ లేకుండ లెక్కవేయుట నేర్చిరి. ఇట్లు జ్యోతిశ్శాస్త్ర మంతయు ఆకాశగోళములయొక్క చలనములను వేలకొలఁది సంవత్సరములవఱకు అవలోకించి యవలోకించి అనేక తరములవారిచే సాధింపఁబడినది. జ్యోతిశ్శాస్త్రాభివృద్ధికి అవలోకనమే ముఖ్యాధారము. ఇట్లు అవలోకనమే ఆధారముగాఁ గల శాస్త్ర

ములు అభివృద్ధియగుటకు మిక్కిలి కాలము పట్టును. ఎందుకనగా మనమవలోక నము చేయవలసిన సృష్టిలోనివ్యాపారము మనకు నిష్టము వచ్చినప్పుడు జర గదు. అది వచ్చినప్పుడు కనిపెట్టుకొని మనము చూడవలెను. సూర్యునియందలి మచ్చలనుగుఱించి కనుఁగొనవలెననిన, ఆ మచ్చలు సూర్యునియందు సంవత్సర ములో నెప్పుడు కానవచ్చునో యప్పుడు వానిని మనము పరీక్షింపవలసినదే కాని వట్టిసమయములందు నేమియుఁ జేయ వీలు లేదు.

## ౨. ప్ర యో గ ము.

సృష్టిలోని పదార్థముల గుణధర్మములను గనుఁగొనుటకు అవలోకన పద్ధతి యంతగా నుపయోగపడదు. మంచుగడ్డలు నీటికంటె బరువా లేక తేలికయా యని కనుఁగొనవలసియున్నది. ఇది కేవల మవలోకనపద్ధతివల ననే యెఱుంగవలె ననిన, మంచు గడ్డలు కట్టి తరువాత పెద్దవర్షము వచ్చి అందులో నవి కొట్టుకొని పోయినప్పుడు ఆగడ్డలు నీటిలో తేలునా మునుఁ గునా యని చూచికదా మనము నిర్ణయింపవలసినది? నీరు స్వాభావికముగా గడ్డకట్టని యుష్ణదేశములో ఈ యోగ మెన్నడును రాదు. కావున అట్టిదేశ వాసులకు అవలోకనమార్గ మీవిషయ శోధనలోఁ బనికిరాదు. కావున అట్టి వారు మఱి యన్యవిధముల నీటిని మంచుగా మార్చి, యామంచుగడ్డను నీళ్లలో వేసి యది తేలుటఁ జూచి, యది నీళ్లకంటెఁ దేలికయని నిశ్చయింపవలెను. ఇటుల శోధించి చూచుటకు ప్రయోగ మని పేరు. ఇంకొక యుదాహరణముఁ జూపెదము. విద్యుత్ (Electricity) యొక్క గుణధర్మములను గనుఁగొన వలసియున్నది. సృష్టిలో అవలోకనమార్గమున విద్యుత్తును జూడవలె నన్న వర్షాకాలము నందు ఉఱుము మెఱుపు రూపముననఁగాని అది కానరాదు. అట్లు వానతో గాలితోఁ గలసి, ఆకాశమున నెంతయో యెత్తున నున్న విద్యుత్ గుణధర్మములఁ గాంచుట యెట్లు? అందుకై శాస్త్రజ్ఞులు ఈభూమిమీదనే విద్యుత్తును పుట్టించు నుపాయములు చూడసాగిరి. పదార్థముల రాపిడివలన మిఱుమిట్లు గలుగునని చూచి యనేకపదార్థములను ఒకటితో నొకటి రాచి

శోధించిరి. శోధింపఁగా శోధింపఁగా అద్దము, పట్టు, ఈరెంటి రాపిడివలన
నిచ్చట విద్యుత్ పుట్టింపవచ్చును అని ప్రత్యక్షానుభవమువలనఁ గనిపెట్టిరి.
ఈ చేసిన శోధనల కన్నిఁటికిని ప్రయోగము లని పేరు. ఇట్లు భూమిమీదనే
విద్యుత్తును బుట్టించి, అందుతో ననేక ప్రయోగములు (Experiments),
ప్రయోగశాల (Laboratory) లోఁ జేసి, ధనవిద్యుత్ (Positive
Electricity), ఋణవిద్యుత్ (Negative Electricity) అను రెండు
విద్యుత్తులు కల వనియు, అందు నేకజాతివిద్యుత్తులకు పరస్పరవైరంబును,
భిన్నజాతులకుఁ బరస్పరస్నేహంబును గలదనియు, భిన్నజాతుల మిశ్రణమే
పిడుగనియు, మొదలయిన యానేకాంశములఁ గనుఁగొని యావిద్యుత్తును తమ
బానిసగాఁ జేసికొని దానిచే బండ్లు లాగించుకొనుచున్నారు. విసనకఱ్ఱలు
వీవించుకొనుచున్నారు, దీపములు వెలిగించుకొనుచున్నారు, పిండి విసరించు
కొనుచున్నారు! ! !

కొన్ని శాస్త్రములకు అవలోకన పద్ధతి తప్ప వేఱు మార్గ ముండదు.
కొన్నిఁటికి నుభయమార్గములును పనికివచ్చును.

## జడము, శక్తి (Matter and Force.)

ప్రకృతిశాస్త్రములన్నియుసృష్టియందుఁ గానవచ్చెడి జడము(Matter)
శక్తి (Energy or Force) అను రెండుద్రవ్యములగురించి ప్రతిపాదించును.
జడమనగా బరువుగలిగి, ఆకాశము (అవకాశము : Space) ను ఆక్రమించు
వస్తువు అని యర్థము. జడమునకే 'పదార్థము' అని నామాంతరము. అందుచే
నింగ్లీషులో మ్యాటర్ అనుశబ్దమునకుఁ బర్యాయపదములుగా మేము 'జడము'
'పదార్థము' 'జడపదార్థము' అను మూఁడు పదములు మా వీలుప్రకారము
వాడెదము. ఇనుముతోను కఱ్ఱతోను చేయఁబడిన రైలుబండి జడము. అది
గంటకు ముప్పదిమైళ్లచొప్పునఁ బోవుచున్న వేగము ఒకశక్తి. వేడిగా నున్న
నీళ్లలో జలభాగము జడము; అందులోనున్న వేడిమి ఒకశక్తి. దీపములో వత్తి
నూనెఅనునవి జడములు; వెలుతురు నిచ్చెడి జ్యోతి యందలి శక్తి. ఇటులనే

యితరపదార్థములను గుఱించి యెఱుఁగునది. రాళ్లు, ఇనుము, బంగారము, చెట్లు ఇవియన్నియు జడములు. ఉష్ణత, ప్రకాశము, చలనము, విద్యుత్ మొదలయినవి శక్తులు. జడము, శక్తి అనువానికి భేదమున్నను శక్తి స్వతంత్రముగా నెక్కడను విడిగాఁ గానరాదు. ఎప్పుడును జడమును ఆశ్రయించి తద్వారానే ప్రకటమగుచుండును. జడమును విడిచి శక్తి యెచ్చటను గానరాదు. ఈజడ, శక్తులను గుఱించి శాస్త్రజ్ఞు లందఱును ఈ క్రిందిసిద్ధాంతముల నంగీకరించి యున్నారు.

౧. జడమునకు వినాశము లేదు.

ఈ సృష్టియం దున్న యేవస్తువుగాని నాశముఁ జెందదు. మనము వస్తువులు నాశముఁ జెందినవని యనుకొను ప్రసంగము లన్నియు, రూపాంతరములుగాని వినాశములుకావు. వీధిలో నిప్పుడున్న నీరు కొంతకాలమునకు నుండదు. అది నాశముఁ జెందె నని పామరు లనుకొనియెదరు. కాని యది యావిరి రూపమును జెందెనేకాని వినాశముఁ జెందలేదు. కఱ్ఱ కాలిపోయినయెడల నది నాశముఁ జెందెనని వినాశముఁ జెందెనని మనము తలంచెదము. కాని యది, బొగ్గులు కర్బనద్వ్యామ్లజనిద (Carbon Dioxide) మను శాస్త్రీయ నామముగల బొగ్గుపులుసుగాలిగను మారెనేగాని నశించి పోలేదు. ఈలాగుననే సృష్టిలోని యత్యంతసూక్ష్మమైన యణువుగూడ నాశముఁ జెందనేరదు. సత్తునుండి యసత్తు పుట్టనేరదని మన వేదాంతులు చెప్పెడి మాట కిదియ యర్థము. ఇంతియ కాదు. అసత్తునుండియు సత్తు పుట్టనేర దని మనపూర్వులవలెనే యాధునికశాస్త్రజ్ఞుల యభిప్రాయము. అనఁగాఁ క్రొత్త యణువులు పుట్టవు. ఇదివఱకు జగత్తునం దెంతజడపదార్థము గలదో యంతకంటె నెన్నడును తక్కువకాదు; ఎక్కువకాదు. సృష్టియందు మనము చూచుచున్న పదార్థముల యుత్పత్తిలయాదులు సృష్టియందలి జడముయొక్క స్వరూపభేదములేకాని, యందుఁ గొంచెమైనను క్రొత్త ద్రవ్యము వచ్చిచేరదు; ఉన్నది తగ్గదు.

౭. శక్తికి వినాశము లేదు.

జడమువలెనే శక్తికూడ నాశముఁ జెందునది కాదు. తుపాకిలోనుండి బహువేగముతో బయలుఁజేరిన గుండు గోడకుఁ దగిలి యాగిపోవును. అంత నావేగమనుశక్తి నశించెనని మన మనుకొందుము. అది నశింపలేదు. ఆ గుండు ఆ గోడ కెచ్చటఁ దగిలెనో యచ్చటఁ బట్టి చూచిన యెడల అది వెచ్చగా నుండును. ఇట్లు ఆవేగమను శక్తి యుష్ణతయను శక్తిగా మారెనే కాని నాశముఁ జెందలేదు. ఇటులనే పొగబండిలోని, ఉష్ణమును కొన్ని యుపాయములచే గమనముగ (Locomotion) మార్చెదరు. చెన్నపట్టణములో మన మెక్కి తిరుగు ట్రాంబండ్లలో విద్యుచ్ఛక్తిని గమనముగా మార్చెదరు. మైసూరు ప్రాంతమునఁ గావేరీనది యొక కొండమీఁదినుండి క్రిందికి దుముకును. ఆ ప్రపాత మనునది (Waterfall) యొక్క శక్తి. దానిని విద్యుచ్ఛక్తిగా మార్చి దానిచే కోలారునొద్ది బంగారపు గనులను త్రవ్వించుచున్నారు. ఇట్లు సృష్టిలోని యొకశక్తి మఱియొక శక్తిగా మారునే గాని నాశముఁ జెందదు.

ఇట్లు ప్రకృతిశాస్త్రముల స్వరూపమును ముఖ్యమయిన తత్త్వములను సంగ్రహముగాఁ గనుఁగొని యేయే ప్రకృతిశాస్త్రము ఏయే విషయములను చర్చించునో మనము తెలిసికొందము.

ప్రకృతిశాస్త్రముల వర్గీకరణము.

పదార్థములన్నియు సజీవ, నిర్జీవములని రెండు భేదములుగాఁ గానవచ్చుచున్నందున సజీవములను గుఱించి చర్చించెడి శాస్త్రము లనియు, నిర్జీవజడములను గుఱించి చర్చించుశాస్త్రము లనియు శాస్త్రముల నన్నిఁటిని రెండుగా విభజింపవచ్చును. ఈ రెండు శాఖలలోని ముఖ్య శాస్త్రముల పేళ్లను వాని విషయములను అతిసంగ్రహముగా నీ క్రిందఁ బొందుపఱచెదము.

సజీవవిషయకశాస్త్రములు.

౧. జీవశాస్త్రము (Biology)— ఇందు సచేతనముల సమానధర్మములను గుఱించియు, భిన్న జీవులలోని పరస్పర కార్యకారణసంబంధములను

గుఱించియు, ప్రాణులకును వృక్షములకును గల్గు సంబంధమును గూర్చియు, భిన్నభిన్న వృక్షముల యొక్కయు జంతువుల యొక్కయు శరీరనిర్మాణభేదములును, ఆభేదము ననుసరించి జీవులలో విజ్ఞానము హెచ్చెడు తగ్గెడు విధంబును గుఱించియు వర్ణింపఁబడును. ఇది యొక స్వతంత్రశాస్త్రము కాదు. ముఖ్యముగా జంతుశాస్త్రము (Zoology), వృక్షశాస్త్రము (Botany) అను రెండు శాస్త్రములు కలిసి యీశాస్త్ర మేర్పడినది.

౨. జంతుశాస్త్రము—ఇందు నణువుకంటెఁ జిన్నజంతువు మొదలు మనుష్యుని వఱకుఁ గల యసంఖ్యజంతుకోటియొక్క వర్గీకరణము (Classification), శరీర నిర్మాణము (Morphology), ఇంద్రియవ్యాపారములు (Organic functions) మొదలయిన విషయములను గుఱించి వ్రాయఁబడియుండును. మానవాస్థి పంజర శాస్త్రము (Human Anatomy), మానవ శారీరశాస్త్రము (Human Physiology) అను రెండు శాస్త్రములును ఈ శాస్త్రముయొక్క విభాగములే. ఈ రెండు శాస్త్రములును వైద్యుల కత్యంతావశ్యకములు.

౩. వృక్షశాస్త్రము—మిక్కిలి చిన్ని వృక్షములు మొదలు గగనచుంబితములగు మహావృక్షములవఱకును గల వృక్షజాతుల వర్గీకరణము, శరీర నిర్మాణము మొదలయిన విషయములను గుఱించి యీ శాస్త్రమునందు వర్ణింపఁబడును.

౪. మానసశాస్త్రము (Psychology)— ఇదియును జీవశాస్త్రాంతర్గతమే. ఇందుఁ జిత్తవృత్తులను గుఱించియు, మనోధర్మములను గుఱించియు, మనోవ్యాపారములను గుఱించియు వివరింపఁబడియుండును.

ఇవి సచేతన విషయకమైన ముఖ్యశాస్త్రములు. ఇఁక నిర్జీవపదార్థములను గుఱించిన శాస్త్రములఁ గనుఁగొందము.

## నిర్జీవవిషయకశాస్త్రములు.

౧. పదార్థ విజ్ఞానశాస్త్రము (Physics)— జీవశాస్త్రమువలెనే యిది స్వతంత్రశాస్త్రము కాదు. అనేకశాస్త్రములసముదాయము. ఇందు జడముయొక్క సామాన్యధర్మము (General properties) లను గుఱించియు, సృష్టిలోని శక్తి (Force) యొక్క రూపాంతరములగు ఉష్ణత (Heat), విద్యుత్ (Electricity), లోహచుంబకత్వము (Magnetism), ప్రకాశము (వెలుతురు Light), ధ్వని (Sound) మొదలయినవాని గుఱించియు చర్చింపఁబడును. ఇందలి గమనమును (Motion) గుఱించిన శాస్త్రమునకు గతిశాస్త్రమనియు (Dynamics), వెలుతురును గుఱించిన దానికి ప్రకాశశాస్త్రమనియు (Optics) పేళ్లు గలవు. ఇందులోని యితరశాస్త్రములకు నిటులనే వేఱు పేళ్లు గలవు.

౨. రసాయనశాస్త్రము (Chemistry)—ఇది సృష్టిలోనున్న జడపదార్థముల నన్నిఁటిని బరీక్షించి యేయే పదార్థములలో మఱి యేయే పదార్థములు కలిసి యున్నదియు, ఏయే పదార్థములు తత్త్వద్రవ్యము (Elements) లయినదియుఁ దెలుపుశాస్త్రము. ప్రయోగపద్ధతిచేఁ బదార్థముల నన్నిఁటిని బరిశోధించి చూచి వానిలో డెబ్బది మాత్రము తత్త్వద్రవ్యములు, అనఁగా నితరపదార్థమేదియుఁ దమలోఁ గలసి లేక స్వయంసిద్ధముగ నున్న వనియు, నెన్నియుపాయములఁ బన్నినను పృథక్కరణమునకు (Analysis) లోఁబడనివి అగుననియు, కడమపదార్థము లన్నియు మిశ్రద్రవ్యములు, అనఁగా ఈ డెబ్బది తత్త్వద్రవ్యముల భిన్నభిన్నసంయోగీకరణముచేఁ బుట్టిన వనియు శాస్త్రజ్ఞులు సిద్ధాంతీకరించిరి. ఈ యంశములను, మిశ్రపదార్థములను తత్త్వద్రవ్యముగా మార్చుపద్ధతియు, తత్త్వద్రవ్యములఁ గలిపి మిశ్రపదార్థములఁ జేయువిధమును ఈ శాస్త్రమునందు విశదీకరింపఁబడును.

పైనఁ జెప్పఁబడిన రెండు శాస్త్రములును అనఁగా పదార్థవిజ్ఞాన రసాయనశాస్త్రములు సకలశాస్త్రములకును మూలాధారములు. కావున ప్రకృతిశాస్త్రముల నభ్యసించువారు వీనిని తప్పక మొదటఁ జదువవలెను

3. భౌతిక భూగోళము (Physical Geography)— ఈ భూగోళముమీఁద స్థలభాగములోను, జలభాగములోను ఎల్లప్పుడును జరుగుచున్న మార్పులును వాని కారణములును ఇందు వివరింపఁబడును.

౪. భూగర్భశాస్త్రము (Geology)— ఇందు భూగర్భములోని పొరలను (Strata) గుఱించియు, వాని ననుసరించి భూమియొక్క యాది యాకారమును గుఱించియు తరువాత నది పెరిగిన విధంబును, భూమిమీఁద ఏయే వృక్షజాతి, యేయే జంతుజాతి యెప్పుడెప్పు డావిర్భవించినదియు మఱి యనేకవిషయములును వివరింపఁబడి యుండును.

ఇట్లిచ్చట ముఖ్యశాస్త్రములను పేర్కొంటిమి. శాస్త్రము లనంతములు. వానినన్నిఁటిని పేర్కొనుటకే యనేకపుటలు కావలెను. జ్ఞానమభివృద్ధియైనకొలఁదిని శాస్త్రముల సంఖ్య హెచ్చుచున్నది. ఒక కంటిని గుఱించి యనేకగ్రంథములు గలవు. చీమను గుఱించి యొక శాస్త్రము గలదు. మన యాంధ్రభాష యభివృద్ధియైనకొలఁదిని ఈ శాస్త్రములన్నియుఁ దెలుఁగునఁ బ్రకటింపఁబడు నని నమ్ముచున్నాము.

ఇట్లు ప్రకృతిశాస్త్రములను గుఱించిన సామాన్యసిద్ధాంతములఁ దెలిసికొని, ప్రస్తుతగ్రంథములోని సంగతు లెట్టివియో కనుఁగొందము.

## జీ వ శా స్త్ర ము.

సచేతనములనియు అచేతనములనియు మన మీ సృష్టియందుఁ బదార్థములలో రెండు భేదములఁ జూచుచున్నాము. సచేతనములకు సజీవములనియు, అచేతనములకు నిర్జీవములనియు నామాంతరములు. సచేతనములను గుఱించిన శాస్త్రమునకు జీవశాస్త్ర మని పేరు. జీవము, ప్రాణము అను శబ్ద

ములు సమానార్థకములు. ప్రతి సజీవపదార్థమును జడపదార్థమగు దేహముతోఁ గలసి వ్యక్తమగునే కాని, జడమును విడిచి స్వతంత్రముగాఁ గానరాదు. కావున జీవశాస్త్రమునందు శరీరముద్వారా వ్యక్తమగు జీవమును గుఱించి విచారింపఁబడునే కాని, దేహమును విడచిన జీవము అతీంద్రియము కావున అందున గుఱించి యిందు వివరింపఁబడదు. జీవుఁడను వాఁడు వేరొకఁడు కలఁడా? లేక సర్వేంద్రియవ్యాపారసమూహమే జీవుఁడా? మరణానంతరము జీవుఁ డేమగును? అను విషయము లన్నియు అతీంద్రియములు. కావున వానితో జీవశాస్త్రమునకు నేమియుఁ బనిలేదు. వేదాంతశాస్త్రము లందున గుఱించి చర్చించును గాత.

మన యింద్రియములకు గోచరమగు సచేతనముల శరీరనిర్మాణమును (Morphology), ఇంద్రియ వ్యాపారమును (Physiology), జీవుల యొక్క శరీరరచన ననుసరించిన మనోవికారభేదములను (చిత్తవృత్తులను Mental Phenomena) బట్టి జీవులలో నేర్పడుచున్న తరగతులును (Classes), భిన్న తరగతులలోని జీవులకుఁ గల సంబంధమును కనుఁగొనుటయు, జీవశాస్త్రముయొక్క విషయములు. ఈ శాస్త్రమును అభ్యసించువారు ప్రప్రథమమున సచేతనము (జీవము) లకును అచేతనములకును గల భేదమును చక్కఁగాఁ గనుఁగొనవలయును. అచేతనములందు లేని యీ క్రింది ధర్మములు సచేతనములందుఁ గలవు:—

• ౧. శరీరనిర్మాణము (అవయవరచన)— సాధారణముగా శరీరమును ఒక యంత్రముతోఁ బోల్చెదరు. ఈ శాస్త్రమునందు శరీరమనగా కేవలము మానవశరీరము కాదు. సూక్ష్మదర్శని (Microscope) సహాయముచేఁగాని కానరాని యత్యంతసూక్ష్మబిందువువలె నుండు వికారిణి (Amoeba) అను జీవి మొదలుకొని సమస్తజీవులకు రాజగు మనుష్యునివఱకుఁ గల అసంఖ్య జీవులయొక్క శరీరమునకును ఈ శాస్త్రమునందు శరీరమని పేరు. వృక్షములును జీవులే అయినందువలన వాని అవయవనిర్మాణమునకును శరీరమనియే

పేరు. ఇట్టి ప్రతి శరీరము యంత్రమువంటిది. గడియారము, ప్రత్తిమర, బియ్యపుమర, కుట్టుపనివానియొద్ద బట్టలు కుట్టెడి మిషన్ మొదలయిన యంత్రములను తెలుఁగు చదువరులు చూచియుందురు. ఈ యంత్రములయందే ముండును? అనేక చిన్నచక్రములును, పెద్దచక్రములును, ఇరుసులును మఱికొన్ని అవయవములును కలిగి, యందొక్కొక్కటి ఒక్కొక్క ప్రయోజనార్థము నిర్మింపఁబడి యొక్కొక్క పనిఁ జేయుచున్నటులఁ గానవచ్చుచున్నది. అలాగుననే ప్రతి శరీరమునందును పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, మస్తిష్కము, హృదయము, జ్ఞానతంతువులు, ఉదరము, మజ్జా మొదలయిన అవయవములలో నన్నియో, కొన్నియో గలిగియుండి, వాని వాని వ్యాపారములఁ జేయుచుండును. యంత్రముయొక్క రచన యెంత సులభముగా నుండునో దానియొక్క వ్యాపారమంత తక్కువగ నుండును. యంత్రముయొక్క రచన యెంత యెక్కువ చిక్కుగ నుండునో దాని వ్యాపారములు గూడ నంత యధికముగా నుండును. అనఁగా నది యధికముగాఁ బనిచేయును. ఇందుకు గడియారమును ఉదాహరణముగా గైకొందము. కేవలము గంటలు, నిమిషములు తెలుపు గడియారములోఁ గొలఁది చక్రములే యుండును. క్షణములఁ జూపు దానిలో నింకొక చక్ర మధికముగా నుండును. అంతకంటె నెక్కుడు చక్రములు కలవి గంటలు కొట్టును. తేదులు, నెలలు, వారములు చూపు గడియార మితరగడియారములకంటె నెక్కుడుచక్రములును, ఎక్కుడు నిర్మాణచమత్కారమును గలిగి యుండును. ఇటులనే జీవుల విషయమై యోజింపవలయును. ప్రాణికోటిలో రాజని చెప్పఁదగు మనుష్యుని శరీరములోని యవయవరచన అత్యంత చమత్కారముగాఁ జేయఁబడినది. అందు నితర ప్రాణులకంటె నెన్నియో అవయవములు, వెలుపలను లోపలను గలవు. అందుచే మానవశరీరవ్యాపారములు ఇతర జంతువులకంటె నధికముగాను, ఎక్కువ యోగ్యత, ఉపయోగము కలవిగాను ఉండును. అవయవనిర్మాణము ననుసరించియె మానవునియందు వాక్కు, బుద్ధి, మేధ మొదలయిన

విశేషంబు లున్నవి. మనము తగ్గుజాతి జీవులను జూచిన కొలఁదిని వానియందు ఇంద్రియరచనయు, ఇంద్రియ వ్యాపారమును, విజ్ఞానమును తగ్గుచున్నటులఁ గానవచ్చెడిని. మిక్కిలి తక్కువ జాతిది యగు వికారిణి (Amoeba)శరీరముఁ జూచినయెడల అందు పంచజ్ఞానేంద్రియ, పంచకర్మేంద్రియముల వ్యాపారములన్నియు నొక్క త్వగింద్రియమే చేయుచున్నటులఁ గానవచ్చును. అందుచే దాని వ్యాపారంబులును విజ్ఞానంబును మిక్కిలి తక్కువగనుండును. ఈలాగు మిక్కిలి తగ్గుజాతి జీవులు మొదలు హెచ్చుజాతి జీవులవఱకు, అవయవరచనానైపుణ్యంబును విజ్ఞానవృద్ధియుఁ గానవచ్చెడిని. కేవల జడపదార్థములలో నీ శరీరనిర్మాణవైచిత్ర్య ముండదు. ఇనుముగాని రాయిగాని చూచినయెడల అందు పరమాణువు లన్నియుఁ గూడి యొక ముద్దవలె నుండును కాని, యందు సృష్టిలోని యొకశక్తిని మఱియొక శక్తిగా మార్చు యంత్ర నిర్మాణమువంటి నిర్మాణ ముండదు. ఇది చేతనాచేతనములకుఁ గల యొక పెద్ద భేదము. ఇట్లు యంత్రములకును జీవులకును బోల్చుటఁ జూడఁగా సాధారణ యంత్రములకును, జీవ శరీరములకును నేమియు భేదము లేదని చదువరులు భ్రమపడుదురేమో. కాని వీనికి సామ్య మున్నటులనే భేదముకూడఁ గలదు. మనము చూచెడి యంత్రములు నడచుటకు వెలుపలి సామర్థ్యము కావలెను. గడియారములోని చక్రములు నడచుటకు స్ప్రింగ్ కావలయును. ఎంజిన్ నడచుటకు ఆవిరి కావలయును. ఈ యంత్రములలోని యేభాగము చెడిపోయినను యంత్రము ఆగి పోవును. ఆ చెడిపోయిన భాగమును బాగుచేసికొను శక్తి ఆ యంత్రమునందు లేదు. ఈ యంత్రములెంత విచిత్రరచన గలవి యైనను తమవంటి రెండవ యంత్రమును పుట్టింపనేరవు. జీవులను యంత్రములకుఁ దమ వ్యాపారములను జేయు సామర్థ్యము స్వయముగాఁ గలదు. అవి యితరపదార్థములవలన వానికి రానక్కరలేదు. ఇందలి కీలేదైనను చెడినయెడల దానిని బాగుచేసికొను సామర్థ్య మీ శరీరయంత్రములందుఁ గలదు; తమవంటి శరీరయంత్రములఁ బుట్టించు సామ

ర్థ్యముఁ గలదు. ఇది యీరెండు యంత్రములకుఁ గల తారతమ్యము. ఇట్లు జడపదార్థములకును సచేతన పదార్థములకును గల యొక భేదముఁ గనఁబఱచి అచేతనములకు లేనట్టి సచేతనములకుఁ గల సాధారణధర్మములఁ బేర్కొని యెదము:—

౨. ఉత్పత్తి —తమవంటి మఱియొక జీవినుండి యుత్పత్తి యగుట జీవుల విశేషధర్మము. ఏజీవియుఁ దనంతటఁ దాను కలుగదు. దానికి జనక స్థానమున దానివంటి యొక జీవి యైనను ఉండవలెను. హెచ్చుతరగతిజీవులకుఁ దలిదండ్రు లనఁబడు జన్మహేతువులగు రెండు జీవు లుండును. తగ్గు జాతిజీవుల యుత్పత్తి యొక్కజీవివలననే గలుగుచున్నది.

3. వృద్ధి (పెరుగుట):—తమచుట్టు నుండెడి విజాతీయ (Hetero-geneous) పదార్థములను లోనికిఁ దీసికొని వానిని రాసాయనరీత్యా (Chemically) పృథక్కరించి (Analyse) వానిలోనుండి తన శరీరమునకు నావశ్యకములయిన పదార్థములను దీసికొని తద్వారా సర్వావయవములను, సర్వశరీరమును అభివృద్ధిచేయు సామర్థ్యము జీవులకుఁ గలదు. అచేతన పదార్థములుగూడ పెరుగుట మనము చూచుచున్నాము. కృష్ణా గోదావరుల లోని లంకలు పెరుగును; స్ఫటికములు (Crystals) పెరుగును. కాని యీ జడపదార్థము లన్నియు సజాతీయపదార్థములు తమపై వచ్చి పడినందునఁ బెరుగును. క్రమక్రమముగా ఇసుక మన్ను మొదలయిన ద్రవ్యముల పొరలు ఒకటిపై నొకటి వచ్చి చేరినందున లంక పెరుగును. ఏకజాతీయ కణములు ఒకటిపై నొకటి చేరుటవలన స్ఫటికము పెరుగును. జీవుల యభివృద్ధి అటువంటిది కాదు. గాలిలోని బొగ్గుపులుసుగాలి (కర్బనద్విఆమ్లజనిదము Carbon Dioxide), భూమిలోని జలము, కొన్ని లవణములు •వీనివలన గడ్డి, ఊవలు, అభివృద్ధియగును. అట్టి గడ్డి ఊలవలు తిని గుఱ్ఱము బలియు చున్నది. ఇదియుఁగాక ఒకానొకచోట మాత్రము క్రొత్త పదార్థము అతిక్కి నందున జడపదార్థము పెరుగును. అనఁగా ఆ పెరుగుట పదార్థముయొక్క—

యొకానొక భాగమునందు గాని, చుట్టు మాత్రము గాని ఉండును. అంతటను ండదు. జీవియొక్క పెరుగుట యటువంటిది గాదు. తనదేహములోని ప్రతి యవయవమును ప్రతికణమును పెరిగినందువలన జీవి పెరుగును. దీనికే సేంద్రియవృద్ధి (Organic growth) అని పేరు.

3. సంతానవృద్ధి:— తనవంటి జంతువును కనుట జీవియొక్క యొక విశేషధర్మము. ఈ పునరుత్పాదనవిధము లనేకములు గలవు. స్త్రీపురుష సంయోగమువలన సంతానోత్పత్తి యగుట మనము హెచ్చుజాతి జీవుల యందుఁ జూచుచున్నాము. కాని అణురూపము లయిన మిక్కిలి తగ్గుజాతుల లోని జీవులలో స్త్రీపురుషవిభేదము లేదు. అట్టి యొక జీవి రెండుగాఁ దెగి యా రెండుభాగములును రెండు స్వతంత్రజీవు లగును. దీనికి ద్విఖండన సంతానవృద్ధివిధాన మని పేరు.

౪. మరణము:—పైన వర్ణింపఁబడిన వ్యాపారము లన్నియు మాని జడత్వముఁ జెందుట మరణము. ఇట్టి మరణము జడములకు లేదు.

## వృక్షములకు జీవము కలదా?

సచేతనములలో వృక్షము లనియు, జంతువు లనియు రెండు భేదములు కలవని యిదివఱకే చెప్పియున్నాము. వృక్షాదులు జంతువులవలె స్థలాంతరముఁ జేరక యొక్కచోటనే నిలిచి యుండుటచే నవి సచేతనములు గావని కొందఱు భ్రమపడుచున్నారు. కాని యది నిజము కాదు. చలనము జీవత్వమునకు ఒక్కముఖ్యలక్షణము కాదు. చలనము లేకయు సచేతనత్వ ముండవచ్చును చలనముండియు జడత్వ ముండవచ్చును. ఇదియుఁగాక పెద్ద పెద్ద జంతువులకు జంగమత్వ మున్నను, చలనము లేక యొక్కచోటనే యుండు అతిసూక్ష్మజంతువులు కొన్ని కలవు. సాధారణముగ వృక్షములకుఁ జలనము లేకపోయినను అతిసూక్ష్మవృక్షములుకొన్ని తిరుగుచుండును. ఇదియుఁ గాక పైని జీవత్వమునకుఁ గల వని వర్ణించిన లక్షణము లన్నియు వృక్షముల యొదఁ గలవు.

వృక్షములకు జంతువులవలె కాళ్లు చేతులు మొదలయిన యింద్రియములు లేకపోయినను, వానియందు జీవనమునకు నావశ్యకమైన అవయవములును, తద్వ్యాపారములును గానవచ్చును. హెచ్చుజాతి జంతువుల శరీరమునకు నాధారముగ అస్థిపంజరము (Skeletou) శరీరములో నున్నటుల వృక్షములను నిలువఁబెట్టుటకు కాడయు, కొమ్మలును గలవు. వృక్షము అభివృద్ధి యగుటకుఁ బోషకరసము కావలయును. దానిని వృక్షములు వేళ్లద్వారా భూమిలోనుండి గ్రహించును. ఈ వేళ్లు వృక్షములకు చేతులు నోరు వంటివి. జంతువుల శరీరములో రక్తము ప్రవహించుచున్నటుల వృక్షములలో నొక విధమైన రసము పారుచుండును. దీనికి మనము వృక్షశోణిత మని పేరు పెట్టినను పెట్టవచ్చును. జంతువులకు ఊపిరితిత్తుల (Lungs) వలన జరిగెడు క్రియ ఆకులద్వారా జరుగును. వృక్షశోణితమును వృక్షశరీరమునందంతటను వ్యాపింపఁజేయు వాహిక లుండును. ఇట్టి శరీరనిర్మాణము కలిగి వృక్షములు ఆహారముఁ దిని స్వశరీరముఁ బెంచి వృద్ధియగుచున్నవి. శత్రువులతోఁ బోరాడి బలవంతము లయినవృక్షములు బలహీనము లయినవాని నడచివేయును. స్త్రీపురుషభేదము పుష్పములద్వారా కలిగియుండి వృక్షములు సంతానోత్పత్తి చేయుచున్నవి.

వృక్షములకు జంతువులవలె మెదడుగాని జ్ఞానతంతువులు (Nerves) గాని లేకపోయినను వానికిఁ గొంతవఱకు మనోవికారములు కల వని చెప్ప వచ్చును. వృక్షములకు నొకవిధమైన నిద్రయు భయమును కలవు. చింత యాకులు, తురాయియాకులు రాత్రి యొకటిలో నొకటి ముడుచుకొనును. ఇది వాని నిద్ర. ఇటులనే యనేక వృక్షములు రాత్రి నిద్రపోవుచుండుట శాస్త్రజ్ఞులు కనుఁగొనిరి. కొన్ని వృక్షముల యాకులను ముట్టినతోడనే యాకులన్నియుఁ ద్వరత్వరగా ముడుచుకొనును. సాధారణముగా 'అత్తిపత్తి చెట్టు' అనఁబడు చిన్నచెట్టు ఇటువంటిది. కొన్ని చెట్లయొక్క యొకయాకు మీఁద సహింపలేని ద్రావకముఁ బోసినయెడలఁ గడమయాకు లన్నియుఁ

భయముఁ జెందినవానివలె వడవడ వడఁకఁ జొచ్చి వాడిపోవును. ఇందువలన జంతువుల శరీరములో నున్నటుల వృక్షములలోఁ గూడ జ్ఞానతంతుజాలము (Nervous System) ఉన్నదేమో యని కొందఱు శాస్త్రజ్ఞు లూహించెదరు. కాని యట్టి జాల మెవ్వరును ఇదివఱకుఁ గనిపెట్టలేదు. పిడుగు వలన మానవులు చనిపోవునటుల నే వృక్షములును మృతినొందును. కొన్ని వృక్షములమీఁద నల్లమందునీళ్లు చల్లినయెడల నవి మత్తెక్కిన వానివలె నగును. కొన్ని విషములు పోసినఁ బ్రాణులవలె నే వృక్షములు చచ్చును.

వాన్. మార్షియస్ అను బాటసారి అమెరికా ఖండములోని ఉష్ణప్రదేశములోఁ దిరుగుచున్నప్పుడు 'మిమోసా' యను వృక్షముల యారణ్యముఁ గనుఁగొనెను. అందును గుఱించి యాతఁ డిట్లు వ్రాసెను: 'నా గుఱ్ఱపు కాళ్ల చప్పుడు వినినతోడనే యా చెట్టుయొక్క యాకులు త్వరత్వరగా మూసికొని పోయెను. మఱియు మిక్కిలి భయపడినవానివలెఁ గానవచ్చెను.' డెస్ఫాంటెనిస్ అను పేరుగల మఱియొక శోధకుఁ డీచెట్టును అనేకరీతులఁ బరీక్షించి చూచెను. ఈతఁ డిట్టి యొక చిన్నవృక్షమును తన బండిలో నుంచుకొని బయలుదేరెను. బండి కదలినతోడనే ఆ చెట్టు ఆకులన్నియు నొకటితరువాత నొకటి మూసికొనెను. కొంతసేపు ఆ బండి యట్లులనే నడచుచుండ నవి విచ్చెను. బండి యాగినతోడనే యవి మరల మూసికొనెను.'

మఱియొక విచిత్రమైన చెట్టు అమెరికాదేశములోఁ గలదు. అది పురుగులను బట్టుకొని భక్షించును. ఆకుమీఁద కీటకము కూర్చుండినతోడనే యా యాకు ముడుచుకొనును. ఆ కీటకము చచ్చి దాని శరీరములోని రసమంతయు ఆ వృక్షశరీరములో జీర్ణమయిన తరువాత నది మరలఁ దెరచును. తమకు భక్ష్యమైన కీటకములు వచ్చినప్పుడే యా యాకులు మూసికొనును. కీటకమునకు బదులు ఒక చిన్న రాయి యుంచిన నవి మూసికొనవు! అనఁగా నిది రాయి, యిది కీటకము అను తారతమ్యజ్ఞాన మా వృక్షమునకుఁ గలదని తోఁచవలసి యున్నది.

ఇట్టి పైవర్ణనలవలన వృక్షములు సచేతనము లని చదువరులు గ్రహించి యుందురు. ఇంతియ కాదు. వృక్షములు సచేతనము లగుటయే గాక సచేతనత్వమునకు జనయిత్రులు; సచేతనత్వమునకు మూలాధారములు. వృక్షముల వలన అచేతనపదార్థములకు సచేతనత్వము ప్రాప్తమగుచున్నది. అనఁగా వృక్షములు ప్రాణము లేనివానికిఁ బ్రాణము పోయుచున్నవి. గాలి, నీరు, మన్ను, లవణములు అను పదార్థములు అచేతనములు (నిరింద్రియములు inorganic). ఈ పదార్థములను ఆహారముగాఁ గైకొని వృక్షములు వీనిని సేంద్రియద్రవ్యములుగా అనఁగాఁ గాయలు, పండ్లు, ధాన్యములుగా మార్చుచున్నవి. సర్వజీవములకును జీవాధారమైన మూలపదార్థము (Protoplasm) అను ద్రవ్యమును వృక్షములు మొట్టమొదట జడపదార్థములనుండి పుట్టించును. ఇటుల నిర్జీవద్రవ్యములకు సజీవత్వ మొసంగు సామర్థ్యము వృక్షములకుఁ దప్ప మఱి యేజీవులకును లేదు. ఇంతియ కాదు. వృక్షములు జంతువుల జీవనమునకు ముఖ్యాధారము. అది యెట్లన, సృష్టిలోని వస్తువులన్నియు సేంద్రియములు (Organic), నిరింద్రియములు (Inorganic) అని రెండుగా విభజింపఁబడును. సజీవపదార్థములును వానిచేఁ సృష్టింపఁబడిన పదార్థములును సేంద్రియము లనఁబడును. ఇతర పదార్థములు నిరింద్రియములు. బియ్యము, గోధుమలు, నూనె, నెయ్యి, శర్కర, ఎముక, మాంసము, ఱంపలు, కఱ్ఱ, శంఖము మొదలయినవి సేంద్రియములు. బంగారము, ఇత్తడి, రాయి, గాలి, నీళ్లు, ఉప్పు మొదలయినవి నిరింద్రియములు. నిరింద్రియద్రవ్యములు వృక్షముల యాహారము. ఇట్టి నిరింద్రియద్రవ్యములలో నుండి సేంద్రియద్రవ్యములను వృక్షములు పుట్టించు నని పైనఁ జెప్పియున్నాము. జంతువుల యాహారము ముఖ్యముగా సేంద్రియద్రవ్యములు గలది. అందు నిరింద్రియ ద్రవ్యములు మిక్కిలి తక్కువగా నుండును. మనుష్యప్రాణియొక్క భక్ష్యభూత పదార్థములను బరీక్షించి చూచిన యెడల ఉప్పు, నీరు, గాలి యీ మూఁడు పదార్థములే యందు నిరింద్రియ

ములు. మానవుఁడు భక్షించు బియ్యము, పప్పు, ఫలములు, పాలు, వెన్న మొదలయినవన్నియు వృక్షములచేఁగాని జంతువులచేఁగాని చేయఁబడిన సేంద్రియద్రవ్యములే. కేవల నిరింద్రియద్రవ్యములు తిని మానవుఁడు బ్రతుకలేఁడు. కావున మన జీవనాధారమునకు వృక్షము లత్యావశ్యకములు. నేఁడు సృష్టిలోని జంతువులన్నియు నశించినను వృక్షములు కొంతవఱకుఁ బ్రతికియుండఁగలవు. కాని వృక్షములు నశించెనేని జంతువులన్నియు నొక్కపెట్టున విలయముఁ జెందఁగలవు. ఇందుచేఁ బృథ్వీమీఁద వృక్షము లేర్పడిన యెన్నియో యుగములకు జంతుసృష్టి ప్రారంభమయ్యెనని విద్వాంసు లూహించియున్నారు. ఏలయన: శాఖాహారములేక జంతువులు బ్రతుకుట యెట్లు? కొందఱు మాకు శాఖాహార మక్కఱలేదు, మేము మాంసాహారము తిని బ్రతుకుదుమని యందురేమో? కాని మన మానవుల కొక్కరికే గాక యన్ని జంతువులకును సేంద్రియాహార మవశ్యము గనుక క్రింది జంతువులు బ్రతుకనిది మానవులకు మాత్రము మాంస మెచ్చటినుండి రాఁగలదు? మేఁకకుఁ దినుటకు గడ్డి యుండినఁగదా దాని మాంసము మానవునికి దొరకుట? ఇట్లు వృక్షములు నిరింద్రియద్రవ్యములను దీసికొని వానిని సేంద్రియములు చేయును. జాతువులు ఆసేంద్రియద్రవ్యములు తిని యందలి సేంద్రియత్వమును గైకొని తమవృద్ధికి నుపయోగపఱచుకొని, మరల వానిని నిరింద్రియద్రవ్యములుగ మార్చును. ఇట్లు వృక్షములు కూర్చును, మనము వెచ్చింతుము.

## జీవకణములు

## (The cell Doctrine.)

జడద్రవ్యములన్నియు నెట్టుల అణువు (molecules) లచేఁ జేయఁబడినవో, యటులనే జీవశరీరములన్నియు జీవకణము (Cells) లనఁబడు సూక్ష్మద్రవ్యములచేఁ జేయఁబడినవి. ఏ వృక్షముయొక్క శరీరమును పరీక్షించి చూచినను, ఏజంతువుయొక్క శరీరమును శోధించినను, అవి కణమయములై యున్నటులఁ గానవచ్చును. అనేకమానవులు కూడి యొక సంఘముగాఁ గాని

దేశముగాఁగాని యెట్టుల నేర్పడునో యట్టులనే యనేక కణముల సమూహము దేహ మనఁబడును. సాధారణముగా మనకుఁ గానవచ్చెడి జీవుల శరీరములన్నియు ననేకకణములతోఁ జేయఁబడినను, సూక్ష్మదర్శనిచేఁ గాని కానరాని యత్యంత సూక్ష్మజీవులు కొన్ని యేకకణమయములై యుండును. ఇట్టివి అనేకములు జంతువులలోను వృక్షములలోను గలవు. ఇవి జీవులలో మిక్కిలి తక్కువతరగతివి. కడమ జీవు లన్నియు అనేక కణములు గలిగి యుండును. ఈ కణములయొక్క యాకారము భిన్నభిన్నజీవులలో భిన్నభిన్నవిధముగ నుండును. కొన్ని అటులవలెఁ జతుష్కోణముగను, గొన్ని పొడవుగను, కొన్ని గుండ్రముగను వివిధాకారము లయి యొప్పును. వీని భిన్నాకారములను ఈ ప్రక్కపుటలో నీయఁబడిన పటములోఁ జూడనగును. ఇతర ప్రాణుల శరీరమువలెనే మానవప్రాణి శరీరములోని అస్థి, మాంసము, త్వక్, జ్ఞానతంతువులు మొదలయిన యన్నిభాగములును కేవల జీవకణమయములై యున్నవి. ఈ జీవకణములు పనిపడినట్టుల నెల్ల భిన్నభిన్న రూపములఁ దాల్చుచు, ఒకటితో నొకటి యనేక రీతుల నంటుకొని రక్తము, అస్థి, స్నాయువు, మజ్జాది రూపములఁ దాల్చి శరీరక్రియ నడపుచున్నవి. శరీరములోని కేశాకారము గల యొకానొక రక్తవాహిక (artery)ను, బరీక్షించి చూచినయెడల అనేక జీవకణము లొకటి నొకటి పొడవుగను గుండ్రగను అంటుకొని గొట్టముల రూపమును దాల్చి రుధిరాభిసరణమునకు సహాయమొనర్చుచున్నవని కనఁబడఁగలదు. కొన్ని జీవకణములు పొడవుగసాగి గుంపుగఁ గూడి సంకోచవికాసశీలము గలవి (that can contract and expand) యై కండరములు (కండలు: Muscles) అగును. మఱికొన్ని కణములు ఒకటి చివర నొకటి యంటుకొని టెలిగ్రాం తీగవలె పొడవై జ్ఞానతంతు వగును. కొన్ని కణములు ఖనిజపదార్థములను విశేషముగఁ దీసికొని కఠినత కలవియై అస్థిరూపముఁ దాల్చును. కొన్ని రూక్షములయి వెలువడి త్వగ్రూపమును ధరించి శరీరరక్షణముఁ జేయును. ఇట్లు వానివాని పనిని అనుసరించి, యీ కణముల రూపము, వర్ణము (రంగు), ఆకారము, ధర్మములు మాఱి యవి

## జీవకణములు




1. గుండ్రని కణము.

2. అండాకృతి గలది.

3. గొట్టమువలె నుండునవి.

4. బహుభుజకణములు. ఇవి మృదుకణముల సంహాతులలో తరుచుగ నుండునవి.

5. బల్లపరుపు కణములు.

6. నక్షత్రాకారమైన కణము.

7. పొడుగైనకణములు. దృఢకణముల సంహాతులలో నీకణములుండును

చర్మాస్థిస్నాయ్వాదిరూపములఁ దాల్చును. ఈ చర్మాస్థిమజ్జా జ్ఞానతంతువులు మొదలయినవి శరీర మను రాజ్యముయొక్క వేఱువేఱు మహాకమాలు (Departments).

మనుష్యులందఱును మొదట నొక్కస్వరూపము కలవార లయినను, కాలము, దేశము, శీతోష్ణములు, భోజనములు, ఆచారవ్యవహారములు మొదలయిన భేదములను బట్టి కొందఱు పెద్ద పెదవులు గల నల్లని సిద్దీలు (Negroes) అయిరి; కొందఱు పసుపువర్ణమును, నష్టకేశమును చట్టిముక్కులును గల చీనావా రయిరి. కొందఱు తెల్లని రంగువారును, మార్జాలనయనములును, ఎఱ్ఱ వెండ్రుకలవారును అగు యూరోపుదేశస్థు లయిరి. కొందఱు మనవలె చామనచాయవారును, నల్లని వెండ్రుకలవారును అయిరి. ఇట్లు మొదటఁ బూర్తిగ సాధర్మ్యము గల మానవులలోఁ గ్రమక్రమముగ బాహ్యస్వరూపమందును, అంతఃస్వరూపమునందును వైధర్మ్యము గలిగి వేఱువేఱు మానవజాతు లేర్పడెను. అటులనే జీవకణము లన్నియు మొదట నొక్కటేయైనను క్రమక్రమముగా మారుచుఁబోయి, విధర్మములు గల అస్థి, చర్మ, స్నాయు మొదలయిన రూపములను దాల్చెను. ఇంతియు కాదు. ఈజిప్టు దేశములోని నల్లని సిద్దీజాతిస్త్రీని దీసికొనిపోయి లండనులో నుంచినను, నల్లని శిశువునే కనును, తెల్లని శిశువును గనదు. ఇది యానువంశిక ధర్మము (Law of Heredity). అటులనే గర్భావస్థలో నున్నపుడు మనుష్యునిశరీరము మొదట సమానమగు కణమయ మయియుండును; అందుఁ గొన్ని అనుకూలస్థితి ప్రాప్త మయినతోడనే, వానియందు నదృశ్యరూపమున నుండు ఆనువంశిక ధర్మమును బట్టి అస్థిరూపమునే దాల్చును. కొన్ని స్నాయురూపమునే దాల్చును. మఱికొన్ని జ్ఞానతంతురూపమునే దాల్చును.

పైనఁ జెప్పిన యుదాహరణములన్నియు జంతువులవిషయమైనవి యగుటచే ఈ జీవకణములు జంతుశరీరమునందు మాత్రముండుననియు, వృక్షములలో నుండవనియుఁ జదువరులు భ్రమపడుదురేమో. భ్రమపడవలదు. ఈ

కణములు వృక్షములందుఁగూడ నుండును. వృక్షముయొక్క వేరు, ప్రకాండము (Stem), కొమ్మలు, ఆకులు, పువ్వులు, కాయలు మొదలయిన వన్నియు ఈ కణముల కలిమిడివలననే కలుగుచున్నవి.

ఈ జీవకణములు సాధారణముగా నత్యంతసూక్ష్మముగా నుండును. సూక్ష్మదర్శినిసహాయమువలనఁ గాని కానరావు. ఒకానొక తరగతి జీవులలో నవి యంగుళములో ముప్పాతిక పొడవు పెరుగును.

ఈ కణములను గూర్చి యొక వింత గలదు. ఈ యొక్కొక కణ మొక్కొక యంత్రము. అందు నొక్కొక్కదానికి నియమింపఁబడిన పనులు రెండు. తనను తాను పోషించుకొనుట; అందు మూలకముగా శరీరము నంతను పోషించుట. దేశములోని ప్రతిమానవుఁడును తనను రక్షించుకొనుటయే గాక, దేశరక్షణార్థమైన కొంత పన్ను ఇయ్యవలయును. అటులనే శరీరమునందలి కణము లన్నియు స్వపోషణమును, శరీరపోషణమును చేయవలసియున్నది. అట్లయినఁగాని శరీరమంతయు నభివృద్ధి చెందనేరదు.

ఈ జీవకణములను గుఱించి మఱియొక గొప్పవింత కలదు. కొన్ని యతిసూక్ష్మజీవులు ఏకకణముగనే యుండునని యిదివఱకు వ్రాసియున్నాము. ఇట్టి యేకకణమయజీవులు జంతువులలోను, వృక్షములలోను గలవు. కడమ జీవు లన్నియు బహుకణమయములు. కాని యివి యన్నియు గర్భోత్పత్తి సమయమునందు నేకకణయుతములు గానే యుండి తరువాతఁ గ్రమక్రమముగా కణము లభివృద్ధియై యది బహుకణమయ మగును. శుక్లశోణితములు కలసి గర్భోత్పత్తి యైనపుడు మనుజుఁడు కూడ అతిసూక్ష్మమైన యేక కణముగా నుండును. క్రమక్రమముగా నాకణము ద్విఖండనవిధానంబున, రెండై, నాల్గయి, యెనిమిదియై, పదియారై, యసంఖ్యాకణములు పుట్టి, అందుఁ గొన్ని తలగను, కొన్ని చేతులుగను, కొన్ని పొట్టగను, కొన్ని కాళ్లుగను, కొన్ని హృదయముగను, కొన్ని జ్ఞానతంతువులుగను ఏర్పడి, కోట్యాను

కోటికణమయం బై, అత్యద్భుతరచనానిర్మాణంబు గలిగి, అనన్యసామాన్య విజ్ఞాన శోభిత మైన మానవశరీర మేర్పడుచున్నది.

### మూ ల ప దా ర్థ ము.

ఇట్టి యద్భుతమైనకణమును విచ్చి యందేమున్నదియుఁ గనుఁగొందము. ప్రతికణమునందును మూలపదార్థ మను (Protoplasm) నొక ద్రవ్యము కానవచ్చును. ఇది జీవత్వమునకు ముఖ్యాధారమైన పదార్థము. ఈ పదార్థమునకును సజీవత్వమునకును అన్వయవ్యాప్తి కలదు. అనఁగా నెచ్చట జీవ ముండునో అచ్చట మూలపదార్థ ముండును; ఎచ్చట మూలపదార్థ ముండునో అచ్చట జీవముండును. ఎక్కువచురుకుఁదనము గల కణములో (cell) నివి యెక్కుడుగను, తక్కువచురుకుఁదనము గల కణములోఁ దక్కువగను ఉండును. చేతనత్వము పోయి కణమునకు జడత్వము రాఁగానే యీమూలపదార్థమును లేకుండఁబోవును. ఇట్లీమూలపదార్థమనునది సకలజీవులకును మూలాధారమైనది. గనుకనే హక్స్లే యను ఘనత వహించిన శాస్త్రజ్ఞుఁడు దీనికి చైతన్యముయొక్క భౌతిక ప్రాతిపదిక (Physical basis of life) మని పేరు పెట్టెను.

మూలపదార్థము మిక్కిలి ఘనత్వముఁ (Solidity) గాని, మిక్కిలి ద్రవత్వముఁగాని చెందని జిగటువంటి యొకపదార్థము. ఇది నీళ్లతోఁ గలసిన తుమ్మబంకవలెను, శర్కరపాకమువలెను ఉండును. ఈ మూలపదార్థ మేయే ద్రవ్యములతోఁ జేయఁబడిన దని రసాయనపృథక్కరణము చేసి చూడఁగా నందు ఆమ్లజనము (ప్రాణవాయువు Oxygen), ఉజ్జనము (Hydrogen), నత్రజనము (Nitrogen), కర్బనము (బొగ్గు Carbon), గంధకము, స్ఫురము (Phosphorous) అను తత్వద్రవ్యములు మాత్ర మందుఁ గానవచ్చుచున్నవి. ఇట్లు ఈ మూలపదార్థము కేవలము రాసాయనికమిశ్రణము (Chemical compound) అయినందున, శాస్త్రజ్ఞులు కష్టపడినయెడల ఇట్టి పదార్థమును ప్రయోగశాలలోఁ బుట్టింపవచ్చు నని తలఁచిరి. కాని

యెక్కుడు సామర్థ్యము గల సూక్ష్మదర్శనియంత్రముల సహాయమువలనఁ బరీక్షించి పరీక్షించి చూడఁగా నీ మూలపదార్థ మనునది కేవలరాసాయనిక పదార్థముగాక యనేకావయవములు గల యొకయంత్ర మనియు, ముడుచుకొనుట, ఆహారమును తినుట, వృద్ధియగుట, సంతానోత్పత్తి మొదలగు జీవలక్షణములన్నియు దీనియందు ఈ అవయవనిర్మాణమువలననే యున్న వనియుఁ జేటతెల్లంబయ్యెను. ఇట్టిది జీవయంత్రములలోని యత్యంతసూక్ష్మయంత్రము; ఆదియంత్రము. ఇందులోనుండియే యన్ని జీవములు పుట్టెను. ఇది యెట్టుల పుట్టె నన్న విషయ మెవరికిని తెలియదు. ఎన్నియో కోట్ల సంవత్సరముల క్రిందటఁ గొన్ని జడపదార్థముల సమ్మేళనమువలన మూలపదార్థము కలిగి యుండవచ్చుననియు, అది క్రమక్రమముగా నిప్పుడు మనకుఁ గానవచ్చెడి స్థితికి వచ్చియుండుననియుఁ గొందఱు శాస్త్రజ్ఞు లూహించెదరు. కాని యివి వట్టియూహా లయి యున్నవి. శాస్త్రవిషయములు కావు.

ఇఁక మనము మూలపదార్థ మను యంత్రముయొక్క నిర్మాణమును గుఱించి కొంచె కనుఁగొందము. మూలపదార్థ మనునది యొకసూక్ష్మబిందువు. బలవంతమైన సూక్ష్మదర్శనిఁ బెట్టి చూచినఁగాని యందలినిర్మాణము మనకుఁ గానరాదు.

ప్రతి మూలపదార్థబిందువులోను కణద్రవ్యమనియు (Cell substance), జీవస్థానమనియు (Nucleus) రెండుభాగము లుండును. కణద్రవ్యము పీలయొక్క యాకారము గల యొకానొక పదార్థముతోను, పలుచని మఱియొక పదార్థముతోను జేయఁబడినది. జీవస్థానమనునది యీద్రవ్యములతోఁ జేయఁబడినదియైనను కణద్రవ్యముకంటె గట్టిగను, చిన్నచుక్కవలెను ఉండును. ఈప్రక్కపుటలో నీయఁబడిన పటములోఁ జూడుఁడు. ఈజీవస్థానమునందు కణద్రవ్యములో లేని యొకానొకద్రవ్యము కలదు. దానికి వర్ణేషి (Chromatin) అని పేరు. జీవస్థానము నడుమ ఇసుకనలుసులవంటి పదార్థ మొకటి కలదు, దానికి అంతర్జీవస్థాన (Nucleolus) మని పేరు. మిక్కిలి సామర్థ్యముగఁ

## వికారిణి Amoeba.




**A.** ఇది వికారిణియొక్క రూపము. అం. అంతఃపలలము. బ. బహిః పలలము. జీ. జీవస్థానము జీ. గ. జీవస్థాన గర్భము. పా. పాదము. అ. ప. అప్పుడే యిముడ్చుకొనబడిన ఆహారపదార్థములు. సం. అ. సంకోచనావకాశము.

**B.** వికారిణియొక్క వేరొక నిమిషమునందలి రూపభేదము. ఆ. అ. ఆహార అవకాశము. అందొక జంతు విముడ్చుకొనబడి యున్నది.

**C. D. E.** ఇవి ద్వైఖండన విధానమునందలి వేర్వేరు స్థితులను తెలియజేయును.

**F.** నిశ్చలనము నొందిన రూపము.

సూక్ష్మదర్శనలు లేని కాలమందు ఈజీవస్థాన మనునది కొన్ని జీవుల కణములలో మాత్రముండుననియు, కొన్నిటియం దుండదనియుఁ దలఁచిరి. కాని ప్రస్తుత మాద్రవ్య మన్ని జీవులకణములందు నుండునని సిద్ధాంతీకరింపఁబడినది. ఇటుల మూలపదార్థముల యొక్క అవయవములను వర్ణించి వాని వ్యాపారములను ఎఱిఁగించెదము.

సంతానోత్పత్తియు, అనువంశికమగు పోలికయు (Heredity) జీవస్థానమునకు సంబంధించియున్నవి. ఇది సోదాహరణపూర్వకముగా స్థిరపడిన విషయము. ఏకకణమయమగు జీవులను మూడుతునకలు చేసి, ఒక తునకలో జీవస్థానము లేకుండగను, రెండింటిలో జీవస్థానము సగసగము వచ్చునటులను చేసినయెడల, జీవస్థానముగల భాగములు అభివృద్ధియై ద్విఖండనవిధానమున సంతానోత్పత్తి చేయును. జీవస్థానము లేని భాగము కొంతకాలమువఱకు జీవించియుండి పెరుగక, సంతానోత్పత్తి చేయక చచ్చిపోవును. పిండోత్పత్తి విధిలో మాత్రంశ యధికముగను, పిత్రంశ తక్కువగను ఉన్నప్పటికి ఇద్దటి మూలపదార్థములలోని జీవస్థానాంశము లాగర్భమునం దుండుటచే శిశువునకుఁ తలిదండ్రుల యుభయుల పోలిక వచ్చుచున్నది. కావున సంతానోత్పత్తి జీవస్థానముయొక్క విశేషవ్యాపార మని మనము నమ్మవలసియున్నది.

పైవ్యాపారము గాక జీవనవిషయములో ఈ జీవస్థాన మింకొక పని చేయుచున్నది. కణముయొక్క జీవనవ్యాపార మేమి, జంతువుయొక్క జీవన వ్యాపారమేమి రెండు విధముల జరుగుచుండును. ఒకటి, వెలుపలి పదార్థములఁ దీసికొని వానిలోనుండి జీవమునకు అవశ్యకము లయిన కణద్రవ్యము, రక్తము మొదలయిన ద్రవ్యముల నిర్మించుట. దీనిని ఈ శాస్త్రమందు నిర్మాణ జీవనవ్యాపార (Constructive metabolism) మనిచెదరు. రెండవది పైన వర్ణించినటుల నిర్మింపఁబడిన ద్రవ్యముల విఱుగఁగొట్టి యందుండి చలనము మొదలయిన జీవనావశ్యకము లయిన శక్తులను వెలుపరించుట. దీనిని వినాశజీవనవ్యాపార మనవచ్చును. ఈ రెండు వ్యాపారములును జీవనమునకు ఆవశ్యకములు. ఇందు మొదటివ్యాపార మాగిపోయి

రెండవ వ్యాపారము మాత్రము నడచుచుండెనేని జీవి కొంతసేపు మాత్రము జీవించి మృతిచెందును. ఈ రెండు వ్యాపారములలో మొదటిది జీవస్థానాధీనము. రెండవది కణద్రవ్యాధీనము. ఏకకణజీవులను జీవస్థానము గల భాగముగను, జీవస్థానములేని భాగముగను రెండు తునకలు చేసినయెడల, జీవస్థానము లేని భాగము కొంతకాలమువఱకు చేతనత్వముయొక్క యన్ని లక్షణములును కలిగియుండి, పిదప వృద్ధిగాక మృతినొందును. ఇందుకుఁ గారణమేమన జీవస్థానము లేక కేవలము కణపదార్థము గల భాగమునకు నిర్మాణజీవనవ్యాపారము చేతకాదు. అదివఱకు నిర్మాణవ్యాపారముచే సిద్ధము చేయఁబడియున్న ద్రవ్యములను దిని చైతన్యమును బుట్టించుకొనుచు కొంత సేపు బ్రతికియుండును. కాని యా ద్రవ్యములు కాగానే క్రొత్తవి సంపాదించుకొను సామర్థ్యము లేనందున కఱవులో అన్నము లేని బీదవానివలె మడియును. జీవస్థానము గల భాగములలో కణద్రవ్యము బహుస్వల్పముగా నున్నను అది పెరిగి సంతానోత్పత్తి చేయుచుండును.

## ఉత్క్రాంతివాదము.

## (The Doctrine of Evoluton)

సర్వజీవములకును మూలపదార్థమే మూలాధార మని చదువరు లిదివఱకే గ్రహించియుందురు. ఈ మూలపదార్థమే యన్ని వృక్షములకును, అన్ని జంతువులకును, కూటస్థపదార్థ మని శాస్త్రజ్ఞుల యభిప్రాయ మైయున్నది. అనఁగా మూలపదార్థముపై అనేక సంస్కారములు జరిగి యీ చేతనపదార్థము లన్నియుఁ బుట్టినవి. మూలపదార్థ (Protoplasm) మయమైన కణములన్నియు మొదట నొక్కరూపముగా నున్నయెడల వికారిణి మొదలు మనుష్యులవఱకుఁ గల జంతుకోటిలో నింత వైధర్మ్య మెందుకు? వాని యంత్రరచనయందును, బాహ్యస్వరూపమునందును ఇంత భేద మెట్లు కలిగెను? అని కొంద ఱడుగవచ్చును. ఇందుకు, ఒక తలిదండ్రులకుఁ బుట్టిన యన్నదమ్ములలోఁ గొంతపోలిక యున్నను, భేదముండుట మనము చూచు

చున్నాము. అన్నదమ్ములకంటె నన్నదమ్ముల కుమారులలోఁ బోలిక తక్కువయై వైధర్మ్య మెక్కువయగును. ఈ ప్రకారము తరములు హెచ్చిన కొలఁదిని పోలిక తగ్గి, వారి స్వరూపములు బొత్తిగా మాఱి, యొకటితో నొకటికి సంబంధము లేనివి యగును. ఇంతియగాక వీరందఱును భిన్నభిన్న దేశములకుఁ బోయి, భిన్నభిన్న వృత్తుల నవలంబించి, భిన్న ఆచార వ్యవహారములు గలవారగుదురేని, కొన్ని తరములలో వారు పూర్తిగా మాఱుదురు. అప్పుడు, వారందఱికిఁ బూర్వ మొకప్పు డొక మూలపురుషుఁడుండె ననియు, అతని సంతతివారే వీరంద ఱనియుఁ జెప్పిన నెవ్వరును నమ్మఁజాలరు. ఈలాగుననే మూలపదార్థముయొక్క యేకవిధ కణములలోనుండి పుట్టినజీవు లన్నియు నానావిధరూపములఁ దాల్చెను.

ఇట్లు జలచరములనియు, స్థలచరములనియు, పక్షులనియు, మృగములనియు భిన్నభిన్న జాతులుగాఁ గానవచ్చెడి జంతువుల సమూహము దేనికది స్వతంత్రముగాఁ బుట్టలేదు. ఇవి యన్నియు నొకటితో నొకటికి సంబంధముఁ గలిగి యొకదానిలోనుండి మఱియొకటియో, లేక ప్రస్తుత మంతరించిన యనేకజాతులలోనుండియో పుట్టిన వని శాస్త్రజ్ఞులు గట్టిగాఁ జెప్పఁగలరు. ఏకకణమయ మైన వికారిణి మొదలు అత్యంతోన్నతజంతు వగు మానవునివఱకును క్రిందనుండి పైవఱకు వచ్చెడి రాజభవనసోపానపరంపరవంటి మెట్లు గలవు. ఈ జంతువు లన్నియుఁ గలసి యొక పెద్ద గొలుసు వంటివి. వేలు వేలు జంతువులు ఈ గొలుసులోని కడియముల వంటివి. ఈ గొలుసుయొక్క యొక చివరను వికారిణివంటి యేకకణమయములును మిక్కిలి తక్కువవిజ్ఞానమును, చేతనవ్యాపారములును గల జంతువులు నుండును. ఇంకొక చివర అసంఖ్యాకణములతోను విచిత్రయంత్రములతోను జేయఁబడిన శరీరము గలిగినట్టియు, అసాధారణబుద్ధివైభవమును విజ్ఞానమును గలిగినట్టియు మానవుఁడు గలఁడు. ఈ యిద్దఱినడుమ నుండు జంతువులు క్రమక్రమముగా శరీరరచనయందును, విజ్ఞానమునందును హెచ్చుచువచ్చును. ఈ

లాగు అత్యంతహీన మైన యేకకణమయజంతువు క్రమక్రమముగా నభివృద్ధియై పూర్వముకంటె గొప్ప జంతువుగా మాఱుచు మానవుఁడుగాఁ బరిణమించెను. కావున ఈ వాదమునకుఁ బరిణామవాద మనియు, క్రింది తరగతి జంతువులు పై తరగతిగా మాఱు నని ప్రతిపాదించుటచే ఉత్క్రాంతి వాద మనియుఁ బేరు. మొదటి పేరు మన యాంధ్రదేశమందును, రెండవ పేరు మహారాష్ట్ర దేశమందును వాడుకలోనున్నవి. ఈ వాదమును మొట్టమొదటఁ బ్రతిపాదించినది డార్విన్ అను ఇంగ్లీషు శాస్త్రజ్ఞుఁడు. మానవుఁడు గూడ ఇతర జంతువులతోఁబాటు ఉత్క్రాంతివలనఁ బుట్టినవాఁడే గాని యిదివఱకు జను లనుకొనినటుల స్వతంత్రముగాను, నకస్మాత్తుగాను బుట్టింపఁబడలేదని యీ సిద్ధాంతము చెప్పుచున్నందున నిది యనేక సంవత్సరముల వఱకును జనులకు గ్రాహ్యము కాలేదు. కాని దినదినము ఈ వాదమునకు ననుకూలమైన ప్రబల నిదర్శనములు కానవచ్చుచున్నందునఁ బ్రస్తుతము శాస్త్రజ్ఞులలో నూటికిఁ దొంబదితొమ్మిదిమందికి గ్రాహ్యమైనది.

ఈ యుత్క్రాంతి తత్వమును అనుసరించి చూడఁగా మిక్కిలి భేదముగాఁ గనఁబడు సమస్తవృక్షములును, జంతువులును జ్ఞాతులయి యున్నవని చదువరు లిదివఱకే గ్రహించియుందురు. జ్ఞాతులలోఁ గొందఱు పదిదినముల వారును, కొందఱు మూఁడుదినములవారును, కొందఱు ఆశౌచము లేనివారును ఉండుట సహజముగదా? చేఁపలు, పక్షులు, మానవులు మొదలగు వారు మిక్కిలి దూరపు జ్ఞాతులుగాన వారి జ్ఞాతిత్వము త్వరగాఁ దెలియదు. వారిలో నొకరి పోలిక లొకరి కున్నను సామాన్యజనులకుఁ దెలియవు. సమీపజ్ఞాతుల బంధుత్వము కొంచె మాలోచించినఁ దెలియును. సింహము, పులి, చిఱుతపులి, పిల్లి మొదలయినవన్నియు నొక్క కుటుంబములోనివియే యని సాధారణముగాఁ గానవచ్చును. కోఁతులు మానవులకు మిక్కిలి సమీపజ్ఞాతు లని వారి యాకారసామ్యతవలనఁ దేటపడఁగలదు. ఇట్టి సమీప బంధుత్వము త్వరగా సామాన్య జనులకుఁ గూడ తెలియును.

కాని దూరపు బంధుత్వములఁగూడ మనకుఁ దెలియని కొన్ని పోలికల ననుసరించి విద్వాంసులు కనిపెట్టియున్నారు. లోపలి ఎముకలను చక్కఁగఁ బరిశోధించి, చేఁపయొక్క ఱెక్కలును, పక్షుల రెక్కలును, చతుష్పాత్ జంతువుల ముందరికాళ్లును, మానవుల చేతులును నిర్మాణవిధియందు నొకదాని కొకటి బంధువు లనియే శాస్త్రజ్ఞులును నిశ్చయించియున్నారు. ఈ ప్రకారము సమస్త జంతువులయొక్కయు, వృక్షములయొక్కయు శరీర రచనను పరీక్షించి వాని నన్నిటిని వేఱువేఱు వంశములుగా వర్గీకరణము (classification) చేసియున్నారు. ఈ వేఱు వేఱు వంశములకును ఎడతెగనిసంబంధము గలదు. అందుచేఁ గొన్ని యీ వంశములోనివా లేక యా వంశములోనివా యని కూడఁ జెప్పుటకు వీలులేదు. ఇంతియ కాదు. కొన్ని జీవులు వృక్షజాతిలోనివా లేక జంతుజాతిలోనివా యని నిశ్చయముగఁ జెప్పుటకు వీలు లేదు. ఇట్లు సమస్తజీవులును ఒకదానితో నొకటి యెడతెగని సంబంధము గలిగియున్నవి. వేఱువేఱుగ స్వతంత్రించిలేవు.

ఈ యుత్క్రాంతివాదములో నింకొక యంశముఁ జక్కఁగ జ్ఞాపకముంచుకొనవలయును. ప్రస్తుతము మనకు భూమిపైఁ గానవచ్చెడి వృక్షములుగాని జంతువులుగాని యెల్లప్పుడును ఇప్పటి శరీరాకారమే కలిగియుండలేదు. వీని శరీరరచనలోఁ గ్రమక్రమముగా మార్పులు గలుగుచు వానికిఁ బ్రస్తుతపు ఆకారము వచ్చినవి. ఇందుకు నుదాహరణముగా గుఱ్ఱమును గురించి విచారింతము. ప్రస్తుతము గానవచ్చెడి గుఱ్ఱముల కాలికి నొక్కడెక్కయే కానవచ్చును. కాని యెన్నియో లక్షలకొలఁది సంవత్సరములకుఁ బూర్వమున్న గుఱ్ఱమునకు నైదుడెక్కలున్నటులను కొంతకాలమునకు అనఁగా గొన్ని తరముల తరువాత అందొకటి యుపయోగము లేమిచే క్రమముగా తగ్గిపోయి నాలుగు నిలిచినటులను, తరువాత క్రమక్రమముగా నవి తగ్గి యొకటే యైనటులను, భూగర్భమునందు దొరకిన ఈ మృగముయొక్క యస్థిపంజరములచే నిశ్చయింపఁబడినవి. ఇందుచే నిది మొదట నైదు

డెక్కలుగల మృగముల లోనిదియే యని చెప్పవచ్చును. ఈ లాగుననే యన్ని జంతువులను గురించి విచారింప సాగిన యెడల వాని వాని బంధుత్వములు తేలగలవు.

భూమిమీఁద మొదటినుండియు నిప్పుడు కానవచ్చెడి వివిధ ఆకారములును, వివిధనిర్మాణములును గల జీవులన్నియు లేవు. మొట్టమొదట అవయవరహితమైన మూలపదార్థ ముండెను. తరువాత వికారిణివంటి యేకకణ ప్రాణులుపుట్టెను. ఇవి మిక్కిలి మోటువాఁడును, నగ్నముగా నరణ్యమునందు సంఘములేక యేకాకిగాఁ దిరుగువాఁడును అగు నడవిమనుష్యునివంటివి. ఇట్టి మనుష్యుఁడు తనకుఁ గావలయుపనులన్నియుఁ దానే చేసికొనును. భక్ష్యమును సంపాదించుకొనుట, దానిని తినుటకుఁ దగినదానిగా వంటజేసికొనుట, ఇల్లు కట్టుకొనుట, తనను శత్రువులనుండి రక్షించుకొనుట మొదలయినపనులన్నియు నెవనికి వాఁడే చేసికొనుచుండును. ఆది జంతువర్గములోని వికారిణియొక్క స్థితియు నిట్టిదియే. హెచ్చుతరగతి జంతువులలో స్నాయువులు చేయు శారీరిక సంకోచవికాసములును, మజ్జాజ్ఞానతంతువులచేఁ గలుగు స్వేచ్ఛాచలనము బాహ్యపదార్థజ్ఞానము మొదలయిన వన్నియు ఈ యేకకణమే చేయును. ఈ జీవకణమునుండి ద్విఖండనవిధానమువలన ననేకకణములు పుట్టుచుండును. ఇందుఁ గొన్ని యొక్కచోటఁ గలసియుండి కొంచెము పైజాతిజీవు లగును. పైనఁ జెప్పిన అరణ్యమానవునికంటెఁ గొంచెము హెచ్చుతరగతి మానవులు ఒకచోటఁ గలసియుండును. వీరు ఎవరి పనులు వారే చేసికొనుచుందురు. ఒక్కచోట కలసియుందురనియే గాని సంఘక్షేమములుగాని, కట్టుబాటులుగాని వారికుండవు. ఎవరికి వారు స్వతంత్రులు. కోయ, చెంచు, ఎఱుకు మొదలయిన యరణ్యజాతు లిట్టివి. జీవసృష్టిలో వీరికిఁ బోల్పఁదగిన జీవు లనేకములుకలవు. నిలిచియున్న నీళ్ళలోఁ గానవచ్చెడి పసిరికపోగులు మొదలయిన విట్టివి. వాని నిర్మాణములో ననేకకణములు కానవచ్చును. అవి అన్నియుఁ గలసియున్నను, అందు ప్రతి కణమును స్వతంత్రముగాఁ దన భక్ష్యసంపాదనము, ఉదరభరణము, సంతానవృద్ధి మొదలయినవి చేయుచుండును. జంతువు

లలో ప్రవాళకీటకములు (పగడపు పురుగులు) ఇట్టివి. ఒక ప్రకాండమునకు నెట్టు లనేకములు కొమ్మలంటుకొనియుండునో యటులనే మధ్యప్రవాళమున కీ కీటకములన్నియు నంటి యుండును. కాని యొకరితో నొకరికి సంబంధము లేకయే యుదర పోషణాదిక్రియలు చేసికొనుచుండును. ఇట్లివి తమ జీవన క్రియలు స్వతంత్రముగా జరుపుకొనుచున్నను, ఒక్కచోటఁ గలసి యున్నందున వీని సంఘమునుజూచి శత్రువులు వీనిపైకి సాహసించి రానేరవు. ఇతర ఆధిభౌతిక బాధలును వీనిని అంతగా బాధింపవు. నాచు, ప్రవాళ కీటకములు గుంపులు కూడి యొక్కచో నున్నందున నీళ్లకుఁ గొట్టుకొనిపోక నిలిచి యుండును. అందుకే 'సంఘే శక్తిః' అను వచనము పుట్టినది. స్పాంజు కీటకములుగూడ పైకీటకముల వంటివే. ఈజీవులు వృక్ష జాతిలోనివా లేక జంతు జాతిలోనివా యని కొంతకాలమువఱకు శాస్త్రజ్ఞులకు సంశయ ముండెను. కాని యవి యేకకణము లయిన యాదిజంతువులలోనివే యని యిప్పుడు నిశ్చయమైనది. బాజారులో దొరకు స్పాంజు, ఇట్టి కీటకముల యిల్లు. ఈ కీటకములు తమ జీవనవ్యాపారము లన్నియు స్వతంత్రముగాఁ జేసికొనుచున్నప్పటికి, అన్నిటికిఁ గావలసిన నీటిని తమ యింటిలోనికిఁ దెచ్చుటయు, అక్కఱలేని నీటిని వెలుపలకుఁ బంపుటయు అనుక్రియల నన్నియుఁ గలసి చేయును.

ఒక కణము అనేక కణములుగాఁ జీలి యాకణములన్నియు నొకటితో నొకటికి సంబంధము లేకుండ విడివిడిగా నున్నయెడల ఎన్నటికిని హెచ్చుతర గతి జీవులు పుట్టియుండవు. కొంతకాలమునకు, ఒక కణము చీలి యేర్పడిన యనేక కణములు విడిపోయి, స్వతంత్రముగానుండుట మాని, కలసి యొకటిగా నుండును. ఇట్లుండుటయేగాక జీవనమునకై కావలసిన వ్యాపారములన్నియు అన్ని కణములు చేయుట మాని, కొన్ని కణములు కొన్ని వ్యాపారములును, మఱికొన్ని కణములు మఱికొన్ని వ్యాపారములును చేయఁబూని యాకణములన్నియుఁ గూడి యొక్కజీవియగును. వెలుపలనున్న కణములు శీతోష్ణముల

యెడతెగని సహవాసముచే గట్టివై కెలుపలి చర్మముగ నేర్పడును. లోనివి మృదువుగ నుండును. జీవనమునకుఁ గావలసిన పదార్థములను వెలుపలనుండి సంపాదించుపని కొన్ని కణములపైఁ బడినందున నవి క్రమక్రమముగా హస్తాది కర్మేంద్రియములుగా మారును. లోనికణములకు ఆహారము జీర్ణముచేయు పని ప్రాప్తించుటచే నవి జీర్ణకోశాది యాకారములను దాల్చును. ఇట్లు భిన్న భిన్న కణములలో శ్రమవిభాగము (Division of labour) గలిగి జీవులకు హెచ్చు తరగతి ప్రాప్తమగును.

మానవుల సంఘములకును, జీవులకును పోలిక యిదివఱకు మనము కని పెట్టుచు వచ్చుచున్నాము. ఏ మానవ సంఘములో వేలువేలు మానవులు వేలువేలు పనులు చేయుచుందురో యది యధిక నాగరికతఁ జెందిన దని మనము చెప్పవచ్చును. ప్రతిమానవుఁడును, తన పొలమును తానే దున్నుకొని తన బట్టలు తానే నేసికొని, తన యిల్లు తానే కట్టుకొను సంఘముకంటె వ్యవసాయము చేయువారు వేఱుగను, బట్టలు నేయువారు వేఱుగను, ఇండ్లు కట్టువారు వేఱుగను, కుండలు చేయువారు వేఱుగను, కరణము పని చేయువారు వేఱుగను ఏర్పడిన గ్రామసంఘము శ్రేష్ఠము గదా? ఇటులనే జంతుశరీర రచనను గుఱించి యెఱుఁగునది. జీవన వ్యాపారములు చేయుటకు నొక్క యవయవము కల జంతువుకంటె రెండు అవయవములు కల జంతువు శ్రేష్ఠమైనది. అంతకంటె మూఁడవయవయవములు కలది గొప్పది; దానికంటె నాలుగు అవయవములు కలది యధికమైనది. ఈలాగుననే యితర హెచ్చుతరగతిజంతువులను గుఱించి యెఱుఁగవలయును.

పైని వర్ణింపఁబడినటుల వేలువేలు కణములకు వేలువేలు పను లేర్పడి క్రమముగ నొకటికంటె శ్రేష్ఠమైన మఱియొక జంతువు పుట్టసాగెను. ఈలాగు జలచరములును, జలస్థలచరములును, కేవల స్థలచరము లగు చిన్న జంతువులును, చతుష్పాద్ జంతువులును, మనుష్యులా యేమి యనఁదగు వానరములును, మనుష్యులును, క్రమక్రమముగా నొకదానికంటె నొకటి హెచ్చు తరగతివి యగు జంతువులు భూమిపైఁ బుట్టెను. ఈప్రకార మారయుగమున కారయుగమునకుఁ

పెద్దపెద్దవియగు జీవు లుదయించుచు, సృష్టియందు నుండుట కనర్హమగు అనేక జంతువుల జాతులు పూర్తిగా నశించుచుఁ, గొన్నిజాతులు శరీర రచనయందు నభివృద్ధిఁ జెందుచుఁ, దుదకు భూమిపై మనుష్యుఁ డుదయించెను. ఈమానవుం డిట్లు ఒక జీవకణములోనుండి బయలుదేరి క్రమముగా ననేకజంతువుల శరీరములను దాల్చి తుద కీరూపము దాల్చెను.

పైని వర్ణించినటుల నేకకణమయ మగుజంతువు చేతనసృష్టికి శిరోభూషణమనఁదగు మానవుడుగా మారుటకు నెన్నియో లక్షలు కోట్లు సంవత్సరములు పట్టినవి. ఇది నూఱు సంవత్సరములలోఁ గాని వేయిసంవత్సరములలోఁ గాని యైన పని గాదు.

ఇంతవఱకు మేము పరిణామ వాదమును గుఱించి చెప్పిన యంశములకు రుజువేమైనను కలదాయని చదువరు లడుగవచ్చును. ఇందుకు శాస్త్రజ్ఞులు నలుబది యేఁబది సంవత్సరములనుండి మిక్కిలి శ్రమపడి, 'మీ కేమి తెలియును? మీ కేమి తెలియును?' అని గుట్టను, చెట్టును, రాతిని, మృత్తికను, సముద్రమును, జంతువులను, మఱియు భూమిమీఁది చేతనాచేతనాత్మకమైన సమస్తపదార్థములను అడిగి యడిగి ప్రబలమైన ముగ్గురు సాక్షులను సంపాదించిరి. ఈముగ్గురు సాక్షులు నమ్మఁదగినవారును, ఒకరితోనొకరికి సంబంధము లేనివారును అయియున్నారు. వారెవ రంటిరేని:—

## ౧. భూగర్భశాస్త్రము
## (Geology.)

భూమిని త్రవ్విన కొలఁదిని అందు పొరల క్రిందఁ బొరలు కానవచ్చును. భూమి క్రమముగాఁ బెరిగినందున నిట్టి పొర లేర్పడినవి. క్రిందికిఁ బోయినకొలఁదిని పైపొరకంటెఁ గ్రింది పొర పురాతనకాలమును జూపు ననుట విదితము. ఆయాపొరలలో ఆకాలమునందు నుండిన వృక్షములయొక్కయు, జంతువులయొక్కయు శిలారూపమయిన ( Fossil ) దేహములు కానవచ్చుచున్నవి. వానివలన జంతువులు క్రమక్రమముగా నెట్లు శరీరరచనలోనికి మాఱినవియు బాగుగఁ దెలిసికొనవచ్చును.

## ౨. పిండోత్పత్తిశాస్త్రము.

## (Embriology.)

గర్భధారణసమయమునుండి జననమువఱకు పిండముయొక్క మార్పులను గనిపెట్టి వర్ణించెడి శాస్త్రమునకు పిండోత్పత్తిశాస్త్ర మని పేరు. ఈ శాస్త్రజ్ఞులు ఒక్కమానవపిండమునే పరీక్షింపక సమస్తజంతువుల పిండములను పరీక్షించిరి. పిండోత్పత్తిసమయమునుండి శిశువు పుట్టువఱకును వీని యభివృద్ధిఁ జూచిన, అవి పూర్వము ఉత్క్రాంతి మార్గమున నేయే రూపములను ధరించెనో, యాయా రూపములను కొంతకాలమువఱకైనను ధరించును, అని తెలియుచున్నది. ఏనుఁగు, పంది, ఆవు, కోతి, మానవుఁడు మొదలగు నత్యంతభిన్నాకారములు గల జంతువు లన్నియుఁ బిండోత్పత్తిసమయమున, ఏకకణమయములయి యేకాకారములుగ నుండును. పిండోత్పత్తియైన తరువాతఁ గొన్ని దినములవఱకును ఈ పిండము లన్నియు సమానముగనే వృద్ధిఁజెందును. ఇందు మానవపిండమును గుఱించి కొంచెము విచారింతము. మొట్టమొదట నీపిండ మేకకణమై యుండును. అప్పుడు దానిని ఏకకణమయము లగు వికారిణివంటి యాదిమ జంతువులతోఁ బోల్చవచ్చును. తరువాత ఈ ఏకకణము రెండు కణములుగాను, అవి నాలుగు, ఎనిమిది, పదియాఱు, ఈ లాగున నభివృద్ధియై యొకటి నొకటిని అంటుకొని ముద్దవలె నుండును. అప్పు డాపిండమును, ప్రవాళకీటకములతోఁగాని, బూజు కుక్కగొడుగులతోఁగాని కొంతవఱకు పోల్చవచ్చును. ఈ ప్రకార మీపిండ మభివృద్ధి యైనకొలఁదిని హెచ్చుతరగతి జంతువుల స్వరూపములను దాల్చుచు తుదకది మనుష్యాకృతిఁ దాల్చును. ఇటులనే యితరప్రాణులను గుఱించియు నెఱుఁగునది.

## 3. శరీర స్థూలనిర్మాణశాస్త్రము

## (Anatomy.)

ఈ శాస్త్ర మిచ్చెడి సాక్ష్యము పరిణామవాదమునకు మిక్కిలి యనుకూలమైనది. హెచ్చుతరగతిజంతువు లన్నిటియొక్క నిర్మాణమునందును శరీ

రము నిలువబడియుండు నిమిత్తమై యాధారముగా అస్థిపంజరము (Skele-ton) ఉండును. ఇంటికిని పందిరికిని స్తంభము లెట్లుండెనో యీ యస్థులును శరీరమునకు నట్లుండును. వేఱువేఱు విధములైన కండరములు (Muscles) ఈ యస్థులను కప్పియుండును. ఇవన్నియుఁ జర్మచ్ఛన్నములవుఁ గానవచ్చును. వీనిని గురించి వివరించెడు శాస్త్రమును శరీరస్థాననిర్మాణశాస్త్ర మని పేరు. వేఱువేఱు జంతువుల శరీరస్థాననిర్మాణములను పోల్చి చూచెడు శాస్త్రమునకు స్థాననిర్మాణ తారతమ్య శాస్త్రము (Comparative Anatomy) అని పేరు.

ఈ యస్థుల నాని సామ్యముఁ గనిపెట్టినయెడల వివిధజంతువుల కెట్టి సంబంధము కలదో స్పష్టముగఁ దెలియును. మాంసము, చర్మములవలన వేఱు వేఱుగాఁ గానవచ్చినను, లోపలియెముకలఁ బరీక్షించినయెడల, పక్షికొక్కు, కోతికిని, మనుష్యునికిన్ని యీయెముకలు ఒకవిధమైనవియే యని తేలగలదు. కొన్ని కోతుల యస్థిపంజరములను, మానవుని యస్థిపంజరమును ఒక్కచోట నుంచి చూచినయెడల ఈ ప్రాణుల కన్నిటికిని మిక్కిలి దగ్గరసంబంధము కల దని స్పష్టపడగలదు.



# రసాయనశాస్త్రము *

‘రసాయనశాస్త్రము’ అనఁబడు నీగ్రంథము ‘విజ్ఞానచంద్రికామండలి’ వారిచేఁ బ్రకటింపఁబడిన మూఁడవశాస్త్రీయగ్రంథము. పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము అనునవి సకలభౌతికశాస్త్రాభ్యాసమునకును మూలాధారములు. పదార్థవిజ్ఞానము శాస్త్రముల శరీరమువంటిదైన రసాయనశాస్త్రము శాస్త్రముల యంతరాత్మవంటిది. వీనిని మొదట నభ్యసించినఁగాని యితరశాస్త్రములు బోధపడవు. కావునఁ బాఠశాలలలో నీశాస్త్రములు బాలురకు మొదట నేర్పవలెను.

## ఈశాస్త్రముయొక్క పూర్వవృత్తాంతము.

యూరోపుఖండమందు రసాయనశాస్త్రమిటీవలనే యభివృద్ధిఁ జెందినది. పదునెనిమిదవ శతాబ్దమువఱకును ఆదేశమందలి శాస్త్రజ్ఞులు ఈ సృష్టి యంతయు పృథ్వి, అప్పు, తేజస్సు, వాయువు అను నాలుగుభూతములతో నిర్మింపఁబడినదనియు, ప్రతిపదార్థమునందును ఈ నాలుగు భూతము లుండు ననియు వాదించుచుండిరి. కఱ్ఱలో నాలుగు భూతములున్నందుకు నేమి దృష్టాంతము? అన్న ప్రశ్నకు ఆపండితు లిట్లు సమాధానము చెప్పుచుండిరి:— ‘కఱ్ఱ కాలుచున్నప్పుడు వెలువడు జ్వాల యగ్న్యంశము; పొగ వాయ్వంశము; ఒక విధమైన రసము వెలువడును, అది జలాంశము; కాలిన తరువాత క్రింద మిగిలియుండు బూడిద పార్థివాంశము.’ ఈ నాలుగుభూతములను వేఱువేఱు కొలతలప్రకారము కలిపినయెడల వేఱువేఱుపదార్థములు పుట్టుననియు, ఈ భూతముల ద్రావకములు సంపాదించి గాజుకుప్పెలలోఁ బెట్టియుంచినయెడల వానిని మన యిష్టమువచ్చిన కొలతప్రకారము కలిపి, యిష్టమువచ్చిన పదార్థ

* ఇది రసాయనశాస్త్రము (వి. చం. గ్రం 7.) నకు ఉపోద్ఘాతము.

మును పుట్టింపవచ్చు ననియు, ఈ విధముగ బంగారము చేయవచ్చు ననియు వారు చెప్పుచుండిరి. కాని బంగారము చేసిమాపినవా రొక్కరైనను కాన రాకపోయిరి.

పైని వర్ణింపఁబడిన పిచ్చియూహలను తొలఁగించి నిజమైన రసాయన శాస్త్రమును నిర్మించినవాఁడు లవాయిశియర్ (Lavoisier) అను ఫ్రెంచి శాస్త్రవేత్త. ఇతఁడు ప్యారిస్ పట్టణమునందు క్రీ. శ. ౧౭౪౩-లో జన్మించెను. తన బుద్ధివైభవముచే నితఁడు చిన్నవయస్సులోనే గణిత,జ్యోతిష,వృక్ష, పదార్థవిజ్ఞానశాస్త్రములఁ జక్కఁగ నభ్యసించెను. శాస్త్రసంబంధ మైన ప్రయోగములు చేయునప్పుడెల్ల నితఁడెక్కుడు శ్రద్ధతో ప్రతిపాత్రయొక్క బరువును, ప్రతిపదార్థముయొక్క యాకారమానమును, ఉష్ణోగ్రతయు, ఇంకను ఇతరవిశేషములును ప్రయోగము చేయుటకుఁ బూర్వమును, తరువాతను చూచి వ్రాసియుంచును. అలసట యన్నమాట యెఱుఁగఁడు. తాను చేయు చున్న శోధన పూర్తిగఁజేయుటకై యెన్నిదినములు పట్టినను శ్రద్ధతోను, ఓపిక తోను ప్రయోగములు చేయుచునేయుండును. ఒకానొక పరిశోధనకై యితఁడు ఆఱువారములవఱకు నొక చీకటిగదిలోఁ గాఁపురముండెను. శోధ నల (Research) నిమిత్తమై ప్రయోగములు (Experiments) చేయుచు, వానివలనఁ బ్రత్యక్షముగాఁ దేలుచున్న సిద్ధాంతములనే గ్రహించును; వట్టి యూహలఁ జేయఁడు. ఇట్లు శోధించి శోధించి యితఁడు తనదేశమందుఁ జతుర్భూతములను గుఱించి జనులకుఁ గల తప్పుటూహలను పారఁద్రోలెను. ఈ చతుర్భూతములలోనిది యగు వాయువు స్వతంత్రపదార్థము కాదని యు, రెండువాయువుల మిశ్రణ మనియు, జలముకూడ మఱి రెండు వాయు వుల కలిమిడిచే నయ్యె ననియు నతఁడు లోకమునకుఁ దెలియఁజేసెను. ఇంతియకాదు. ప్రాణవాయువు (అమ్లజని Oxygen), జలవాయువు (ఉదజని Hydrogen), నత్రజని (Nitrogen) అను వాయువుల గుణధర్మములను జక్కఁగ శోధించెను. పదార్థమునకు (సత్తుకు) వినాశములేదను సిద్ధాంతమును

ప్రబలప్రమాణములతో స్థాపించెను. అంతవఱకు వాడుకలో నున్న రాసాయనికపదములనే క్రొత్త రసాయనశాస్త్రమందు వాడినయెడల లోకులకు నీ శాస్త్రము చక్కఁగఁ దెలియ దని తలఁచి క్రొత్తగా రాసాయనిక పరిభాష (Nomenclature) యితరపండితులసాయము వడసి యేర్పఱిచెను. మనకుఁ గానవచ్చుచున్న యసంఖ్యపదార్థములలో నెద్ది మూలద్రవ్యమో, యేది మిశ్రద్రవ్యమో తెలిసికొనుటకు ననంఖ్యము లగు ప్రయోగములను జేయుచుండెను.

ఇట్టిమహాత్ముఁడు నవీనరసాయనశాస్త్రముయొక్క పునాదిని దృఢపఱుచుచుండఁగా ఫ్రాన్స్ దేశములోని జనులు తమరాజుపైఁ దిరుగఁబడిరి. ఫ్రాన్స్ దేశములో రాజ్యక్రాంతి (Revolution) యయ్యెను. రాజప్రభుత్వము పోయి ప్రజాప్రభుత్వము స్థాపింపఁబడెను. లవాయ్‌శియర్ రాజునకు ననుకూలుఁడని తోఁచినందున ప్రజాపక్షమువా రాతనికి దేహాంతశిక్ష విధించిరి. వధ్యస్థానమునకుఁ గొనిపోవునపుడు అతఁడు "నన్ను చంపవలె నని యున్నయెడలఁ జంపుఁడు. లోకమునకు మిక్కిలి యుపయోగముగా నుండునట్టి యొక ప్రయోగమును చేయుచున్నాను. ఆప్రయోగము పూర్తియైనతోడనే నన్నుఁ జంపవచ్చును" అని చెప్పెను. కాని యామూర్ఖులు 'మానూతనప్రజాప్రభుత్వమునకు నిట్టిప్రయోగములతోను, శాస్త్రజ్ఞులతోను పనిలేదు' అని చెప్పి యాతనిని జంపిరి. అతని ప్రేతమును స్మశానములోఁ బాతివేయునపు డనేక శాస్త్రజ్ఞులు వచ్చి, అధికారములో నున్న ప్రజాపక్షమువారి క్రోధమును లక్ష్యముచేయక, ఈ మహాశయునిపైఁ బుష్పవృష్టి చేసిరి.

రసాయనశాస్త్రమునకు జనకుఁ డని చెప్పఁదగు లవాయ్‌శియర్ కీర్తిశేషుఁ డైనను ఆతని రసాయనశాస్త్రముమాత్రము దినదినాభివృద్ధిఁ జెందెను. దినదినమును ఈతని శాస్త్రముయొక్క ఖ్యాతి యూరోపుఖండ మంతయు వ్యాపించినందున అనేకశాస్త్రవేత్త లీతని ప్రయోగపద్ధతిని, సిద్ధాంతములను, రాసాయనిక పరిభాషను, ఒప్పుకొని నూతనశోధనలు చేయసాగిరి. డేవి యనువాఁడు 'పొటాశియము', 'సోడియము' మొదలయిన ధాతువులను గని

పెట్టెను. డాల్టన్ అను శాస్త్రిజ్ఞుఁడు పదార్థములకుఁ బరమాణువులు మూల మని స్థాపించి, రసాయనసంయోగసంబంధమైన సిద్ధాంతములను సప్రమాణముగా సిద్ధాంతీకరించెను.

బెర్జీలియస్, గేలుసెక్, గ్రహామ్, డ్యూమాస్, మెండలీఫ్ మొదలయిన రసాయనవేత్త లనేకశోధనలు చేసినందున ఈ శాస్త్రిము శీఘ్రకాలములోనే యత్యున్నతదశఁ జెందినది. ఇప్పు డీశాస్త్రిమును సంపూర్తిగా నభ్యసించుటకు ఒకమానవుని జీవితకాలము చాలదు !

## హైందవరసాయనశాస్త్రిము.

హిందూదేశమందుఁ గూడ రసాయనశాస్త్రిము కొంతవఱకు నభ్యసింపఁబడినది. కాని యిది మనదేశమునందు స్వతంత్రశాస్త్రిముగాఁ బరిణమింపలేదు. ఇతరవిద్యలయొక్క యంగముగా మనవారు ఈశాస్త్రిములోని కొన్ని విషయములను శోధించినట్లు కానవచ్చుచున్నది. వైద్యశాస్త్రిము, రసవాదము, ధాతువాదము మొదలయిన విద్యలతో సంబంధించినంతవఱకు ఈశాస్త్రిము మనదేశములో నభివృద్ధిఁ జెందెను. ఆశాస్త్రిముల యభివృద్ధి కుంఠితమైనతోడనే యీ శాస్త్రిముకూడ నశించెను.

## వైద్యము.

వైద్యవిషయమై సంస్కృతములో వ్రాయఁబడిన గ్రంథములను చూడఁగా నౌషధాదులకుఁ గావలసిన రసాయనక్రియలను మనపూర్వులు చక్కఁగ నెఱిఁగినట్లు స్పష్టముగాఁ గానవచ్చుచున్నది. క్షారముల భేదములు, వాని గుణధర్మములు, వానిని జేయువిధము, మందులుగా నుపయోగించుటకునై మధ్యమక్షారము(**Alkaline caustic of middling strength**), మృదుక్షారము (**Weak alkline solution**) మొదలయినవాని వర్ణనయు, లవణభేదములు, వాని లక్షణములు చరక సుశ్రుతాది వైద్యగ్రంథములలో సవిస్తరముగ వర్ణింపఁబడినవి.

బంగారము, వెండి, రాగి, ఇనుము మొదలయిన లోహములను భస్మముచేసినఁగాని వానిని మందులుగా నుపయోగించుటకు వీలులేదు. కావున మన వైద్యులకు భస్మీకరణము (Calcimation) అనఁబడు రాసాయనక్రియలను అభ్యసించుట యావశ్యక మాయెను. ఆర్యులు మిక్కిలి పురాతనకాలమునుండియు ననేకలోహముల నెఱుంగుదు రని నమకచమకములలోని 'హిరణ్యం చ మే, అయశ్చ మే, శ్యామంచ మే, లోహంచ మే, సీసంచ మే, త్రపుచ మే, యజ్ఞేనకల్పన్తాం (౧౮-౧౩)' అను వాక్యమువలనఁ దెలియుచున్నవి. ఇంతియగాక టంకముపొడితో (టంకణక్షారము Borax) బంగారము నతుకుటయు నాకాలపువా రెఱిఁగియుండిరని 'లవణేన సువర్ణం సందధ్యాత్' అన్న ఛాందోగ్యోపనిషత్తులోని వాక్యము (౪, ౧౭, ౭) చెప్పుచున్నవి. క్రమక్రమముగా లోహవిషయకజ్ఞానము అభివృద్ధిఁ జెందెను. పరిశుద్ధలోహముల లక్షణములును, అపరిశుద్ధలోహములలోనుండి పరిశుద్ధలోహములఁ దీయు విధములును రసార్ణవాదితంత్రగ్రంథములలో స్పష్టముగా నీయఁబడియున్నవి.

రసరత్నసముచ్చయ మను గ్రంథముయొక్క ఐదవ యధ్యాయమందు లోహములను గుఱించి సవిస్తరముగా వ్రాయఁబడియున్నది. (వేఱు వేఱు లోహముల లక్షణములును, అవి దొరకు స్థలములును, వానిని శుద్ధిచేయు విధమును, భస్మముచేయు రీతియు, ఈ గ్రంథమునందుఁ జూడనగును.) వాత్స్యాయన కామసూత్రములలో కళలను వర్ణించుచో 'ధాతువాద' మను శాస్త్రమొకటి యున్నట్లు వర్ణింపఁబడినది. 'శుక్రనీతి' యను గ్రంథము 'పాషాణ ధాత్వాదిదృతి స్తద్ భస్మీకరణం కలా' అని చెప్పియుండుటవలన, ధాతువుల దృతులు తీయుట యందును, భస్మీకరణమందును హిందువులు మిక్కిలి ప్రావీణ్యత కలిగియుండి రని కానవచ్చుచున్నది. 'ధాతుసాంకర్య పార్థక్యకరణంతు కలాస్మృతా' యని యా గ్రంథమునందు వ్రాయఁబడియున్నవి. లోహములను ఇతర ద్రవ్యములనుండి విడఁదీయుటయు, ఇతరపదార్థములలోఁ గలిపి మిశ్రద్రవ్యము చేయుటయు నొక 'కళ' అనఁగా విద్యావిశేషముగా నాకాలమందుఁ బరిగణింపఁబడుచుండెను.

ద్రావకములను చేయుట హిందూవైద్యులచే నభ్యసింపఁబడిన మఱి యొక రాసాయనిక క్రియ. రసకామధేను, రసరత్నప్రదీపిక యను గ్రంథములలో ఈ క్రియ వర్ణింపఁబడినది. భైషజ్యరత్నావళిలో మహాద్రావకరసము లను పేరిట, పటికి, అన్నభేది, వెలిగారము, సురేకారము, నవాసాగరము ఇంకను కొన్ని ద్రవ్యములు నీటిలో కలిపి గాజుమూసలో పెట్టి ఒట్టిపెట్టి ద్రావకము చేయువిధము వర్ణింపఁబడినది. గంధకద్రుతి నత్రకద్రుతి చేయుటకూడ హిందువు లెఱిఁగియుండిరి.

## రసవాదము.

'రసేశ్వరసంప్రదాయ' మను మతమువారు రస మనఁగా పాదరస మును గుఱించి యధికముగా శోధనచేసి దాని రసాయనధర్మములను చక్కఁగఁ గనుఁగొనిరి. ఈ రసాయనపద్ధతులన్నియు వైద్యశాస్త్రములోని భాగమై నను, కొందఱు సంప్రదాయమువారు శరీరమును వజ్రమువలెఁ జేసి రోగజరామ రణములనుండి మనుజులను తొలఁగించు శక్తి ఈ పాదరసమునకుఁ గలదనియు, నితర మతములవారు దేహము పడిపోయిన తరువాత ముక్తి చెప్పుదురు, గాని తాము ఈ దేహముండఁగనే ముక్తి ననుభవించు నుపాయము చెప్పుచున్నామని యు అనేకముగా వాదించుచుండిరి. ఈ వాదముకలన వారికోరిక ప్రకారము రసము మనుష్యుల మరణమును తప్పింపకపోయినను, వారికి దానియందుఁ గల భక్తిచే వారు దాని గుణధర్మములను చక్కఁగఁ గనుఁగొనిరి. అందువలన 'రసము' ను చంపి దానిని రోగమునకు మందుగా నుపయోగించు విధము లనేకములు మనకుఁ దెలిసెను. తంత్ర గ్రంథములలో రసమునుగుఱించి యధికముగా వ్రాయఁబడినది. నాగార్జునుఁ డను బౌద్ధతత్త్వవేత్త యీ రసవాదమును గుఱించి యనేకశోధనలు చేసి విఖ్యాతి వడసెను.

## పరుసవేది : బంగారము చేయుట.

ఇనుము మొదలయిన క్షుద్రలోహములను బంగారుగా మార్చి యధిక ధనవంతులము కావలయుననిన కోరిక యన్ని కాలములందును, అన్ని దేశములందును

మనుజులకుఁ గలదు. అందుకునై కొందఱు తమధనమంతయు వెచ్చింతురు. ఇప్పటికిని కొన్ని మూలికల రసముచేఁ గొందఱు బైరాగులు కానిడబ్బును బంగారపు మోహారుగామార్చెదరని నమ్మువారు మనదేశమందు ననేకులుగలరు. బంగారపుఁ బిచ్చివలన రససంప్రదాయమువారే యీ ధాతుశోధనములఁ జేసిరి. అందువలన బంగారము చేయుయుక్తి యెవరికిని తెలియలేదు. కాని ధాతువుల గుణధర్మములును, వేఱువేఱు ధాతువులకును, ధాతువులకు మూలికలరసముల కును సంయోగము కలిగి మిశ్రపదార్థములు సిద్ధమగువిధమును మానవకోటికిఁ దెలిసి యెంతయో యుపకారము కలిగినది. శుక్రనీతిలో 'ధాత్వౌషధీనాం సంయోగక్రియాజ్ఞానం కలాస్మృతా' యని యున్నందున అప్పటికి ధాతువు లను, ఔషధులను కలుపుశాస్త్ర మొక స్వతంత్రశాస్త్రముగా నెంచఁబడు చుండెననుట స్పష్టము.

యంత్రములు: రసశాల.

పైని వర్ణింపఁబడిన రసాయనక్రియలు చేయుటకునై రసశాలయు (Laboratory), యంత్రములును (Apparatus) నిర్మింపఁబడెను. రసము తోఁ బ్రయోగములను చేయుటకు యంత్రములు ముఖ్యములు. రసార్ణవము నందు యంత్రమాహాత్మ్య మిట్లు చెప్పఁబడియున్నది:—

"పాదరసమును చంపుటకును, దానికి వర్ణమువేయుటకును యంత్రమే ప్రబలసాధనము; యంత్రవిద్యయే ప్రబలమైనది. పాదరసమును యంత్రము చేఁ జంపవచ్చును. కావునఁ దెలిసినవారు యంత్రబలమును నిరాకరింపఁజాలరు"* "రసరత్నసముచ్చయమునందలి యేడవ యధ్యాయమునందు 'రసశాల' వర్ణనము

*'జారణేమారణేచైవ రసరాజస్యరంజనే। యంత్రమేవ పరంకర్మయంత్ర విద్యామహాబలా॥ ఓషధీరహితా శ్చాయం పాకాత్ యంత్రేణవధ్యతేతస్మాత్ యంత్రబలంచైకం న విలంఘ్యం విజానతా॥ (౨౩, ౨౪)

† "ఊర్ధ్వం వహ్నిరధశ్చాపో మధ్యేతు రససంగ్రహః। మూషాయంత్ర మిదం దేవి జారయేత్ గంధకాదికమ్॥ (రసార్ణవము.)

గలదు. తంత్రగ్రంథములలో ననేకయంత్రములు వర్ణింపఁబడినవి. డోలా యంత్రము, జారణయంత్రము, గర్భయంత్రము, మూషలు (Crucibles) మొద లయినవి కొన్ని యంత్రముల పేళ్లు.

"మీఁద నగ్ని, క్రింద జలము, నడుమ పాదరసముకలది మూషాయంత్ర ము." ఇట్లే యితరయంత్రములు వర్ణింపఁబడినవి. విస్తరభీతిచే వాని నిచ్చట వర్ణించుటకు వీలులేదు. అంధమూష యనుదానిని ఇప్పుడు (Crucible with a lid on) అనియు, వాలుకాయంత్రమునకు 'Sand bath' అనియు, డోలాయంత్రమునకు 'Steam bath' అనియు నామములు.

శాస్త్రిజ్ఞుల సభ.

ప్రస్తుతకాలమందు వైద్యులందఱును సభచేసి భిన్నభిన్నవిషయము లను చర్చించునట్లు పూర్వకాలమందలి శాస్త్రిజ్ఞులును అప్పుడప్పుడు సభచేసి శాస్త్రీయవిషయములను చర్చించుచుండిరి. చరకసంహితలో నిట్టిసభ యొకటి వర్ణింపఁబడినది. ఈ క్రిందఁ జెప్పఁబడిన ఋషులొకప్పుడు చైత్రరథారణ్య ములోఁ గొన్నిదినములు గడపుటకు వచ్చి రసములను గుఱించి ముచ్చటించిరి. ఆ ఋషు లెవ్వరనిన: ఆత్రేయుఁడు, భద్రకాప్య శౌనకేయుఁడు, పూర్ణ మౌద్గల్యుఁడు, హిరణ్యాక్షకౌశికుఁడు, కుమారశిర భారద్వాజుఁడు, వార్యో విదరాజు, విదేహరాజగు నిమి, బాహ్లీకదేశములోని వైద్యశ్రేష్ఠుఁ డగు కాంఖాయనబాహ్లీకుఁడు. వయోవృద్ధులును, జ్ఞానవృద్ధులును అగు ఈ ఋషు లకు రసములనుగుఱించి యొకసంవాదము జరిగెను. *

---

*ఆత్రేయోభద్రకాప్యశ్చ శాకుంతేయ స్తథైవచ ।
పూర్ణాక్ష్యశ్చైవ మౌద్గల్యో హిరణ్యాక్షశ్చ కౌశికః ।
యఃకుమారశిరోనామ భరద్వాజఃసచానఘః ।
శ్రీమాన్వార్యోవిదశ్చైవ రాజా మతిమతాంవరః ॥
నిమిశ్చరాజా వైదేహో వడిశశ్చ మహామతిః ।
కాంఖాయనశ్చ బాహ్లీకో బాహ్లీకభిషజాంవరః ॥

## పరిశోధన.

ఇప్పటి పాశ్చాత్యశాస్త్రజ్ఞులవలెఁ బూర్వపు హిందూశాస్త్రజ్ఞులు కూడ వైద్యాది శాస్త్రములలోని విషయములను గురించి స్వయముగాఁ బరిశోధన చేయుచుండినట్లును, స్వయముగాఁ బ్రయోగములు (experiments) చేసి చూచి, యందున గురించి వ్రాయుచుండినట్లును గానవచ్చుచున్నది. అట్లు ప్రయోగములు స్వయముగాఁజేసినవారు ఆ సంగతి వ్రాసియుంచినారు. ‡ కాని యిటీవలివారు క్రమక్రమముగాఁ బ్రత్యక్షముగా శాస్త్రీయప్రయోగములను జేసి చూచుట మాని, వేదాంతములవలెనే భౌతికశాస్త్రములలోఁ గూడ నూహలపై నూహ లల్లుట ప్రారంభించినందున ఈశాస్త్రము లన్నియు మనదేశమున అభివృద్ధిజెందక నాశముఁబొందినవి. ఇతరశాస్త్రములకు అనుమానాదికములు ప్రమాణములయిన నగునుగాక. భౌతికశాస్త్రమునకుఁ బ్రత్యక్షమే ప్రమాణము. ప్రత్యక్షమును విడిచిన భౌతికశాస్త్రము భూమి విడిచి చేయబడిన సాముపంటిది.

## పదార్థతత్త్వనిరూపణము.
## (Constitution of Matter)

పదార్థములన్నియుఁ బరమాణువులచే నిర్మింపఁబడిన వని యిటీవలి రసాయనశాస్త్రవేత్తలసిద్ధాంతము. ఈ విషయమే కణాదమహర్షిచే నెన్నియో

---

ఏతే(శ్రు)తలవయోవృద్ధా జితాత్మానో మహర్షయః ।
వనే చైత్రరథే రమ్యే సమీయుర్విజిహీర్షవః ॥
తేషాంతత్రోపవిష్టానా మియమర్థవతీకథా ।
బభూవార్థవిదాం సమ్య గ్రసాహారవినిశ్చయే ॥
చరకసంహిత, సూత్రస్థానము, ౨౬-వ అధ్యాయము.

‡ స్వహస్తేనకృతంసమ్యక్ జారణం న(శ్రు)తంమయా ।
స్వహస్తేన భవయోగేన కృతంసమ్యక్ (శ్రు)తేనహి ॥
ధాతుబంధస్తృతీయోసౌ స్వహస్తేనకృతోమయా ।
దృష్టప్రత్యయయోగోయం కథితో నాత్రసంశయః ॥

వేలయేండ్లక్రింద వైశేషికదర్శనమునందుఁ బ్రతిపాదింపఁబడెను. పృథివి మొదలయిన యన్నిద్రవ్యములకును * పరమాణువులే యుపాదాన కారణము (material cause). ఘటపటాదిద్రవ్యములలో నెద్ది తీసికొనినను దానిని రెండుతునకలుగాఁ జేయవచ్చును. ఆ రెండుభాగములలో నొక్క దానిని తీసికొని మఱల రెండువిభాగములుగాఁ జేయవచ్చును. ఇట్లు వచ్చిన నాల్గవవంతును తీసికొని దానిని రెండుభాగములుగా విభజింపవచ్చును. ఇట్లు విభజించుచుఁ బోఁగాఁబోఁగా నింకను విభజించుటకు వీలులేనంత చిన్న భాగము మిగులును. అద్దియే పరమాణువు. గవాక్షపు రంధ్రములలోనుండి గదిలోనికి వచ్చు సూర్యకిరణములయందుఁ గానవచ్చెడి రేణువులో నాఱవపాలు పరమాణువు అనఁబడును‡. ఇట్టి రెండుపరమాణువులు కలసి 'ద్వ్యణుక'మగును. మూడు ద్వ్యణుకములు కలసి త్ర్యణుక మగును. ఇట్లే చతురణుకాది క్రమమున పృథివ్యాది భూతములు పుట్టినవి. ఇది కణాదప్రణీత వైశేషికదర్శనములోని పరమాణు సిద్ధాంతము. ఇప్పటి శాస్త్రజ్ఞుల సిద్ధాంతముతోఁటి చాల వఱకు సరిపోవుచున్నది.♦

## శాస్త్ర ప్రశస్తి.

పైని వర్ణింపఁబడిన చరిత్రమునుబట్టి చూడఁగా ఈశాస్త్రము హిందూదేశములో వైద్యశాస్త్రమునకు నొక యంగముగా నభివృద్ధిఁజెంది క్రమముగా

---

* వైశేషికదర్శనమునందు 'పదార్థము' 'ద్రవ్యము'అను పదములు వేఱువేఱు అర్థములలో వాడఁబడినవి. పదార్థము అనఁగా category. ద్రవ్యమనఁగా matter.

‡ "జాలసూర్యమరీచిస్థం యత్సూక్ష్మం దృశ్యతే రజః।
తస్య షష్ఠతమో భాగః పరమాణుః స ఉచ్యతే॥"

♦ హైందవ రసాయనశాస్త్రమును గుఱించి మిక్కిలి పరిశ్రమపూర్వకముగా శోధనచేసి డాక్టర్ పీ. సీ. రే యను బంగాలీవిద్వాంసుఁడు ఇంగ్లీషులోఁ జక్కనిగ్రంథములు రెండు వ్రాసినాఁడు.

నశించినదనియు, యూరోపుదేశమునందు నిది క్రమక్రమముగా నభివృద్ధిఁజెంది స్వతంత్రశాస్త్రమై సర్వశాస్త్రములకు నాధారభూతమై యున్నయది యని యుఁ జదువరులకుఁ దెలియఁగలదు. కేవలము శాస్త్రముగాఁగాక, ప్రతిదినము వ్యవహారములలోఁ గూడ ఈ శాస్త్రము కావలసివచ్చుచున్నది. కోమటి వాఁడు నేతిలో క్రొవ్వుకలిపినయెడలఁ గనుఁగొనుటకును, విషము తిని చచ్చిన వాని కడుపులోని ద్రవ్యము విషమగునా లేదాయని పరీక్షించుటకును, ఔషధములు చేయుటకును, రంగులువేయు ద్రవ్యములు చేయుటకును, ఆస్పత్రిలోని మందులు కలుపుటకును ఈ శాస్త్రముయొక్క జ్ఞాన మత్యావశ్యకము.



# పంచాంగము*

చతురంగబలో రాజా జగతీం వశమానయేత్।
అహం పంచాంగబలవాన్ ఆకాశం వశమానయే॥‡

జ్యోతిశ్శాస్త్రము రెండు విధములు. వీనిని స్కంధము లందురు: గణిత స్కంధము, జాతక స్కంధము. మొదటిది, రెండును రెండు నాలుగు, అను లెక్కవంటిది, ప్రత్యక్షసిద్ధము, నిశ్చితము. రెండవది అనిశ్చితము. బెజవాడనుండి చెన్నపట్టణమునకు గల మార్గమును మన మెఱుంగుదు మనుకొనుడి. ఆ రెంటిమధ్యనున్న స్టేషనుల క్రమమును మన మెఱుంగుదుము. రైలుబండి గంట కిన్ని మైళ్లు నడచు నన్న వేగము గూడ మనకు తెలియు ననుకొనుడి. ౧౯౧౭ మార్చి ౨౮ వ తేదీని ఉదయమున ౬ గంటలకు బెజవాడనుండి రైలు బయలుదేరినయెడల నేయే వేళకు నేయే స్టేషనులయొద్ద నుండునో, చెన్నపట్టణ మెప్పుడు చేరునో త్రైరాశికము వచ్చినవారెల్లరు చెప్పవచ్చును. జ్యోతిష మందలి గణితస్కంధ మీ లెక్కను పోలియుండును. సూర్యచంద్రాది గ్రహములు రైలుబండ్లు. ౧౨ రాసులు, ౨౭ నక్షత్రములు ఆకాశములో మనము గుర్తుపెట్టుకొన్న స్టేషనులు. ఇక రైలుబండి బాపట్లయొద్దకు వచ్చినప్పుడు పుట్టినపిల్లవానిపెండ్లము నల్లగ నుండును, గూడూరునకు రైలు చేరినప్పుడు పుట్టినవాడు రాజగును అని చెప్పుట జాతకస్కంధమును అనుసరించుట. ఈ భవిష్యత్తు ఒకప్పుడు నిజమగును, ఒకప్పుడు అసత్యమగును. గణితస్కంధము యొక్క సత్యత్వాసత్యత్వములను బట్టి జాతకస్కంధముయొక్క సత్యత్వా

* 'ఆంధ్రపత్రిక' ఉగాదిసంచిక: పింగళనామ సం॥రము (1916–1917) పుట ౨౫.

‡ చతురంగబలముగలరాజు భూమిని వశపఱుచుకొనును. పంచాంగబలము గల నేను ఆకాశమును వశపఱుచుకొనియెదను.

సత్యత్వములను జెప్పుటకు వీలు లేదు. గ్రహణము ప్రత్యక్షముగా గానవచ్చును గావున జాలకముగూడ నిజమని మనవారు కొంద అందురు. వారికీ స్కంధ ద్వయవిభేదము తెలియదు.

గణితస్కంధమునందు బెక్కు విషయములు చెప్పబడి యుండును. వానిలో బంచాంగమును గుణించుట యొకటి. హిందువులకు పంచాంగము లోకవ్యవహారమునకును, కర్మాచరణమునకును ముఖ్యము.

ఇంగ్లీషువిద్య యభివృద్ధి యైనకొలదిని మనదేశమునందు బంచాంగములు చదువు నభ్యాసము తగ్గుచున్నది. పూర్వతరమువారును గ్రామపురోహితులునుమాత్ర మిప్పుడు పంచాంగముల నుపయోగించుచున్నారు. ఇట్లు పంచాంగముల నుపయోగించువారికిగూడ బంచాంగములయందలి విషయ స్వరూప మెట్టిదో, తిథ్యాదులన నేమిటో, అవి యెట్టిగణితమువలన వచ్చునో, వేఱువేఱు పంచాంగములకు భేద మెందుకుండునో తెలియదు. కావున బంచాంగమందలి విషయస్వరూపమును ఈ వ్యాసమునందు గొంచెముగా దెల్పదలచినాను.

పంచాంగ మనగా నైదు అంగములు కలది యని అందఱ కెఱిగిన విషయమే. తిథి, వార, నక్షత్ర, యోగ, కరణము లనునవి మన పంచాంగము యొక్క యంగములు. ఇప్పటి పంచాంగములలో నివిగాక పెక్కువిషయము లీయబడినను మొదట బంచాంగము గుణించుపద్ధతి పుట్టినప్పుడును, పంచాంగ మన్న పేరు పెట్టబడినపుడును ఈ యైదువిషయములే యందు జూపబడు చుండె ననుటకు సందేహము లేదు.

## తి థి

పంచాంగమునందు మొదట జూపబడునది తిథి. చంద్రునకును, సూర్యునకును గల యంతరమునుబట్టి తిథి యేర్పడును. అమావాస్యదినమున (క్షణమున) చంద్రసూర్యు లిద్దరును కలిసియుందురు. అమావాస్య యనగా గలిసియుండుట.

అనగా ఆదినమున సూర్యచంద్రు లిద్దరికిని గల పూర్వ పశ్చిమాంతరము (౦) సున్న. ఇట్లున్న సమయమున అమావాస్యగడియలు పూర్తియగును. అప్పటి నుండి సూర్యచంద్రులు మరల ప్రయాణమునకు బయలుదేరుదురు. సూర్యుఁడు మందముగ నడచును*. చంద్రుఁడు వేగముగ నడచును. చంద్రుఁడు దినమునకు రమారమి ౧౩° - ౨౦' నడచును సూర్యుఁడు రమారమి ౧° నడచును. ఈ యిద్దరికిని ౧౨° (అంశములు) అంతరము కలుగగనే ఒక తిథియగును. అనగా నప్పటికి ౧ పాడ్యమి పూర్తియగును. చంద్రసూర్యులకు ౨౪° (అంశములు) అంతరము గలిగినప్పుడు విదియతిథి పూర్తియగును. ౩౬° అంతరమున్నపుడు తదియ పూర్తియగును. ౧౮౦° భేద మున్నపుడు ౧౫ అనగా పౌర్ణిమయగును. ౨౬౪° భేద మున్నపుడు బహుళ ౭ మి తిథిపూర్తియగును. ౩౬౦° అంతర మున్నపు డనగా నేమియు నంతరము లేక యిద్దరు మరల కలసినపుడు అమావాస్యయగును.

ఇట్లు తిథి తెలిసికొనవలయు నన్నయెడల సూర్యచంద్రాదు లెన్నవ యింట నెచ్చట నున్నది తెలిసికొని చంద్రునిలో నుండి సూర్యునిఁ దీసివేసి మిగిలిన యంశములను ౧౨° చే భాగింపగా తిథులు వచ్చును. ఈ సంగతియే యీ క్రింది సమీకరణముచే సూచింపవచ్చును.

$$\frac{\text{చం}-\text{సూ}}{\text{౧౨}^{\circ}} = \text{తిథులు}$$

చంద్రసూర్యులకు ౧౨° అంతరము కలుగుటకు సాధారణముగ మధ్యమమానమున ౫౯ గడియలు ౪ విగడియలు (౨౩ గంటల ౩౭ మినిట్లు ౨౮.౦౫౩ సెకనులు) పట్టును. ఇట్టి తిథులు ౩౦ యైన చాంద్రమాస

* నిజముగా నడచునది మనభూమి. అందుచే సూర్యుఁడు నడచునట్లు కనిపించును. అయినను భాషాసౌకర్యమునకై సూర్యుఁడు నడచును. ఇన్నవరాశిలోఁ బ్రవేశించును, ఇన్నవ నక్షత్రములోఁ బ్రవేశించును అని వ్రాయఁబడును. చదువరులు సూర్యుఁడే నిజముగ నడచునని భ్రమపడవలదు.

మగును. చాంద్రమాసమున ౩౦ తిథు లున్నను, దినములు మధ్యమమానమున ౨౯½ దినములే. ఇట్టివి ౧౨ నెలలైన ఒక చాంద్రసంవత్సర మగును. ఇట్టి సంవత్సరమునందు ౩౬౦ తిథులున్నను, దినములు మాత్రము ౩౫౪. కావున సంవత్సరములో తిథులు వృద్ధిక్షయములఁ జెంది ౬ దినములు తగ్గును. సాధారణముగఁ బండ్రెండు చాంద్రమాసములలో ౧౩ క్షయతిథులును, ౭ వృద్ధితిథులును వచ్చును. సూర్యచంద్రుల వేగము లొకప్పుడు శీఘ్రముగను, ఒకప్పుడు మందముగను ఉండుటచే తిథు లన్నియు సమానకాలమును వ్యాపింపవు. కొన్ని పెద్దవిగను, కొన్ని చిన్నవిగను ఉండును. కొన్నితిథులు ౬౫ గడియల కాలమును మించవచ్చును; కొన్ని ౫౩ గడియలే వ్యాపింపవచ్చును. తిథి వ్యాపించు నట్టికాలము లీక్రిందఁ జదువరుల సౌకర్యార్థమై యీయఁబడుచున్నవి:—

| | గడి-పల* - విపల | గంట - మి - సె |
|---|---|---|
| మధ్యమ తిథి | ౫౯-౩-౪౦.౨౩ | ౨౩-౩౭-౨౮.౦౯౨ |
| మిక్కిలి పెద్దది | ౬౫-౧౬-౦ | ౨౬-౬-౨౪ |
| మిక్కిలి చిన్నది | ౫౩-౫౬-౦ | ౨౧-౩౪-౨౪ |

ఇట్లు తిథి యొకసమయమందుఁ బూర్తి యగునన్న నియమము లేదు. ఒకప్పుడు సూర్యోదయసమయమందు, మఱియొకప్పుడు పగలు, ఇంకొకప్పుడు రాత్రి పూర్తి కావచ్చును. కాని మన పంచాంగములందు, సూర్యోదయకాలమందు నేతిథి యుండునో దానినే చూపుదురు. అదియే యాదినమునకు వ్యవహారమునకైన తిథి. ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలోని పింగళనామసంవత్సర పంచాంగమందలి సంవత్సరాది పండుగదినమున నిచ్చినతిథి చూడుఁడి. అందు "ప్ర ౩-౪౮" అని వ్రాయఁబడియున్నది. ప్ర అనగా ప్రతిపద (పాడ్యమి) † ఆదినము సూర్యోదయకాలమున పాడ్యమితిథి యుండెననియు, అది సూర్యో

---

* పల లనగా విగడియలు.

† పాడ్యమి, విదియ తదియ, చవితి, అనునవి ప్రథమా, ద్వితీయా, తృతీయా, చతుర్థీ అను సంస్కృతపదములకుఁ దెలుఁగు తద్భవ[illegible]

ద్దయానంతరమున 3 గడియల ౪౭ విగడియల కాలమునకుఁ బూర్తియగు ననియు దీని కర్థము. ఈ పాడ్యమితిథి తొలిదినమున సూర్యోదయానంతర మున ౭-౨౭ కే ప్రారంభ మైనది. కాని ఆ దినము సూర్యోదయకాలమందు అమావాస్య యుండుటవలన నాదినమునకు వ్యవహారవిషయమై అమావాస్య యనియే పేరు వచ్చెను. సంవత్సరాదిపండుగదినమున పాడ్యమి సూర్యోదయా నంతరము 3 గడియల ౪౭ విగడియల (౧ గంట ౩౭ నిమిషముల) కాలము మాత్ర మున్నను, అది సూర్యోదయ కాలమం దుండుటచే నాదినముననే (మార్చి ౨౪ వ తేది శనివారమునాడే) పాడ్యమినాఁడై సంవత్సరాదిపండుగ వచ్చెను ఆనాఁడు "ప్ర 3-౪౭" ఉండె ననగా నేమి యర్థము? 3-౪౭ కి విదియ ప్రారంభమైనదని. అది ఆదిన మంతయు ననగా మరునాఁడు సూర్యో దయము వఱకు ౫౬ గడియలు ౧౨ విగడియలు ఉండెను. ఇట్లు మార్చి ౨౪ వ తేదిన పాడ్యమి 3-౪౭ కాలము మాత్ర మున్నది. విదియ ౫౬-౧౨ * కాల మున్నది. అయినను సూర్యు డుదయించినపుడు పాడ్యమి యుండుటచే నాఁడు పాడ్యమియే యయ్యెను. కావున ఒకానొక దినము తిథిని నిర్ణయము చేయు టలో, ఆ దిన మేతిథి యెక్కువకాలమును వ్యాపించెనని చూడ నక్కఱ లేదు. సూర్యోదయకాలమున నేతిథి యుండెనో చూడవలెను. సూర్యుఁ డుద యించిన తరువాత నాతిథి యొక విగడియకాల మున్నను సరే.

మార్చి ౨౫ వ తేదిని పంచాంగములో నేమి వ్రాయఁబడియున్నదో చూడుదము. "ద్వి ౦-౧ తృతీయా ౫౮-౧౧" దీని కర్థమేమి? ఆ దినమున సూర్యోదయకాలమందు విదియగడియ యుండెననియు, అది సూర్యుఁ డుద యించిన తరువాత ఒకవిగడియకాల ముండి సమాప్త మైనదనియు, తరువాత తదియవచ్చి ౫౮-౧౧ వఱకు నుండెననియుఁ; పిదప చవితి ప్రవేశించెననియు

* గడియలను విగడియలను గంటలుగ మార్చుకొనవలెనన్న, గడియ=౨౪ మినిట్లు, విగడియ=౨౪ సెకనులు అన్న లెక్కప్రకారము మార్చుకొన వచ్చును.

నర్థము. ఇట్లొకదినమున ౦-౧ కాలము విదియ, ౫౭-౧౦ కాలము తదియ, ౦-౯ కాలము చవితి-అను మూడు తిథు లుండెను. కాని ప్రొద్దు పొడిచినప్పుడు విదియయుండుటచే నాదినము విదియయే యనిపించుకొనును. ౨౬ వ తేదిన యేమి వ్రాయఁబడి యున్నది? "చ ౫౫-౨౯" అనగా నా దినము చవితి.

ఇట్లు ౨౫ వ తేదిన పత్రములు వ్రాసికొనిన యెడల విదియ యని వ్రాయుదురు. ౨౬ వ తేదిన పత్రములవ్రాసిన చవితి అని వ్రాయుదురు. మధ్య తదియగతి యేమి? వ్యవహారములో నది యేదినమునకును సంబంధించినది కా కుండఁబోవును; ఇట్టి దానినే క్షయతిథి యందురు. ఒకదినము సూర్యోదయమైన తరువాతఁ బుట్టి మఱునాఁడు సూర్యోదయ మగుటకుఁ బూర్వమే పూర్తియగునది క్షయతిథి. ఇట్టి క్షయతిథి ౬౦ గడియలకంటెఁ దక్కువ కాలము వ్యాపించియుండును. ఈ తదియ ౨౫ వ తేదిన ౦-౨ కుఁ బ్రారంభమై ఆ దినముననే ౫౭-౧౧ కుఁ బూర్తియయ్యెను గాన దీని వ్యాప్తి కాలము ౫౭-౧౦. ఇట్లే కొన్నితిథులు వృద్ధిఁ జెందును. ఇవి ౬౦ గడియలకంటె నెక్కుడుకాల ముండును. ఇట్టివి యొకదినమున సూర్యోదయానంతరముసఁ జాలకాలమునకుఁ బ్రారంభమైన, రెండవదిన మంతయు ౬౦ గడియలును ఉండి, మూఁడవదినము సూర్యోదయకాలమునం దుండి తరువాత కొద్దికాలమునకుఁ బూర్తియగును. ఇట్టివి మూడుదినములను తగిలి రెండుదినములకుఁ దనపేరు నొసంగును. ఇందు కుదాహరణము.

మార్చి ౨౯ గురువారము దినమున సప్తమి ౫౭-౫౨ కుఁ బూర్తియగును. అష్టమి ప్రారంభ మగును. అది 30 వ తేది శుక్రవార మంతయు (౬౦ ఘడియలును) ఉండును. 31 వ తేది శనివారమున సూర్యోదయానంతరము ౧-౫కిఁ బూర్తియగును. ఇట్టి ౘ మి గురు, శుక్ర, శనివారము లన్న మూడుదినములను స్పృశించినది కావున దీనిని 'త్రిదినస్పృక్' అందురు. శుక్ర, శనివారముల సూర్యోదయకాలమందు ౘ మి ఉండుటచే, వ్యవహారమునందు శుక్రవారము ౘ మి, శని

వారము ౮మి అగును. ఇట్లు రెండుదినములకును ఒక్కటే తిథి యేర్పడు చున్నది! ఈ తిథి మొత్తముమీద ౬౩ ఘడియల ౧౩ విఘడియల కాలము వ్యాపించినది. శుక్ర, శనివారములు రెండు దినములుకూడ ౮మి తిథియే యగును. ఇట్లే యొకప్పుడు రెండు పౌర్ణిమలును, రెండు అమావాస్యలును వచ్చును. ఈయేడు నిజభాద్రపదమునందు రెండు అమావాస్యలును, పుష్యమాసమందు రెండు పున్నములును వచ్చినవి. సూర్యోదయకాలమందలి తిథినే గ్రహింపవలసినదన్న నియమము వ్యవహారమునకే చెల్లును. తద్దినములు మొదలైన కర్మకు తిథి సూర్యోదయానంతరమున బ్రారంభమైనను గ్రహింతురు.

శుక్లపక్షమునందు సూర్యాస్త సమయమునను, కృష్ణపక్షమునందు సూర్యోదయ సమయమునను చంద్రుడెచ్చటనున్నది చూచి స్థూలమానమున తిథి చెప్పవచ్చును. క్షితిజము (Horizon) మొదలు ఖస్వస్తికము (Zenith) వఱకు ౯౦° (అంశములు). సూర్యుడస్తమించినప్పుడు చంద్రుడు ఖస్వస్తికమందుగాని యామ్యోత్తర వృత్తముపై నెచ్చటఁగాని యుండెనేని, అతఁడు సూర్యునికంటె ౯౦° ముందు నున్నట్లర్థము. ౧౨° కు ౧ తిథి కావున ౭ తిథులు పూర్తియై ౮ వ తిథి జరుగుచున్నదని యర్థము. సూర్యాస్త సమయమున చంద్రుఁడు ఖస్వస్తికమునకుఁ దూర్పున, ఖస్వస్తికమునకును క్షితిజమునకును నడుమ నున్న యెడల నతఁడు సూర్యుని ౧౩౫° (౯౦° + ౪౫°) వెనకకుఁ ద్రోసెనని యర్థము. కావున శుక్ల ౧౨ శి జరుగుచున్నదని యర్థము. ఈలాగున తిథులను లెక్కింపవచ్చును. కృష్ణపక్షమునందు సూర్యోదయకాలమున, చంద్రుఁడు పశ్చిమక్షితిజమునుండి ౪౫° ము ఎత్తుమీద నున్నయెడల నాతఁడు సగము ఆకాశమును (౧౮౦°) మఱియు ౪౫° ను అతిక్రమించినట్లు. ౧౮౦° + ౪౫° = ౨౨౫° కావున ౧౮ తిథులు పూర్తియై కృష్ణ ౪ తి జరుగుచున్నదని భావము. చంద్రుఁడు దినదినము రమారమి రెండురెండు గడియలు (౪౮ మినిట్లు) ఆలస్యముగా నుదయించును. శుక్లపక్షమునందు, సూర్యోద

యానంతరమున తిథిసంఖ్యకంటె రెట్టింపు గడియలకు నుదయించును. అనగా శుక్లపక్షమందు సూర్యుం డుదయించిన తరువాత చంద్రుండు పాడ్యమినాఁడు ౨ గడియలకును, విదియనాఁడు ౪ గడియలకును, ౮ మినాఁడు ౧౬ గడియలకును, పౌర్ణిమనాఁడు ౩౦ గడియలకును మధ్యమమానమున ఉదయించును. కృష్ణపక్షమునందు సూర్యాస్తమయము తరువాత చంద్రుఁడు కృష్ణపక్షతిథుల సంఖ్యకంటె రెట్టింపు గడియలకు నుదయించును. అనగా కృష్ణ ౪ తి నాఁడు సూర్యాస్తమయము తరువాత ౮ గడియలకు, ౮ మి దినమున ౧౬ గడియలకు నుదయించును. ఈ లెక్కలవలన రమారమిగ తిథులను కనుఁగొనవచ్చును.

## ప క్ష ము

సాధారణముగఁ బక్షమందు ౧౫ దినము లున్నను, ఒకప్పుడు ౧౩, ౧౪, ౧౬ దినములు గల పక్షములు వచ్చును. పింగళనామ సంవత్సరములో, చైత్ర బహుళ పక్షమున ౧౪ దినములును, శుక్లపక్షమున ౧౫ దినములును, వైశాఖ శుక్లపక్షమున ౧౬ దనములును కలవు ౧౩ దినములు గల పక్షము అరుదుగ వచ్చును. ఇట్టిపక్షము వచ్చునప్పుడు గొప్ప యుత్పాతములు కలుగు ననియుఁ, బ్రజాక్షయ మగుననియు మనవారి నమ్మకము. మహాభారత యుద్ధ సమయమున నిట్టిపక్షము వచ్చెను (భీష్మపర్వము ౩-౩౨). ఇప్పుడు జరుగు చున్న ఐరోపీయయుద్ధము ప్రారంభమైన పక్షమునందుఁ గూడ ననగా ఆనంద నామ సంవత్సర శ్రావణ శుద్ధపక్షమునందు (చూఁడు ౫వ సంవత్సరాదిసంచిక) ౧౩ దినములే యుండెను! కాని మనవారు కొంద ఆనుకొనున ట్లిట్టిపక్షము వచ్చినప్పు డెల్లను ప్రజాక్షయ మగుననుట నిజముకాదు; ఇట్టిపక్షము ౧౦౦౦ సంవత్సరములకు నొకపర్యాయము వచ్చుననుటయు నిజముకాదు. పది యిరువది సంవత్సరములకు నొకసారి వచ్చుచునే యుండును.

## వా ర ము

ప్రపంచమునం దన్ని దేశములలోను వారము లేదే. వాని నామములు కూడ సమానార్థకములే. ఏదేశమందలి నామములఁ దీసికొన్నను వారములకు

రవ్యాది సప్తగ్రహముల పేళ్లుకలవు. కావున నీ వారనామము లెక్కడనో యొక్కచోటఁబుట్టి ప్రపంచమంతయు వ్యాపించినట్లు కానవచ్చుచున్నది. ఇట్లు ప్రపంచమందలి వారగణన యొక్కటియైనను, అది ప్రారంభ మగు కాలమును గుఱించి మాత్రము ఆచారభేద మున్నది. హిందువుల యాచార ప్రకారము వారము సూర్యోదయము మొదలుకొని మరల సూర్యోదయమువఱకు నుండును; మహమ్మదీయుల యాచారప్రకారము సూర్యాస్తమయము మొదలుకొని సూర్యాస్తమయమువఱకు నుండును; పాశ్చాత్యుల యభిప్రాయ ప్రకారము మధ్యరాత్రి మొదలు మధ్యరాత్రివఱ కుండును.

వారక్రమ మెట్లు పుట్టినదని విచారింపఁగా మన గ్రంథకారు లిట్లు చెప్పియున్నారు. పురాతన జ్యోతిష్కుల సిద్ధాంతము ననుసరించి భూమి స్థిరముగ నుండును, దానిచుట్టును గ్రహములు తిరుగుచుండును. చివరగ్రహము నుండి వానిక్రమ మీలాగున నుండును:— శని, గురు, మంగళ, సూర్య, శుక్ర, బుధ, చంద్రులు.

పై క్రమములో మొదటిది శనివారమనుకొని, తరువాత నాల్గవ గ్రహ సంబంధమైన వారము వచ్చుననుకొన్న యెడల మన వాడుకలోనున్న, శని, ఆది, సోమ, మంగళ, బుధ, గురు శుక్ర వారముల క్రమము వచ్చును. శని యొద్దనుండు నాల్గవవాఁడు సూర్యుఁడు, కావున శని తరువాత ఆదిత్య (సూర్య) వారము వచ్చును. సూర్యుని తరువాత నాల్గవవాఁడు చంద్రుడు, కావున ఆది తరువాత సోమ (చంద్ర) వారము వచ్చును. ఇట్లే యితరవారములను గుఱించి యెఱుంగునది. నే డేగ్రహము వారము వచ్చునో యా గ్రహము నకు నాల్గవదియైన గ్రహము పేరు తరువాత వారమున కేల వచ్చునని యాలోచింప నిట్లు తెలియుచున్నది: జ్యోతిష్కులు అహోరాత్రములను ౨౪ భాగములుగ విభాగించి యొక్కొక్క భాగమునకు హోర యన్న పేరు పెట్టిరి. ఈ హోరలకు సప్తగ్రహములు క్రమముగ నొకరి తరువాత మఱియొకరు ప్రతిదినము నధిపతులుగ నుందురు. ఇట్లు గంట కొకరుప్రకారము ప్రతిదినమును

సప్తగ్రహములు మూడుసారులు హోరాధిపత్యమును వహించిన తరువాత (౭ × ౩=౨౧) ఇంకను ముగ్గు రధిపతులై, మఱునాఁడు సూర్యోదయము వఱకు నాల్గవగ్రహము హోరాధిపతిగ నుండును. ఎట్లన నేఁడు సూర్యోదయ కాలమందు శని హోరాధిపుఁ డనుకొనుఁడు. రేపు సూర్యోదయమువఱకు పై నిచ్చిన క్రమమున సప్తగ్రహములు మూడుసారులు హోరాధిపతులై, మరల శని, గురు, మంగళులు ప్రభుత్వముచేసి, సూర్యోదయకాలపు హోరకు సూర్యుడు అధిపతిగ నుండును. సూర్యోదయకాలమున హోరాధిపతిగ నెవ్వఁడుండునో వాఁడే యాదినమునకు నధిపతి. వాని పేరనే యా వారము చెల్లును. కావున రెండవదినమున ఆదివారమగును, మూడవదినము సోమవారమగును. ఇట్లే యితర వారములను గుఱించి యెఱుఁగవలెను.*

పైని హోర అను పదము వచ్చినది. అది సంస్కృతపదము కాదు. దీనిని మనవారు గ్రీకుభాషలోనుండి తీసికొనినట్లు కానవచ్చుచున్నది. ఈ పదమే యింగ్లీషులో అవర్ (Hour గంట) అను పదముగ మారినది. గంట యనఁగా నహోరాత్రములలో ౨౪ వ పాలు గద. హోరావిభాగము మన గణితస్కంధమునందు వాడుకలో లేదు. ఫలజ్యోతిషమునందున్నది. పూర్వపు ఖాల్డియాదేశమునందు నీ విభాగమును, సప్తవారక్రమమును ఉండెననియు, నచ్చటినుండియే హిందువులు వారపద్ధతిని గ్రహించిరనియు, ఈ వారపద్ధతి మొదట హిందువులది కాదనియు జ్యోతిష్కుల యభిప్రాయము.

---

* మందాదధః క్రమేణ స్యుశ్చతుర్థా దివసాధిపాః
హోరేశాః సూర్యతనయా దధోధః క్రమశ స్తథా.
సూర్యసిద్ధాంతము, భూగోళాధ్యాయము.

† ఆర్య జ్యోతిషశాస్త్రమును జాతీయభక్తితో వ్రాసిన దేశభక్తాగ్రేసరుఁడును, జ్యోతిష శిఖామణియునగు శంకర బాలకృష్ణ దీక్షితులవారు కూడఁ జర్చించి యీ యభిప్రాయమునే యంగీకరించినారు. చూఁడు భారతీయ జ్యోతిషశాస్త్రము, పుట ౧౩౭-౧౩౮.

## నక్షత్రము

అశ్విన్యాది నక్షత్రములు ౨౭ అని యందఱకుఁ దెలిసిన విషయమే. ఆకాశమందలి చుక్కల యాకారమును అనుసరించి యీ పేళ్లు పెట్టఁబడినవి. కాని ఈనక్షత్రసూచకములగు చుక్కలు సమానాంతరములుగ లేనందున జ్యోతిష శాస్త్రమునందు నక్షత్రమనఁగ క్రాంతివృత్తము (ఆకాశచక్రము, ecliptic) యొక్క ౨౭ వ వంతని యర్థము.

$$\text{నక్షత్రము} = \frac{౩౬౦^{\circ}}{౨౭} = ౧౩^{\circ}\text{-}౨౦'$$

ఇట్టి నక్షత్రమనగా నాకాశమందు ౧౩° అంశములు ౨౦' కళలు. నక్షత్రశబ్దమునకు నింకొక యర్థము కలదు. ఈ ౧౩°-౨౦' స్థలమును చంద్రుఁ డెంతకాలములోఁ దిరుగునో యాకాలమునుగూడ నక్షత్రమనియెదరు. దీనినే దిననక్షత్రము, దినతార యందురు. దీని వ్యాప్తి వివర మీక్రింద నీయఁబడు చున్నది:—

| | గ - పల - విపల | గం - మి. సె. |
|---|---|---|
| మధ్యమమానము | ౬౦ - ౪౨ - ౫౩.౪ | ౨౪ - ౧౭ - ౯.౩౬ |
| ఎక్కువకాలము | ౬౬ - ౨౧ - ౦ | ౨౬ - ౩౨ - ౨౪ |
| తక్కువకాలము | ౫౫ - ౫౬ - ౦ | ౨౨ - ౨౨ - ౨౪ |

మొత్తముమీద సరాసరి దినమునకుఁ జంద్రుఁ డొక్కనక్షత్రము నడుచును. కావున నక్షత్ర మాసమునందు ౨౭.౩౨౧౬౬ దినములుండును. పంచాంగమునందు తిథి తరువాత నీయఁబడు నక్షత్రములు చంద్ర నక్షత్రములు. సంవత్సరాదిదినమున పంచాంగమునందు తిథి తరువాత "రే ౩౭-౪" అని వ్రాయఁబడినది. అనఁగా ఆ దినమున సూర్యుఁ డుదయించినపుడు రేవతియుండె ననియు, తరువాత ౩౭ గడియల ౪ విగడియలకు రేవతీనక్షత్రము పూర్తియై అశ్విని వచ్చెననియు భావము. అనఁగా చంద్రుఁడు రేవతి దాఁటి అశ్వినిలోఁ

ప్రవేశించును. తిథులవలెనే, సూర్యోదయకాలమందు నే నక్షత్రముండునో అదియే ఆ దినపు నక్షత్ర మనఁబడును. తిథులవలెనే కొన్ని నక్షత్రములు క్షయముఁజెందును, కొన్ని వృద్ధిఁజెందును అని తెలిసికొనునది.

చంద్రునివలెనే సూర్యుఁడు, ఇతర గ్రహములును ఈ నక్షత్రములలో నుండి ప్రచారము చేయుచుండును. సూర్యుఁడీ నక్షత్రముల నన్నిటిని నొక్కమాఱు చుట్టివచ్చుటకు రమారమి ౩౬౫ దినములు పట్టును. కావున సూర్యునకు నొకనక్షత్రమును దాటుటకు రమారమి ౧౩ ౧౪/౨౭ దినములు పట్టును— వర్ష సంబంధమైన మృగశిరాదినక్షత్రములు చంద్రసంబంధమైన దిననక్షత్రములు కావు. సూర్యసంబంధమైన నక్షత్రములు. పింగళనామ సంవత్సరమునందు జూన్ నెల ౮-వ తేది గురువారము విదియదినమున మృగశిరానక్షత్రము ౨౩-౨౩కిఁ ప్రవేశించినట్లు చూపఁబడినది. అనగా ఆకాలమునకు సూర్యుఁడు ఆనక్షత్రమందుఁ బ్రవేశించును అని యర్థము చేసికొన వలయును. ఇట్లు చంద్రుఁడీనక్షత్రములన్నియు రమారమి ౨౮ దినములలో తిరిగివచ్చును. సూర్యుఁడు సంవత్సరములోఁ దిరిగివచ్చును. ఇట్లు దిన మీయఁబడు నక్షత్రములు చంద్రగమన సంబంధమైనవి. ఋతువులకు సంబంధమున నీయఁబడు నక్షత్ర ప్రవేశము సూర్యగమనమునకు సంబంధించినది అని తెలిసికొనవలయును.

ఇతర గ్రహములు ఈనక్షత్రములలో నుండి సంచారము చేయుకాలములు మనపంచాంగములలో విడిగ 'కుజచారః, బుధచారః' అనుశీర్షికల క్రింద నీయఁబడును.

## యోగము

చంద్రసూర్యుల గమనమునకుఁ గల యంతరము తిథి యని చెప్పితిమి. ఆగమన సంయోగము (కూడిక) యోగ మనిపించుకొనును. సూర్యుఁడు చంద్రుఁడు కలిసి ౧౩°-౨౦' అంతర మెంతకాలములోఁ బ్రయాణము చేయుదురో దానిని యోగమందురు. అనగా నిద్దరు జతగా జట్టీలంపట్టి నడుతురని యర్థము

కాదు. సూర్యునిత్రోవను సూర్యుఁడు పోవుచుండును. చంద్రునిత్రోవను చంద్రుఁడు పోవుచుండును. ఇద్దరు నడిచిన అంతరము కలిపిన ౧౩°-౨౦' కావలెను. దానికిఁ బట్టుకాలము:—

| | ఘ. పల. విపల | గం. ని. సె కె. |
|---|---|---|
| మధ్యమకాలము | ౫౬-౨౯-౨౧.౭౫ | ౨౨-౩౫-౪౪.౭ |
| ఎక్కువకాలము | ౬౧-౩౧-౦ | ౨౪-౩౬-౨౪ |
| తక్కువకాలము | ౫౨-౧౨-౦ | ౨౦-౫౨-౪౮ |

విష్కంభము, ప్రీతి మొదలయిన పేళ్లుగలయోగములు ౨౭. ఈ ౨౭ యోగములకు ౨౫.౪౨౦౨౨ దినముల (౨౫ దినములు, ౨౫ విగడియల) కాలముపట్టును. సూర్యచంద్రాదుల క్రాంతి సమానముగ నుండునపుడు వ్యతీపాతయోగములును, వైధృతియోగమును సంభవించును. వీనిని మహాపాతములు, లేక మహాయోగములు అని యందురు. ఇవి రమారమి ౧౩ దినముల యంతరమున వచ్చును. ఈ సంవత్సరాదిదినమున పంచాంగములో నక్షత్రము తరువాత "బ్ర ౬-౩౭" అని యున్నది. అనగా నాఁడు బ్రహ్మయోగము సూర్యోదయానంతరము ౬-౩౭ కిఁ బూర్తియగును. సూర్యోదయసమయమున ఈ యోగ ముండెను.

### కరణము

కరణమనఁగా తిథిలో సగము. అనఁగా అమావాస్యనుండి చంద్రసూర్యుల గమనభేదము ౬° అంశములగుటకు కెంతకాలముపట్టునో దానిని కరణ మనియెదరు. సాధారణముగ తిథియనగ నొక దినము, కరణమనగ నొకపూట యని యనుకొనవచ్చును. చాంద్రమాసమందు ౩౦ తిథులును ౬౦ కరణములును ఉండును. రెండు రెండు కరణముల జతలు తీసికొన్న యెడల రెండవదాని చివర గడియలును తిథి యొక్క చివర గడియలును ఒక్కటియే యగును. ప్రతిదినమును నిజముగ రెండుకరణములఁ బంచాంగములో నీయవలయును. కాని సాధారణముగ ౩౦ గడియలలోఁ బూర్తియగు కరణమును మాత్రము చూపె

దరు. కృష్ణపక్ష ౧౪ శి తిథియొక్క రెండవకరణము శకుని యనునది, అమావాస్య తిథియొక్క మొదటికరణము చతుష్పాత్తు, రెండవది నాగము, శుద్ధపాడ్యమి మొదటికరణము కింస్తుఘ్నము. శుద్ధపాడ్యమి రెండవకరణము మొదలుకొని, కృష్ణ ౧౪ శి మొదటికరణమువఱకు బవ, బాలవ, కౌలవ, తైతుల, గర, వణిజి, భద్ర అను ౭ కరణములు తిరిగి ౮ సారులు వచ్చును.

ఇంతవఱకుఁ బంచాంగమందలి ముఖ్యమైన అయిదు అంగములను గుఱించి చెప్పనైనది. లోకవ్యవహారమునకై యిప్పటి మన పంచాంగములందు మఱికొన్ని విషయములను ఇచ్చెదరు. అందుఁ గొన్నిటిని గుఱించిమాత్రే మిచ్చటఁ గొంచెము తెల్పెదను.

## వర్జ్యము

తెనుఁగు వారికి వర్జ్యము పట్టింపు ఎక్కువగ నున్నది. హిందూదేశమునందలి ఇతరరాష్ట్రములవారికి దీనితో నంతగఁబనిలేదు. వర్జ్యమనఁగ విడువఁబడదగిన గడియ లని యర్థము. ఇవి దిన నక్షత్రములలోని కొంత భాగము. అశ్విని నక్షత్రముయొక్క వంతు, భరణి నక్షత్రముయొక్క, కృత్తికయొక్క భాగము. ఇట్లు ప్రతి నక్షత్రమునకును కొన్ని పాళ్లు ఏర్పడియున్నవి. ఆయానక్షత్రములయొక్క ప్రారంభకాలమునుండి, ఆయావంతు కాలమును విడఁదీసినయెడల నదియే త్యాజ్య (వర్జ్య) కాలమగును. ఈవర్జ్యకాలము పగలు పడ్డయెడల సూర్యోదయమునుండి యెన్నిగడియలకుఁ బడినది చూపెదరు. రాత్రి పడ్డయెడల సూర్యాస్తమయమునుండి యెన్నిగడియలకుఁ బడినది చూపెదరు. ఈయేఁటి పంచాగమునందు చైత్ర శు ౨ య (౨౯మార్చి) దినమున "వి౨౯-౪౯" అని వ్రాయఁబడియున్నది. అనగా 'వివి' పగలు అని యర్థము. సూర్యోదయాదంతరము ౨౯-౪౯-కి వర్జ్యము. ఈ లెక్క యెట్లు వచ్చినది? పాడ్యమిదినమున రేవతి నక్షత్రము ౩౭-౪ కుఁ బూర్తియయ్యెను. కావున అశ్విని ౩౭-౪ నుండి ప్రారంభమైనది. అది విదియదినము ౩౯-౩౪ వఱకు నున్నది. అనగా ఈ నక్షత్రము మొత్తముమీఁద ౬౨-౩౦ గడియల కాలమున్నది. దీని ౯/౬ వంతు

(అనఁగా ౬ తో భాగించి వచ్చిన లబ్ధమును ౫ తో గుణించిన వచ్చునట్టి గడియలు విగడియలు) ఈ నక్షత్రముయొక్క వర్జ్యకాలమగును. లెక్క వేయగా నట్టివంతు ౪౮-౪౫ అగుచున్నది. పాడ్యమినాఁడు ౩౭-౫ కి అశ్విని ప్రారంభమైనది గనుక అప్పటినుండి ౪౮-౪౫ కాలము లెక్క వేయవలయును. అది విదియదినము ౨౫-౪౯ కిఁ పూర్తియగును.

పాడ్యమినాఁడు ౨౨-౫౬
విదియనాఁడు ౨౫-౪౯

మొత్తము. ౪౮-౪౫

విదియదినముననే 'రా ౨౯-౨౨ త్యా' అని వ్రాయఁబడియున్నది. 'రా' అనగా రాత్రి, 'త్యా' అనగా త్యాజ్యము. ఆరాత్రి సూర్యాస్తమయము తరువాత ౨౯-౨౨ కి వర్జ్యమున్నదని యర్థము. ఇది భరణీ నక్షత్రసంబంధమైన వర్జ్యము. ఈ దినమున (౨౫ మార్చి) అశ్విని ౩౫-౩౪ కిఁ పూర్తియై, భరణి ౩౫-౩౫ కిఁ ప్రారంభమై మఱుదినము ౩౫-౯ కిఁ పూర్తియైనది. రెండు దినములు కలిసి దీని వ్యాప్తి (౨౪-౨౬) + (౩౫-౯)=౫౯-౩౫. భరణియొక్క ౨/౫ వవంతు కాలము వర్జ్యము కావున (౫౯-౩౫) లో ౨/౫=౨౩-౫౦. విదియ దినము భరణి ౩౫-౩౫ కిఁ ప్రారంభమైనది గనుక ఈ కాల మప్పటినుండి లెక్కింపవలెను. (౩౫-౩౫) + (౨౩-౫౦)=౫౯-౨౫ అనఁగా విదియదినము సూర్యుఁడు గ్రుంకిన తరువాత వచ్చును. ఆనాడు సూర్యాస్తమయము ౩౦-౩ కి నున్నది గనుక (౫౯-౨౫)- (౩౦-౩)=౨౯-౨౨ కావున రాత్రి ౨౯-౨౨ కి వర్జ్యము వచ్చును.

ఇతర నక్షత్రములను గుఱించి యిట్లే తెలిసికొనవలెను. ఈనక్షత్రము యొక్క యిన్నవవంతు చివర గడియలు త్యాజ్యమన్న విషయమున వేఱువేఱు జ్యోతిష్కులు వేఱువేఱుగఁ జెప్పెదరు. హస్తానక్షత్రమునకు ౨౨/౩౦ వ వంతని కొందఱును, ౨/౩౦ వ వంతని కొందఱును చెప్పుదురు. ఇట్టే కొన్ని యితర నక్షత్రములను గురించి భిన్నాభిప్రాయములు కలవు.

## సంవత్సరమునకు అధికారులు

పార్లమెంటులో పార్టీలు మారినప్పుడెల్ల మంత్రిమండలము మాఱునట్లు మన పంచాంగములలో ప్రతిసంవత్సరమును రాజు, మంత్రి మొదలగువారు మారుచుందురు. ఈయేటి యధిపతులలో ఈ క్రిందివారు ముఖ్యులు:—

రాజు—శని
మంత్రి—శుక్రుఁడు
సేనాధిపతి—గురుఁడు
మేఘాధిపతి—గురుఁడు
సస్యాధిపతి—చంద్రుఁడు
ధాన్యాధిపతి—శని

కొన్ని పంచాంగములలో నింకను పెక్కు అధికారుల పేళ్లీయఁబడును. దీనికర్థమేమి? వీరి కీయాధిపత్య మిచ్చినవారెవరు? వీరి కీయధికార మీయేఁడు వచ్చినదని తెలిసికొనుట యెట్లు? ఇందుకు పేఱుగ లెక్కలక్కఱ లేదు. చైత్రశుద్ధపాడ్యమినాఁ డనఁగా చాంద్రమాన సంవత్సరాది పండుగ నాఁ డేవారమో యా గ్రహము ఆ సంవత్సరమునకు రాజు. ఈ యేఁటు సంవత్సరాది శనివారమైనది కావున ఈయేఁటికంతకును శనియే రాజు; మేషసంక్రమణ మెన్నఁడగునో అనఁగ (అఱవవారి) సౌరసంవత్సరాదిపండుగ యేవారమునాఁడు సంభవించునో ఆవారాధిపతి మంత్రియగును. ఈయేఁడు మేషమునందు చైత్ర బ॥ ౬ శుక్రవారము (౧౯౧౭, ఏప్రియల్ ౧౩ వ తేది) నాఁడు సూర్యుఁడు ప్రవేశించినాఁడు. అదియే మేషసంక్రమణము. ఆదినముననే అఱవల సంవత్సరాది. చిత్రి నెల ౧ వ తేది. కావున శుక్రునకు ఈయేఁటు మంత్రి పదము లభించెను. సింహమునందు సూర్యుఁ డేవారమునఁ బ్రవేశించునో ఆ వారాధిపతికి సేనాధిపత్యము వచ్చును. ఈ యేఁడు సింహసంక్రాంతి శ్రావణ బ॥ ౧౪ గురువారము (౧౬ ఆగస్టు) నాఁడు తటస్థించినది. కావున గురుఁడు సేనాధిపతి. ఆర్ద్రానక్షత్రమందు సూర్యుఁడు ప్రవేశించు వారమునకు నధిపతి

మేఘాధిపతి యనఁబడును. ఈయేఁట సూర్యుండు ఆర్ద్రానక్షత్రమందు ఆషాఢ శు ౨ గురువారము (జూన్ ౨౧) నాఁడు ప్రవేశించినాఁడు. కావున నీయేటికి సేనాధిపత్యముతోఁ బాటు మేఘాధిపత్యముఁగూడ గురునకుఁ బ్రాప్తించినది. ఇట్లే కర్కాటసంక్రాంతి, ధనుస్సంక్రాంతియొక్క వారాధిపులు క్రమముగ సస్యాధిపతియు, ధాన్యాధిపతియు నగుదురు. కర్కాటసంక్రాంతి సోమవారము (ఆషాఢ బ॥ ౧౩ జూలై ౧౬) నాఁడును, ధనుస్సంక్రాంతి శనివారము (మార్గశిర శు ౧, నవంబరు ౧౯) నాఁడును సంభవించినవి. కావున చంద్రుఁడు సస్యాధిపతియు, శని ధాన్యాధిపతియు నయ్యె.

## పంచాంగములలోని భేదములు

ఇట్లు పంచాంగములోని తిథ్యాదులు సూర్యచంద్రుల గమనమును బట్టి యేర్పడినయెడల నన్ని పంచాంగములలోను ఒకేవిధమున నేల చూపఁబడవు? కొన్ని పంచాంగములలో ఒకవిధముగను, మఱికొన్ని పంచాంగములలో మఱికొన్ని విధములుగను ఏలచూపఁబడును? అని కొందఱడుగవచ్చును. అందుకుఁ దగినట్లు పింగళనామసంవత్సరపంచాంగములు ఆఱు ఇప్పుడు నాయొద్ద నున్నవి. ఆయాఱింటిలోను సంవత్సరాది పండుగదినమునను, మరునాఁడును చూపఁబడిన తిథులు ఈక్రిందఁ జూపుచున్నాఁడను:—

| | తేది | వారము | తిథి |
|---|---|---|---|
| ఆంధ్రపత్రిక పంచాంగము కృష్ణాజిల్లాలోని ముక్త్యాలకు గుణింపఁబడినది. | మార్చి ౨౮ | శ. | ప్ర॥ ౩-౪౮ |
| | ౨౯ | ఆ. | ద్వి॥ ౦-౧; తృ॥ ౫౭-౧౧ |
| వేగాయమ్మపేట సంస్థాన పంచాంగము రాజమహేంద్రవరమునకు గుణింపఁబడినది. | మార్చి ౨౮ | శ. | ప్ర॥ ౪-౪౬ |
| | ౨౯ | ఆ. | ద్వి॥ ౦-౫౯; తృ॥ ౫౬-౫౦ |

| | |
|---|---|
| నిమ్మగడ్డవారి పంచాంగము ఎచ్చటికి గుణించినది లేదు. బహుశః గుంటూరు జిల్లాలోని ఒకానొక గ్రామమునకు నై యుండును. | మార్చి ౨౪ శ. ప్ర॥౩-౩౮; ద్వి॥౫౫-౫౮<br>౨౫ ఆ. తృ॥౫౬-౪౪ |
| శృంగేరి పంచాంగము బెంగుళూరుకు గుణించినట్లు కానవచ్చుచున్నది. | మార్చి ౨౪ శ. ప్ర॥౩-౨౪; ద్వి॥౫౫-౫౦<br>౨౫ ఆ. తృ॥౫౬-౧౨ |
| హా అండు కో వారి డైరి పంచాంగము (చెన్నపట్టణము.) | మార్చి ౨౪ శ. ప్ర॥౩-౪౦; ద్వి॥౫౫-౫౩<br>౨౫ ఆ. తృ॥౫౬-౪౦ |
| స్వామికణ్ణుగారి ౨౦౦ యేండ్ల త్ర్యంగము (ఉజ్జయినికి గుణింపఁబడినది.) | మార్చి ౨౪ శ. ప్ర॥౩-౩౦; ద్వి॥౫౭-౩౦<br>౨౫ ఆ. తృ॥౫౮-౦ |

ఇట్టీ పంచాంగములలో నొకటి మఱియొకదానితో తిథుల ప్రారంభాంతకాలములను గుఱించి కలయుటలేదు. సూర్యచంద్రులగతి భూమి కంతకును సామాన్యము. సూర్యచంద్రాదులు ఆకాశమునందు నియమితస్థలమును ఏకక్షణమున నాక్రమింతురేగాని రాజమహేంద్రము వారికొఱ కొక్కసారి, గుంటూరు వారికొఱ కింకొకసారి, బందరువారికొఱ కింకొకసారి యాక్రమింతురా? యని కొందఱడుగవచ్చును. అట్లు కాదు. సూర్యచంద్రాదుల గమన మందఱకును సామాన్యమే గనుక తిథు లన్ని ప్రదేశములవారికిని ఏకకాలమందే పూర్తియగును. కాని తిథుల మితి మనవారు సూర్యోదయ కాలమునుండి లెక్కవేయుచున్నందునను, సూర్యోదయ మన్నిచోట్లను ఏకకాలమునందుఁ గాదు గనుకను వేఱువేఱు స్థలముల విషువచ్ఛాయ (రేఖాంశములు (Longitudes) ల ననుసరించి లెక్కవేయగా తిథులు వేఱువేఱుగ వచ్చును. ఒకానొక స్థలమును గుర్తుగ నుంచుకొనినయెడల దానికిఁ బశ్చిమమున్న స్థలముల ఆలస్యముగ సూర్యుఁ డుదయించుటయుఁ, దానికిఁ దూర్పుననున్న స్థలములందుఁ ద్వరగ నుదయించుటయు సంభవించును. మనవారు లంక, ఉజ్జయిని, కురుక్షేత్రముల

మీదుగఁ బోవు రేఖను శూన్య విషువచ్ఛాయా మధ్య రేఖ (°degree of Longitude)గ నెంచి కొనిరి.* కావున మనజ్యోతిష్కులు మొదట ఉజ్జయినికి లెక్కవేసికొని, తరువాత తమగ్రామము ఉజ్జయినికిఁ దూర్పున నున్న యెడల ౧° అంశమునకు ౨౩ విగడియలు(౮ మినిట్లు) వంతున కల్పుదురు. పడమరనున్న తీసివేయుదురు. ఇట్లు వీలు ననుసరించి యొకప్పుడు కలిపెదరు. ఒకప్పుడు తీసివేయుదురు. ఇప్పటి పాశ్చాత్యజ్యోతిష్కులు గ్రీనిచ్ పట్టణపు విషువచ్ఛాయను ఆధారము చేసికొని లెక్కచేసెదరు; దేశపటముల వ్రాసెదరు.

నిజముగా విచారించినయెడల గ్రామగ్రామమునకు వేఱువేఱు పంచాంగ ముండవలయును. చివరకు జిల్లాకు నొక పంచాంగమైనను ఉండవలయును. అట్లు యినఁగాని శ్రాద్ధాది క్రియలయందు వచ్చుకొను కలవారి పిండాదులు, వారివారి పూర్వులకు ముట్టనేరవు. ఒక దినము తద్దినమైన మఱియొక దినము తద్దినము పెట్టుట సంభవించును.

వేఱువేఱు పంచాంగములలో తిథులు భేదముగవచ్చుటకు, దేశభేదము గాక మఱికొన్ని కారణములుకూడఁ గలవు. కొందఱు పంచాంగకారులు సూర్య సిద్ధాంతమును అనుసరించి లెక్కలు వేయుదురు. మఱికొందఱు ఆర్యసిద్ధాంత మునుబట్టి వేయుదురు ఇటీవల కొందఱు దృగ్గణిత పంచాంగములని, నాటికల్ అల్మనాక్ (Nautical Almanack) అను దానినిబట్టి లెక్కలువేసి పంచాంగము ప్రకటింతురు. అందలి ప్రతివిషయమును దృక్ప్రత్యయమునకు సెకనుల విభేదముకూడ లేకుండఁగ వచ్చును.

మన పంచాంగములు గుణించు పద్ధతియేప్పడి యెన్నియో వందల సంవత్సరములయినది. దృక్ప్రత్యయమునుబట్టి దానిని అప్పటినుండి సంస్కరించిన వారులేరు. పాశ్చాత్యజ్యోతిశ్శాస్త్రము, ఒకసెకనులో నూరోవంతు కాలము

---

* "యల్లంకోజ్జయినీ పురోపరి కురుక్షేత్రాది దేశాన్ స్పృశన్... సామధ్యరేఖా స్మృతా"—భాస్కరాచార్యుఁడు.

కూడఁ దప్పకుండ నాకాశమునందు గ్రహాదికముల స్థానమును జూపునంత పరిపూర్ణావస్థకు వచ్చినది. కావున వారి శోధనలను గ్రహించి, మన పద్ధతిలో నిముడ్చుకొని పంచాంగాదికములు గుణించునపుడు గ్రహాదికముల స్థితులలోఁ జేయవలసిన సంస్కారములను ఏర్పాటుచేసినఁగాని మన పంచాంగములు వ్యవహారమునకుఁ బనికి వచ్చినను క్రియాకర్మలకుఁ బనికి రావని పెక్కు విద్వాంసుల, మతాభిమానుల యభిప్రాయము. వెనుకఁ గొన్ని యేండ్లక్రిఁద పంచాంగ శోధనమునకై పద్ధతు తేర్పఱుచుటకు పూర్వపు శ్రీ శృంగగిరి శంకరాచార్యుల వారొకసంఘమును (కమిటీని) ఏర్పాటు చేసియుండిరి. తరువాత నాసంఘము వారింతకఱకును ఏమిచేసినది తెలియలేదు.

---

# మేరు ప్రదేశము *

## ఆఱునెలలు పగలు—ఆఱునెలలు రాత్రి

పురాణాదులలో మనము మేరుపర్వతముయొక్క వర్ణనము చదివి యున్నాము. ఇది యన్ని దేశములకును అన్ని ద్వీపములకును ఉత్తరముననుండు ననియు, దీని నెత్తిమీఁద ఆకాశమునందు ధ్రువమండలము సూటిగ నుండు ననియు, సూర్యచంద్రాదులు దీనిచుట్టు ప్రదక్షిణమును చేయుచుందురనియు, అచ్చట పితృదేవతలు నివసించియుండెద రనియు, వారికి ఆఱునెలలు పగలును ఆఱునెలలు రాత్రిగను ఉండుననియు జెప్పఁబడియుండును. ఈ వర్ణనవిషయములన్నియు మానవులకుఁ గానవచ్చునవి గావనియు, అతీంద్రియములైన దేవతాలోక విషయము లనియుఁ గొందఱు తలంచియుందురు. కాని యందలివిషయము లన్నియు మనము కాఁపురముండు ఈభూలోకమునందలివియె. వీనిని జూచుటకై యెవరును మానవదేహమును వదల నవసరము లేదు. అమానుష సామర్థ్యములను సంపాదింప నక్కఱలేదు. ఉత్సాహము, సాహసము, ఓర్పు అనుగుణము లుండినచో నేమానవుఁడైనను వీనిని జూచి రావచ్చును.

మనవారిచే మేరుపర్వత మని వర్ణింపఁబడినది ఉత్తరధ్రువ (North-pole) ప్రదేశ మనఁబడునవి. భూగోళము గుండ్రముగా నున్నను, ఈగుండ్రతనము అంతటను సమానముగా లేదు. ఉత్తర దక్షిణ మందలి భాగములు కొంచెము ఒత్తుకుపడినట్లును, మట్టములుగను ఉండును. ఉత్తరపువైపుననున్న యిట్టి, ప్రదేశమును ఉత్తరధ్రువ మనియు దక్షిణపువైపుననున్న యిట్టి ప్రదేశ

* 'సరస్వతి' — దుందుభి, ఫాల్గుణము, రుధిరోద్గారి, చైత్రము, సం ౧, సం ౧, ౨ లు.

మును దక్షిణధ్రువమనియు అందురు. ఉత్తరధ్రువ ప్రదేశ మధ్యస్థలమునకు ఉత్తరధ్రువబిందు వనియు, అట్లె దక్షిణధ్రువపు మధ్యప్రదేశమునకు దక్షిణ ధ్రువబిందు వనియు విశేషనామములు. భూగోళములోపలిగా ఉత్తరమునుండి దక్షిణమునకు నొక యినుపకడ్డీ దూర్చినయెడల దానికి అక్షము [ఇరుసు Axis] అని పేరు. ఈ కల్పితాక్షముయొక్క ఉత్తరపుమొనయే ఉత్తరధ్రువబిందువు. దక్షిణపుమొనయే దక్షిణధ్రువబిందువు. ఈ కల్పితాక్షముచుట్టును భూగోళము ప్రతిదినమును తిరుగుచుండును. మనకు నిచ్చట మిట్టమధ్యాహ్న కాలమందు సూర్యుఁడు సరిగ తలమీఁద నున్నట్లు ఉత్తరధ్రువమున ధ్రువనక్షత్ర మెల్లప్పుడును అచ్చటివారి శిరస్సుపై నుండును.

ఉత్తరధ్రువమందు మనకు మొదటఁ గనఁబడు చమత్కార మేది యన నాకాశమునందలి గోళము లన్నియు మనతలపై నొకగొడుగువలె గుండ్రముగాఁ దిరుగుట. మన ముండు ఉష్ణసమశీతోష్ణ ప్రదేశములలో సూర్య చంద్రాదికజ్యోతులు తూర్పున ఉదయించినట్లును, పశ్చిమమున అస్తమించి నట్లును కానవచ్చును. వానిలో కొన్ని మన తలమీఁదుగను, కొన్ని కొంచెము ప్రక్కగను పోవును. కాని ఉత్తరధ్రువమందలి జనుల కట్లు గానరావు. మన మొకగొడుగు పట్టుకొని గుండ్రముగా త్రిప్పుచున్నయెడల నెట్లుండునో అట్లే సూర్యుఁడు, చంద్రుఁడు, గ్రహములు, నక్షత్రములు మొదలైనవన్నియు ఎడమవైపునుండి కుడివైపునకు గుండ్రముగా తిరుగుచుండును. అచ్చటఁ బ్రతిదినమును నక్షత్రము లుదయించుట, అస్తమించుట యనునది యుండదు. కుమ్మరివాని చక్రమువలె నవి యన్నియు క్షితిజమునకు (Horizon) సమాంతర క్షేత్రములలో గుండ్రముగఁ దిరుగుచుండును. ఒక ప్రదక్షిణ మయిన వెంటనే రెండవ ప్రదక్షిణము చేయుటకు ప్రారంభించును. ఇట్లాఱునెలల దీర్ఘరాత్రి యంతయు చేయుచుండును. సూర్యుఁ డొకతడవ నుదయించిన తర్వాత నాఱునెలలవఱకును అస్తమింపఁడు. ఇంతవఱకు నాతఁడు గిఱ్ఱుగిఱ్ఱున నాకాశముచుట్టును, గుండ్రముగాఁ దిరుగుచుండును. దినదినమున కొక ప్రదక్షి

ణము చొప్పున ఆఱునెలలకు రమారమి ౧౮౦ ప్రదక్షిణములు చేయును. అచ్చట నుండువారికి ధ్రువనక్షత్రమే ఖస్వస్తికము (నెత్తిమీఁదిబిందువు Zenith) కావున వారికి నుత్తరదిక్కనఁగా నూర్ధ్వదిశయే, దక్షిణదిక్కనగా నధోదిశయే, అనగా క్రిందిభాగము—క్షితిజమునకుఁ గ్రిందనున్నందున కనఁబడని భాగము. భూమి ప్రతిదినమును తన యక్షముచుట్టుఁ దిరుగుచున్నందున పూర్వపశ్చిమదిగ్బిందువులు చూచువానికి క్రమముగ నెడమవైపునను, కుడివైపునను ఉండి, తిరుగుచున్నందున, ఆకాశస్థజ్యోతులు ప్రతిదినమును క్షితిజముతోఁబాటు ఎడమవైపునుండి కుడివైపునకుఁ దిరుగుచున్నట్లు కానవచ్చును. సూర్యుఁడు చుట్టునుదిరుగుటలో భూగోళమందలి ఇతరప్రదేశములకును ధ్రువప్రదేశమునకును భేదము గలదు. భూమధ్యరేఖ మొదలైన ప్రదేశములన్నియు దినమున నొక్కసారి సూర్యునకుఁ గానిపించి మరల గానిపింపకపోవును. కావున నచ్చట ౨౪ గంటలలో నొకరాత్రియు, నొక పగలును తప్పక యేర్పడును. భూమియొక్క అక్షము భూకక్షకు కొంచెము వంకరగా నుండి సూర్యునిచుట్టు తిరుగుచున్నందున ఆయక్షపుకొనలైన ధ్రువప్రదేశములు ఆఱునెలలవఱకు సూర్యునివైపుననే యుండుటయు, మరల నాఱునెలలవఱకుఁ సూర్యునకుఁ గానఁబడకుండ నుండుటయు తటస్థించును. ఇట్లు పృథ్వియొక్క అక్షపుదిశ మారనందున ధ్రువప్రదేశమునం దున్నమానవునకు నెల్లప్పుడును ఒక ఖగోళార్ధమే (ఆకాశభాగమే) కానవచ్చుచుండును రెండవ ఖగోళార్ధమును, అందలి నక్షత్రములును కానరావు. ఆకాశముయొక్క విషువవృత్తమే (equinoctial point) అతనికి క్షితిజముగ నుండును. అచ్చటి ప్రేక్షకునకు సూర్యుఁ డుత్తరగోళార్ధమునందుఁ బ్రవేశింపఁగనే, అతఁడు దక్షిణమునుండి వచ్చునట్లు తోఁచును. మన కెంత విపరీతముగఁ దోచినను అచ్చటివారు సూర్యుఁడు దక్షిణమున నుదయించునని చెప్పినయెడల నది వస్తుస్థితియే యగుఁ గాని అలంకారము గానేరదు.

ధ్రువమునొద్ద సంవత్సరమునకు నొక్కసారిమాత్రము సూర్యోదయమగును. ఒకసారి సూర్యోదయమైనతరువాత నాఱునెలలవఱకును సూర్యుఁ

డస్తమింపక దినమును కొంచెముకొంచెము పైకెక్కుచు, ౨౪ గంటల కొక్కసారి ఆకాశమును గుండ్రముగ చుట్టివచ్చును. ఒక్కచెట్టును గాని, మఱియొక స్థిరపదార్థమును గాని గుర్తుపెట్టికొని సూర్యుఁ డెన్నిపర్యాయములు అచ్చటికి వచ్చి పోవునో అన్నిదినములు అని, అనగా ౨౪ గంటలకాల మని ధ్రువప్రదేశమువారు కాలగణన చేసికొనవచ్చును. సూర్యుఁడు ప్రతిదినమును క్షితిజముపైకి కొంచెము ఎక్కినను మొత్తముమీఁద ౨౩½° అంశములకంటె హెచ్చుపోఁడు. మనదేశమునందు సూర్యుఁడు ౯౦° అంశములమీఁదికి నెక్కునని చెప్పినయెడల ధ్రువప్రదేశమున నెంత తక్కువగ ప్రొద్దెక్కునో తెలియఁగలదు. ఈకారణమున నచ్చట సూర్యరశ్మి మనకున్నంత తీక్ష్ణముగా నుండదు. సూర్యుఁడు మరల నస్తమించునప్పుడు దక్షిణముననే గ్రుంకును. సూర్యు డస్తమించినతోడనే ఉత్తరఖగోళార్థమంతయు నన్ని నక్షత్రములతోడను దృగ్గోచరమగును. మనకుఒక నక్షత్రము క్రమముగా గానవచ్చినట్లు వారికిఁ గానరావు. అన్నియు నొక్కసారియే గానవచ్చును. ఇట్లు ఆఱునెలల రాత్రియు, ఆఱునెలలు పగలును, ఖగోళముల చక్రాకారభ్రమణమును ధ్రువప్రదేశమందలి కాలదర్శకములైన ముఖ్యవిశేషములు.

ధ్రువప్రదేశమునం దుండువారు ఆఱునెలలరాత్రి గడపవలయు నని వినినతోడనే ఈకాలమంతయు నాప్రదేశము చిమ్మచీఁకటిలో మునింగి యుండవచ్చునని తోపకమానదు. సంవత్సరములో నర్థకాలము, వెలుతురు లేకయు, వేడిమిలేకయు గడపవలసివచ్చుట ఘోరమైన యాపత్తని, ౬౦ గడియలలో నొకరాత్రియు నొకపగలును అనుభవించుచున్న మనవా రనుకొనుట సహజము. ఇంతకాలము వెలుతురును వేడిమియు గృత్రిమోపాయము వలనఁ బుట్టించుటయు నసాధ్యమే. కాని సృష్టిలో నిందునకును దగినయేర్పాటు లేకపోలేదు. ఈ దీర్ఘరాత్రుల యంధకారమును బాఱఁదోలుటకై ధ్రువప్రదేశమున ఉత్తరారుణము (Aurora borealis) అనఁబడు రమ్యమైన విద్యుత్ప్రకాశము కలదు. అచ్చట చంద్రుఁడు నెలకు పదునైదుదినములు క్షితి

జము పైనుండి తనకళల ఆరోహణావరోహణ చమత్కారములను, ప్రకాశ మును ప్రసాదించుచుండును. కాని ధ్రువప్రదేశమందలి దీర్ఘరాత్రముల యంధకారభయమును బాపు గొప్పసాధనము మఱియొకటి కలదు. అది యచ్చటి సంధిప్రకాశము – ఉషస్సు. ఇది సూర్యోదయమునకుఁ బూర్వమును, సూర్యాస్తమయమునకుఁ దరువాతను కానవచ్చును. మనదేశమునందలి యుషస్సు ప్రాతఃకాలమునందు గాని, సంధ్యాకాలమునందు గాని రెండుగంటలకంటె నెక్కువకాల ముండదు. ధ్రువప్రదేశమందునో యిది పెక్కుదినములవఱకును ఉండును. కొందఱిమతమున నది ౪౫ దినములవఱకును, మఱికొందఱి మతమున ఇంకను నెక్కువకాలమువఱకును ఉండును. ఉష్ణదేశములందు సూర్యుఁడు క్షితిజమునకు ౧౮° అంశములు క్రిందనుండగనే యాతనికిరణములు మొదట కనఁబడసాగును. అదియే అరుణోదయము. ఉన్నతాక్షాంశములు (High latitudes) గలప్రదేశములలో సూర్యునికిరణములు ౨౦° యక్షాంశములదూరమునుండియే కానవచ్చును. ఈమితి బహుళః ధ్రువప్రదేశమునకు చెల్లును. క్యాప్టన్ పెమ్ ధ్రువప్రదేశమందలిసంవత్సరము నిట్లు వర్ణించెను :—

"అచ్చట మార్చినెల ౧౬ వ తేదిన సూర్యుఁ డుదయించును– అంతకు ౬౭ దినములు పూర్వమునుండియే అనగా జనవరినెల ౨౯ వ తేదినుండి అరుణోదయము కాన్పించుచుండును. సెప్టెంబరునెల ౨౫ వ తేదికి సూర్యుఁ డస్తమించును. తరువాత ౪౯ దినములు అనగా నవంబరునెల ౧౩ వ తేదివఱకు సాంధ్యరాగము కానిపించుచుండును. తరువాత ౭౬ దినములవఱకు సూర్యుఁడుగాని అరుణప్రకాశముగాని లేనందున చీఁకటి యుండును. తరువాత మరల నరుణప్రకాశమువచ్చి సూర్యుఁ డుదయించి ౧౯౪ దినములవఱకు క్షితిజముపై నుండును. అనగా ధ్రువప్రదేశమందలి సంవత్సరములో ౧౯౪ దినములు సూర్యునివెలుతురు, ౪౮ దినములు సంధ్యారాగము, ౭౬ దినములు చీఁకటి, తరువాత ౪౭ దినములు అరుణోదయము నుండును."

కాని మఱికొందఱు విద్వాంసులు ఈ యరుణసాంధ్యరాగముల కాలమును ఇంకను కొంత పెంచి ధ్రువప్రదేశమందుఁ బూర్తిగఁ జీకటిగనుండు

కాలము ౭౦ దినములకంటె నెక్కువ యుండ దని చెప్పెదరు. ఈ యరుణ సాంధ్యరాగములకు గాలివలన సూర్యకిరణములకు వక్రీభావమును (refraction) పరావర్తనమును (reflection) కలుగుటయే కారణము. గాలి కిట్టిశక్తి శీతోష్ణాదికములనుబట్టి హెచ్చుచుఁ, దగ్గుచు నుండును. ఇప్పు డక్కడిగాలి మిక్కిలిచల్లగా నున్నది కాని హిమాంతరకాలము అనఁబడు మిక్కిలి పురాతనకాలమున నది మిక్కిలి సౌఖ్యముగ నుండె ననుటకు సందియము లేదు. కావునఁ బూర్వమునందు అరుణసాంధ్యరాగము లిప్పటికంటెనెక్కుడు కాలము వెలుఁగుచుండె ననుటకును సంశయము లేదు. అది యెట్లున్నను ఇప్పుడుకూడ ధ్రువప్రదేశమునందు సంవత్సరమునకు రెండుపర్యాయములు మాత్రము గానవచ్చెడిసాంధ్యరాగము సూర్యుఁడు క్షితిజమునకు క్రింద ౧౮° అంశములు దూరముగ నుండునంతవఱకును నిస్సంశయముగఁ గానవచ్చును. సూర్యుఁడు ౧౮ అంశముల ప్రదేశము నాక్రమించుటకు నెలదినముల కంటె నెక్కుడు పట్టును. ఇట్టిసాంధ్యరాగ మచ్చటి ఆఱునెలల చీఁకటిలోనుండి దగ్గఱదగ్గర సగభాగమును తగ్గించును కావున ధ్రువప్రదేశమునందలి యర్ధవార్షికరాత్రి అచ్చటిప్రజలు కాపుర ముండుటకు దగినకాలము కాదని తలచుట తప్పు. ఇంతేకాదు–అచ్చట నక్షత్రములవలెనే ఆడుచు గుండ్రముగా దిరుగుచుండెడి దీర్ఘమైన ఉషస్సుయొక్క వింతనాట్యమును జూచుభాగ్య మచ్చటి వారికే సాధ్యము కాని యితరులకు సాధ్యము కాదు.

ఉష్ణకటిబంధమునందును (Torrid zone), సమశీతోష్ణకటిబంధములందును (Temperate zones) ఉషఃప్రకాశము కొద్దికాలమే కాన్పించును. ౨౪ గంటలలో మరల మరల వచ్చును, ఇంతస్వల్పకాల ముండు నదియైనను అది మన కవుల వర్ణనలకు మనోహరవిషయమయ్యెను. అట్టియెడ నేదేశమునందు నుషస్సు రెండునెలల యంధకారము తరువాత వచ్చునో, వచ్చి నెలపదునైదుదినములవఱకు తనవింత వింతరూపములం జూపునో, యచ్చటి ప్రజలు దానిరాక కెంతయుత్సుకతతో నెదురుచూచుచుందురో, దానియాగ

,మనమువలన వారి కెంతయానందమును ఉత్సాహమును కలుగునో చదువరులే యోజించుకొనియెదరు గాక ! ధ్రువప్రదేశమందలి వర్ణనీయ మైన యీయుష స్సౌందర్యమును డాక్టరు వారన్ ఇట్లు వర్ణించియున్నాఁడు:—

"రాత్రి మొదట నాకాశమునఁ గ్రిందిభాగమున అనగా క్షితిజము నొద్ద నొకయపూర్వతేజఃపుంజము ఈషత్ దృశ్యమాన మగును. అది మొదట నక్షత్రములతేజస్సును కొంచెము లోపింపఁజేసి క్రమక్రమముగా వృద్ధియై యింకను చీకటితో గ్రమ్మి యున్న క్షితిజమును అంటి వంకరగా నున్న వృత్త రూపమున నాకాశమున ప్రదక్షిణము చేయసాగును. ౬౦ గడియలలో నొక ప్రదక్షిణము ,ముగించి బయలుదేరినస్థలమునకుఁ దిరిగివచ్చును. అంత వాని తేజ స్సభివృద్ధియై మఱికొన్ని నక్షత్రముల నణఁచివేయును. త్వరలోనె యీ తేజోగోళము పెరిగి ముత్యపువన్నె ధరించి దేదీప్యమానమై ప్రతిక్షణమునకు వృద్ధిఁ జెందుచు బయలుదేరఁగా దానిమౌక్తికశ్వేతిమ యంతకంతకు నుజ్జ్వలమై నీల, పీతవర్ణములు గలదియై చివరకు నారక్తతం జెందును. గాలియు మేఘములును ప్రకాశపరావర్తనమునకు ననుకూలముగా నున్నప్పు డెక్కుడు ప్రజ్వలితమై, ప్రతికూలముగా నున్నప్పుడు నిస్తేజ మగును. ఒకప్పుడు తేజమును గోల్పోయినను మరల వెనుకటికంటె నెక్కుడు తేజస్సును బొందును. ఇట్టియుషశ్చమత్కారము సూర్యోదయాద్రి నారోహించు వఱకును గానిపించుచుండును. ఈలాగున రెండునెలల వఱకును అంతరిక్షము నంతను ఉషస్సు తనదివ్యరూపములతో నింపినతర్వాత, తేజోనిధియైనసూర్యుఁడు తాను విశ్రమించుచున్న స్థలమునుండి పైకి వచ్చి మానవులకుం గానిపించును. మొదట అర్ధవృత్తాకృతిగా నున్న ఉషస్సు ఒకటిరెండు ప్రదక్షిణములతరువాత పూర్ణమై మిక్కిలి దూరమం దున్న గిరిశిఖరములను గూడ ప్రసన్నములం జేసి యంతమీఁద తనకుఁ బ్రియమైన నా ధ్రువప్రదేశమును ఆఱునెలలవఱకు అంధకార మావరింపలే దని తెలిసికొని తాను లోపించి విశ్వముయొక్క అక్షము చుట్టు ప్రతిబింబితమై చక్రాకారముగ భ్రమించు-

చుండును. తాను కాన్పింపకుండఁ బోయినప్పుడుకూడ తను లేనప్పుడు ఒకప్పుడు ప్రజ్వలితముగను ఒకప్పుడు నిస్తేజముగను కాన్పించుసంధిప్రకాశమును ఉంచిపోవును. ఇట్లు తనవియోగముచే దుఃఖిత యైనభూమికి తాను మరల త్వరలోనే వచ్చెద నని యభయవచన మిచ్చెను.”

ఇట్టి యద్భుతచమత్కారములను చూచుభాగ్యము కలిగినధ్రువప్రదేశస్థుల స్మృతిపై నది శాశ్వతపరిణామము కలిగించు ననుటకు సందేహములేదు. మనపూర్వులైనయార్యులొకప్పు డీప్రదేశమునందుఁ గాపురముండుటచే నచ్చట వారు చూచిన వంకరగ ప్రదక్షిణము చేయుచు దీర్ఘకాలి కముండెడి ఉషస్సును గురించినకథలు వారిసంతతివారైనవైదికఋషులు ఋగ్వేదాదికములలో వర్ణించియున్నారు.

పైని వర్ణింపఁబడిన చమత్కారము లన్నియు ధ్రువబిందువునందును, దానికి చుట్టును గలకొంతప్రదేశమునందును గానవచ్చునవి. కాని యాప్రదేశమునుండి మనము దక్షిణదిక్కునకు రా మొదలిడితిమేని ఈచమత్కారములలోఁ గొంత మార్పు గలుగును. ధ్రువబిందువుకడ నాకాశమందలి ధ్రువనక్షత్రమే ఖస్వస్తికము (Zenith) అని యిదివఱకుఁ జెప్పియుంటిమి. అచ్చటినుండి మనము దక్షిణమునకు వచ్చినకొలదిని ఖస్వస్తికముగూడ మారుచు దక్షిణమునకు వచ్చును. అచ్చటచ్చటిక్షితిజము, కానవచ్చు నక్షత్రములు మారుచువచ్చును. ధ్రువబిందువునొద్ద నక్షత్రము లన్నియు నెప్పుడును గాన్పించుచుండును. దక్షిణమునకుఁ బోయినకొలఁదిని కొన్నినక్షత్రము లెప్పుడును గాన్పించుచుండును; కొన్నిమారుచుండును. కొన్నినక్షత్రము లెప్పుడును క్షితిజముపై నుండును. మఱికొన్ని కొంతకాలము క్షితిజముపైని కొంతకాలము క్షితిజము క్రిందను ఉండును. ధ్రువబిందువునొద్ద నక్షత్రములు క్షితిజమునకు సమాంతరముగను గుండ్రముగను తిరుగుచు దక్షిణమునకు వచ్చినకొలఁదిని యవి కొంతవంకరగ తిరుగును. ధ్రువనక్షత్రమునకు కొంతదూరమున నున్న నక్షత్రములు మాత్రము ఎల్లప్పుడును క్షితిజము మీఁదనే యుండి వాని

క్రింద నున్న నక్షత్రములు మనదేశమునందలి నక్షత్రములవలెనే ఉదయించుచు నస్తమించుచునుండును. ధ్రువబిందువును సమీపించిన కొలఁదిని ఇట్టి నక్షత్రములు తక్కువగ నుండును. ధ్రువబిందువునుండి మనము దూరము పోయిన కొలఁదిని వీనిసంఖ్య హెచ్చును.

ధ్రువబిందువునకు క్రింద నుండువారి దినరాత్రిమానములయందును భేదములు గలుగును. దక్షిణమునకు వచ్చినకొలఁదిని దీర్ఘదివారాత్రముల ప్రమాణము మారి కొన్ని స్థలములందు అయిదునెలల రాత్రియు, అయిదునెలలపగలును, కొన్నిచోట్ల మూఁడునెలలరాత్రియు, మూఁడునెలలపగలును ఈప్రకారము తగ్గుచుపోయి సమశీతోష్ణదేశమునకు రాఁగనే సూర్యుఁడు ప్రతిదినమును క్షితిజముపై కొంతకాలమైన నుండుటు తటస్థించును. అనగా ౨౪ గంటలలో నొకరాత్రియు, నొకపగలు నేర్పడును. ఇంకొక చమత్కారము—మూఁడు నెలలుపగలు, మూఁడునెలలు రాత్రియని చెప్పినచోట సంవత్సరమునకు రెండు రాత్రులు, రెండుపగళ్లు మాత్ర మగునని తలంపఁగూడదు. మూఁడునెలలు అయినతోడనే కొన్నిదినముల వఱకు సూర్యుఁడు మనదేశమునందు వలెనే ౨౪ గంటల కొకసారి ఉదయించుచు, నస్తమించుచు నుండును. తరువాత మూఁడునెలల దీర్ఘరాత్రి వచ్చును. ఈదీర్ఘరాత్రి గడచినపిదప సూర్యుఁడు ౨౪ గంటలలో నొకసారి ఉదయించుచు, నస్తమించుచు నుండును. ఈసంగతియే ఇంకొక యుదాహరణముం దీసికొని స్పష్టపఱచెదను. ఒకప్రదేశము ధ్రువబిందువునకు దక్షిణమున మిక్కిలి దూరమునం దున్నందున అచ్చట రెండునెలల దీర్ఘదివసమును రెండునెలలదీర్ఘరాత్రియు నుండు ననుకొనుఁడు. దీర్ఘరాత్రి సమయమున సూర్యుఁడు రెండునెలలవఱకును క్షితిజమునకుఁ గ్రిందనే యుండును. ఈరాత్రికి మధ్యకాలము దక్షిణాయనదినము అనగ సాయన మకరసంక్రమణదివసము. ఇది సాధారణముగ డిసెంబరునెల ౨౧వ తేదిన బడును. ఈ తేది కొకనెల పూర్వమును, ఒకనెల తరువాతను దీర్ఘరాత్రి యుండును. అనగ రమారమి నవంబరు ౨౧ వ తేది మొదలు జనవరి ౨౧ వ తేది వఱకు

దీర్ఘరాత్రియుండును. అట్లే యచ్చటి దీర్ఘదివసముయొక్క మధ్యకాలము ఉత్తరాయణదినము (జూన్ ౨౧ వ తేది) అనగా దీర్ఘదివసపరిమితి మే ౨౧ మొదలు ౨౨ జూలైవఱకు, నీకాలమంతయు సూర్యుఁడస్తమింపకుండ క్షితిజము పైననే యుండి గుండ్రముగ దినమున కొకయాకాశప్రదక్షిణమును చేయుచుండును. ఇట్లు సంవత్సరములోనుండి నాలుగునెలలు పోఁగా మిగిలిన యెనిమిది నెలలును అచ్చటివారికి యెట్టి దినమాన ముండునో యని చదువరులకు సంశయము కలుగవచ్చును. ఆయెనిమిదినెలలును వారికి మనవలెనే ౨౪ గంటల యహోరాత్రములు కలిగియుండును. జనవరినెల చివరివారమునందు దీర్ఘరాత్రి ముగిసిన తోడనే వారికి ౨౪ గంటల యహోరాత్రములు ప్రారంభమగును. మొదట పగటికంటె రాత్రి పెద్దదిగా నుండును. సూర్యుఁడు దక్షిణమునుండి యుత్తరగోళార్ధమునకుఁ బోయినకొలఁదిని రాత్రికంటె పగలు హెచ్చుచుఁబోయి మే నెలలో దీర్ఘదివసమువచ్చును. జూలై నెలలో దీర్ఘదివసము అస్తమించినతోడనే ౨౪ గంటల యహోరాత్రములు మరల ప్రారంభమగును. అప్పుడు మొదట పగళ్లు రాత్రులకంటె పెద్దవిగా నుండును. సూర్యుఁడు దక్షిణగోళార్ధమునకు వచ్చినకొలదిని పగళ్లకంటె రాత్రులు హెచ్చి నవంబరునెలలో దీర్ఘరాత్రి ప్రారంభమగును. ఇట్లే మూఁడునెలల యహోరాత్రములును, నాలుగునెలల యహోరాత్రములును, అయిదునెలల యహోరాత్రములును గల స్థలములందు స్వల్పభేదములతో జరుగునని యెఱుంగునది. ధ్రువప్రదేశమునకు పోఁగా దీర్ఘ అహోరాత్రులకాలము ఆఱునెలలై నడిమి ౨౪ గంటల యహోరాత్రములు పూర్తిగ లోపించును.

పైని ఉత్తరధ్రువబిందు ప్రదేశమును గురించియు ఉత్తరధ్రువప్రదేశమును గుఱించియుఁ జెప్పిన విషయము లన్నియు దక్షిణధ్రువబిందు ప్రదేశమును గుఱించియు, దక్షిణధ్రువప్రదేశమును గుఱించియు చెప్పఁబడినవి గానే యెంచుకొనవలెను. కాని యొకభేదము గలదు. ఉత్తరధ్రువబిందు ప్రదేశమున పగలుగా నున్న యాఱునెలలును దక్షిణధ్రువబిందు ప్రదేశమున రాత్రిగా

నుండును; అట్లే ఉత్తరమున రాత్రిగానున్న యాఱునెలలును దక్షిణమున పగలుగా నుండును. ఈలాగుననే యితరవిషయములును ఊహించుకొనునది. ఉత్తర ధ్రువబిందువునుండి ఉత్తర ధ్రువప్రదేశముయొక్క పరిమితి యెటు చూచినను రమారమి ౨౩౧° అంశములు; అట్లే దక్షిణధ్రువ బిందువునుండి దక్షిణ ధ్రువప్రదేశముయొక్క పరిమితి యెటుచూచినను రమారమి ౨౩౨° అంశము లుండును. ఉత్తరముపైపు నున్న యాప్రదేశమును ఉత్తరశీతప్రదేశ మనియును (North frizid zone), దక్షిణపైపు దాని దక్షిణశీతప్రదేశ మని యందురు. ఉత్తరశీతప్రదేశమునకు దక్షిణమున ఉత్తర సమశీతోష్ణప్రదేశమును, దక్షిణ శీతప్రదేశమున కుత్తరమున దక్షిణ సమశీతోష్ణప్రదేశమును ఉండును. సమ శీతోష్ణప్రదేశములలో పైచమత్కారములు కానరావు.

పైని చెప్పఁబడిన విశేషములు కొంతవఱకు మనదేశమందలి పూర్వ జ్యోతిష్కులకుఁ గూడఁ దెలిసియుండెననుటకు సందేహము లేదు. భాస్కరాచార్యులవారు 'సిద్ధాంతశిరోమణి' యను గ్రంథమునందు గోళాధ్యాయమున నిట్లు వ్రాసియున్నారు.

శ్లో॥ సదాసమత్వంద్యునిశోర్నిరక్షే । నోన్మండలంత్రకుదాహ్యతోస్యాత్ ॥
షడ్షష్టి భాగాభ్యధికాఃపలాంశా । యత్రాధతత్రాస్త్వపరోపి శేషః ॥
శ్లో॥ లంబాధికాక్రాంతిరుదక్ఛయావత్ । తావద్దినంస న్తతమేవతత్రి
యావచ్ఛయామ్యాసతతంతమిస్రాత్రి । తతశ్చమేరౌ సతతం సమార్థం ॥
(అధ్యా ౭. శ్లో ౬–౭)

"నిరక్షదేశమునందు అనగా భూమధ్యరేఖా (Equator) ప్రదేశ మునందు క్షితిజమును ఉన్మండలము నొకటి యైనందువలన నెల్లప్పుడును (౨౪ గంటలలో) రాత్రియు, పగలును సమానముగా నుండును. కాని యేస్థలమునందు ఉత్తర అక్షాంశములు (North latitudes) ౬౬° అంశముల (భాగల) కంటె నధికముగ నుండునో యచ్చట నొకవిశేషము కానవచ్చును. అచ్చటి లంబాం శములకంటె సూర్యుని యుత్తరక్రాంతి యెంతవఱకు అధికముగ నుండునో

యంతవఱ కచ్చట నెడతెగకుండ పగలే యుండును; ఎంతవఱకు లంబాంశములకంటె సూర్యుని దక్షిణక్రాంతి యధికముగ నుండునో యంతకాలము వఱకును ఎడతెగకుండ రాత్రి యుండును. అందుచేతనే మేరువుపై (ఉత్తరధ్రువముపై) నెల్లప్పుడు నాఱునెలలు రాత్రియు ఆఱునెలలు పగలునుండును."

ఒకస్థలముయొక్క అక్షాంశము (Latitude) ౭౦° యంశము లను కొనుఁడు. కావున నచ్చటి లంబాంశము ౯౦° అంశములలోనుండి ౭౦° అంశములుతీసివేయుగా మిగిలినవి ౨౦°అంశము లగును. సూర్యుఁడు విషువవృత్తమునకు నుత్తరపువైపు నెన్నఁడును ౨౩½° అంశములకంటె నెక్కుడుదూరము పోఁడు. కావున సూర్యుని యుత్తరక్రాంతి ౨౩½° అంశములకంటె తక్కువగను, ౨౦° అంశములకంటె నెక్కువగ నున్నంతవఱకు నాప్రదేశమునందు సూర్యుఁ డస్తమింపక వెలుఁగుచునే యుండును. అలాగుననే సూర్యుఁడు దక్షిణగోళార్థమునకు వెళ్లినతర్వాత నంతపరిమాణమేగలదీర్ఘరాత్రి యొకటి సంభవించును.

ఇంతవఱకు జేసిన వర్ణనసుఁబట్టి ధ్రువప్రదేశములందు గానవచ్చెడి యాకాశచమత్కారములను రెండుజతలుగా విభజింపవచ్చు నని చదువరు లూహించియుందురు. ఒకటి ధ్రువబిందు ప్రదేశమునకు సంబంధించినది. రెండవది మిగిలిన భూప్రదేశమునకు సంబంధించినది. వాని వివరము చదువరుల సౌకర్యార్థమై మఱల నిచ్చట సంగ్రహముగాఁ జెప్పుచున్నాను.

ధ్రువబిందుప్రదేశమందలి విశేషములు.

1. సూర్యుఁడు దక్షిణదిక్కున నుదయించును.

2. నక్షత్రములు ఉదయింపవు, అస్తమింపవు. ఎప్పుడును ఆకాశమందే యుండి క్షితిజమునకు సమాంతరముగ గుండ్రముగ ౨౪ గంటల కొక పర్యాయము ప్రదక్షిణము చేయుచుండును.

3. ఉత్తరధ్రువమునొద్ద ఉత్తర ఖగోళార్థమును, దక్షిణ ధ్రువమునొద్ద దక్షిణ ఖగోళార్ధకమును మాత్రము గానవచ్చుచుండును.

4. ఆరునెలలవఱకును అఖండమైన యొకపగలును తరువాత ఆఱునెలల వఱకును అఖండమైన రాత్రియునుండును.

5. సంవత్సరమున కొక్కసారిమాత్రము సూర్యోదయమును, నొక్కసారిమాత్రము సూర్యాస్తమయమును అయినను రెండుసంధ్యల యుషస్సుమాత్రము రెండేసి నెలలవఱకు ప్రకాశించును. ఈ సాంధ్యరాగము మనదేశమునందువలె ఉదయమున తూర్పునను, సాయంకాలమున పశ్చిమముననుమాత్రము కానరాక యాకాశముచుట్టు నంతను ౨౪ గంటల కొక్కసారి తిరుగుచుండును. సూర్యుఁడుకూడ నీల్లాగుననే ౨౪ గంటల కొకసారి గుండ్రముగా చుట్టివచ్చుచుండును.

## ధ్రువమండలమందలి విశేషములు.

1. సూర్యుఁ డెప్పుడును చూచువారి స్వస్తికమునకు దక్షిణమున నుండును కాని సమశీతోష్ణప్రదేశమునందును ఇట్లు కానవచ్చును. గావున నిదియొక విశేషము కాదు.

2. ఇచ్చట పెక్కునక్షత్రము లెప్పుడును అస్తమింపక ఆకాశమునందే యుండి ధ్రువునిచుట్టు తిరుగుచుండును. మరికొన్ని నక్షత్రములు సమశీతోష్ణ ప్రదేశములలో వలెనే ఉదయించును, అస్తమించును. కాని వానిమార్గము మాత్రము కొంచెము వంకరగా నుండును.

3. ఇచ్చటి సంవత్సరమును మూఁడువిధములుగ విభజింపవచ్చును. (అ) ఒక యఖండ దీర్ఘరాత్రి. ఇది మకరసంక్రమణకాలమునందు సంభవించును. ఇయ్యది ఆయాస్థలముల యక్షాంశములను (Latitudes) బట్టి ౨౪ గంటలకు హెచ్చుకాలమును ౬ నెలలకు తక్కువకాలమును పరిమితిగా గలిగియుండును. (ఆ) ఈదీర్ఘరాత్రికి ప్రతిగా నొకదీర్ఘదివస ముండును. అది కర్కాటసంక్రమణ సమయమున సంభవించును. (ఇ) దీర్ఘరాత్రమునకును, దీర్ఘదివసమునకును మధ్య కాలములందు అహోరాత్రములు గలసి ౨౪ గంటలు పరిమాణము గల దివసము లుండును.

4. దీర్ఘరాత్రములతరువాత వచ్చెడియుషస్సు పెక్కుదినము లుండదు. ఆదినముల పరిమితియు దాని తేజఃపరిమితియు ఆయాస్థలముల యక్షాంశములను బట్టి హెచ్చుతక్కువలుగా నుండును.

5. ధ్రువబిందు ప్రదేశమందు తిరిగినట్లే సూర్యుఁడు దీర్ఘదివసమునందు ఆకాశముచుట్టు తిరుగును. కాని క్షితిజమునకు సమాంతరముగాఁ దిరుగక కొంచెము వంకరగాఁ దిరుగును.*

---

* ఈవ్యాసము కేవలము భాషాంతరము, గాకపోయినను, లోకమాన్య తిలకుగారి ఆర్టిక్‌హోమ్ ఆఫ్ ది ఆర్యాస్, అను గ్రంథమందలి ౨ వ అధ్యాయము ననుసరించి వ్రాయఁబడినది.

# రాజరాజు కాలమునఁ దెలుఁగుదేశమందు సౌరమాన వ్యవహార ముండెనా ?

---

రాజరాజుచే నీయఁబడిన కోరుమిల్లి శాసనమునందు[1] నాతని పట్టాభిషేక మహూర్త మిట్లీయఁబడినది.

రౌరక్షితుం వసుమతీం శకవత్సరేషు
వేదాంబురాశినిధివర్తిషు సింహగేర్కే
కృష్ణ ద్వితీయ దివసోత్తరభాద్రికాయాం
వారేగురోర్వణిజి లగ్నవరేభిషిక్తః॥

అర్థము: [రాజరాజ నరేంద్రుఁడు] భూమిని రక్షించుటకునై శా. శ. ౯౪౪ వ సంవత్సరమున సూర్యుఁడు సింహరాశియందుండఁగా, బహుళ ద్వితీయా గురువారమునాఁడు, ఉత్తరాభాద్ర నక్షత్రమున, తులాలగ్నమునందు నభిషిక్తుఁ డయ్యెను.

ఇందు తిథివారాదు లన్నియుఁ గలవు కాని నెల పేరులేదు మన మెఱిఁగిన నెలల పేరెత్తుటయులేదు. అనఁగా నిప్పుడు మన దేశమునందు వాడుకలో నున్న చాంద్రమానపు చైత్రాది నెలలలో నేమాసమునందు నీరాజ్యాభిషేకము జరిగెనో యీ శ్లోకమునందుఁ జెప్పలేదు. అంత మాత్రమున నేమాసమును చెప్పలేదని యనుకొనఁ గూడదు. పట్టాభిషేక సమయమున సూర్యుఁడు సింహరాశియందుండెను. అనఁగా నప్పుడు 'సింహ' మాసము. ఇది సౌరమాసము. ఈ మాసము లిప్పటికిని అఱవ దేశమునందును, బంగాళమునందును నిత్య వ్యవహా

---

* రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక. పుట ౧౩౮.

1. Ind. Ant. Vol. xiv p. 53.

రమునఁ గలవు. ఇట్లు రాజరాజు సౌరమాసమును చెప్పుట అప్పుడు తెలుఁగు దేశమందు నీ మాసములే లోకవ్యవహారము నందుండుటవలననే యని మనము తలఁపవలెనా? లేదా అఱవవారితో సంబంధము కలుగుటవలన వారి యాచారమును అవలంబించెనా?

ఇట్లు సౌరమాసమును జెప్పినవాఁ డితఁ డొక్కఁడే కాఁడు. ఈతని తండ్రియైన విమలాదిత్యుఁడు తానిచ్చినరణస్థిపూండి శాసనము[1]నందును ఇట్లే చెప్పి యున్నాఁడు.

"అనలానల రంధ్రగతే శకవర్షే వృషభమాసి సితేపక్షే యష్ఠ్యాం గురుపుష్యే సింహాలగ్నే ప్రసిద్ధ మభిషిక్తః [౧౩]

అర్థము:—శా. శ. ౯౩౩ వ సంవత్సరమున వృషభమాసమునందు, శుద్ధ ౬ గురువారమునాఁడు పుష్యమి నక్షత్రమున, సింహాలగ్నమునందుఁ బ్రసిద్ధముగ నభిషిక్తుఁ డయ్యెను.

రాజనరేంద్రుఁడు పోయిన వెంటనే కులోత్తుంగునకు రాజ్యము లేకుండ హరింపవలయుననియో మఱియే హేతువుననో రాజ్యాభిషిక్తుఁడైన రెండవ శక్తివర్మ[2]–విమలాదిత్యుని కుమారుఁడు –కూడ నిట్లే సౌరమాసమునే ఉదాహరించినాఁడు:—

గుణవసునిధిసంఖ్యే యాతి శాకాబ్దవర్షే
దివసకృతి తులాస్థే యేధ్య(రా)జ్యలక్ష్మీం
స్థిరతర మనురాధా శుక్లపక్షే ద్వితీయో
యజసుర గురువారే కుంభలగ్నేభిషిక్తః॥

అర్థము:—శా. శ. ౯౮౩ వ సంవత్సరము గడచిన తరువాత సూర్యుఁడు తులారాశియందుండఁగా ఎక్కువ స్థిరమయిన అనూరాధానక్షత్రమున శుక్ల

---

1. Ep. Ind Vol. vi, p. 347.

2. మద్రాస్ ఎపిగ్రాఫి రిపోర్టు ౧౯౧౩-౧౪ లోని ౮ వ తామ్రశాసనము ౬౩-౬౫ పంక్తులు. ఈశాసన మింకను ప్రకటింపఁబడలేదు. ఇప్పుడు రాగిరేకులు నాయొద్ద నున్నవి. త్వరలోనే ప్రకటింపఁబడును.

పక్ష ద్వితీయా గురువారమునాఁడు కుంభలగ్నమందు నభిషిక్తుఁ డాయెను.

ఇట్లు రాజరాజు పూర్వరాజు, రాజరాజు, అతనికిఁ దరువాతిరాజు సౌరమాసమునే ఉదాహరించి యున్నారు. ఇంకను గొంత వెనుకకుఁబోయి చూచెదము.

మొదటి చాళుక్యభీముని శాసన మొకటి[1] నాయొద్ద నున్నది. అందు నాతని యభిషేకముహూర్త మిట్లు వర్ణింపఁబడినది.

"శాకేష్వబ్దేషు యాతేష్వథ మునువసుసంప్రాప్త సంఖ్యేషు మేషే
మిత్రే, చైత్రే చ మైత్రే శశిని, శశిదినే, కృష్ణపక్షే ద్వితీయే
యోగ్మత్రుః స్స్వోర్ద్ధమేధా త్సకలజనముదే పట్ట మాచంద్రతారం
శ్రీమాన్ చాళుక్య భీమ శ్చతురుదధిలస న్మేఖలేలాకలస్య."

అర్థము:— శా. శ. ౮౧౪ సంవత్సరములు గడచిన తరువాత సూర్యుఁడు మేషమం దుండఁగా చైత్రమున చంద్రుఁడు మిత్రానక్షత్రమం దుండ, కృష్ణపక్ష ద్వితీయా (విదియ) సోమవారమునాఁడు చాళుక్యభీముఁడు నాలుగు సముద్రము లొడ్డాణము గాఁగల భూమికిఁ బట్టము కట్టుకొనెను.

ఇందు సౌరమాసపు మేషమాసమని చెప్పుటయే గాక, "చైత్ర" మనియుఁ జెప్పంబడినది. కాని "చైత్ర" మనునది చాంద్రమాసమునకు వలెనే సౌర మాసమునకును పేరు. ఇచ్చట లెక్క వేసి చూడఁగా నిందు వర్ణింపఁబడిన గ్రహాది స్థితులు సౌర చైత్రమునకే చెల్లుచున్నవి; కాని చాంద్ర చైత్రమునకు చెల్లుట లేదు. ఇందును గురించి డాక్టరు స్వామి కణ్ణుపిళ్లెగా రిట్లు వ్రాసిరి.

"శకము ౮౧౪, చైత్ర బ॥ విదియ సోమవారము, మైత్రమిశ్రమున శా. శ. ౮౧౪ లో చైత్ర బ॥ ౨ మేషములోఁ బడలేదు; మీనమాసము ౨౬ వ తేదిని

1. ఎపిగ్రాఫి రిపోర్టు ౧౯౧౭-౧౮ లోని ౧౪-వ తామ్రశాసనము. ఇదియు నాయొద్దఁ గలదు. త్వరలోనే ప్రకటింపఁబడును. [ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక ౧౧-వ సంపుటములో ౨౮౧-వ పుటలో లక్ష్మణరావు పంతులుగారీశాసనమును బ్రకటించియున్నారు. సం.]

బడ్డది. ఆదినము ఆదివారము స్వాతి నక్షత్రము అయినది. కాని (చాంద్రమాసమున) వైశాఖ మాసమందు అనఁగా [సౌరమాస] మేష (చిత్తై)' మాసమందు[1] ౨౭ వ తేదీన మైత్ర (అనూరాధ) నక్షత్రము సోమవారము అగుచున్నది. (క్రీ. శ. ౮౬౨ ఏప్రిల్ ౧౭ సోమవారము.)"

దీనిని బట్టిచూడ నీశాసనమందలి నెలగూడ సౌరమేగాని చాంద్రము గాదని నిశ్చయమగు చున్నది. చాంద్రమానపు వైశాఖమాసము ప్రారంభమైన తరువాతఁ గూడ నఱవవారి చిత్తైనెల కొంతికాల ముండును.

పూర్వకాలపు చాళుక్యశాసనములలో నింకొకదానిలో రాజ్యాభిషేక ముహూర్త మీయఁబడినది. అది రెండవ అమ్మరాజునాఁటిది.

> గిరిరసవసు సంఖ్యాబ్దే శకసమయే మార్గశీర్షమాసేస్మిన్
> కృష్ణత్రయోదశిదినే భృగువారే మైత్రనక్షత్రే
> ధనుషిరవౌ ఘటలగ్నే ద్వాదశవర్షేఽతు జన్మనఃపట్టం॥

శా. శ. ౮౬౭ సంవత్సరమున మార్గశిరమాసమందు, కృష్ణపక్షత్రయో దశి శుక్రవారమునాఁడు మైత్ర (అనురాధా) నక్షత్రమున సూర్యుఁడు ధనుర్రాశిలో నుండగా కుంభలగ్నమందు పుట్టిన పన్రెండేండ్లవుఁ బట్టము కట్టుకొనెను.

ఇచ్చట సౌరమాన, చాంద్రమాన మాసముల పేళ్లు ముహూర్తపద్యమున నొక్కటియగుట తటస్థించినందున, మార్గశిరమాసము కవియొక్క యుద్దేశప్రకారము చాంద్రమా, సౌరమా అని నిర్ణయించుటకు వీలులేదు. ఎట్లయినను ఇందు సౌరమాసము ధనుర్మాసమని స్పష్టముగాఁ జెప్పఁబడినది. గనుక మార్గశిరము చాంద్రమనుకొన్నను అప్పుడు సౌరమానము నెలను తెల్పుట ఆవశ్యకమని తలంచు చుండిరనుట స్పష్టము.

1. Ep. Rep. (S. C.) 1918, p. 120

పై ఉదాహరణము లన్నిటిని పట్టి చూడఁగా చాళుక్యుల కాలమున తెలుఁగు దేశమునందు సౌరమాన ప్రభ యెక్కువగ నుండెనని మనము నిశ్చయింపవచ్చును ఇంతమాత్రమున చాంద్రమానము లేదనికాదు.

చాంద్రమానము అధికమాసము వేదకాలమునాటినుండి యున్నది. సౌరమాన మున్నచోటఁ జాంద్రమానము కూడ నుండును. అఱవదేశమునందు సౌరమాన ప్రభయున్నను చాంద్రమానము బొత్తిగా లేకపోలేదు. సూర్యమానవ్యాప్తి యెక్కువ. చాంద్రమాన వ్యాప్తి చాలతక్కువ, ఇంతియ. వ్యవహారమునందు నిప్పుడు తేదీల వాడినను శ్రాద్ధాది మతకృత్యములందు తిథులనే వాడెదరు. ఇట్లే పూర్వము తెలుఁగుదేశమునం దున్నట్టు తోఁచుచున్నది. సౌరమానము వ్యవహారమునం దుండి తెలుఁగుదేశమున నెప్పుడు పూర్తిగాఁ బోయినదో చరిత్రకారులు కనుగొందురు గాక.

ఈ రెండు మాసములకుఁ గల భేదము.

సౌరచాంద్రమాసముల భేదము తెలియని వారి నిమిత్తము కొద్దిలో నా భేదము తెల్పుచున్నాను. సౌరమాసమనఁగా సూర్యుని గమనమును బట్టి యేర్పడిన నెల. ఒక సంక్రాంతినుండి మఱియొక సంక్రాంతివఱకు దీని వ్యాప్తి యుండును. సూర్యుఁడొక రాసినుండి మఱియొక రాసిలోనికిఁ బోవుట సంక్రాంతి యనఁబడును. ఆకాశచక్రము ౧౨ రాసులుగా విభజింపబడినది. కనుక సూర్యుఁడొక్కొక్క రాసిలో నున్నకాల మొక నెలగా నెంచఁబడును. మేషములో నున్నకాలము మేషమాసము ఇత్యాది. ఈమాసములకు రాసులనుబట్టి ౧౨ పేళ్లేర్పడినవి. ఇదిగాక వీనికి చైత్రాది నామములును గలవు. మేషమాసమును చైత్రమనియు, వృషభమాసమును వైశాఖమనియు వ్యవహరింతురు. ఇట్లే ఇతరమాసములను గుఱించి యెఱుఁగునది; కావున మేషాది నామములు వచ్చినప్పు డవి సౌరమాసము లగుట నిశ్చయము. చైత్రాదినామములు వచ్చినప్పుడుమాత్రము సందర్భమును బట్టి సౌరమో, చాంద్రమో కనుఁగొనవలయును. ఇంగ్లీషుమాసములకు తేదులున్నట్టే అఱవ దేశమందు సౌరమాసములకు తేదులుండును. కొన్నిమాసములకు 3౦ దిన

ములును, కొన్నిటికి ౩౧ దినములును ఉండును. ఒకే నెలకు ఒకప్పుడు ౩౦ దినములును, మఱియొకప్పుడు ౩౨ దినములును వచ్చుట కలదు. ఈ తేదుల పద్ధతి ౧౦ వ శతాబ్దమునకు పూర్వము లేదు. తిథులు, నక్షత్రములను మాత్రము ఉదాహరించుచుండెరి.

చాంద్రమాసము చంద్రునిబట్టి యేర్పడినది. శుద్ధపాడ్యమి మొదలు అమావాస్యవఱకుఁగాని, బహుళ పాడ్యమి మొదలు పౌర్ణమివఱకు గాని దీనివ్యాప్తి. మనదేశమున ఈమానమే వ్యవహారమునఁగలదు. సౌరమాసము సంక్రాంతితోను, చాంద్రమాసము శుద్ధపాడ్యమితోను ప్రారంభమగును గాన ఏకనామము గల సౌర, చాంద్రమాసముల వ్యాప్తిలో భేదముండును. శుద్ధపాడ్యమినాఁడే ఎల్లప్పుడును సంక్రాంతి రాదుగదా? సాధారణముగ చాంద్రమాసము మొదట ప్రారంభమగును; ఆ మాసమునందే తరువాత నెప్పుడో ఆపేరు గల సౌరమాసము ప్రారంభమవును. ఈ వివరము తెలియుటకై రాజరాజ పట్టాభిషేకము నాఁటి సౌర, చాంద్రమాసములను గుఱించియు విచారింతము.

శా. శ. ౯౪౪ (క్రీ. శ. ౧౦౨౨) వ సంవత్సరమున సింహాసంక్రాంతి జూలై ౨౭ వ తేదీన అయినది. అనఁగా ఆనాఁటినుండి సౌరసింహా (లేక శ్రావణ) మాసము ప్రారంభ మగును. కాని ఆనాఁడు చాంద్రమాసము ననుసరించి శ్రావణ బహుళ ౧౧ అను తిథి అయియుండెను. ౩౧ వ జూలై దినమున చాంద్ర శ్రావణము పూర్తియయ్యెను. ౧ వ ఆగష్టు దినమున చాంద్ర భాద్రపదము ప్రారంభమయ్యెను. పట్టాభిషేకదినము చాంద్ర భాద్రపద బహుళ విదియ గురువారము. ఇంగ్లీషుపద్ధతిని ఆగష్టు నెల ౧౬ వ తేది యగును. సౌర సింహామాసము ౨౬ వ ఆగష్టు దినమున పూర్తిఆయెను. చాంద్ర భాద్రపదము ఆగష్టు ౩౦ వ తేదిన పూర్తి ఆయెను.

ఇఁక నిప్పుడు మనము ఉత్సవము చేయుచున్న శా. శ. ౧౮౪౪ సంవత్సరమును గుఱించి విచారింతము. ఈ యేఁడు సింహామాసము ఆగష్టు ౧౭ వ తేదీన ప్రారంభమైనది. సెప్టెంబరు ౧౬ వ తేదీన పూర్తియగును. చాంద్ర

మాసప్రకారం ఈ నెల శ్రావణ బ॥ ౯ నాఁడు ప్రారంభమై, భాద్రపద బ॥ ౧౦ తో పూర్తియగును. మనకుఁ గావలసిన బ॥ విదియ, ఉత్తరాభాద్రనక్షత్రము సెప్టెంబరు ౨ వ తేదీన అగును. ఆనాఁడు అఱవవారి లెక్క ప్రకారము ఆవణి నెల ౨౩ వ తేది. ఈ సౌరసింహ (శ్రావణ) మాసము ౩౧ దినములు కలవు. కనుకనిందు బహుళ ౯ లు రెండు, బహుళ ౧౦ లు రెండు (చాంద్ర శ్రావణ, భాద్రపద మాసములవి) కలవు. చాంద్రమాసము యొక్క వ్యాప్తి ౨౯½ దినములు మాత్రము: కావున ౩౧ దినములు గల సౌరమాసమునందు చాంద్ర తిథులు వచ్చినవే మఱల రావచ్చును.

---

# కర్మయోగము *

"తపస్స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని క్రియాయోగః".

—పాతంజలయోగదర్శనం, అ ౧. పా ౨. సూ ౧.

"ఈశ్వర ప్రణిధానం తస్మిన్ పరమగురౌ సర్వకర్మార్పణం, తత్ఫల సన్న్యాసో వా" —ఇతి యోగేవ్యాసః.

### కర్మకును మానవ స్వభావమునకును గల సంబంధము.

'చేయుట' యని యర్థముగల 'కృ' యను సంస్కృతధాతువునుండి 'కర్మ' మను శబ్దము పుట్టినది. మనముచేసెడిపనులన్నియుఁ గర్మములే. కర్మముయొక్క పరిణామ మనఁగాఁ బూర్వ సంచితము, లేక ప్రారబ్ధము అని యీ కర్మశబ్దము నకు నొకపారిభాషికార్థము కలదు. అధ్యాత్మశాస్త్రమునం దొకప్పు డీశబ్దము నకుఁ గృతకర్మముయొక్క కారణమని యర్థము కలుగును. కాని 'కర్మయోగము' నం దీపదము వ్యాపారము-క్రియ-చేయుట-యను సర్వసాధారణమైన యర్థము ననే వాడఁబడును. సత్యజ్ఞానమును సంపాదించుకొనుటయేసకల మానవజాతి యొక్క యితికర్తవ్యత (పరమోద్దేశము). ఈ యత్యుత్కృష్టమైన సిద్ధాంత మునె పౌర్వాత్య (తూర్పు సంబంధమైన) యధ్యాత్మశాస్త్ర మనఁగా మన హిందూ వేదాంతశాస్త్రము మనకు నుపదేశించుచున్నది. సుఖము మానవుని యితికర్తవ్యత (పరిశ్రమ పూర్వకముగా సంపాదింప వలసినదియని యర్థము) కాదు. జ్ఞానమె నిజమైన యితికర్తవ్యత. సుఖవిలాసంబులకు వినాశము గలదు. సంపాదింపవలసినవానిలో సుఖమే యతిశ్రేష్ఠమైన దని తలంచుట తప్పు. సుఖమే సర్వోత్కృష్టమైన వస్తువనియు, దానిని సంపాదించుటకై పాటుపడ వలయుననియు మానవులకుగల వెఱ్ఱిభ్రమయే జగత్తులోని సకలదుఃఖములకు

* అముద్రితము.

మూలమైయున్నది. కొన్నిదినములకు సుఖముకొఱకై యత్నించుటచే నిజమైన సుఖము కలుగ నేరదనియు, జ్ఞానమార్గములోనే నిజమైన సుఖమున్నదనియు, సుఖదుఃఖములు రెండును మనకు మార్గదర్శకములనియు నరునకుఁ దెలియును. మేలువలనఁ గలిగినట్టులనె కీడువలనఁగూడ సత్యజ్ఞానము కలుగును. కడచిన సుఖదుఃఖంబు లాత్మపైఁ జేసిన భిన్నభిన్న సంస్కారంబు లా సుఖదుఃఖంబుల ప్రతిబింబంబులపగిది నాత్మపైఁ బ్రకాశించు. ఈ భిన్నభిన్న ప్రతిబింబంబుల (సంస్కారంబు) యేకీకరణము (కూడుట) నే మానవునియొక్క స్వభావము లేక శీలమని యందురు. ఏనరుని 'వర్తనము' (స్వభావము)ను గుఱించి విచారించినను నందు మనఃప్రవృత్తియొక్క యేకీకరణమును, మనోవికారముల సమ్మేళనమును గాన్పించును. మానవుని స్వభావము నిర్మించుటయందు సుఖదుఃఖములు రెండును బనిచేయును. మనస్స్వభావము లేక ప్రవర్తనమునకు మంచి, చెరుపులు సమానశక్తుల మార్గదర్శకములైనను కొన్ని యుదాహరణములలో మేలుకంటెఁ గీడువలననే యధిక సద్బోధ కలుగును. జగత్తులో నిదివఱకు గతించిన గొప్పగొప్ప పురుషుల చరిత్రల శోధించి చూడఁగా, వారిలో ననేకులు సుఖానుభవముకంటె దుఃఖానుభవమువలననే సుజ్ఞాను లయిరనియు, సంపత్తికంటె విపత్తిచేతనే యధిక దుర్గుణవిముక్తు లయిరనియు, స్తుతులచేఁ గాక నిందాప్రహారములచేతనే వారి ప్రభాప్రకాశ మధికముగా వెలువడెననియుఁ దెలుచున్నది.

మఱియు మనుష్యమాత్రుల యందు జ్ఞానము స్వయంభువుగా (తనంతట దానే పుట్టునది) నుండును. ఏజ్ఞానమును మనకు బాహ్యసృష్టివలనఁ గలుఁగదు; జ్ఞానము మన యంతరాత్మలోనే యుండును. 'నరుఁడు గుర్తెఱుఁగును', 'మానవుఁడు తెలిసికొనును', 'నరుఁడు కనుఁగొనును' అనిన వాక్యములకు మానసశాస్త్రము ననుసరించి యర్థము చేసినయెడల 'అంతర్జ్ఞానమును వెలిపుచ్చు', 'బయలుపఱచు' ననియును 'నేర్చుకొనుట' లేక 'జ్ఞానసంపాదన' మనఁగా నగాధజ్ఞానమయమైన యాత్మమీఁది యాచ్ఛాదనమును దీసి, యాజ్ఞానమును

బయలుపఱచుటయే. న్యూటన్ దొర క్రొత్తగా గురుత్వాకర్షణమును (Gravitation) గనిపెట్టెనని చెప్పుదురు. ఆయాకర్షణ మదివఱకు నొక మూలఁ గూర్చుండి దొరగారి రాకకు నెదురు చూచుచుండెనా యేమి? లేదు. అది యతనిమనస్సులోనే యుండెను. సంధి దొరకినతోడనే వెలువడిన దింతియు. జగత్తులోని జ్ఞానమంతయు మనస్సువలననే కలుగును. బ్రహ్మాండము లోని యనంతజ్ఞానభాండారము మనమానసమునందు నిండియున్నది. బాహ్య ప్రపంచము కేవలము సూచన (లేక నిమిత్తతుల్యము). ఇది మనలను, మనఃపరి శీలనమునకు మాత్రము ప్రేరేపించును. కానిపరిశీలనము (అభ్యాసనము) యొక్క విషయము (Subject) మాత్రము మనమునందే యుండును. చెట్టు నుండి పండు పడుటవలన న్యూటనుకు ప్రేరణకలిగె; అందుపై నతఁడు తన మనసులో గొలుసువలె నొకదానితో నొకటి సంబంధముకలిగి యెడతెగక యుండు కల్పనా పరంపరల నన్నిటిని బరిశోధించి చూచెను. ఆ గొలుసులో నతనికి నొక క్రొత్త కడియము గానవచ్చెను. దానినే మనము 'గురుత్వాకర్షణ నియమ' మనియెదము. ఆ నియమ మాపడినఫలములో లేక యుండెను; పృథ్వియొక్క గర్భములో లేక యుండెను; మఱియెందున లేక యుండెను; (న్యూటన్ యొక్క మనస్సులోనే యుండెను). ఐహిక, పారలౌకిక జ్ఞానమంతయు మానవుని యంతరాత్మ యందుండును. అందుపై నావరణ ముండినందున ననేకపర్యాయము లది వెలువడక యచ్చటనే యడఁగియుండును. జ్ఞానము పైనున్న యీయాచ్ఛాదనమును దన్నతిన్నగాఁ దొలగించుటయే మనము జ్ఞానార్జనము చేయుచున్నా మనుట. ఈ యాచ్ఛాదనమెట్లెట్లు తొలఁగుచుండునో మన మట్లట్లు అధికాధికజ్ఞాన సంపన్నుల మగుదుము. ఎవరి యంతఃకరణము మీఁది యీ పటలము దొలఁగునో వాఁడు జ్ఞాని: అట్లుఁ దొలఁగక, యెవని యంతఃకరణముపై నీపటలము గట్టిగా నిలిచియుండునో వాఁడు అజ్ఞాని. ఈ యావరణమును బూర్ణముగఁ దీసివేసినవాఁడు పూర్ణజ్ఞాని లేక సర్వజ్ఞుఁడు. నేఁటి వఱకు ననేకసర్వజ్ఞు లయి పోయిరనియు, నింకను గానున్నారనియు

నా యభిప్రాయము. ఈ కాలచక్రమున నిట్టివారు లక్షలకొలఁది బుట్టెదరు. పలుగురాతిలోని యగ్నివలె జ్ఞానము మనస్సునందు నిగూఢముగ నుండును. ఈ జ్ఞానాగ్నియొక్క మిణుఁగురులు బహిఃప్రపంచములోని సూచనలనెడి ఘర్షణ (రాయిడి) వలన వెలువడును. మన సకల మనోవికారముల యొక్కయు, మనము చేయు నన్ని పనుల యొక్కయు స్థితియిట్టిదే. మనము శాంతచిత్తులమై విచారించి చూచిన యెడల మన యానందాశ్రువులు, మన సుఖదుఃఖములు, మన హాస్యరోదనములు, మన శాపాశీర్వాదములు, మనస్తుతి నిందలు బాహ్య ప్రపంచము యొక్క ప్రేరణచే, నాఘాతముచే మన మనస్సులో నుండియే పుట్టినవని స్పష్టముగాఁ గానవచ్చును. ఇప్పటి మనస్థితి యంతయు నీయాఘాతము యొక్క పరిణామమే. ఈ యన్నియాఘాతముల సముచ్చయమే (కూడికయే) కర్మ - కార్యము - అనఁబడును. ఆత్మయొక్క తేజము ప్రకటమై, యందుచేఁ దత్ప్రభావజ్ఞానంబులు వెల్లడియగుటకు నాత్మపై బహిఃసృష్టిచేఁ జేయఁబడి, శారీరక, మానసిక ప్రహారములలోఁ బ్రతియాఘాతమును వ్యాపకార్థమునందుఁ గర్మయని చెప్పవచ్చును. ఇందుచే మనము జన్మమంతయుఁ గర్మ చేయుచుందుమని చెప్పవలసియున్నది. నే నిప్పుడు మీతో ముచ్చటించుట కర్మయె; మీరు వినుచుండుట కర్మయే; శ్వాసోచ్ఛ్వాసము చేయుట నడచుట, మాటలాడుట మొదలైన వన్నియుఁ గర్మలే. మనము శరీరముచేతఁగాని మనస్సుచేతఁగాని చేయునదియంతయుఁ గర్మయే. ఈకర్మ మనమనస్సుపై శాశ్వతమైన సంస్కారముఁ జేయును.

కొన్ని కర్మలు చిన్న చిన్న యనేకకర్మలయొక్క సముదాయరూపమై యుండును. మనము సముద్రపు టొడ్డున నిలుచుండి చూచిన గొప్పగొప్ప యలలు ప్రచండనాదము చేయుచు నిసుకపైఁ గూలుట కాన్పించును. ఐనను లక్షల కొలఁది చిన్నచిన్నయలలు కూడి కాని పెద్దయలకాలేదని మనకుఁ దెలిసిన విషయమే. ఆయలలలోఁ బ్రతియలయు శబ్దము చేయుచుండును గాని యాశబ్దములు మనకు వేర్వేరుగా వినఁబడవు. ఈచిన్నశబ్దంబులన్నియుఁ గూడి ఘన

నాదమైనప్పుడు మనకు వినఁబడును. ఇట్టులనే యతిసూక్ష్మములైన హృదయ నాదములవలననే ప్రచండమైనకర్మ సముదాయమగును. అనేకకర్మలు మనకు స్పర్శమువలన వెంటనే తెలియును. కొన్నిటి ఫలములు స్పష్టముగాఁ గాన్పించును. కాని యివియన్నియుఁ జిన్నచిన్న కర్మలుకూడి యైనవియే (స్వతంత్ర కర్మలుకావు). మానవునియొక్క నిజమైన యాచరణము నెఱుఁగవలయుననిన నాతనిచేఁ జేయఁబడిన మహాత్కృత్యములను జూచిన లాభము లేదు. ప్రాణము మీఁదికి వచ్చినప్పుడు పిఱికి బంటుకూడ శూరుఁడు కావచ్చును. గాన మనుష్యుని సాధారణములైన నిత్యకృత్యములనే చూడవలయును. ఇటులఁ జేసిన నతని నిజమైన ప్రవర్తనము మీరెఱుంగఁగలరు. గొప్పప్రసంగములు వచ్చినప్పుడు అతిక్షుద్రమానవుల మనోవృత్తియు నత్యుచ్చపదమును సంపాదించుటకై యుద్దీపితయగును. గాన యెల్లప్పుడు నెవనియాచరణము శ్రేష్ఠమైనదిగ నుండునో వాఁడే శ్రేష్ఠుఁడు.

కర్మయొక ప్రచండశక్తియొయ్యన మన ప్రవర్తనపైఁ బరిణమించును. మానవుఁ డొక కేంద్రము లేక మధ్యబిందువు. ఇది బ్రహ్మాండములోని సకల శక్తులను దనవైపున కాకర్షించుకొనును. ఈ శక్తులన్నియు నా కేంద్రమునందు నేకీభవించి యచ్చటినుండి మఱల నొక ప్రచండ ప్రవాహరూపమున నిర్గమించును. ఇటుల సకల బ్రహ్మాండమునకుఁ గేంద్రమువలె నుండువాఁడే నిజమైన మానవుఁడు; వాఁడే సర్వశక్తిమంతుఁడు; వాఁడే సర్వజ్ఞుఁడు; వాఁడే సర్వ బ్రహ్మాండము నాకర్షించువాఁడు. కీడు మేలు, సుఖము దుఃఖము మొదలైన వన్నియు వానియొద్దకె పోయి వానినె యాశ్రయించును. వీనియన్నిటివలన ప్రవర్తన రూపమైన యొక ప్రచండప్రవాహమును నిర్మించి దానినీవల వదలును. ప్రతిశక్తిని నాకర్షించు సామర్థ్యమువలెనే, కార్యసిద్ధికై యావశ్యకమైనయెడల దేనినైనను దూరముగఁ బరిత్యజించు సామర్థ్యమును నాతనికిఁ గలదు.

జగత్తులో మనము చూచెడి కృత్యములన్నియు, మానవ సంఘమునందు జరుగు వ్యాపారములన్నియు, మనచుట్టు గానఁబడు కార్యములన్నియుఁ గేవ

లము మానవుని విచారశక్తియొక్క భౌతిక స్వరూపములును (ప్రతిబింబములు), మానవేచ్ఛయొక్క ప్రతిమలును అయియున్నవి. భౌతికయంత్రములు, శస్త్రాస్త్రములు, పట్టణములు, పడవలు, యుద్ధనౌకలు-మొదలయినవానిలోఁ బ్రతిదియు మానవుని యిచ్ఛాశక్తిచేఁ బుట్టినందున నాయిచ్ఛాకర్తృత్వముయొక్క వ్యక్తస్వరూపమైయున్నది. ఇచ్ఛకుఁ గారణము స్వభావము (ప్రకృతి); స్వభావమునకుఁ గారణము కర్మ. ఇచ్ఛయొక్క యావిష్కరణ మనఁగా బాహ్యస్వరూపము కర్మను అనుసరించియుండు. ప్రబలమైన యిచ్ఛాశక్తిగల లోకకళ్యాణాభిలాషు లనేకు లిదివఱకు జగత్తులో నయిపోయిరి. వారమితముగాఁ గర్మాచరణముఁ జేయుచుండిరి. వీరు శరీరబలమునందు భీమునివంటివారు; వీరి ప్రబలమైన యిచ్ఛాశక్తి ముల్లోకములను దల్లకిందులు చేయునంత సామర్థ్యము గలది. ఇట్టి యిచ్ఛాశక్తి వారికి నెన్నియో యుగములు పరిశ్రమ చేసినందున ప్రాప్తమైనవి. బుద్ధ క్రైస్తవులకుఁ గలిగినట్టి లోకోత్తరమైన యిచ్ఛాశక్తి యొక జన్మమునందలికర్మవలననే కలుగునని చెప్పుటకు వీలులేదు. ఏలయున వారి తండ్రు లెవరో మనకుఁ దెలియును. వారితండ్రులు మానవజాతియొక్క మేలును (కళ్యాణమును) గురించి యొకమాటయైనను నుచ్ఛరించినటుల నెవ్వరును నెఱుంగరు. 'జోసెఫ్'వంటి వడ్రంగులనేకులు పూర్వమైపోయిరి. అనేకు లిప్పు డున్నారు. బుద్ధునితండ్రివంటి క్షుద్రరాజు లెందఱో యైపోయిరి. వంశమును గురించివచ్చిన సంస్కారమున, నేఁడే యెవనియాజ్ఞ పాలింపుచుండిరో లేదోయని సంశయింపవలసియున్న క్షుద్రరాజు గర్భమున సర్వజగత్తు ఎవనిని వంద్యునిగా భావించునో యట్టికుమారుఁడు గల్గుటెట్లు? అసంఖ్య లోకులచేఁ బరమేశ్వరునివలెఁ బూజింపఁబడు లోకోత్తముఁడైన క్రైస్తవునకును నతని తండ్రికిని గల మహదంతరంబునకు సమాధానమేమి? గాన దీనిని వంశజన్య గుణమని చెప్పుటకు వీలులేదు. బుద్ధక్రైస్తవు లీ జగత్తునందు వ్యాపింపఁ జేసిన ప్రబలమైన యిచ్ఛాశక్తి వారికి నెక్కడినుండి ప్రాప్తమయ్యెను? ఈశక్తి సంచయమునకు నుత్పత్తిస్థానమెద్ది? ఇది యనేకయుగములనుండి తిన్నతిన్న

గాఁ గూడుచువచ్చి, ప్రచండ మైనదియై, బుద్ధ, క్రైస్తవ రూపములతో సమాజము (సంఘము) స్థాపింపఁబడెను. దీనిప్రభావము నేఁటివఱకును స్థిరముగా నున్నది.

ఇది యంతయుఁ గర్మఫలము. యత్నముచేసి సంపాదింపక యెవరికిని నేమియు దొరకనేరదు. ఇది సనాతనమును, శాశ్వతమునునైన సిద్ధాంతము. ఈ సిద్ధాంత మసత్యమైనది యని మనకుఁ గొన్ని యెడలఁ దోఁచును. కాని దీర్ఘానుభవముచే నీ సిద్ధాంతమే నిజమైనది యని నిశ్చయముగా, మనసుకుఁ దోఁచఁగలదు. ఒకానొకఁడు తాను ధనవంతుఁడను కావలయు ననీ జన్మమంతయు యత్నించుచుండును. అనేక జనులను మోసపుచ్చును. కాని తుదకు వానికిఁ దాను ధనవంతుఁడు అగుటకుఁ బాత్రుఁడు కాఁడనియు (అనగాఁ దాను ధనవంతుఁడు కాఁజాలఁడనియుఁ), దన జన్మమంతయు నిరుపయోగ ప్రయత్నములందును, వ్యర్థోపాధులయందునుఁ (మోసము) బోయెననియుఁ దెలిసి వచ్చును. మనము మన శారీరక భోగములకొఱకు నెన్ని పదార్థములను సంగ్రహించినను వానిలో మనచే నుపయోగింపబడిన (ఉపభుక్తము లయిన) పదార్థములు మాత్రము మనవి. ఒకానొక మూర్ఖశిరోమణి భూమిలో నుండు పుస్తకము లన్నియుఁగొని తనపుస్తకభాండాగారములో నుంచినను, నందు నే గ్రంథము చదువుటకు వానికి యోగ్యతకలదో వానినే చదువును. ఇట్టి పాత్రత కర్మఫలఁ గలుగుచున్నది. మనయోగ్యతయు, నే పదార్థములను స్వాధీనపఱచుకొనుటకు సమర్థులమైనదియుఁ గర్మవలననే నిర్ణయింపఁబడును. మన కిప్పుడు ప్రాప్తించినస్థితికి నుత్తరవాదులము మనమే. (ఈస్థితి మనకర్మ 'క్రియ' వలననే కలిగినదియని నాతాత్పర్యము). ముందు నేస్థితికిఁ బోవలయు ననిన నాస్థితికిఁ బోవునంత సామర్థ్యము మనకుఁ గలదు. ఈజన్మ మనకుఁ బూర్వకర్మ వలనఁ బ్రాప్తమైనది. ఇఁకముందు మనకుఁ గావలయునని మనము కోరెడి స్థితి యిప్పటి కర్మలకు ఫలము కావచ్చును. గానఁ గర్మ ననుసరించు విధమును గనుఁగొనుట మనకర్తవ్యము. "ప్రతిమనుష్యుఁడు ఏదో యొకతీరునఁ గర్మ (చేయుం) చున్నాఁడు గానఁ గర్మ ననుష్ఠించు విధము బాగుగాఁ గనుఁగొనుటవలన

లాభమేమి" యని మీరడుగవచ్చును. కాని యిట్టుల విధిం దెలియక కర్మానుష్ఠానముం జేసినందున మిగుల మానసిక శక్తి తక్కువగును. భగవద్గీతయందుం గర్మశాస్త్రమును బ్రతిపాదించునపుడు "కర్మ నిర్మలాంతఃకరణముతోను, సశాస్త్రముగను జేయవలయును" అని చెప్పియున్నది. కర్మచేయు విధము నెఱింగి, కర్మచేసిన యెడల దానివలన నత్యంతోత్తమఫలము ప్రాప్తించును. అజ్ఞానరూపమైన గాఢనిద్రలో నున్న యాత్మను మేల్కొలుపుట యనంగా మనస్సులో నిగూఢముగా నున్న జ్ఞానశక్తిని వెలువరించుటయే సర్వ కర్మాచరణము యొక్క మూలోద్దేశమని మనము మఱువంగూడదు. ప్రతి మానవుని యంతఃకరణమునందును ఈ శక్తియు (సామర్థ్యము), జ్ఞానమును నుండును. మనముచేయు కర్మలన్నియు ఈ జ్ఞానరూపుఁడైన ప్రచండపురుషుని మేలుకొలిపి, యీవలకుం దెచ్చుటకై చేయు ప్రహారంబులేయని చెప్పవలయును.

మానవు లనేకోద్దేశములతోం గర్మచేయుదురు. ఉద్దేశములేక కర్మ జరుగనేరదు. కొందఱు కీర్తిలోలురయి, తన్నిమిత్తము కర్మ చేయుదురు. కొందఱు ధనేచ్ఛగలవారై యందుకు గర్మ ననుష్ఠించెదరు. కొందఱు స్వర్గకాములై స్వర్గప్రాప్తికై యత్నించెదరు. కొందఱు అధికారమునకై ప్రయత్నించెదరు. చైనా దేశస్థులవలెం గొందఱు తాము గతించినపిదపం దమకుం గీర్తి కావలయునని కోరెదరు. చీనాదేశమున నెవరికిని మృతి చెందువఱకు బిరుదులు దొరకవు. మృతిం జెందిన పిదప దొరకును. మనపద్ధతికంటె నీపద్ధతియే మేలయినది. చీనాదేశమునందు నెవఁడైన సత్కృత్యముం జేసినయెడల మృతుండైనవాని తండ్రికో, లేక తాతకో సన్మానసూచకములైన బిరుదులు దొరకును. ఇందుకుంగూడం గొందఱు కర్మచేయుచుందురు. మహమ్మదీయపంథలోని యొకానొక శాఖవారు తాము మృతులైనయెడలం దమకుం గట్టంబడు గోరీలు వీలయినంతవఱకు నధికాధిక విశాలముగా నుండుటకు యత్నింతురు. బాలుఁడు జన్మించినతోడనే వాని సమాధినిర్మించు పంథయొకటినే నెఱుంగుదును. ఇతర సమాధులకంటెం బెద్దదియు, విశాలమైనదియునగు సమాధి నిర్మించుటయే పుర

ష్టార్థమని వారి తాత్పర్యము. వారిలో మనుష్యుని గొప్పతనము సమాధియొక్క గొప్పతనమువలననే నిర్ణయింపఁబడును. కొందరు పుణ్యమునకై మంచికృత్యములఁ జేసెదరు. వీరు మొదట సాధారణముగా నీచకృత్యము లనేకములుచేసి పిదప నొకగుడి కట్టెదరు; లేక ధర్మగురువులకుఁ గొంతధనము దానముచేసి స్వర్గమునకుఁబోవుటకు ననుజ్ఞాపత్రమును గొందురు. ఇట్టి పరోప(కార) కార్యములచేఁ బూర్వముచేసిన పాపములన్నియుఁ బాయుననియు, ఆ పాపములకై తాము శిక్షననుభవింప నక్కఱలేదనియు నా రనుకొనియెదరు. ఇట్లు కర్మయొక్క యుద్దేశము లనేకము లుండును.

కర్మకొఱకే కర్మచేయవలయును (అనఁగా కర్మచేయుట ఫలముకొఱకు గాదని తలఁచి ఫలాపేక్షలేక కర్మచేయుటయే కర్తవ్యమని కర్మానుష్ఠానము చేయుకలయును). జీవనమునకు లవణ మత్యంతావశ్యకమైనటుల దేశక్షేమమునకు నత్యంతావశ్యకులగు సజ్జనులు ప్రతిదేశమునందును గర్మానుష్ఠానమే పరమార్థమని(కర్తవ్యమని)నిష్కామకర్మ ననుష్ఠించెదరు. వాంఛ్రము కీర్తిని, స్వర్గమును లక్ష్యపెట్టరు. మంచిఫలమే కలుగునని తలఁచి కర్మ ననుష్ఠించెదరు. మఱి కొందఱు ఇంతకంటె నున్నతవిచారములు కలవారయి బీదలకు హితమును, మనుష్యజాతికి సహాయమును జేయుదురు. ఏలయనఁ బరోపకారమే సత్కార్యమని దృఢవిశ్వాసము కలవారగాన సత్కార్యములయందే ప్రీతిఁగలవారై యుందురు. ఇఁకఁ గర్మప్రేరకములైన పేరుప్రతిష్ఠలను, హేతువులను గుఱించివిచారించెదము. పేరుప్రతిష్ఠలకు యత్నించెడివారికి నా ఫలములు తత్కాలమునందే యరుదుగా దొరకును. మనము కార్యములుచేసి చేసి ముసలివారమై మరణాసన్నులమైనపుడు మనకుఁ బేరు ప్రతిష్ఠలు ప్రాప్తించును. ఇది సాధారణ నియమము. నేను జన్మమంతయుఁ గీర్తికొఱకుఁ గొట్టుకొనినయెడలఁ దుదకు నాకు రవ్వంత ప్రాప్త మగును. ఆయుష్యమంతయుఁ బేరు సంపాదింపవలయునని వ్యాయపడిచిన యెడల నంత్యమున నది కొంచెము సాధ్యమయినటుల భాసిల్లును. ఐహిక పదార్థములకు సంబంధించిన యిచ్ఛలన్నియు, నిటులనే దీర్ఘకాలమునకుఁ

గాని సిద్ధింపవు. సిద్ధించినను నవి యంతటితోనే యాగిపోవును. కాని యొకా
నొకఁడు స్వార్థబుద్ధిని ద్యజించి కర్మ చేసినయెడల వానిస్థితి యేమియగును?
వాని కేమియుఁ బ్రాప్తము కాదా? వానికి నన్నియుఁ బ్రాప్తమగును. స్వార్థ
త్యాగముయొక్క ఫలము అన్నిటికంటెను నధికమైనది. నిరపేక్షబుద్ధితో
వర్తించునంత ధైర్యము లోకుల కుండదు. స్వార్థత్యాగమువలన నైహికలాభ
మును మిగులఁ గలదు. భక్తి, సత్యము, స్వార్థత్యాగము అను నీసద్గుణములు
నీతినిగురించి ప్రౌఢతతో మాటలాడుటకై నిర్మించిన యర్థరహితములైన పద
ములు కావు. వీనివలననే మనయంతఃకరణ మత్యంతప్రగల్భతను జెందును.
వానిలో నెట్టిసామర్థ్యము మూర్తిమంతముగా నుండును. ఇంతయేల? ఎవఁడైన
స్వార్థహేతువుల నన్నిటిని దూరముగా విడిచినవాఁడై, రాఁబోవుసంగతుల
నెంతమాత్రమును విచారింపక స్వర్గ, నరకా(దుఃఖా)దులను లక్ష్యపెట్టక
యైదురోజులు - లేక యైదునిమిషము లయినను - నిష్కామకర్మ చేయఁగలిగె
నేని వానియందు నీతియొక్క ప్రచండ విగ్రహమగు సామర్థ్యము (యోగ్యత)
ఉన్నదని చెప్పవచ్చును. ఇట్లు చేయుట బహు దుస్తరము. ఐనను ఇట్లుచేసి
నందువలనఁ గలుగు మేలుయొక్క మాహాత్మ్యము మనయంతరాత్మకుఁ జక్కగాఁ
దెలియును. ఈయాత్మసంయమనము నిరోధకశక్తులలో నత్యంతప్రచండ
శక్తియొక్క యావిష్కరణము. నాలుగు గుఱ్ఱములరథమును బర్వతమునైనుండి
విడిచినయెడల నది యాగక క్రిందికైనఁ బోవును. లేక సారథి గుఱ్ఱములను దన
సామర్థ్యమున నాపి క్రిందికిఁ బోకుండఁజేయును. ఈ రెండుశక్తులలో నేది
గొప్పది? క్రిందికిఁబోనిచ్చునదియా? లేక పైననిలిపియుంచునదియా? పైకి నెగుర
వేయఁబడిన కందుకము (బంతి) ఆకాశమునఁ గొంత దవ్వరిగి క్రిందఁ
బడును. రెండవ కందుక మెగిరి గోడమీఁదఁబడిన దానిగతికి నిరోధము గలిగి
యుండుటచే నచ్చట నుష్ణ ముత్పన్న మగును. ఇటులనే యీ యైహికప్రే
రణ లన్నియు స్వార్థబుద్ధి ననుసరించి, శీఘ్రముగనో, యాలస్యముగనో లయమై
పోయి మఱల మనకుఁ బ్రాప్తింపవు. కాని యాత్మనిగ్రహము చేసిన యెడల

మాత్రము అంతశ్శక్తి (సామర్థ్యము) వికాసమును బొందును. ఇట్టి నిగ్రహము చేతనే యఖండమైన యిచ్ఛాశక్తి ప్రాదుర్భవించును; ఇట్టి నిగ్రహముచేత నే బుద్ధ క్రైస్తవులు పుట్టుదురు. ఈ గూఢా (ర్థ) ము (రహస్యము) మూర్ఖులకుఁ దెలియదు. ఐనను మనుష్యజాతిని దమయాజ్ఞలో నుంచుకొన నిచ్ఛించెదరు. ఓపికతోఁ బ్రయత్నముచేసినయెడల సకల జగత్తుపై మన యధికారము చెల్లించుకొనఁగల మనితత్త్వము వారికిఁ దెలియదు. కొన్నిసంవత్సరము లోపిక పట్టి, యధికారము చేయవలయు ననినమూర్ఖపు ఇచ్ఛను నిరోధించి, యీ యిచ్ఛను సంపూర్ణముగ నశింపఁజేసిన మీ యిచ్ఛాశక్తి ప్రబలమై బ్రహ్మాండము నంతను స్వాధీనపఱచుకొని దానిపై నధికారము చేయును. అల్ప ధనము సంపాదించుటకై జనులు మహాప్రయాసపడుచుందురు. అందుకై వారు సజాతీయులను మోసపుచ్చుటకును సంశయింపరు. ఇట్టివారు కొన్ని సంవత్సరములు ఆత్మనిగ్రహముచేయుదురేని వారి స్వభావము పనిఁబడినయెడల లక్షలకొలఁది ధనము తెచ్చియిచ్చునంత సామర్థ్యముకలది యగును. కాని దీర్ఘదృష్టిలేని మృగములవలె మన మందఱము కొన్ని సంవత్సరములకంటె నధికకాలమును గుఱించి యాలోచనచేయము (దూర దృష్టి లేని వారమై సద్యఃఫలమునే చూతుము). ఈ మనజగత్తు ఒకవర్తులము (చుట్టు గీసినగీటు). (ఈ వర్తులముకంటె నావల చూచుధైర్యము మ(న)కు లేదు. కను కనే మనము నీతిభ్రష్టులమును, దుష్టులమును నగుచున్నాము. ఇదియే మ(న)కుఁ గల వ్యంగము (వంక). ఇదియే మ(న)కుఁ గల దౌర్బల్యము.

అత్యంతక్షుల్లక మైన కర్మనుగూడ తిరస్కరింపఁగూడదు. విశేష జ్ఞానములేనివానిని గీర్తికొఱకో, పేరుకొఱకో, లేక యితర స్వార్థము కొఱకో కర్మచేయనిండు. కాని కర్మచేయుటకు నున్నతములయిన హేతువు లెవ్వియో వానిఁ దెలిసికొని, వాని ప్రకారమే మనస్సును బ్రవర్తింపఁ జేయుట ప్రతిమానవుని కర్తవ్యము. కర్మాచరణము చేయుటకు మన మధికారులమే కాని దానిఫలమునకు నధికారులముకాము. కర్మఫలము లేక పరిణామ

మేమైనఁగానిండు. ఫలచింత మీకెందుకు? ఒకనికి సహాయము చేయఁ దలఁచి నపుడు వాఁడు మనను ముందిట్లిట్లు గౌరవింపవలయు నని యోజించుట యనావశ్యకము. ఫల మేమగునో తెలిసికొనవలయు ననియు, లేక యా ఫలము యొక్క గుణావగుణములను బరీక్షింపవలయు ననియుఁ జింతింపఁగూడదు. ఘనమైన సత్కార్యము చేయఁదలఁచినయెడల దానిపరిణామ మేమగునో యని కనుఁగొనుటకు నిసుమంతయైన ప్రయత్నము చేయవలదు.

నిష్కామకర్మ మను నీకర్మచేసెడి యుత్తమపద్ధతిని గురించి యిం కొక కఠినమైన ప్రశ్న యుత్పన్న మగుచున్నది. మనశరీరమునందు నత్యంత చప లత యుండవలెను. మన మెప్పుడు కర్మచేయుచుండవలెను. కర్మచేయకుండ మన మొక నిమిషమైన బ్రతుకఁజాలము--అని చెప్పితిరి. ఇట్లయిన మనకు నిజమైనవిశ్రాం తి యెప్పుడు? రెండు చిత్రపటము లున్నవి. అందునొకదానిలో జీవితమునకై మన ము పడుపాటులును, ఆయుష్యప్రవాహమునందు సుడిగుండమువలె మనము గిరగిర తిరుగుచున్నట్లును జిత్రింపఁబడియున్నవి. (ఈపటము సంసారములోనుండు మాన వునిపాటులఁ జూపుచున్నది). రెండవపటములో శాంతియు, సర్వసంగపరిత్యా గమును జిత్రింపఁబడి యున్నది. ఇందు చుట్టునుండు ప్రతిపదార్థమును శాంతముగను, నిశ్శబ్దముగను, చలనము లేకుండను నున్నది. ఇందు సృష్టి సౌంద ర్యము, మృగములు, పుష్పములు, పర్వతములు తప్ప మఱియేమియును లేవు. (ఈరెండు చిత్రపటములలో నేది యుంచితము?) ఈ రెంటిలో నొకటియును నిర్దోష మైనది కాదు. ఒకానొక యనధికారి సర్వసంగపరిత్యాగము చేసి యుత్తమ కల్పనల ననుసరించి యేకాంతమున నుండఁదలఁచినవాఁడు జగత్స్వరూపమైన సుడి గుండములోఁ బడగానే నాశము జెందును. ఏలనఁగా నీటిలోనుండి చేప సముద్రము పైకి రాఁగానే తునకలైపోవునటులనే యెల్లప్పుడును నేకాంతముననుండి, పనిచేయ యత్నింపనివారు జగత్తులోనికి రాఁగానే నాశము బొందెదరు. అటు లనే జగత్తులోనుండి ఎల్లప్పుడును నేదో యొకపనిచేయుచుఁ దిమ్మని బ్రహ్మఁ బ్రహ్మని దిమ్మఁ జేయువాఁడు ఏకాంతమున జీవింపఁగలఁడా? జీవించియుండెనో

యున్మత్తాలయమునకే యోగ్యుఁడగును. అత్యంత శాంతమైన నిర్జనప్రదేశము జనులచే నాక్రమింపఁబడి గజిబిజిగా నున్న స్థలమువలెను, అతిశయమైకలకలనినాదముగల జనసమ్మర్దస్థలము ఏకాంతస్థలముగను నెవనికిఁ దోఁచునో వాఁడే పరమ పురుషుఁడు. వానికే యాత్మనిగ్రహముయొక్క రహస్యము తెలిసెను. వాఁడే తనను దాను జయించెను. నానావిధముల జనులచేనిండి మహారవయుక్తమైన యంగడిలో నాతనిమనసు అరణ్యములోని గుహలో నున్నంత శాంతముగ నేయుండి యెడతెగక కర్మచేయుచుండును. ఇదియే కర్మయోగము యొక్క లక్షణము. ఇది మనకు సాధ్యమైన కర్మయొక్క రహస్యము మనచేతఁ జిక్కినదియె.

మనము మొదటినుండి ప్రారంభింపవలయును. మనము చేయవలసిన నానావిధములైన కర్మలఁ జేయుచుఁ బ్రతి దినము క్రమక్రమముగా నధికాధిక స్వార్థత్యాగులము కావలయును. మన పాలిటికర్మ మనకుఁ జేయక తప్పదు. ఈ కర్మచేయుటకు మనలఁ బ్రేరేపించుకారణము లెవ్వియో వాని గుర్తెఱుంగవలయును. ప్రథమసంవత్సరమున నీకారణము లన్నియు నపవాదము లేకుండ స్వార్థపరములేయై యుండును కాని నిష్కామకర్మయొక్క యభ్యాసముచేత స్వార్థపరత తిన్నతిన్నగాఁ గరగి (తగ్గి) తుదకు స్వార్థత్యాగకర్మయే యెల్లప్పుడును జేయుట తటస్థించును. ఇట్లయినయెడల నా యభ్యాసవిధిలో మునుఁగుచుఁ దేలుచునున్న మనము పూర్ణముగా నిరిచ్ఛులమగు సుదిన మెన్నడైన రాకపోదు. ఇట్లయిన సకలసామర్థ్యములు మనలో నేకీభవించును; సత్యజ్ఞానము విమలరూపముతో మనకుఁ బ్రత్యక్షమగును.

ఎవనికి వాఁడే పెద్ద.

సాంఖ్యదర్శనమున సృష్టిలో సత్వ, రజ,

శక్తులున్నవని చెప్పఁబడి యున్నది. జడసృష్టిలోఁ గూడ వీని రూపములు కనఁబడుచున్నవి. వానికి నాకర్షణశక్తి, ప్రతిసారక (త్రోసివేయు) శక్తి— యీ రెంటింటిని గట్టుబాటులో నుంచుశక్తియనియు నామముల నిడవచ్చును

'సత్వ' మనఁగా నాకర్షక, ప్రతిసారక శక్తులను గట్టుపాటులో నుంచునది. 'రజ' స్సను ప్రతిసారకశక్తి, 'తమ' స్సనఁగా సంలగ్నమై (కూడి) యుండునది. అజ్ఞానము, సోమరితనము తమోగుణలక్షణములు. చంచలత (క్రియాశక్తి) రజోలక్షణము. రాజసప్రవృత్తియందుఁ బ్రతి పదార్థమును ఆకర్షణ స్థలమునుండి దూరదూరముఁ బోఁ బ్రయత్నించును. ఈ రెండు శక్తులను (ఆకర్షణ, ప్రతిసారక) నొకదాని కంటె నొకదానిని నధికము గానీయకుండ సమానముగ నుంచునది సత్వగుణము.

ప్రకృతి యందున్న యీ మూఁడు శక్తులు మానవునియందుండును. మనయందొక్కొకప్పుడు తమోగుణము ప్రబలమై యుండును. అప్పుడు మనము సోమరుల మగుదుము; మనసుఁ గదలుటకుఁ జేతగాకయుండును. కొన్ని విచారములచే గాని, యలసటచేఁ గాని మనము జడులమై పోవుదుము. మఱి యొకసమయమున నసోమరితనము పోయి మనము చపలురమగుదుము. ఇంకొకప్పుడు నిరంతరము సమానములయి శాంతిగుణము ప్రబలియుండును. భిన్న ప్రకృతి కలవారి యందు భిన్నగుణములు ప్రబలియుండును. నిరుత్సాహము, మాంద్యము, ఆలసట యివియే యొకని గుణములై యుండును. మఱియొకని యందు నుత్సాహము, చురుకుదనము, సామర్థ్యము విశేషముగ నుండును. వేఱొకనికి సద్వృత్తి, నిరుద్యోగితలను (కార్యముచేయు సామర్థ్యమును, సోమరితనమును) మితిమీఱనీక సమానముగా నుంచు నాత్మనిగ్రహ, శాంతత నమ్రతాది సద్గుణములే ప్రధానములుగా నుండును. సమస్త ప్రాణికోటుల యందును, వనస్పతులయందును, మనుష్యులయందును-సకల సృష్టియందును-ఈ త్రిగుణాత్మకములైన మూఁడు శక్తులు బహుప్రకారములుగాఁ గానవచ్చును.

'కర్మయోగము' నందు నీసృష్టియందుఁ గల యీమూఁడుశక్తులను-తత్త్వములను గుఱించియేమి..................................

అసంపూర్తి.

# లలితకళలు *

మన పూర్వగ్రంథముల ప్రకారము కళ లఱువదినాలుగు. లోకవ్యవహారమునందుఁ జూడఁ గళ లసంఖ్యములు. వాని నన్నిటితోను మన కిప్పుడు పని లేదు. వాని నన్నిటికిని వన్నె తెచ్చునవియు, సర్వజనానందదాయకము లయినవియు నగు నాల్గయిదు కళలనుగుఱించి యిచ్చట విచారింతము. చిత్రవిద్య, సంగీతము, కవిత్వము, నాట్యము, శిల్పము, ♦ అనువానిని మనము విడఁదీయవచ్చును. వీనిని పాశ్చాత్యులు 'ఫైన్ ఆర్ట్స్' అందురు. మనము వీనిని 'లలితకళ' లందము. వీనిని లావణ్యకళలు, శృంగారకళలు అనవచ్చును. కాని కవికులగురు వైన †కాళిదాసుఁ డిట్టివానినిఁ 'లలితకళ' లన్నందున మన మా పేరే నిల్పెదము.

### మనోహరత్వము ముఖ్యధర్మము.

లలితకళలవిశేష మేమి? లలితములనఁగా మనోజ్ఞములు, ఆహ్లాదజనకములు. మనసున కానందము కలుగఁజేయుట యేయేకళలయొక్క పరమ ప్రయోజనమో యవి లలితకళలు. ఇతర లౌకికకళలు జనులకు భోజనాది

* "'కళ'—దుందుభి, కార్తికము, పుష్యము, రుధిరోద్గారి, చైత్రము, వైశాఖము. సం. ౧, సం. ౪, ౬, ౯, ౧౦ లు.

♦ 'శిల్పము' అను పదము అనేకార్థములందుఁ బ్రయుక్త మైనను ఇచ్చట గృహనిర్మాణకాది కళ (Architecture) అనునర్థమందే వాడెదము.

† 'గృహిణీ సచివః సఖీ మిథః ప్రియశిష్యా లలితే కళావిధౌ' [రఘువంశము, ౮వసర్గము. ౬౭శ్లోకము] "లలితే సుకుమారే కలానాం గీతాదీనాం విధౌ అనుష్ఠానవిషయే ప్రియశిష్యా" [మల్లినాథః].

పదార్థముల నిచ్చుటవలన నుపయోగకరములు. లలితకళలు కేవల మానందదాయకములు. చక్కని ప్రతిమను చూచుటవలనఁగాని, రసవంతమైన కావ్యమును వినుటవలనఁ గాని, పఠించినందువలనఁగాని కడుపు నిండదు, దప్పి తీరదు, ఎండబాధ తప్పదు. కాని యేమి జరుగును? వీనినన్నిఁటిని మఱచునట్లు అంతరాత్మకు నిర్హేతుకమైన యానందవిశేషము కలుగును. కావున మనోహారత్వ మనునది లలితకళలయొక్క ముఖ్యధర్మము

పైసంగతియే యింకొకవిధముగఁ జెప్పవలయునన్న లలితకళావిషయములను చూచుటవలనఁ గాని వినుటవలనఁ గాని గల్గు ఆనందము సవ్యాజముగ నుండఁగూడదు, నిర్హేతుకముగ నుండవలయును. ఆ యానందమునకు స్వలాభమునకు సంబంధ ముండఁగూడదు. "నీకుఁ గుమారుఁడు పుట్టెను; నీకు ధనమిత్తును" అనిన మాటలు వినఁగనే గూడ నానందము కల్గును. కాని యది సవ్యాజము. ఆత్మలాభముతోఁ గూడుకొనినది. చిత్రపటము చూచినపుడు గల్గు ఆనందముగాని, పాట వినినపుడు గలుగు ఆనందముగాని తన్ను మఱపించునది. ఆ యానందసమయమున మానవుఁడు తన్మయుఁడగును. 'నాకది లాభకరమా నష్టముఁ గల్గఁజేయునదియా' యన్న యాలోచన అప్పు డుండనే యుండదు. 'అహం' అనుగుర్తు అప్పుడు లోపించు నని చెప్పవచ్చును.

## మనోహారత్వము : ఉపయోగత్వము.

లలితకళలు మనోహారత్వము కలిగియుండియు నితరవిధములఁగూడ నుపయోగకరములుగ నుండవచ్చును. శిల్పకళావిజయ మనఁదగు తాజమహాల్ వంటి రమ్యహర్మ్యములు జనులకు వాసయోగ్యములు కావా? కాని నివాసయోగ్యత యను గుణము వేఱు; మనోహారత్వ మను గుణము వేఱు అనినమాట మాత్రము మనము మఱువఁగూడదు. అందలి అంగణములు, శాలలు, గదులు, మంటపములు, లోపలికి గాలి వెలుతురు వచ్చుటకుఁగల వీళ్లు, బావులు, కోనేరులు మొదలయినవి వాసయోగ్యతకు, అనగా గృహత్వమునకు సంబంధించినవి. వానికిని మనోహారత్వమునకును సంబంధములేదు. కాని యందలి వేఱు

వేఱు అవయవముల కూర్పు, ఒకదానికిని మఱియొకదానికిని గల సంబంధము, స్తంభముల,గోడల, కమానుల(Arches)వైఖరి,ఇవన్నియు నొకవిధముగా రచింపఁబడుటచే గృహమునకుఁగలిగిన రమ్యత యనునది శిల్పకళలోని మనోహరత్వమునకు, ఇంపునకుఁ,జక్కఁదనమునకుఁ గారణము.తాజమహా లంతయిల్లు తాజమహాలుయొక్క చక్కఁదనములో నూఱవవంతు లేకుండ గట్టవచ్చును. ఆరెంటికిని గలభేదమే శిల్పకళావిశేషము. గొప్ప మందిరములలో వలెనే చిన్న గుడిసెలు కట్టుటయందుఁగూడ శిల్పచమత్కారము చూపవచ్చును. ఇంటి గోడకు నొక చివరన ద్వారముపెట్టి వెలుపల మఱియొకచివరన అరుఁగు వేయుటకంటె నడుమ ద్వారముపెట్టి దానికి రెండువైపులను రెండు అరుఁగులు వేయుటలోను శిల్పభేదము లేదా? ఇట్టితరకళలలోను, కళాత్వమును, లోకోపయోగితను విడఁదీయవలయును. కొన్నిఁటిలో కళాత్వము అనఁగా మనోహరత్వము హెచ్చుగా నుండవచ్చును; మఱికొన్నిఁటిలో దీనికి వ్యతిరేకముగ నుండవచ్చును. శివాజీపటము చక్కఁగ జిత్రింపఁబడినది యొకటి కల దనుకొనుఁడు. మిక్కిలి చక్కఁగ వ్రాయఁబడినది నగ్నస్త్రీపటము మఱియొకటి కల దనుకొనుఁడు. మొదటిదానియందు మనోహరత్వము తక్కువ యయినను, జనులకు స్వదేశాభిమానాదులు బోధించుట కది యెక్కువగా నుపయోగ పడును. రెండవది పరిపూర్ణకళకు గుఱియైనను ప్రపంచమునకు నితరవిధముగ నుపయోగకారి కాకపోవచ్చును; నష్టము చేయునదిగఁ గూడ నుండవచ్చును.

## రెండును జంటగాఁ బెరిగెను.

ఇట్లు కేవలానందజనకములగు లలితకళలకును, కేవలోపయోగకరములగు నితరకళలకును భేదమున్నను, అనాదికాలమునుండియు నీరెండుకళలును జంటగా నభివృద్ధియగు చున్న వేగాని వేఱువేఱుగఁ బెరుఁగుటలేదు. ఒక్క చిత్రకళను దీసికొనుఁడు. ఇది నేతపని, మందిరనిర్మాణము, ఘటనిర్మాణము మొదలయిన నిత్యోపయోగకరము లయిన కళలతోఁబాటు పెరిఁగినది. మా

వుఁడు మొదట చలినుండి తన దేహమును రక్షించుకొనుటకు బట్టలు నేయుట నేర్చెను. పేక పడుగు పోసి యొక్క గట్టిబట్ట నేసిన పతినికిఁ జాలును. కాని చక్కఁదనమునందు మానవునికిఁ గల సహజాభిలాషవలనఁ గొంతకాలమునకు నాబట్టకు నంచువేయవలయునన్న బుద్ధి పుట్టెను. ఇదియే వస్త్రసంబంధమైన చిత్రకళకుఁ బ్రారంభము. క్రమముగా పట్టంచులు, జరీఅంచులు, రుద్రాక్షంచులు, పూలయంచులు, వేలు వేలు అద్దకములు, అల్లికలు ఉద్భవించెను. ఇవియన్నిటియందును మొదటి ముతకబట్టలోఁగల శీతనివారణశక్తియను సుగుణమున్నను మనోహరత్వమను గుణమే యున్న భేదములకుఁ గారణమైనది. ఇట్లే గృహనిర్మాణమనునది మొదట మానవనివాసమునకై పుట్టి మనోహరత్వము కొఱకసంఖ్యరూపములను దాల్చినది. మతసంబంధమైన గృహాదికములలో ననఁగా గుళ్ళుకట్టుటలోఁ జిత్రవిద్య యభివృద్ధి చెందినట్లు అన్యవిధముగ నభివృద్ధిఁ జెందియుండలేదు. బౌద్ధయుగమునందలి చక్కని స్తూపములును, దక్షిణదేశమునందలి భవ్యదేవాలయములును, ఐరోపా దేశమందలి విఖ్యాతక్రైస్తవ ప్రార్థనా మందిరములును ఇందునకు నిదర్శనములు. ఇట్లే అచ్చని సంగీతము మనస్సును హరించునది యైనను, శృంగారవీరభక్తిరసములతోఁ గలిసియే, అనఁగా ఆయా యుపయోగములకు లోనై యభివృద్ధిఁ జెందినది. చక్కని రాగాలాపమును, వీణాదికముల మంజులధ్వనులును కేవలసంగీత మని చెప్పవచ్చును. కాని మానవుని తల్లీనునిఁ జేయుగుణము సంగీతమునందుఁ గలదని యెఱిఁగి దానిని జనులు వేలు వేలు పనులకు నుపయోగపఱుప సాగిరి. కామాతురులు దీనిని పచ్చిశృంగారమునకు సాధనముగఁ జేసికొనిరి. ఇందుకు క్షేత్రయ పదములును శృంగారజావళీలును దృష్టాంతములు. భక్తులు దైవభక్తిపారవశ్యతఁ జెందుటకై సంగీతము నాశ్రయించిరి. రామదాసుకీర్తనలు, త్యాగరాయ కృతులు ఇట్టివి. దక్షిణదేశమునం దిప్పుడు సంగీతశాస్త్రము నభ్యసించువారు త్యాగరాయకృతులను తప్పక నభ్యసింపవలయును గదా! ఇట్లు సంగీతము భక్తిని, భక్తి సంగీతమును పెంపుచేసెను! వీరరసోత్పత్తికిఁ గూడ సంగీతము

నాశ్రయించుచున్నారు. వీరగీతములును, సైన్యసంబంధమైన బాండును ఇట్టివి.

### రెండవ విశేషము.

లలితకళలలోని రెండవ విశేషము అవి విశ్వజనీనము లగుట — అనఁగా నందఱికిని ఆనందము కలుఁగఁజేయునవిగా నుండుట. ఇంకొక విశేషము. అవి ఏకకాలమందుఁ బెక్కుజనులకు నానందము కలుఁగఁజేయును. చక్కని మందిరములను జూచి గ్రామమందలి జనులందఱును సంతసింతురు. చక్కని పాట విని వేలకొలఁది జనులు ఏకకాలమందు తన్మయు లగుదురు. హరిశ్చంద్రుఁడు భార్యాపుత్రాదులను అమ్ముచున్నట్టు ఆడఁబడిన నాటకమును జూచి ప్రేక్షకు లందఱును ఏకకాలమునందుఁ గన్నీరు విడుతురు! వేఱు ఆనందముల సమాచార మిట్లు కాదు. ఒక్కనికే యది కల్గును. గారె తినినందున గల్గు నానందము తినువానికే కల్గును. ఆయొక్క గారె పెక్కు మంది తినుటకు వీలు లేదు. అందఱకు నేకపదార్థమువలన నానందము కలుగుటకును వీలు లేదు.

లలితకళలయెడఁ గల యీ విషయమువలన నింకొక చిత్రము గలుగుచున్నది. ఒక కళావిషయమును ఎంతమంది చూరఁగొన్నను అది గాని, దానివలన నితరులకు గల్గు ఆనందముగాని తగ్గదు. ధనధాన్యాదులను పెక్కుజను లనుభవించుటవలన నవి తగ్గును. "నాధనధాన్యాదులు తగ్గుచున్నవే" యనినచింత యజమానునికిఁ గల్గును. ఇం దట్టితలంగు లేదు. కావున 'నీ కళ నాది, యితరులది కాదు', అని యెవరును అనుకొనుటకు వీలులేదు. కళలు, కనులు చెవులు గలవా రందఱి స్వాత్తనియే చెప్పవలెను.

### ఈకళలు అనుకరణములు.

లలితకళ లనుకరణములుగ నుండునేగాని మూలములుగ (అసల్లుగ) నుండవు. ఒకానొకసుందరియొక్క చిత్రపటము కళావిషయ మనిపించుకొనునుగాని, ప్రత్యక్షముగా సుందరి వచ్చి నిలిచిన నది లలితకళావిషయము కాదు. బుద్ధుని విగ్రహము శిల్పకళ, కాని బుద్ధుఁడు కాఁడు. యుద్ధము

యొక్క రసవంతమైన వర్ణనము కావ్యమగునేగాని ఆయుద్ధము కావ్యము కాఁజాలదు. కావుననే 'యుద్ధస్య కథా రమ్యా' అనినాఁడు; యుద్ధము రమ్య మనలేదు.

## భిన్నకళలలోని యనుకరణమార్గములు.

అనుకరణమునుగుఱించి చిత్రకారుఁడును, కవియు పెట్టుకొనవలసిన గుఱి యొక్కటియే. సృష్టియందుఁ గానవచ్చెడు వస్తువులు గాని, మనోవికారములు గాని ప్రత్యక్షముగఁ గనులకుఁ గాఁపచ్చుచున్నవా యేమి యన్నట్లుభయులును వర్ణములతోఁ జిత్రింపవలయును. ఒకఁడు కజ్జలరూపవర్ణములతోడను, మఱియొకఁడు శబ్దరూపవర్ణములతోడను వ్రాయవలెను. ఇంతియ భేదము. పటమును జూచి పురుషుఁడే యన్న భ్రాంతి గలుగునట్లు చిత్రించినవాఁడు చిత్రకారుఁడు వినుచున్న ప్రసంగము నిజమైనదియాయేమి యన్న భ్రాంతి క్షణమైనను కలుగునట్లు వర్ణించువాఁడు కవి. కవిని గుర్తింపవలసిన గుర్తులనేకము లున్నవి. అందు నిది యొకటి.

## చిత్రవిద్య

చిత్రవిద్యయందలి యనుకరణమును గుఱించి యీ క్రింది కథ గమనింపఁ దగినది.

నల్గురు చిత్రకారులు పోటీకి నాల్గుపటములఁ జిత్రించిరి. వానిని రాజు చూడవచ్చెను. మొదటివాఁడు గులాబి పుష్పములఁ జిత్రించెను. వానిని నిజమైనవిగా భ్రమించి తుమ్మెదలు రసపానమునకై వానిపై వ్రాలెను. రెండవవాఁడు ద్రాక్షపండ్లగుత్తిని చిత్రించెను. పక్షులు వానిపైఁగూర్చుండి తినఁబోయెను. మూఁడవవాఁడు కుక్కప్రతిమను చేసెను. దానిఁజూచి మఱియొక కుక్క మొఱుఁగసాగెను! రాజు నాల్గవవానిఁ జూచి 'నీచిత్రపట మేది' యని యడుగఁగా, 'ఈ తెరవెనుక నున్నది, దేవరవారే తెరఁ దొలఁగించి చూడవచ్చు' ననెను. రాజు తెరను కదిలింపఁబోయి, యది తెర కాదనియు, తెరవలె వ్రాసినపట మనియుఁ దెలిసికొనెను!

'మొదటివాఁడు కీటకముల వంచించెను. అంతకంటె నెక్కుడు తెలివి గల పక్షులను రెండవవాఁడు మోసపుచ్చెను. అంతకంటె నధికజ్ఞానముగల మృగమును మూడవవాఁడే మార్చెను; మానవుఁడనైన నన్నే నీవు భ్రమింపఁజేసితివి; కావున నీవే నల్గురిలో శ్రేష్ఠుఁడవు' అని రాజు చెప్పెనఁట !

నాటకమందలి యనుకరణము.

కవికంటెను, చిత్రకారుని కంటెను లోకానుకరణమునందు నటునిపని యెక్కువ కష్టసాధ్యమని తోఁచెడిని. 'ఆంగికాభినయమును' గురించి నే నిది వరకు వ్రాసినదానిలోనుండి కొంచెము భాగ మెత్తి వ్రాసెదను.

నేత్ర ముఖ హస్త పాదాదికముల వ్యాపారములవలన మనోవ్యాపారములఁ దెలియఁజేయుట ఆంగికాభినయము. లోకమునందు జనులు కోపము వచ్చినప్పు డొకవిధముగను, ప్రేమ యధికమైనప్పు డొకవిధముగను, విషాదము కలిగినపు డొకవిధముగను ముఖవికాసమును హస్తపాదవిక్షేపములను జేయుట మనము చూచుచున్నాము. ఒకని బహిరింద్రియవ్యాపారములనుబట్టి యతని మనోవ్యాపారములను మనము కొంతవఱకుఁ గనుఁగొనఁగలము. లోకమందలి యీ శారీరకవ్యాపారములను నటులు చక్కఁగ ననుకరణముఁ జేసినఁగాని ప్రేక్షకులకు నానందము కలుగనేరదు. ఇంతియ కాదు. ఈ యంగవ్యాపారములు లోకము ననుసరించి బాలురకు, తరుణులకు, వృద్ధులకు, గొప్పవారికి, భృత్యులకు వేఱువేఱుగ నుండవలెను. గంభీరుఁడైన నాయకుఁడు దుఃఖసమయమున బాలునివలె బావురు మని యేడ్చిన బాగుండునా! ఒక్కపురుషుఁడే యొక్కభావమునే భిన్నభిన్నవ్యక్తులయెడఁ గనఁబఱచునపుడు భిన్నాభినయములఁ జూపవలయును. ఒకానొక పురుషుఁడు ప్రేయసినిఁ బ్రేమించునప్పుడును, సోదరినిఁ బ్రేమించునప్పుడును, పుత్రునిఁ బ్రేమించునప్పుడును, ఒక్కవిధమైన యభినయమే చూపుటకు వీలు లేదుగద!

---

* ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము. 3-వ సంపుటము.

నాటకమునందు ఆంగికాభినయ ప్రాధాన్యముఁ జూపుటకు రెండు ఉదాహరణములఁ జూపెదను. శాకుంతల ప్రథమాంకమందలి యీ క్రింది భాగము చూడుఁడు :—

శకుంతలా :—(శృంగారలజ్జాం రూపయతి)

సఖ్యౌ :—(ఉభయోరాకారం విదిత్వా జనాంతికం)

హలా ! శకుంతలే ! యద్యత్రాద్య తాతః సన్నిహితో భవేత్.

శకుంతలా :—(సరోషం) తతః కిం భవేత్.

సఖ్యౌ :—ఇమం జీవితసర్వస్వేనాప్యతిథివిశేషం కృతార్థం కరిష్యతి *

ఇచ్చట శకుంతల మొదట కూర్చుండియున్నది. మాటలాడుట లేదు. కాని యామె అనురాగవ్యంజకము లగు "ఉర్వీలేఖన, చింతన, ముఖావనమన, నఖకర్తన, వస్త్రాంగులీయకస్పర్శాది"కము లయిన యంగచేష్టలవలన శృంగార లజ్జను అభినయించినందున సఖుల కామెభావము తెలిసెను. అట్లే నాయికా నాయకులయాకార మనఁగా పరస్పరస్నిగ్ధావలోకనమువలన వారిభావమును సఖు లెఱింగిరి. కావున దుష్యంత, శకుంతల వేషములను వేసికొనినవారు వారి భావము ప్రేక్షకులకుఁ దెలియునట్లు అభినయింపవలెను. లేనియెడల నీభాగము ప్రేక్షకులకు రసవ్యముగ నుండదు.

---

* చదువరుల సౌకర్యార్థమై ప్రాకృత మీయక, సంస్కృతఛాయయే యీయఁబడినది. అర్థము :—

శకుంతల :—(శృంగారలజ్జ నభినయించుచున్నది.)

సఖులు :—(ఇరువురియాకారమునుం గని, జనాంతికము.) సఖీ శకుంతలా, నాయన యిపు డిచట నుండిన?

శకుంతల :—(రోషముతో) ఉండిన నేమి?

సఖులు :—జీవితసర్వస్వమేని యిచ్చి యీ యతిథిని కృతార్థునిఁ జేయుదురు.

[వే. వెం]

శాకుంతలమునందలి యింకొక ప్రసంగము చూడుఁడు.

శకుంతల :—అనసూయే! అభినవకుశసూచ్యా పరిక్షతం మే చరణం. కురవక శాఖాపరిలగ్నం చ వల్కలం తావత్పరిపాలయతం మాం యావదేనమ్ మోచయామి. (రాజాన మవలోకయంతీ సవ్యాజం విలంబ్యసహ సఖీభ్యాం నిష్క్రాంతా). *

ఇచ్చట శకుంతల కాలికి దర్భాంకురము గ్రుచ్చుకొనెననియు, పర్ణ్యోట చెట్టుకొమ్మకుఁ బట్టుకొనె ననియు సాకులు కల్పించుకొని కొంత కాలయాపనము చేసి యితరులకుఁ దెలియనట్లుగ రాజును జూచును. పైకిఁజూపినయభినయముకంటె నిది యెక్కుకు కష్టము. ఇచ్చట కాలికి దర్భ గ్రుచ్చుకొనినట్లును కొంగు చెట్టుకుఁ బట్టుకొనినట్లును అభినయము చేయుటయే గాక యాచేష్టలన్నియు రాజును జూచుటకై కల్పింపఁబడిన వ్యాజములు (సాకులు) అని ప్రేక్షకులకు నభినయమువలననే బోధపడునట్లు నటింపవలెను. ఇది యభినయములోని యభినయము.

ఉత్తరరామచరితమందలి యీక్రింది ప్రసంగము చూడుఁడు :—

సీతా :—ఏతే ఖలు తత్కాలకృత గోదానమంగలా శ్చత్వారో భ్రాతరః। వివాహదీక్షితా యూయమ్। అహో జానామి తస్మి న్నేవ ప్రదేశే తస్మి న్నేవ కాలే వర్తే॥

*  *  *

---

* అర్థము :—

శకుంతల :—అనసూయ! సూదివంటి క్రొత్తదర్భపుడక నాపాదమునం గ్రుచ్చుకొన్నది. నాచీర కురువకవృక్షముయొక్క కొమ్మం జిక్కుకొన్నది. దీనిం దీసికొనువఱకు నిలిచి నన్ను వెంటఁ గొనిపొండు. (అని మిష పెట్టి రాజుం జూచుచు నాలస్యముచేసి సఖులతో వెడలి పోవుచున్నది.) [కం. వీ.]

లక్ష్మణః :—ఇయు మార్యా । ఇయమప్యార్యా మాండవీ । ఇయం వధూః శ్రుతకీర్తిః ।

సీతా :—వత్స, ఇయమప్యపరా కా?

లక్ష్మణః :—(సలజ్జాస్మితమ్ అపవార్య స్వగతమ్) అయే ఊర్మిళాం పృచ్ఛత్యార్యా! భవతు। అన్యతః సంచారయామి(ప్రకాశం)ఆర్యే దృశ్యతాం ద్రష్టవ్యమేతత్ । అయంచ భగవాన్ భార్గవః *

ఇచ్చట లక్ష్మణుఁడు తన నల్గురి యన్నదమ్ముల వివాహకాలపుఁ బటమ్ముఁ జూపుచు సీత, మాండవి, శ్రుతకీర్తులఁ బటమునఁ జూపి పేర్కొనెను. తన భార్యయైన ఊర్మిళపటమును సిగ్గుచేఁ జూపక యూరకుండెను. అంత సీత ఊర్మిళపటముఁ జూపి కేరడమునకై 'ఇదుగో యిచ్చట నింకొక యామె యున్నదే, ఈమె యెవరు?' అని యడిగెను. అంత లక్ష్మణుఁడు 'వదినెగారు ఊర్మిళను గుఱించి యడుగుచున్నా' రని మనసులో ననుకొని ముసిముసినవ్వులు నవ్వి యామాటను తప్పించి వివాహకథలోని తరువాతి

* సీత :—నిజముగా వీరిప్పుడే గోదానమంగళ కార్యమును నెఱవేర్చిన నలుగు రన్నదమ్ములు. మీరు వివాహదీక్షను గైకొనినవారు. ఆహా! ఆప్రదేశమునందే యాకాలమునందే నే నిప్పు డున్నట్లున్నది.

* * *

లక్ష్మణుఁడు :—ఈమె వదినెగారు. ఈమె మాండవీ వదినెగారు. ఈమె మఱఁదలు శ్రుతకీర్తి.

సీత :—వత్సా! ఇదిగో యింకొకతె యున్నదే ఈమె యెవరు?

లక్ష్మణుఁడు :—(సిగ్గుపడి నవ్వుచు, మొగము త్రిప్పి, తనలో)—ఆహా! మావదినెగారు నన్ను ఊర్మిళనుగుఱించి యడుగుచున్నారు. సరే మంచిది. ఆమెను ఇంకొక వైపునకుఁ ద్రిప్పెదను. (ప్రకాశముగ). ఇదుగో మీరు చూడఁదగినది చూడుఁడు. ఇతఁడు భగవంతుండగు భార్గవుఁడు.

భాగమగు పరశురామగర్వభంగప్రకరణమునకుఁ బోవును. ఇచ్చట కేరడీ మాడి నప్పటి సీతముఖవికాసమును, లక్ష్మణుని మనోద్భావముఁ దెల్పు ముసిముసి నగవులను నటులు చూపలేక పోయినయెడల నీ కథాభాగమందలి స్వారస్య మంతయు వ్యర్థమగు ననియు, నట్టి యభినయము లేని నాటకప్రదర్శనము రస ములేని పిప్పివంటి దనియుఁ జెప్పవలసియుండును.

కళయన ననుకరణమని మరువఁగూడదు.

కళలలోని యనుకరణము మూలమును ఎంతసమీపించిన దానియోగ్యత యంత హెచ్చు ననుమాట వాస్తవమైనను, కళను కళగ ననుభవించుటకు నయ్యది యనుకరణమన్న జ్ఞానము చూచువారికిఁ గాని, వినువారికిఁ గాని యత్యంతావశ్యక మనిన మాటమరచిపోఁగూడదు. లేనియెడలఁ గళవలనమనకుఁ గలుగ వలసిన యానందము కలుగనేరదు. ప్రపంచమునందు ముసలివానిని, కృశోదరుని, గుండె బాదుకొనుచు దుఃఖించువానిని చూచిన నెవరికిని ఆనందము గలుగదు. కాని యట్టివారి పటము, చిత్రకారుఁడు సరిగ దింపి చూపినయెడల మనకొకవిధమైన సంతోషము జనించును. రవివర్మ దింపిన శకుంతలా జననమనుపటములోని విశ్వామిత్రుని పెదమూతిఁ జూచిన మనకెంతయు నానందము జనించును. నిజముగ విశ్వామిత్రుని నాయవస్థలోఁ జూచినయెడల, మనకు నానందమునకుబదులు అసూయ గలిగి వానిని ఒక చెంపదెబ్బ పెట్టియుందుమేమో? గాడిద, పంది మొదలయినప్రాణులు మనకు రోత పుట్టించునవి యైనను వాని పటములు మనకు నుల్లాసముకలిగించును. పటములవలెనె కావ్యములును, అవి ప్రత్యక్షములు కావనిన జ్ఞానము మనకుఁగలదు గనుకనే కరుణా, భయానక, భీభత్స, రౌద్రరసాదులు గల వర్ణనములను మరల్మరలఁ జదువుచున్నాగము, వినుచున్నారము. * నాటకాదులలో నీవిషయము మఱింత

* కావుననె మనసాహిత్యశాస్త్రకారులు 'కావ్యవ్యాపారము లోకోత్తరమనియు, అరమణీయములయిన శోకాదులనుగూడఁ బ్రయోగించి, అలౌకికమైన యాహ్లాదమును పుట్టించుననియు, కావ్యవ్యాపారమువలనఁ బుట్టిన యీ

స్పష్టపడును. నర్తకుఁడు తన పనిచక్కఁగాఁ జేసినకొలఁదిని చప్పట్లు కొట్టుదుము. ప్రపంచములో, సాహుకారుగుమాస్తా, యెవఁడయిన నొకగృహస్థుని నప్పుకొఱకు కష్టిబాధించినయెడల మనము వానిని కొట్టిపంపుదుమేమో! భార్యాపుత్రులను హరిశ్చంద్రుఁ డమ్మఁగాఁ జూచి, సభవారు కన్నీరు పెట్టుదురు గాని చప్పట్లుకూడఁ గొట్టెదరు. అనఁగా నది యనుకరణమన్న జ్ఞాన మాయానందమునకు మూలమని భావము. లేనియెడల నొకసారి కన్నీరుపెట్టినవాఁ డెన్నఁడును ఆయాటకు మరల రాకుండ వలయును. దుఃఖాది ప్రసంగములు చక్కఁగాఁ బ్రదర్శించెడి నాటకములకుఁగూడ నసంఖ్యాజనులు వచ్చుటయే యిందునకు నిదర్శనము. కావునఁ జిత్రము చూచునప్పుడు గాని కావ్యాదులు వినునప్పుడుగాని వానివలన రసానుభవము గలుగుటకు, సామాజికునకు, నవి యనుకరణము లన్న జ్ఞానము ఉండవలయును. అట్లే కళలయందును మూలమును సమీపించు గుణ ముండవలయును. ఈ రెంటిలో నేదితగ్గినను కళను కళగా ననుభవించుటకు వీలు లేదు. ఇందుకుఁ గొన్ని యుదాహరణములఁ గైకొందము.

మన్నుతోటి సీతాఫలము, అరటిపండు మొదలయిన ఫలములు చేసి పైని రంగుపూసి యమ్మెదరు; అవి కొన్నిసమయములందుఁ జిత్రకారుని ప్రతిభవలన మూలఫలములవలెనే యుండును. పెక్కుసారులు వానిని మనము చూచి నిజమైన ఫలములె యని తలంచి తలవంచిపోవుట కలుగును. కాని యవి తలంచికొని కృత్రిమఫలములని తెలిసినతోడనే మన కొకవిధమైన యాశ్చర్యమును, ఆనందమును కలిగి వానిని కొంతతడవు పరీక్షించిచూచి సంతసించెదము.

---

స్వాదము, ఇతరరుచులకంటె విలక్షణమనియు, కమనీయమనియుఁ జెప్పిరి. "అయం హి లోకోత్తరస్య కావ్యవ్యాపారస్య మహిమా యత్ప్రయోజ్యా అరమణీయా అపి శోకాదయః పదార్థా ఆహ్లాద మలౌకికం జనయన్తి, విలక్షణోహి కమనీయః కావ్యవ్యాపారజ ఆస్వాదః ప్రమాణాన్తరజా దనుభవాత్" [పండితరాయల రసగంగాధరమ్, ౧ వ ఆననమ్]

పగటిభాగవతులనువారు క్రొత్తగ నొకగ్రామమునకు వచ్చినప్పుడు గొల్లవానివేషమో, బైరాగివేషమో వేసికొనివచ్చి ఆవేషమునకుఁ దగిన కథ నల్లికొని మాటలుచెప్పి గ్రామస్థులను కొంతకాల మేమార్చెదరు. కొంతకాలమునకు తరువాత వాఁడు పగటిభాగవతుఁడని తెలియును. అప్పుడు వాని పనితనము మెచ్చఁబడును. నిజముతెలియకపూర్వము కొందఱు వానియొద్దకు గూడ రారు. అట్టివారే వాఁడు మాఱువేషగాఁడని తెలిసినతోడనే వానిఁ జుట్టుకొని వానిప్రతిమాటకును సంతసించుచుందురు.

ఒకసారి బొంబాయిపట్టణమున నొకనాటకము చూచుటకు నేను వెళ్లియుంటిని. అందొక యద్భుతమైన తెర కలదు. అందు బొంబాయిలోని యొకవీధి చిత్రింపఁబడినది. చిత్రకారుని యప్రతిమకౌశల మెట్టిదనఁగా గాని, ఆతెర మొదట దింపినప్పుడును, మరలఁ బైకిలేపినప్పుడును సూత్రము గానిని తెర యనుకొంటిమేగాని మిగిలినయరగంటకాల మొకవీధిని చూచుచున్నామనియే సభాసదులు తలంచిరి. ఇంకొకవిశేషము. తెరవాలినప్పుడు చూచితిమి గాన, మనస్సు అది తెరయేయని చెప్పును. కాని కనులు మాత్రము అది వీధియనియె గ్రహించును. ఇట్లు కనులకును మనసునకును అరగంటసేపు వాదము జరిగెను. ఆకాలమున నా చిత్రకళానైపుణ్యమును మేము మాఱఁగొన్నట్లు మఱి యేకాలమునందును అనుభవింపలేదు.

పశుపక్ష్యాదులవలె ధ్వనులఁ జేయువారు కలరు వారొకప్పుడు కుక్కవలె మొరుగుదురు. అందుపైఁ గుక్కలెన్నియో మొఱగజొచ్చును. కాకులవలె నరవగనె కాకులన్నియు కావుకావు అనుచు గుంపులు కూడి వచ్చును. మనమందఱము పొట్టవిరుగునట్లు నవ్వుదుము. ఆ ధ్వనులను కుక్కలు, కాకులు గ్రహించినవి, మనమును గ్రహించితిమి. కాని కుక్కలును కాకులును మూలములుగ గ్రహించినవి, మనముకళలుగ గ్రహించితిమి. అందువలననె మనకు, ఆనందమును వినోదమును కలిగినది. మన మెచ్చటనో యుండి ధ్వనిమాత్రము విని కుక్కకూతయనియు, కాకియరపు అనియు భ్రమపడియున్న యెడల నాయానందము మనకుఁ గలిగియుండదు.

లలితకళలను జూచునపుడుగాని వినునపుడుగాని, భావోద్రేకముచే మనస్సును స్వాధీనమునఁ దుంచుకొనలేకపోయినయెడల నవి యానందము నిచ్చుటకు మారుగా దుఃఖకోపాదులకుఁ గారణమగును. కావున కళల యంతరార్థమును తెలిసికొనఁ గోరు రసికుఁ డెప్పుడును మనోనిగ్రహము గలవాఁడుగ నుండవలయును. ఒక గొల్లవాని కథ యిందుకు దృష్టాంతముగఁ దీసికొనవచ్చును. ఒకచోట వీధినాటక మాడుచుండిరి. భామ వచ్చి కృష్ణుని నెంతకాలమో వేఁడుకొనుచుండెను. కథాకలాపసంప్రదాయము ననుసరించి కృష్ణుఁడు బెడమూతి పెట్టుకొని యెంతసేపటికి నామె మాట వినకుండెను. ఈ సమాచారమంతయు నొక గొల్లవాఁడు చూచిచూచి దిగ్గునలేచి, కృష్ణునియొద్దకుఁ బోయి "ఆయమ్మ జాముసేపటినుండి బ్రతిమాలుచుండ మొద్దువలెఁ గూర్చుండెదవేల? లేచి వెళ్ళతావా? దుడ్డుకఱతో వీపు మెత్తచేతునా?" అని యరచెనఁట! ఇట్లే రాజమహేంద్రవరమున నొక నాయుఁడుగారుండిరి. వారికి శివునిపై భక్తి, కృష్ణునిపైఁ గోపము మెండు. ఒకసారి గయోపాఖ్యాన మను నాటక మాడుచుండిరి. అర్జునుఁడు కృష్ణుని నిందించు కథాభాగము వచ్చినప్పుడు నాయుఁడుగారాత్మస్వరూపమును మరచి సామాజికులలోనుండి లేచి "అట్లే తిట్టు గొల్లవానిని. నీకు వీఁడేమి ఉపకారము చేసినాఁడు. శివుఁడు పాశుపతమిచ్చి కాచినాఁడు కాని వీఁడు పట్టిమాటలు చెప్పి కాలము గడిపినాఁడు" మొదలైన మాటలు పెద్దగ నావేశముతోఁ జెప్పిరఁట. ఇట్లు జరుగుటకుఁ గారణమేమి? భావోద్రేకమువలన నిది నాటకమని గొల్లవాఁడును, నాయుఁడుగారును మరచుటయే. అందువలన వారు నాటకమును ఒకకళగా ననుభవింప లేకపోయిరి. వాస్తవప్రపంచమేయని భ్రమపడిరి. భావోద్రేక మనేక కారణములవలనఁ గలుగును. కొంతకాలము క్రిందటనె పుత్రునిఁ గోలుపోయినవాఁడు కావ్యములలోని పుత్రదుఃఖవర్ణనములను ఇతరులవలెఁ గేవల కావ్యరసాస్వాదనపరుండై వినఁజాలఁడు. ఆతనికి దుఃఖము పొరలివచ్చి, కొంతసే పాతఁడు కావ్యవిషయమును మఱచి పోవును. ఇట్లె వ్యభిచారాది దుర్గుణప్రవృత్తిగలవాఁడు నాయికవిషయమైన

శృంగారాభివర్ణనలను, తననాయికయందె యారోపించుకొని యున్మత్తుఁడు కావచ్చును. కావుననే శృంగారాతిరేకముగల కావ్యాదులు తరుణవయస్కుల చేతఁ బడినందునఁ బెక్కుపర్యాయములు సంఘమునకు ననర్థము వాటిల్లుచున్నది. ఇందుకలననే లలితకళలకుఁ గర్తలైన కవి, చిత్రకారాదులకును రసోద్భోక్తలైన రసికులకును మనశ్శాంతి అనగా మనోనిగ్రహము, ఇంద్రియనిగ్రహము అను గుణము లత్యంతావశ్యకములు. 'కవి' లక్షణము చెప్పునప్పుడు ఇతర లక్షణములతోఁ బాటు అప్పకవి 'ప్రశాంతుఁడు' 'శుచి' 'కరుణాన్వితి'గా నున్నవాఁడే కవియని చెప్పియున్నాఁడు [1-147]. కవి రసికుఁడుగ నుండవలెననియు, రసికుఁ డనగా వ్యభిచారియనియు నిటీవలివారు విపరీతార్థములను కల్పించుకొనుట యెంతయు శోచనీయము.

## అనుకరణమునకు మితి.

మానవుఁ డెంత బుద్ధికుశలత కలవాఁడైనను సృష్టిసౌందర్యమును సంపూర్తిగ నెన్నఁడును అనుకరింప నేరఁ డనినమాట మనము మఱవఁగూడదు. అట్లు గాకున్నవో త్రిభువనవిధాతయైన బ్రహ్మదేవునకును, బొమ్మలఁ జేయు నమ్మూర్తి వానికిని బోటీ యెప్పుడో వచ్చియుండును. సృష్టిలోని వస్తుజాలమును మనము పంచేంద్రియములచేత గ్రహింతుము; మనస్సుచేత భావింతుము. చిత్రకారాదులు తమ కళలమును జూపి యొక్కొక్క యింద్రియమునే మోసపుచ్చఁ గలుగుదురు గాని, అన్నిటికిని నేకసమయావచ్ఛేదమున మోహముఁ బుట్టింపనేరరు. మనము మామిడిపండు స్వరూపమును రూపరసగంధస్పర్శము లను నాలుగు విషయముల ద్వారమునఁ దెలిసికొందుము. చిత్రకారుఁడు రూపమునుమాత్రముం జూపి కనులకుఁ గొంతకాలముమాత్రము భ్రమ గలిగింపవచ్చును. 'కాని మిగిలిన యింద్రియముల నెట్లు సంతృప్తిచేయఁగలఁడు? గ్రుడ్డివాఁ డొకఁడు మన్నుతోఁ జేయఁబడిన మామిడిపండును చేతితోఁ దాకి యది మామిడిపండని భ్రమపడునా? సృష్టితోఁ బోటీపెట్టుకొనుటకుఁ జిత్రకారాదులకుఁ బెక్కు ఇబ్బందులు కలవు. ప్రపంచములో మనకుఁ గనఁబడువస్తువు లెల్లను స్థూల

ములు. ఎత్తు, వెడల్పు, లావు ఉబ్బు అను వివిధప్రమాణములచే నని మనకుఁ గానిపించును. 'కాగితముమీఁదగాని బట్టమీఁదగాని పటములను దింపువారందు నొకకొల్తను లేక రెండుకొల్తలను పొడుగు వెడల్పును చూపఁగలరు, కాని లావుగనున్న మనుష్యునియొక్క స్థూలతయను మూడవ కొల్త నెట్లు చూపఁ గలరు? ఇంటిపటము దింపునపుడు ఒకవైపు భాగమునే చూపఁగలరు గాని మిగిలినవైపుల భాగములనెట్లు చూపఁగలరు? కవులు కవిసమయములనేర్పఱచు కొనినట్లు, శిల్పులన్నిటిని [illegible] చిత్రకారులుగూడ కొన్ని సమయముల నేర్పఱచుకొని, కొంతవఱకు లోపములను తొలగించుచున్నా రివన్నియు వాస్తవము.' కాని యీ కల్పితసమయములన్నియు స్వాభావికములని చెప్పుటకు వీలులేదు. మన్నుతోడను, శిలలతోడను, ధాతువులతోడను విగ్రహములు చేయువారు పటములు వ్రాయువారికంటె సృష్టిని ఎక్కువగ ననుకరింపవచ్చును. కాని వారైనను పూర్తిగ ననుకరింపలేరు. మన్నులో మనుష్యుని పోలిన విగ్రహమొకటి పరిపూర్ణమైనది, చేయఁబడినదని యనుకొందము. అందు బెత్తు పొడుగు లావు ఎత్తు మొదలైనవి యన్నియు మనుష్యుని కుండవలసినవి సరిగా నున్నను, దానిని జేతితాకినతోడనె యది మనుష్యశరీరము గాదని పిల్లవాండ్రుగూడ గ్రహింపఁగలరు. ఇందింకొక విశేషము కలదు. అనుకరణము మూలమును ఎంతసమీపించునో అనుకరణక్షేత్ర మంతతగ్గును. పటములమీఁది బొమ్మల కన్న శిలాది విగ్రహములు మూలమును ఎక్కుడుగ సమీపించునుగదా? కాని పటముపై సృష్టిలోని యెన్ని వింతలను చిత్రింప వచ్చునో యన్ని వింతలను మన్నుతోడను గాని, శిలాలోహాదులతో గాని చూపుటకు వీలులేదు. శిలాలోహాదులతో మనుష్యమృగపక్ష్యాదుల రూపములను మాత్రము చూప వచ్చును. సూర్యాస్తసమయమందలి ఆకాశపుశోభ, ఉద్యానసౌందర్యము, సముద్రతరంగముల యుల్లాసము మొదలైన వానిని పటములలోఁ జూపినట్లు శిలాదులలోఁ జూపుటకు వీలులేదు. ముఖవికాసాది చమత్కారములును అట్లే. శిల్పచాతుర్యమెంతది యైనను సృష్టితోఁ బోలనేరదని చూపుకథ యొకటి పాశ్చాత్యులలోఁ గలదు. సైప్రస్ దేశమున పిగ్మేలియన్ అను చిత్రకర్త

నిపుణుఁ డొక డుండెను. అతఁ డతిసుందరమైన స్త్రీవిగ్రహ మొకటి సృష్టించెను. దానిచక్కదనమునకు నాతఁడే యాశ్చర్యపడి దానిని మోహించెను. కాని ప్రాణములేని శిలను మోహించి ప్రయోజనమేమి? అందుకాతఁ డావిగ్రహమునకుఁ బ్రాణముఁ బోయవలసినదిగా వీనస్ అనఁబడు రతీదేవినిఁ గోరెను. వీనస్ దేవత యా విగ్రహమునకుఁ బ్రాణముఁబోయఁగా నాతఁడు దానిని పెండ్లియాడెనఁట. ఎంతసౌందర్యముగ కళలను నిర్మించినను అది సృష్టికంటెఁ దక్కువదిగనుండును గనుకఁ దత్కర్తకు సంతుష్టియుండ నేరదనియు, అంతకంటెను జక్కనికళను నిర్మింపవలె ననుకోరిక కలుగుచుండు ననుటకును నీకథ దృష్టాంతము.

తమతమ ప్రియులయొక్కగాని, ప్రియురాండ్రయొక్కగాని పటములను జూచి, ప్రేమోద్రేకముచేత వానిని నిజమైన స్త్రీలుగను, పురుషులుగను ఎంచి భ్రమపడినట్లు మనకవులును, పాశ్చాత్యకవులును పెక్కుతావుల వర్ణించియున్నారు. కాని కవిశేఖరుఁడైన షేక్స్పియ రొకనాటకమున నిజమైన స్త్రీని ఆమెప్రతిమగఁ జూపి యద్భుతమైన కథానకమును కల్పించినాఁడు. ఒకరాజు నిష్కారణముగఁ దనభార్యయెడల సంశయము కలవాఁడై, యామెను చంపుమని తనమంత్రిని ఆజ్ఞాపించెను. ఆమంత్రి దూరదృష్టికలవాఁ డగుటచే నామెను దాచియుంచి చంపితినని రాజుతోఁ జెప్పెను. కొంతకాలమునకు రాజు పశ్చాత్తప్తుఁడై భార్యకై విలపింపసాగెను. అంత నామంత్రి తనయింట రాణిగారి ప్రతిమ యొకటి యత్యద్భుతమైనది కలదని చెప్పి రాణి నొకగద్దెమీదఁ బ్రతిమవలె నిలువఁబెట్టి, రాజునకుఁ జూపెను. అప్పుడే దానికి రంగు వేయఁబడినందున నంటిన రంగుతగులునని రాజును సమీపమునకు మొదటఁ బోనీయలేదు; రాజు 'ఈప్రతిమకుఁ బ్రాణమున్న నెంత బాగుగనుండు' నని యనగాఁ దాను ఆప్రతిమను నడిపింపఁగలననియు, మాటలాడునట్లు చేయఁగలననియుఁ జెప్పి, మంత్రి యామెచే నట్లుచేయించి, క్రమక్రమముగా నామె రాణియేయని రాజునకుఁ దెల్పి, వారిరువురినిఁ గల్పెను! ప్రత్యక్షముగ మానవునిఁ జూచి, యది ప్రతిమయనుకొనుట యసంభవమని కొందఱనుకొనవచ్చును. కాని యిది

యసంభవముకాదని ప్రత్యక్షానుభవమువలనఁ జెప్పవచ్చును. స్యాండోయను నింగ్లీషుమల్లుఁడీదేశమునకు వచ్చి తనకౌశలముఁ జూపునప్పుడు నేనొకసారి చూడ వెళ్ళితిని. స్యాండో పంచప్రాణములను, బిగించుకొని శరీరములోని కండలన్నిఁటిని ఉబ్బించి, ఒకచిన్న గుండ్రని బల్లమీద నిలిచియుండఁగా తెర యెత్తఁబడెను. అందుఁ జలన మెంత మాత్రమును లేదు. అది విగ్రహమా మనుష్యుఁడా యన్న సంశయము సామాజికులకుఁ గలిగెను. తరువాతఁ గ్రిందిబల్ల మాత్రము తిరిగి వీపువైపుభాగము సామాజికుల వైపునకు వచ్చెను. అంతటితో నది విగ్రహమేయనియు, బల్ల యంత్రముతోఁ ద్రిప్పఁబడుచున్నదనియు, అందుచే విగ్రహముయొక్క ముందుభాగము, వెనుకభాగము మనవైపునకు దిరుగు చున్నవనియు సామాజికులు నిశ్చయపఱుచుకొనిరి. ఇంతలో మరల బల్ల తిరిగి ముఖాదికములు గలభాగము మావైపునకు వచ్చెను. అంత స్యాండో ఊపిరిని బిగబట్టుట మాని, కండల యుబ్బుతగ్గించి, మానవునివలె నకస్మాత్తుగనై మాకెంతయు నాశ్చర్యముఁ గలిగించెను. కావున మానవునిఁ జూచి బొమ్మ యను కొనుటయుఁ గొన్ని సమయములందుఁ బొసఁగును.

వైకథానకములవలనఁ జిత్రకారాదులు నేర్చుకొనవలసిన విషయ మొకటియు, రసికులును కళావిమర్శకులును తెలిసికొనవలసిన విషయ మొకటియు గలవు. చిత్రకారులకు, కవులకుఁ దృప్తియుండఁ గూడదు. సృష్ట్యనుకరణమును ఎక్కుడెక్కుడుగఁ జేయుటకు వారు యత్నింపవలెను. అట్లయినఁగాని కళలు పరమావధిఁ జెందనేరవు. రసికులు వీనిని కళలని, అనుకరణములని, శిల్పుల నేర్పరితనమని వానిని అనుభవింపవలెను. సహృదయత, తన్మయత్వము కొంత వఱకు నుండవలసినదే. అదిలేనిదే యేకళాసౌందర్యమును మనము గ్రహింప నేరము. కాని కళయొక్క కళాత్వము లోపించునంత తన్మయత్వముఁ జెందిన యెడలఁ గొన్నియెడలఁ నాభాసమునకుఁ గారణమగుననిమాత్రము మఱువరాదు.

### సంగీతమున ననుకరణ మప్రధానము.

ఇంతవఱకు ననుకరణమును గుఱించి యీయఁబడిన యుదాహరణము

లలోఁ జిత్ర విద్యకును, కవిత్వమునకును సంబంధించినవే కలవు. కాని సంగీతమునకు సంబంధించిన యుదాహరణములు లేవని చదువరులు గమనించియుందురు. సంగీతమునందు నితరకళలకంటె సృష్ట్యనుకరణము మిక్కిలి తక్కువ. కోకిలాదిపక్షులవలె మధురధ్వని కొందఱు గాయకులకుఁ గల్గినను, అందఱు గాయకులయొక్క మనోహరధ్వనులును వీణాదికముల మంజులధ్వనులును సృష్టిలోని మధురధ్వనుల యనుకరణమని చెప్పుటకు వీలులేదు. ఏధ్వనికాధ్వనియే స్వతంత్రమనియు, విశిష్ట మాధుర్యము కలదనియుఁ జెప్పవలయును. వేఱు వేఱు మానవుల ముఖవర్చస్సు లెట్లు వేఱు వేఱో యట్లే గాయకుల గాత్రములును వేఱువేఱు. దేని మాధుర్యము దానిదేయగును; గాని యన్యధ్వనియొక్క యనుకరణ మనుటకు వీలుండదు. అన్నదమ్ముల ముఖములలోఁ గొంతపోలిక యున్నను భేదముకూడ నున్నట్లు, కొందఱు గాయకుల ధ్వనులలో సామ్యమున్నను వైవిధ్యముగూడ నుండును. కావునఁ గొందఱు పాశ్చాత్యులు లలితకళలను అనుకరణ ప్రధానకళలు, అననుకరణ ప్రధానకళలు అని రెండుభాగములుగ విభాగించి, సంగీతమును రెండవ వర్గములోఁ జేర్చిరి. కాని పాశ్చాత్యవిమర్శకుల కందఱకును మూలపురుషుఁడని చెప్పఁదగిన అరిస్టాటల్ మాత్రము సంగీతమునుగూడ అనుకరణప్రధానకళల లోనె చేర్చెను. ఉల్లాసము, విచారము, ఔత్సుక్యము, క్రోధము, రోషము మొదలైన అనుభావములను మనస్సునందుఁ బుట్టించుటకు నావశ్యకమైన ధ్వనిని అనుకరించి యట్టి భావములను సంగీతము మానవుల మనస్సునందుఁ బుట్టించును గావున నీ కళయందుఁగూడ ననుకరణము కలదని యాతనిభావముగఁ గానవచ్చుచున్నది. ఈ యీస్వరమేళనము, ఈ యీరాగము, ఈ యీతాళము ఈయీ భావోద్బోధనకును, భావోద్రేకములకును అనుకూలములని సంగీతమందలి యుద్గ్రంథములు చెప్పవచ్చును; శిష్యులు గురువుల ననుసరించి యాయారాగాలాపముల నేర్చుకొనవచ్చును; వాని సాయమున సామాజికులలో నాయాభావములను బుట్టింపవచ్చును. కాని యదియంతయు సృష్టిలో నెచ్చ

తునో యున్న ధ్వనుల యనుకరణమని చెప్పుటకు వీలులేదు. ఇందువలన సంగీతమునందును గానమునందును సృష్ట్యనుకరణము ప్రధానముకాదని తాత్పర్యము.

## మఱియొక విభాగము.

మఱికొందఱు దృశ్యములు శ్రావ్యములు అని లలితకళలను ద్వివిధముగ విభజించిరి. కనులతోఁ జూచి సంతోషమునుఁ గలిగించునవి దృశ్యకళలు. శిల్పము, చిత్రవిద్య, ప్రతిమానిర్మాణము అనునవి యిట్టివి. సంగీతము, కవిత్వము శ్రావ్యకళలు; విని సంతోషింపఁదగినవి. నాట్యకళ యీరెంటికిని సంబంధించినది. అది కొంతవఱకు దృశ్యకళ, కొంతవఱకు శ్రావ్యకళ. దృశ్యకళకును శ్రావ్యకళకును గల ముఖ్యభేదము దృశ్యకళా విషయమునంతను ఏకకాలావచ్ఛేదముగ (ఒక్కసారిగ) ననుభవింపవచ్చును. ఒకానొక రమ్యమందిరమును గాని, చక్కని పురుషునిబొమ్మనుగాని, రవివర్మ పటమునుగాని, అంతయు నేకకాలమునందుఁ జూచి సంతసింపవచ్చును. శ్రావ్యకళావిషయములను ఒక్కసారి వినుటకు వీలులేదు. క్రమముగా నొకభాగము తరువాత మఱియొక భాగమును విని యానందింపవలెను. అంతయు నొకసారి గ్రహించి యానందించుట యసంభవము. కావున వీనిని కాలమునకు సంబంధించిన కళలనియు, పూర్వపు వానిని స్థలమునకు (ఆకాశమునకు Space) సంబంధించిన కళలనియుఁ జెప్పవచ్చును.

## ప్రతిభయే కారణము

లలితకళావిర్భావమునకుఁ గర్తయొక్క ప్రతిభావిశేషమే ముఖ్యహేతువు. అన్నికళలకును గురుబోధ, శాస్త్రాభ్యాసము, అనుభవము ఆవశ్యకము లయినను అవి యితరకళలకు ముఖ్యహేతువులు; లలితకళలకు సహకారహేతువులని చెప్పవలెను. మొదటఁ గర్తకు నొకానొకకళయెడల నైసర్గికప్రేమ యుండవలయును. శాస్త్రాభ్యాసాదులు దానిని అభివృద్ధిచేయునేగాని, లేని ప్రతిభను పుట్టింప నేరవు. రంగులు కలుపుట నేర్చుకొనినందున చిత్రకారుఁడు కాఁడు; వృత్తలక్షణములు తెలిసికొన్నందున కవికాఁడు. ఈ లలితకళావిష

యము లెంతెంత యసామాన్యములుగను, అనన్యసాధ్య విషయములుగను ఉండు నో వాని కంతంత ఘనత, యోగ్యత యెక్కువ. గౌహర్ జాన్ పాట కా మనోహరత్వ మేమి? ఇతరులు నేర్చిన సంగీత విద్య యామెయే నేర్చెనుగదా? రవివర్మపటమున కాచక్కదన మేల? ఆయన నేర్చిన చిత్రవిద్య అందఱు నేర్చినదే. కాళిదాసు కవిత్వమున నంతరస మెందుకు నుండవలె? ఆయన నేర్చిన ఛంద స్సందఱు నేర్చినదే. ఆయా కళలలోని యాధిక్యతకు నాయా గ్రంథకర్తల ప్రతిభావిశేషములే కారణములు. ఆ ప్రతిభావిశేషము యొక్క రూపము ఇట్టిదని ఆయాగ్రంథకర్తలకే తెలియదు. వారు దానిని ఇతరులకు నేర్పఁజాలరు.

ఇట్లు లలితకళల కర్తలకు నాయాకళలు ప్రదర్శించుటయందుఁ జాలవఱకు స్వాతంత్ర్య ముండవలెను. శాస్త్రనియమము లన్న శృంఖలలను గట్టిపఱచి కళాజ్ఞునికి స్వాతంత్ర్య మీయనియెడల ప్రతిభాయుతములగు కళలు అభివృద్ధిఁ జెంద నేరవు. శాస్త్రము లెప్పుడును దిగ్దర్శకములుగ నుండునే గాని ప్రతిభ చేయుపనిఁ జేయఁజాలవు. కావున వానినే ప్రధానములుగఁ జేసి కర్తప్రతిభకు స్వాతంత్ర్యము లేకుండ జేసినయెడల, నూతనకళావిశేషము లావిర్భవింప నేరవు. చిత్రకళయందు ఈరంగే ఉపయోగింపవలెను, కాలింతపొడుగే వేయవలయును; రాజు చేతులో గోరువంకపిట్టే ఉండవలయును అనిన నిర్బంధములఁ బెట్టి పటము చిత్రింపుమని చిత్రకారునితో నన్న వాఁడేమి చేయఁ గలఁడు? అయ్యవారును బదులు కోతిని చేసిపెట్టును. అట్లే కవిత్వమునందును జూడుఁడు. కవికి స్వాతంత్ర్యము ఈయక ఇన్ని వర్ణనము లున్నగాని కవిత్వము కాదు. స్త్రీముఖము ఇట్లే వర్ణింపవలెను, సముద్రమును అట్లె వర్ణింపవలెను అను నియమముల బలపఱచినయెడల, క్రొత్తకావ్యము పేరిట ప్రాతకావ్యముల క్రొత్తకూర్పులు బయల్పడును. క్రమక్రమముగా నిజమైన కవిత్వము చచ్చి, అనుకరణములు హెచ్చును. మనదేశమునందు శిలాలోహప్రతిమలు చేయు విద్య యొకప్పుడు అభివృద్ధిగనుండి క్రమముగ క్షీణించుటకు నిదియే కారణము. విష్ణువిగ్రహము చేయవలెననిన కాళ్లు ఇంత పెద్దవి, ముక్కు ఇంత పెద్దది, చేతు

లింతపొడుగుని- అని అందఱు దేవతలకు, మనుష్యులకు, పశువులకు, పక్షులకు-కొలతలు వేసి అంగములకు భేదముగాఁ జేసినయెడల గోపము; పనికిరాదు అన్నంయున ఆవిద్య అంతకఱకే నిల్చియుండుటకు ఈటస్థించినది. ఇట్లే యితరకళలను గుఱించియు నిరూపింపవలయునని యెఱుఁగునది.

## భావానుకరణము.

ఇదివఱకుఁ జిత్రకారునకు నావశ్యకమైన రూపానుకరణమును గుఱించి వ్యాసము ఎక్కువగా జెప్పఁబడినది. కాని చిత్రకారుఁడు రూపానుకరణమును మాత్రము చేసినఁ జాలదు. అతఁడు భావానుకరణముఁగూడఁ జేయవలయును. చిత్రకారునకేమి కవికేమి శరీరమును చిత్రించుట యెంతయావశ్యకమో మనసును చిత్రించుటయు నంతకంటె నావశ్యకము, కఠినమైనపని. మానవుండనగా నేవల శరీరవిశిష్టుఁడు కాఁడు. మనశ్శరీరసంయోగమున్నఁ గాని సంపూర్ణమానవత్వము సిద్ధింపదు. పూర్ణమానవునిఁ జిత్రింపవలయునన్న నాతని శరీరమువలెనే యాతనిమనస్సును, అనగా భావములు, గుణములు, శీలము మొదలయినవానినిగూడఁ జిత్రింపవలెను. రూపములేని భావాదుల నెట్లుచిత్రింపవచ్చునని చదువరు లడుగవచ్చును. కాని శరీరము మనసునకును, మనస్సు శరీరమునకును బింబప్రతిబింబసదృశములు. అట్లే మనమాటలును మనహృద్గతము దెలుపును. కావునఁ జిత్రకారునకును కవికిని మనస్సును జిత్రించుట యొకకష్టమైన పనికాదు. హర్ష, విషాద, గ్లాని, వ్రీడా, మోహా, ధృతి, దైన్య, చింతా, గర్వ, త్రాస, వితర్క, అసూయాది చిత్తవృత్తులలో నొక్కొక్కటి యొక్కొక్కవిధముగా మానవశరీరముపైఁ బ్రతిబింబించును. కోపముతోనున్న వానిని, చింతాక్రాంతుని, సంశయగ్రస్తుని, మనముచూడగనే గుర్తింపలేమా? దేనివలన గుర్తించెదము? ఆతనిశరీరేంద్రియస్థితినిబట్టియు; ముఖవికారములను బట్టియు. ఒక్కొక్క వికారమునకు ముఖ మొక్కొక్కవిధముగ మాఱును. చిత్రకారుఁ డీభేదముల నన్నిటిని స్వానుభవమువలన లోకములోఁజూచి నేర్చుకొని, తన చిత్రకర్మయందు వీనిని అనుసరించి మనసులోనిభావములను ముఖము

పైఁ గనఁబఱుపవలెను. చిత్రముయొక్క ముఖమును మనస్సునకు నద్దముగఁ జేయవలయును. చిత్రకారుని కౌశలము గానవచ్చునది యీభావానుకరణము నందే. తెలివిగల చిత్రకారుఁడు ఒక రెండుగీట్లు కూర్చుటవలననే వేలు వేలు భావములను చిత్రముముఖముపైఁ జూపఁగలఁడు. ఇచ్చట నటునకును చిత్రకారునకును పోటీగలదు. నటుఁడు మనోవికారములను ప్రత్యక్షముగఁ దనముఖము నందుఁ జూపవలయును. చిత్రకారుఁడు చిత్రమునందు రేఖలలోఁ జూపవలయును. శ్రీయుత బళ్లారి రాఘవాచార్యులుగారు చంద్రహాసనాటకమునందు దుష్టబుద్ధి వేషమును, విజయనగరపతననాటకమునందు పఠాన్ సుల్తాను వేషమును వేసి, మనస్సులోనికి దురాగ్రహపుటాలోచనలు వచ్చినప్పుడు ప్రదర్శించు కనుల చూపునకుఁ బ్రేక్షకు లంతయానందము నేల పొందెదరు? ఆముఖము మనస్సుయొక్క ప్రతిబింబముగనుక. అట్టి పటములనుగుఱించి యోచింపుఁడు. పటములలోని భేదము చూడవలయునన్న రవివర్మచేఁ * జిత్రింపఁబడిన 'నిషాదుఁడు'

* మృతప్రాయమైయున్న హైందవచిత్రకళకుఁ బ్రాణముపోసి యాదేశమునందు నింటింటను ప్రవేశించునట్లు చేసిన రాజారవివర్మ పటముల పేరెత్తగనే మొగము చిట్లించుకొనుటయు, అందుఁ జిత్రకళానైపుణి లేదనుటయు, బంగాళీవారు గీసినవి యెట్టివిచ్చిగీట్లయినను అందుఁ జిత్రవిద్యా ప్రతిభ యున్నదని మెచ్చుకొనుటయుఁ గొందఱుయువకుల కిటీవల 'ఫ్యాషన్' అయినట్లు కానఁబడుచున్నది. కాని యిది పెడత్రోవ; రవివర్మయొక్క యన్నిపటములును చిత్రవిద్యయొక్క యత్యున్నతదశను జూపునవి కావనుట యెంత నిజమో, వానిలోఁ గొన్ని చిత్రవిద్యాపరమావధినిఁ జూపునవనుట యంతే నిజము. రవివర్మపటములఁ జూడవలయునన్న నచ్చుపడి వచ్చువానిఁ జూచినఁ బ్రయోజనములేదు. ఇందుఁ బెక్కులాతని పటములఁజూచి యిత్తరులు వ్రాసినవి. కొన్ని యాతఁడు వ్రాసినవి యున్నను, లక్షలకొలది ప్రతులు ఒక్క రాతి మీఁదినుండియే యచ్చుపడినందునఁ బ్రతులలో మూలములోని సౌందర్యమందలి నూఱవవంతయినను రాదు. ఈ యాధునికచిత్రవిద్యా విశారదుని చిత్రనైపుణిఁ



౧. శాంతము. ౨. ఉల్లాసము ౩. విచారము. ౪. ఆలోచన. ౫. నవ్వు. ౬. వ్యసనము ౭ ఆశ్చర్యము ౮. తిరస్కారము-అతృప్తి. ౯ దుఃఖము. ౧౦. దుఃఖము-భయము.

"తెలివిగల చిత్రకారుఁడు ఒకటిరెండుగీట్లు కూర్చుటవలననే వేలువేలుభావములను చిత్రముపైఁ జూపఁగలఁడు"
[చూడుము పుట 300].

[ఈ పటముల విమ్మల నిచ్చిన శ్రీయుత పా. వే. రాజనున్నారు గారికి వందనములు.—సం.]

‘గర్వము’ అను స్త్రీలపటములఁ జూడనగు. రెండుపటములును చక్కని స్త్రీలవే. కాని భేదమింతయు ముఖవికాసములలోనె యున్నది. ‘గర్వము’

---

జూడవలయునన్న బరోడానగరమందు గాయక్వారు మహారాజుయొక్క సౌధమునందును, ట్రావనోరు రాజమందిరమందును, మఱి యితర రాజమందిరములందును ఉన్న చిత్రకారునిచేతి అసలు పటములఁ జూడవలెను. బరోడాలోని చిత్రములఁ జూచుభాగ్యము నాకులభించినందున నందుఁగొన్ని యప్రతికములని నొక్కి చెప్పగలను. నేను నావ్యాసమునందుఁ దరుచుగ రవివర్మపటములనే యుదాహరించుటకుఁ గారణము: నేను ఉదాహరించినవన్నియు నుత్తమోత్తమములని కాదు. మనదేశమునందు నిప్పుడు సాధారణముగాఁ బ్రతివానికిని లభ్యమైనవి యీపటములు. కావున నిష్టమున్న చదువరు లాయాపటములఁ జూడవచ్చును. గనుక వీనినే ఉదాహరించెదను. ఇట్లే బంగాళీచిత్రకారుల పటములలోఁగొన్ని, భావాద్యనుకరణమునకు మంచి యుదాహరణములనుటకు సందేహములేదు. కాని వారువ్రాసెడి పిచ్చిగీట్లును పెక్కులుగలవు. వాని నన్నిటిని ‘ఆహాహా!’ యని పొగడుటయు, రవివర్మాదుల మంచిపటముల నిందించుటయు బంగాళీవారిలోఁ గొందఱు కంకణముకట్టుకొని చేసెడిపని. బంగాళీవారిలో నొక సద్గుణమును, ఒకదుర్గుణమును కలవు. అవి బంగాళీవారియందభిమానము, ఇతరులయెడ నసూయ- అనునవి. తమవా రెట్టి పిచ్చిపుస్తకము వ్రాసినను దానిని కొనియాడుట, తమవా రెట్టిబొమ్మ దింపినను దానిని కొండను చేయుట, ఇతరు లాపనులను చేసినను వెక్కిరించుట వారియందు బాగుగఁ గానవచ్చును. ఇందుకొఱకై కొన్నిపత్రికలుగూడఁ బుట్టినవి. వ్రాతలనుబట్టి చూడ మాడర్న్‌రివ్యూకూడ నిట్టిదే యని చెప్పవలెను. కావున బంగాళీవారి వ్రాతలఁ జూచి మనవారు భ్రమపడుట తప్పు. బంగాళీల పటములేమి, రవివర్మ పటములేమి వాని వాని యోగ్యతనుబట్టి మంచిచెడ్డలనిర్ణయింపక రవివర్మ పటములన్ని చెడ్డవి, బంగాళీవారి గీట్లన్ని మంచివి అని తలంచుట, పక్షాభిమానమగును గాని, కళాభిమానము కాదు.

అను స్త్రీయొక్క ముఖమునందు నాకంటె నెక్కుడు చక్కనివారున్నారా? యన్న భావము స్పష్టముగ గోచర మగును. వినయము అను స్త్రీముఖము అణకువను, సౌశీల్యమును తోఁపఁజేయును. ఈ పటములలోఁ గలరూపానుకరణమునకును రూపానుకరణమూలముననే చూపఁబడిన భావానుకరణమునకును గల భేదమును కనుఁగొనవచ్చును.

ఒక ముఖవికాసమే గాక హస్తపాదాదివిన్యాసములనఁ గూడ భావానుకరణముఁ జూపవచ్చును. తలనెత్తుట, మెడవంకరఁబెట్టుట, తర్జనిఁజూపుట మొదలయిన పెక్కు అవస్థాభేదములవలన నెన్నియో మనోభావములఁ జూపవచ్చును. ఇట్లే గుణానుకరణమును క్రియానుకరణమును, రూపానుకరణము ననుసరించి చేయవచ్చును. రవివర్మ దింపినది మోహినీపట మొకటి గలదు. అందు మోహిని ఉయ్యాల యూగుచున్నట్లు చూపఁబడినది. చిత్రపటమునందు నూగుక్రియఁ జూపుటయెట్లు? అందువలన నామె పయిటకొంగు, వెండ్రుకలును ఎక్కువగా నెగురుచున్నట్లు చూపబడినది. అందుమూలముగా నామె వెనుకకు ముందునకు నెక్కువ వేగముతో నూగుచున్నట్లు సూచింపఁబడినది.

శాంతుఁడు, భక్తియుతుఁడు, దుష్టభావముగలవాఁడు, కామాతురుఁడు మొదలయిన గుణవిశిష్టపురుషుల భేదములను కావ్యములందు వలెనే పటములందును చిత్రింపవచ్చును. అట్లే నిశ్చలుఁడగువానిని, పరుగెత్తుచున్నవానిని, మాటలాడుచున్నవానిని, శాపము పెట్టుచున్నవానిని, వీడీయాక్రియలఁ జేయుచున్నాఁడని తెలియునట్లుగఁ జిత్రింపవచ్చును. ఇవన్నియు నొక విధములైన భావానుకరణములే. ఇట్లు భావములను చక్కఁగ ననుకరింపఁగ నేర్చిన చిత్రకారుఁడు, ఒకవ్యక్తిమనోభావము నే గాక తనచిత్రకౌశలముచేఁ గవి చెప్పఁగలిగినన్ని కథలు, చరిత్రలు, చిత్రములమూలమునఁ జెప్పఁగలఁడు; కవి పుట్టించు భావములన్నియు, రసములన్నియుఁ బుట్టింపఁగలఁడు. ఇందునకు నుదాహారణము లొకటిరెండు మన పూర్వచిత్రములలోనుండి యిచ్చెదను.

అమరావతిస్తూపమున శిలలమీదను, అజంతలో శిలలమీదను గోడల మీదరంగులతోను హిందూబౌద్ధపురాణములలోని కథలనేకములు కనఁబడుఁ

[ఈ పటములకు బ్లాకుల నిచ్చిన శ్రీయుత పా. వే. రాజయ్యగారికి వందనములు—సం.]



అమరావతిస్తూపము, ౧-వ పటము. [చూడు. పుట 303]





అమరావతిస్తూపము, ౨-వ పటము. చూడు. పుట ౩౦౩]

కట్టినట్లు చిత్రింపఁబడినవి. అందు నమరావతిస్తూపమునందలి యొక చిన్న స్తంభముమీదఁ జెక్కఁబడిన కథయొక్క పటము విజ్ఞానసంచికలో నీయఁబడినది. స్తంభమునకుఁ బైని యొక శాసనమును, దానిక్రింద మకరతోరణమును, దాని క్రింద కమలమును, దానిక్రింద గధము, దానిక్రింద మగల బొమ్మలును చెక్కఁబడియున్నవి. క్రిందిభాగము కొంత పగిలిపోయినది. రెండు కమలముల మధ్య గల కథ యెద్దియని మనము పరీక్షింపగా నందలి ప్రతిమల హావభావాదికముల వలన నీకథ గోచరించును :—

"పైభాగమున నొక రాజు సింహాసనముమీద నాసీనుఁడై యున్నాఁడు. చారుఁ డొకఁడు చేతులు జోడించుకొని యేదియో వార్త చెప్పుచున్నాఁడు. అతని యెదుటి భాగమునందు సైనికులు కోటను సంరక్షణ చేయుచున్నారు. అందుకుఁ గ్రిందిభాగమునఁ గోటద్వారములోనుండి సైనికులు లోపలికిఁ దోలఁబడుచున్నట్లున్నది. అందు నేనుఁగులు, గుఱ్ఱములు, పదాతులు గూడ నున్నారు. క్రింద నొకఁడు శత్రుఁడు కాఁబోలును సాష్టాంగముపడి శరణుఁజొచ్చినట్లు కానవచ్చుచున్నది. ఈవార్తయె పైని చారుఁడు రాజుతోఁ జెప్పుచున్నాఁడు గాఁబోలు. స్తంభముయొక్క క్రింది భాగము పగులకున్న యెడల నీ కథయొక్క తుదిపరిణామము మనకుఁ దెలిసియుండును." *

ఇంకొకపటముఁ జూడుఁడు. ఇదియు నమరావతిలోనిదే. ఈబండపై భాగము కొంత పగిలినది. ఆపగిలిపోయిన వృత్తమునందు "ఒక బౌద్ధబోధకుఁడు స్త్రీపురుషుల కేదియో బోధించుచున్నట్లును, వారందఱును భక్తిశ్రద్ధలతో వినుచున్నట్లును, వారిపైని దేవగంధర్వులు పూజాద్రవ్యములు గొనివచ్చి యర్పించుచున్నట్లును గానవచ్చుచున్నది. బోధకుని తల లేనందున నీతఁడు బుద్ధుఁడో, బోధిసత్త్వుఁడో, మఱియెవ్వఁడో తెలిసికొనుటకు వీలు లేకుండనున్నది. పైవృత్తమునకును క్రిందికమలమునకును నడుమనున్న పటములు మూఁడుగళ్లుగా విభజింపఁబడి యున్నవి. మొదటిగడిలో నొక రాజు సింహా

* విజ్ఞానసర్వస్వము, 3-వ సంపుటము ౧౮౧౯ వ పుట.

సనముమీఁదఁ గూర్చుండినట్లును, ఒకయుంకుఁడు భూమిమీఁద నాసనము వేసి
కొని కూర్చుండినట్లును, ఒక వీరుఁడు తన కేదిరియై నాపి వీరావేశ సంభాష
ణము కావించుచున్నట్లును, రాజు ఈసంభాషణము వినుచున్నట్లును జూపఁ
బడినది. రెండవగడిలో ఈసంభాషణముయొక్క ఫలము చూపఁబడినవి. రా
జొక యేనుఁగు నెక్కి తొందరగా శత్రువులమీఁదికిఁ బోవుచున్నాఁడు. అతని
వెంట నిద్దఱు స్త్రీలుమాత్ర మున్నారు. శస్త్రములుకూడ లేవు. ఆతనివెంట
సైన్యము వచ్చుచున్నది. ఆకాశమునుండి దేవగంధర్వులు పుష్పమాలలు వేయు
చున్నారు. మూఁడవగడిలో వాయువేగమున పరుగిడుచున్న యశ్వముల నెక్కి
శత్రువులుపాఱిపోవుచున్నట్లు చూపఁబడినవి. *"

ఈప్రకారముగాఁ జిత్రకారుఁడు రూపలేఖనముచేతనే, శరీరవ్యాపార
ములు, మానసికవ్యాపారములు, ఆధ్యాత్మికతత్త్వములు, భారతములు, భాగవత
ములు వర్ణించి చెప్పఁగలఁడు. అహో! రూపానుకరణ ప్రభావము!

కావ్యము, చిత్రము.

రమణీయార్థ ప్రతిపాదకశబ్ద మెట్లు కావ్యమగునో, అట్లే రమణీయార్థ
ప్రతిపాదకరూపము చిత్రమగును. రమణీయార్థప్రతిపాదకత్వము రెంటికిని
సామాన్యమే. అయినను రమణీయార్థము మాత్రము కావ్యమగును, తత్సాధన
మైన శబ్దము కావ్యమున కక్కరలేదని చెప్పుటకు వీలులేదు. కావుననే
దండి మొదలయిన వారలు శబ్దార్థములు రెండును కావ్య మన్నారు.
దానినే పండితరాయ జగన్నాథులు రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దము
కావ్యమన్నారు. కావ్యము వలయునన్న శబ్దము తప్పదు. అట్లే చిత్రము
కావలయునన్న రమణీయార్థ ప్రతిపాదక రూపము తప్పదు. చిత్రమునందు
రూపసామ్య మక్కరలేదు. రమ్యార్థమే కావలెననియు, సంగీతమునందు
నాదమక్కరలేదు రమ్యార్థమే కావలెననియు చెప్పుట అసంభవమైన కోరి
కఁగోరుట. నాదౌచిత్యమునువిడిచి సంగీతానందము లేదు; రూపౌచిత్యమును

* ఆంధ్రవిజ్ఞానసర్వస్వము. సంపుటము 3, పుట ౧౪౨౨.

విడిచి చిత్రవిద్యలేదు; శబ్దౌచిత్యమును విడిచి కావ్యములేదు. దీనికి వేఱు ప్రమాణ మక్కఱలేదు. - చెవిటివానికి సంగీతము, గుడ్డివానికి చిత్రము, పిచ్చివానికిఁ గావ్యము సున్న అని చెప్పినఁ జాలును.

రూపానుకరణము చిత్రలేఖనమునందును, శబ్దానుకరణము కావ్యమునందును ముఖ్యసాధనము లగుటకు మనుచరిత్రమునుండి యొకయుదాహరణము నిచ్చెదను. పెద్దన వరూధినిరూప మిట్లు వర్ణించెను:—

సీ. తతనితంబాభోగధవళాంశుకములోని
యంగదట్టపుకావిరంగువలన
శశికాంతమణిపీఠి జాజువాఱఁగఁ గాయ
లుత్తుంగకుచపాళి నత్తమిల్లఁ
దరుణాంగుళీధూతతంత్రీస్వనంబుతో
జిలిబిలి పాట ముద్దులు నటింప
నాలాపగతిఁజొక్కి నరమోడ్పు కనుదోయి
రతిపారవశ్యవిభ్రమముఁ దెలుప
తే. బ్రౌఢిఁ బలికించు గీతప్రబంధములకుఁ
గ్రమముకరపంకరుహాదత్నకటకఝణఝణ
ధ్వనిస్ఫూర్తి తాళమానములఁ దెలుప
నింపుదళుకొత్త వీణ వాయించుచుండి.

మను. ఆ. ౨. ప. ౩౧

ఇఁక ప్రవరాఖ్యుని శీలమును పవిత్రప్రవర్తనమును కవి యీలాగు చిత్రించియున్నాఁడు.

శా. ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁ బాలిండ్లు వొంగారఁగా
యంచుల్ మోవఁగఁ గౌఁగిలించి యధరం బాసింప హా శ్రీహరీ
యంచుల్ బ్రాహ్మణుఁ డోరమోమిడి తదీయాంసద్వయంబంటి పా
మ్మంచుం ద్రోచెఁ గలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్.

[మను. ఆ. ౨. ప. ౭౬]

ఒకానొక పురుషునియొక్క పరస్త్రీపరాఙ్ముఖత యింతకంటె నెక్కుడుగఁ గనులకుగట్టునట్లు ఎవ్వరైనను వర్ణింతురని తోఁపదు. ఒకయామికుఁడైన శుద్ధశ్రోత్రియ పవిత్ర బ్రాహ్మణుండు, లోకమునందు గన పచ్చుటచ్చట వరుదుగఁ జూచునట్టివాఁడు, కనుల యెదుటఁ గట్టినట్లు కానవచ్చుచున్నాఁడు.

ఈపద్యమందలి 'శ్రీహరీ' యను పదము శబ్దానుకరణములో శబ్దానుకరణము. మనవారు దుఃఖ మతిశయించినప్పుడును, అన్యాయకార్యము జరిగినప్పుడును 'హరి! హరీ! శివ! శివా! యనుట సర్వవిదితమే.

ఇఁక నీరూపమును ఈశీలమును మనకు బోధించుటకునై 'చిత్రకారుఁడేమిచేయునో చూడుఁడు. పైని వరూధినిని వర్ణించిన పద్యమువలన మనమనస్సులో నుద్భవించు నూహాలే సరిగ నుద్భవింపఁజేయవలయు నన్న చిత్రకారుఁ డాపద్యమందలి వర్ణనమును తూచాతప్పకుండ ననుకరించి పటమువ్రాయవలెను.

లేఁతమామిడిచెట్టుక్రింద నున్న చంద్రకాంతపీఠము, దానిమీఁదఁ గూర్చున్న కిన్నరస్త్రీ, ఆమె లోనంగట్టిన యెఱ్ఱనిపావడ, పైనిగట్టిన తెల్లసెల్లా, వీణ, ఆమె యుత్తుంగకుచపాళిని నత్తమిల్లువీణబుఱ్ఱ కాయలు, తరుణాంగుళీధూతతంత్రి, అరమోడ్పుకనుదోయి చక్కఁగఁ జిత్రించినఁగాని పద్యార్థమును చిత్రార్థమును ఒక్కటిగానేరవు. ఇంతియగాదు. పైవర్ణనమువలన వరూధిని లోపలగట్టిన పావడయొక్క యెఱ్ఱదన మధికముగ నుండెననియు, పైని గట్టిన తెల్లశాలువ మిక్కిలి సన్నగనుండెననియు, అందుచే పావడయెరుపురంగువలనఁ దెల్లనిచంద్రకాంతశిల కొంత జాజువారెననియు గోచరించునట్లు పటముగా వలెను. ఇందు దేని యనుకరణము తక్కువైనను పద్యమునకు సమానమైన చిత్రమని చెప్పుటకువీలులేదు.

ఇఁక బ్రవరుని వైరాగ్యముఁ దెల్పు రెండవపద్యమునందలి భావము బోధించుటకు చిత్రకారుఁడు వ్రాయు పటముఁగూడ నందలివర్ణనములకు సరిపోవునదిగ నుండవలెను. వరూధిని "ప్రాంచద్భూషణబాహుమూలరు

చిత్తోc బాలిండ్లు వొంగారc గౌcగలించి యధరంబానించు''టయుc, ప్రవరుcడు 'ఒకమోవిడి...అంసద్వయంబంటి పొమ్మంచున్' ద్రోచుటయుc గనులకుc గట్టినట్లు లిఖింప వలదా? 'శ్రీహరీ' యనుమాటలుగూడ మనకు వినిపించునట్లు చిత్రమును వ్రాయవలెను. అనcగా నట్టి మనఃస్థితిలోనుండు మానవుని ముఖాదివికాసములను, హస్తాదివిక్షేపములను సరిగ ననుసరించి చిత్తరువు వ్రాయవలెను. లోకానుకరణ మెంతమాత్రము తప్పినను, ఉద్దిష్టమనోభావములు గోచరింపవు, ఔచిత్యాభాసమైనదని రసికులు మెచ్చరు.

## నూతన సంప్రదాయము.

ఇట్లు సారూప్యప్రభావ మెచ్చటు జూచినను చిత్రవిద్యలోc గానవచ్చుచుండ, పౌరస్త్యపాశ్చాత్యపండితు లొప్పుకొనియుండc బశ్చిమదేశమునందుc జిత్రవిద్యనుగుఱించి యొకక్రొత్త సంప్రదాయము బయలుదేఱినది. వీరు చిత్రరచనయందు ననుకరణము అముఖ్య మందురు. భావానుకరణమును అనుకరణము అనcగూడ దందురు. దానిని సత్యము (truth) అనవలె నందురు. చిత్రీకరణము అనుకరణము (imitation) కాదు, ఇది ప్రతిసృష్టి (re-creation) లేక ప్రాతినిధ్యము (re-presentation) అని యేమేమో చెప్పుదురు. వీరు చెప్పువానిలోc గొంతసత్యము లేకపోలేదు. కాని యాసత్యము రూపసామ్యసిద్ధాంతమునకు వ్యతిరేకమైనది కాదు. వీరి సిద్ధాంతములోనుండి మన హైందవ చిత్రకారులు గ్రహింపనలసినవిషయములను మఱియొకసారి చర్చించెదను. ప్రస్తుతము రూపసామ్యము చిత్రమున కక్కఱలేదనినవాదమును మాత్రము కొంత ఖండించెదను.

మనదేశమందలి కొందఱు యువకులు పాశ్చాత్యులలోని యీనూతన సిద్ధాంతములను గ్రహించి అవి నూతనముగా దాము గ్రహించినవని చెప్పక, ఈసిద్ధాంతములే మన హిందువుల గ్రంథములలోని సిద్ధాంతములని చెప్పుచున్నారు. ఆవిషయము నిజముకాదని మన గ్రంథములలోని కొన్ని ప్రమాణములనుగూడ జూపెదను.

## అనుకరణమున్నయేని చిత్రమున్న.

చిత్రకళకు ననుకరణము (సాదృశ్యము, సామ్యము, సారూప్యము, రూపౌచిత్యము) అక్కఱలేదను వారి యర్థమేమి? జాత్యనుకరణ మక్కఱలేదనియా? వ్యక్త్యనుకరణ మక్కఱలేదనియా? జాత్యనుకరణ మక్కఱలేదను నెడ, ఆవుబొమ్మ దింపుమని యడుగగా గేదెపటము వ్రాసినను, సింహపటము వ్రాయఁబోయి శునకపటము దింపినను, అయ్యవారిని చేయఁబోయి కోఁతిని జేసినను తప్పని చెప్పరాదు. ఆ వ్రాసినపటమునందుఁ జిత్రకారునకు నీపోలికలు తప్ప యింక నేవిధమైన విశేషములు, భావములు తట్టిన నవి యాతఁడు పటమునందు జూపించినఁ జాలునని వీరు చెప్పగలరా? అప్పుడు చచ్చుటకు సిద్ధముగనున్నవానిని వ్రాసి దుస్ససేనునితోఁ బోరాడివచ్చిన భీముఁడనుకొనుమనిన వీరొప్పెదరా? రావణుని ధిక్కరించుచున్న సీత చక్కని అలంకారములు ధరించినట్లుగాని, పకపక నవ్వుచున్నట్టుగాని చూపవచ్చునా? కూడదని మొదలఁ బటములు ప్రపంచములోని పదార్థములకు ఆచారములకు ననుకరణములు కావనుటయందు నర్థమేమి? ప్రతికృతి శబ్దమునకు సంస్కృతమున ప్రతిబింబము అని యర్థమున్నందున అనుసరణము, అనుకరణము అను పదములఁ దీసి ప్రతికృతి అను పదముఁ బెట్టిన ప్రయోజనము లేదు. ఇఁక వ్యక్త్యనుకరణము వలదందురేని ఔరంగజేబుపటము వ్రాసి శివాజి అనినను, క్లైవుపటము వ్రాసి శ్రీకృష్ణరాయలు అని పేరు వ్రాసినను వీరు ఒప్పుకొనవలసినదే. లోకములో తండ్రిపోలిక కుమారునియందుఁ గానవచ్చును. అంతపోలిక మూలమునకును చిత్రపటమునకును ఉండినఁ జాలునా? అదియుఁ జాలదు. అట్లయినఁ దండ్రిపటముఁ జూపి కొడుకని చెప్పుట తటస్థించునే? ఆ పోలికఁ జూపుచు నిద్దరికిఁగల భేదముఁ జూపుట చిత్రకారుని కౌశల్యలక్షణమని భాగవతమందలి ఉషాపరిణయకథా భాగమువలన స్పష్టమగుచున్నది. ప్రద్యుమ్నునిఁ జూచి ఉష మొదట యితఁడేనా యని సంశయించినదఁట. తరువాత ననిరుద్ధునిఁ జూచి యితఁడే యని నిశ్చయించినదఁట. అనగాఁ బితాపుత్రులకుఁగల సామ్యము, భేదము రెండును చిత్రమునందుఁ జూపఁబడినవని భావము. కావునఁ జిత్ర

కళయందు జాత్యనుకరణముం బూర్తిగ నుండవలెను. వ్యక్త్యనుకరణముం బూర్తిగ నుండవలెను. శిన్మాలమున భావాదికముల ననుకరింపవలెను.

రూపము ప్రధానముగాక, బోధయే, మతబోధయే ప్రధానమైన చిత్రములలోఁగూడ సాధ్యమైనంతవరకు రూపసామ్యము సాధింపవలెను. లేనియెడలఁ జిత్రకారుని యుద్దేశము చూపరులకు బోధపడనేరదు. హిందువుల యభిప్రాయప్రకారము గోవు మిక్కిలి పవిత్రమైన జంతువు. వారిమతమున ముప్పదిమూడుకోట్లదేవతలు దానిశరీరమునందు వాసము చేయుదురు. ఈభావము బోధించుటకునై ఆవుపట మొకటి చిత్రించి విక్రయించెదరు. చదువరులు చూచియుందురు. ఇందు రూపము ప్రధానముకాదుగదా, దానిపవిత్రత యను భావముం దెల్పుటయే ప్రధానముగదా యని తలచి, ఆవురూపమును, ఆవో లేడియో యని సంశయము కలుగునట్లు ఆవుపటమును, కోఁతులో రాక్షసులో యన్నట్లు దేవతలపటములను దింపినయెడలఁ జిత్రకారుని యుద్దేశము సఫలమగునా? కావున రూపానుకరణము చిత్రలేఖనమునకు ముఖ్యము.

## ప్రాతినిధ్యము.

చిత్రములు మూలములకు ప్రతినిధులే (representatives) కాని పోలికలుకావు, అనుకరణములు కావు అని కొందఱు చెప్పెదరు. వీరిమతమునఁ జిత్రీకరణమనినఁ బ్రాతినిధ్యము (representation); కాని యీమతమును సరియైనదిగాదు. ప్రాతినిధ్యమునకు (అనఁగా నేర్పఱచుకొనిన గుర్తునకును) సామ్యమునకును గలభేదము తెల్పెదను. అ ఆ ఇ ఈ లు అనునవి కొన్నిధ్వనులకు గుర్తులుగ నేర్పఱుపఁబడినవి. ఇవి కొన్నికలిసి శబ్దములకు దానియర్థమునకు గుర్తుగ నేర్పడును. ఈయక్షరములకును వానికిసంబంధించిన ధ్వనులకుగాని అర్థమునకు గాని ఏమియుఁబోలికలేదు. చదువువచ్చినవారు 'కృష్ణుఁడు' అనునక్షరములు కాగితముమీఁదఁ జూచినతోడనే వారికి ఆధ్వనియు, దానికి సంబంధించిన యర్థమును స్ఫురించును. ఇట్లు అక్షరము ధ్వనికిని, ధ్వని అర్థమునకును ప్రతినిధులు, గుర్తులు. పట మట్టిదికాదు. 'కృష్ణుఁడు' అను నక్షర

ములఁ జదివినఁ గల్గు నానందమును, కృష్ణునిపటముఁ జూచినందునఁ గల్గు నానందమును ఒక్కటియేయని యెవరైన చెప్పఁగలరా? దూరదేశమునఁ గుమారుఁ డున్నపుడు తండ్రికి, కుమారుని పేరు వ్రాసి చూపించినను కుమారుని పటము చూపినను ఒకటే ఆనందముగలుగునా? ఇదియుఁగాక నెట్టుకొనినగుర్తులకును పటమునకును పెద్దభేదముకలదు. పటములోనిభాష సార్వజనీనము, ప్రపంచ మందలి యందఱకుఁ దెలియునది. అక్షరములు (మన మేర్పఱచుకొనిన గుర్తులు గాన) వానిని నేర్చుకొనువారికే తెలియును. భాషయు నట్టిదే. 'ఆవు' అని తెనుఁగులో వ్రాసినయెడల: జదువురాని పిల్లవానికిఁ దెలియదు, తెలుఁగుగాని వానికిఁ దెలియదు. అదే ఒక ఆవుపటము వ్రాసి చూపినయెడల నందఱకుఁ జెప్పకయే బోధపడును! చూచితిరా? ప్రతినిధికిని, అనుకరణమునకును గల భేదము! కావుననే యిటీవలఁ బిల్లవాండ్రకు నక్షరజ్ఞానము సులభముగను, సహజముగను కలుగవలయునని పటములమూలమున నక్షరములు నేర్పెదరు. 'ఆ' నేర్పవలయునన్న 'ఆవు' పటము వ్రాసి దానిక్రింద 'ఆ' వ్రాసెదరు! ఇట్టి ప్రథమపాఠ పుస్తకములె సారూప్యములకును, ప్రాతినిధ్యమునకును గలభేదముఁ దెల్పుచున్నవి. నూఱుమాటలతో వర్ణించిన దానికంటె నొక చిన్న పటము వ్రాసిన నెక్కుడు బోధ కలుగుట అందఱకు ననుభవమెగదా?

## ప్రతిసృష్టి.

చిత్రవిద్య అనుకరణముకాదు, ప్రతిసృష్టి, పునస్సృష్టి, అని యొక వాదము కలదు. ఈమాటలు (re-creation) అను శబ్దమునకు మక్కికిమక్కి భాషాంతరమై యుండవచ్చును. కాని వీనియర్థమేమొ గోచరముగాకయున్నది. ప్రతిసృష్టి యనగా మూలమునకంటె భిన్నమైన పదార్థమని యర్థమగునేని అది యందఱు నొప్పుకొనవలసిన విషయమే. పటము మూలవస్తువును బోలినదని యనుచున్నాము కాని మూలమును, దానిపటమును ఏకద్రవ్యమని యెవరును అనుటలేదు. కాని 'పునఃసృష్టి' శబ్దమువలన మూలముతో నెట్టిపోలికయు లేనిది యని వీరి యర్థమగునేని యది యనుభవవిరుద్ధము. అట్లయి

గుఱ్ఱము గాడిదల ప్రతిమలకు గుఱ్ఱము గాడిదలతోఁ బోలిక లుండవు; గుఱ్ఱము, గాడిద యొక్కటియే యగును! కావున కవితాసృష్టి, కవిబ్రహ్మ ఇత్యాదిశబ్దములు ఆలంకారికభాషగా గ్రహింపవలయునేగాని, యౌగికార్థముగా గ్రహింపఁగూడదు. అట్లు గ్రహించిన శబ్దముల కర్థమే లేకుండ ననర్థము ప్రాప్తించును.

## భౌతికరూపము, ఆధ్యాత్మికరూపము.

మనకుఁ గనఁబడు రూపము భౌతికముకాదు, ఆధ్యాత్మికము; కావున రూపసామ్య మక్కఱలేదని యొకమాట చెప్పెదరు. రూపముయొక్క యీ విభజనయే ననర్థావహమే. కాని యిది తత్త్వజ్ఞానవిషయము. దీనివిషయమై చర్చింపవలెనన్న యొకగ్రంథము వ్రాయవలెను. వాదమునకై చిత్రవిద్యలో, భౌతికాధ్యాత్మికరూపభేదములను అంగీకరించినను, చిత్రకారుఁడు చూపు ఆధ్యాత్మికరూపము నిజమైన ఆధ్యాత్మికరూపమునైనను పూర్తిగాఁ బోలియుండవలెనా? అదియు నక్కఱలేదా? ఉండవలె నందురా, ఆధ్యాత్మికరూపములోఁగూడ ననుకరణమును ఒప్పుకొనినవారై, దానిని భౌతికరూపమునకు దింపెదరు. అక్కఱలేదందురా యేచిత్రమువలననైనను ఏ ఆధ్యాత్మికరూపజ్ఞానమైనను కలుగవచ్చును. ఒకచిత్రమువలన నొక్కవిధమైన యాధ్యాత్మికజ్ఞానమె యుద్భవించునన్న నియమ ముండదు. మారునిపటముఁజూచిన బుద్ధుని యాధ్యాత్మికరూపముతోఁపవలెను. పందినిఁజూచిన నందియొక్క యాధ్యాత్మికస్వరూపము తోఁపవలెను. ఇదియ నవస్థాప్రసంగమునకుఁ బెద్ద త్రోవ.

చిత్రవిద్యలో భౌతికరూపము, ఆధ్యాత్మికరూపము అని విభేదము చేయుట యెంత యసంగతమో వీరి యాధ్యాత్మికరూపమును గట్టిగా నొక్కి చూచినఁ దెలియఁగలదు. వీరు 'ఆధ్యాత్మికరూపము' అనునది, అనుకరణవాదులకు జవాబుచెప్పుటకుఁ దెచ్చిపెట్టుకొనిన యర్థములేనిమాటయని స్పష్టపడఁగలదు. ఆధ్యాత్మికరూపము ఆత్మస్వరూపము (బ్రహ్మస్వరూపము) తప్ప మఱియొక్కటెట్లగును? అది యొక్కటియె. అందు సజాతీయ, విజాతీయ

స్వగతభేదము లుండఁగలవా? యజ్ఞదత్తుని ఆధ్యాత్మికరూపము వేఱుగను, దేవదత్తుని యాధ్యాత్మికరూపము వేఱుగను ఉండునా? అట్లున్న యెడల నది యాధ్యాత్మిక మగునా? ఇట్టి ఏకాకారమైన, అనిర్వచనీయమైన యాధ్యాత్మిక రూపమునకుఁ బటమెందుకు? దానికిఁ బటమెట్లుండును? కావునఁ బటము నందుఁ జూపెడి, చూచెడి ముఖరూపము భౌతికమే, అది యెన్నియో భౌతిక, మానసిక, ఆధ్యాత్మికములు అయిన యూహలను పుట్టించును అని యనిన- అది సరియైన మాట యగును. పటమునందలిది భౌతికరూపముగాదు, ఆధ్యాత్మిక రూపము అనుట అర్థములేని వాక్యము.

ఇదియుఁ గాక యాధ్యాత్మికస్వరూపము బోధపడుట కెట్టిమహానీ యునకు? ఎట్టి యాత్మజ్ఞానికి? అట్టి మహనీయునకుఁ బటమెందుకు? ఘట మెందుకు? చిత్రకారులందఱును తత్త్వవేత్తలు, భౌతికశరీరము పోఁగాఁ గొడుకు చచ్చెనని యేడ్చి, కొడుకు పటముఁ జూచి దుఃఖోపశమనముఁ జేసికొనిన పామరుఁడైన తండ్రి తత్త్వజ్ఞానియనియు, ఆత్మస్వరూపజ్ఞానియనియుఁ జెప్పుట ఆధ్యాత్మికవిద్యను పరిహసించుట కాదా? తాత్పర్యమేమనగా నాధ్యాత్మ స్వరూపమొకటి భౌతికస్వరూపమునకంటె భిన్నమైనది కలదనువారు, అది యింద్రియ విషయము గాదు, కేవల పరిపూర్ణజ్ఞానవిషయ మన్నమాట మఱవఁ గూడదు.

ఇంకొక మాట. భౌతికరూపము, ఆధ్యాత్మికరూపము - అని భేదము చేయువారు భౌతికరూప మనగాఁ వేఱైనది యని తలంచుచున్నట్టు కానవచ్చుచున్నది. ఇట్టిభావము బైరాగుల కుండిన నుండవచ్చునేమో గాని చిత్రకారులకుగాని, మఱియేవిద్య నభ్యసించువారికిఁ గాని ఉండఁదగదు. ఏలయన మనకుఁగల్గు ప్రత్యక్షజ్ఞానములో నూటికిఁ దొంబదివంతులు కనుల మూలమున, అనగా తద్విషయమైన రూపముమూలముననే కలుగును. అందుచే రూపమును ధిక్కరించుట యనగా మనజ్ఞానమును నిందించుటయే. భౌతికరూపమునందు హేయోపాదేయత్వములు లేవు. అవి మన మనస్సునందే కలవు.

ఒకఁడు భోగముదానిరూపమునందుఁ జిక్కుకొని యధోగతి పాలగును; మఱి యొకఁడు విఠ్ఠలేశ్వరుని రూపమునందె తగులుకొని తుకారామ్ అగును. ఒకఁడు నగ్న చిత్రములందె దృష్టినిల్పి నీతిభ్రష్టుఁడగును; మఱియొకడు శివాజి కృష్ణరాయాది మహామహుల రూపములందె మనస్సునిల్పి దేశభక్తుఁడగును! రూపము అగ్నివంటిదే. ఒకఁడు దానితో వన్నాగలు సిద్ధపరచి భూతతృప్తి కలిగించును; మఱియొకఁడు కొంపలు తగులబెట్టి భూతబాధ కలిగించును. దోషమెందున్నది? భౌతికరూపమును నిందించువారు జనులందఱును కనులు పెరికివైచుకొని గ్రుడ్డివారు కావలయునని బోధచేయుట యుక్తముకదా? అట్లెవరును చేయుచున్నట్లు కానరాదు.

## నాకొక చెట్టు, నీకొక చెట్టు.

రూపము చెట్టులో లేదు, చూచువానిలో నున్నది; అది అందఱకు నొకవిధముగఁ గానరాదు; చిత్రకారునకు నొక విధముగను, ఇతరులకు నొక విధముగను గానవచ్చును; కావునఁ జిత్రకారుఁడు చిత్రించినది చెట్టురూపము కాదు. అతని కది కనబడ్డ విధము — అని యొక వింతవాదము కలదు. * కానిదీనిని

---

రూపము వస్తుగతమా (Objective) లేక చూచువాని మనోగతమా (Subjective) అనితత్వశాస్త్రమునందుఁ బెద్ద తగాదా కలదు. బహిః ప్రపంచము సత్యమా, కేవలమాయయా యన్న ప్రశ్నము దీనికి సంబంధించినదే. మనకుఁ బ్రపంచమునందుఁ గలుగు జ్ఞానమంతయు సాపేక్షము (Relative), నిరపేక్షము (Absolute) కాదు, అనునదియు నిట్టిదే. ఈవాదము లింకను వేదాంతములలోనే తెగలేదు. పాశ్చాత్య, పౌరస్త్య తత్వజ్ఞులలో దీనిని గుఱించి యెన్నెన్నియో పరస్పరవిరుద్ధాభిప్రాయములు కలవు. పాశ్చాత్య, పౌరస్త్యతత్వజ్ఞాన చరిత్రము (History of Philosophy) తెలియనివారు, పాశ్చాత్యులు భౌతికసృష్టిని సత్యమనియెదరు, మనవారు అసత్యమనియెదరని చెప్పుచుందురు. ఇది సత్యమైన విషయము కాదు. పాశ్చాత్యులలో బహిఃప్రపంచమును భ్రమగాఁ దలఁచువారు పూర్వకాలమునుండి నేటివఱకును

అంగీకరించినయెడల జిత్రకళయే వినాశముం జెందును! చూడుఁడు. నాకు నెదుట నొక మామిడిచెట్టు కనఁబడుచున్నది. దానిపటము వ్రాయుమని చిత్రకారుని నడిగితిని. కాని వీరి సిద్ధాంతము ననుసరించి యీ చిత్రకారునకు చెట్టు గాఁ గనఁబడక గుట్టగాఁ గానఁబడవచ్చును. అతఁడు గుట్టపటము వ్రాసి తెచ్చును! ఇట్లు చిత్రకళ లోపించుటయే గాక సకల ప్రపంచ వ్యవహారమును ఆగిపోవును. నాకు గుట్టగనున్నది యింకొకనికి బట్టగను; మఱియొకనికి నిల్లుగ నున్నది నాకు నడవిగను గాన్పించిన వ్యవహార మెట్లు సాగగలదు? భిన్నమానవులకు వస్తువు లింత భేదముగ గానరావు. కొంచెము భేద ముండును; చెట్టు గుట్టగఁ గానరాదు; అందఱకుఁ జెట్టుగనె కనిపించును; * కాని ఒకనికి నొక సౌందర్యముతోను, ఇంకొకనికి నింకొక సౌందర్యముతోను కానవచ్చును అని వీరు బదులు చెప్పవచ్చును. ఈభేదముకూడఁ జిత్రవిద్యయందు నొప్పుకొనుటకు వీలులేదు. ఏల? మామిడి చెట్టులో నాకుఁ గానఁబడని చక్కఁదనము చిత్రకారునకుఁ గనఁబడిన దనుకొనుఁడు. అది యాతఁడు, చిత్రమునఁ జూపును. కాని యీ పటముగూడఁ జెట్టువలెనే భౌతికరూప విశిష్టవస్తువు గనుక, అందఱకు నొక్క రీతిగా నెట్లు కానవచ్చును? కావునఁ జిత్రకారుఁ డెట్లది కనఁబడవలయునని వ్రాసెనో యట్లే అందఱకుఁ గానవచ్చునన్న నమ్మక మేది? పగమేశ్వరుఁడు

---

బెక్కురు గలరు: హిందూదేశమునందు బహిఃప్రపంచమును సత్యమని తలంచు వారును పెక్కురుకలరు. బౌద్ధులలో బహిఃసృష్టి అసత్యమనువారు కలరు; సత్యమనువారు కలరు. హిందువులలో నట్లే శంకరాచార్యుఁడు మిథ్యయనును; రామానుజ, మధ్వాచార్యులు సత్యమందురు; ఇట్లు మహామహాయోగీశ్వరులు భిన్నాభిప్రాయులైయున్న విషయమును, వ్యావహారికమైన చిత్రకళలో[illegible] దింపుట యెంత హాస్యాస్పదము?

* అందఱకుఁ జెట్టుగనె కనఁబడునని యొప్పుకొనినతోడనె వస్తుత్వ విశిష్టరూపము వస్తుగతమే, ద్రష్టగతము కాదని స్పష్టపడి వీరివాద మొగిరిపోవునని మాత్రము చదువరులు మరువఁ గూడదు.

సృష్టించినవృక్షమే యందఱకు నొకవిధముగఁ గానఁబడనప్పుడు, మానవుఁడు వ్రాసినరూప మొక్కటియిదియుగాఁ గానవచ్చునా? చిత్రకారుని యుద్దేశము వ్యర్థమగును. కావున 'నాకొక చెట్టు, నీకొక చెట్టు అను వాదము' చిత్రవిద్యలోఁ బనికిరాదు. ఒకే రూప మొకే విధముగనె యందఱకుఁ దోఁచుననినఁగాని చిత్ర విద్య సాగనే సాగదు.

ఒకే వస్తువువలనఁ జిత్తవృత్తులను బట్టి యొకప్పుడు సంతోషమును, ఒకప్పుడు విషాదమును, ఒకప్పు డసూయయుఁ గల్గుట కలదు. కాని యీ వికారములన్నియు నొక్కవస్తువువలననే కల్గినవన్న మాటమాత్రము మరువరాదు. ఈభిన్న వికారములు వస్తువు మారుటవలనఁ గల్గలేదు; మనసు మారుటవలనఁ గల్గినవి. మనస్సు ననుసరించి వస్తువులయెడ వేఱువేఱు భావము లుద్భవించుననుట వేఱు. ఇంతియుకాదు. రూప మొక్కటే యనిన నిశ్చయబుద్ధి కలదు గనుకనే భావాదికములు మారుటకుఁ గారణమగుచున్నది; ఎట్లన, ఒక పురుషునితో నాకు మైత్రియున్నకాలమున, నాతనిపటముఁ జూచిన నానందము కలుగుచున్నది; అతనితో వైరమువచ్చినతరువాత నాపటమే కోపమును కలిగించుచున్నది. ఏల? ఆపురుషుని పటమె యని నేను నిశ్చయభావము కలవాఁడను గనుక. అది మరియొకపురుషుని పటమువలెఁ గానవచ్చినయెడఁ గోప మేల వచ్చును?

### ఆర్యచిత్ర కళాసంప్రదాయము: రూపానుకరణము

పైని ఖండింపఁబడిన యూహాలన్నియుఁ గ్రొత్తగాఁ బశ్చిమదేశమునఁ బుట్టినవి. ఆధునికులయిన కొందఱు చిత్రకారులపక్షము నవలంబించి, వారిపటము [redacted]ఇతరు లాక్షేపింపగా వారిని భూషించుటకునై రస్కిన్ అనువాఁ డీసంప్రదాయమును మొదటఁ బుట్టించెను. ఆధునిక చిత్రవిద్యను గుఱించి యీ పండితరసికవర్యుఁడు పెక్కు గ్రంథరాజములను వ్రాసి, చిత్రకారుల కెన్నియో నూతన మార్గములను జూపెను. ఈతని గ్రంథములను, ఈతని సంప్రదాయము వారు వ్రాసిన గ్రంథములను, చిత్రకళ నభ్యసించువారును, చిత్రకళల గుణావ

గుణములను జర్చింపఁగోరు రసికులును తప్పక చదువ వలసినదే. అందుగున వారు నేర్చుకొనవలసిన విషయములు పెక్కులు గలవు. అంతమాత్రమున నీసంప్రదాయమువారు చెప్పెడి మాటలన్నియు మనము ఒప్పుకొన నక్కరలేదు. ముఖ్యముగ ననుకరణమును గురించి వీరు చెప్పుమాటలు కల్పప్రధానములుగను, పరస్పర విరుద్ధములుగను ఉండును. అది యట్లుండె.

మనవారు కొందఱు రస్కిన్ మొదలయినవారు వ్రాసినవ్రాతలు చక్కఁగఁ గానవచ్చినందున దానికి భ్రమసి ఈ సంప్రదాయములోని నూతన సిద్ధాంతములన్నియు మనపూర్వుల చిత్రవిద్యలో నున్నట్టు చెప్ప మొదలిడిరి. పాశ్చాత్యులు నూతనముగఁ గనిపెట్టిన రైలుబండి, టెలిగ్రాము, ఎక్సురేస్ మొదలయినవన్నియు మనపూర్వు లెరుగుదురని కొందఱు చెప్ప యత్నించునట్టి యత్నమే యిది. ఈ నూతన సిద్ధాంతములు పాశ్చాత్యులలోను పూర్వము లేవు, మనలోను పూర్వము లేవు. ప్రాచీనగ్రీకుల యభిప్రాయముఁ జూడవలయు ననిన అరిస్టాటిల్ వ్రాతలు చూచినను, మనదేశమందలి పురాతనకాలపు వారియభిప్రాయములఁ జూచినను చిత్రవిద్యకు మూలపదార్థసారూప్యమె ప్రధానాంశమని వారియభిప్రాయమైనట్లు స్పష్టముగాఁ దెలియఁగలదు ఈయంశమును మనవాఙ్మయములోని కొన్నియుదాహరణముల నిచ్చి చూపెదను.

### భారతము

మనవారు లలితకళలలో ననుకరణమునకు నిచ్చిన యున్నతస్థలమును గురించి తెలిసికొనవలయునన్న మహాభారతమునందలి మయసభావర్ణనమును చూడవలయును. శిల్పకళలోఁ జిత్రకళవలె ననుకరణమునకు నంతఁగఁ బ్రసక్తి లేకపోయినను అందుగూడఁ బోలికవలనఁ గలుగు భ్రాంతిని వర్ణించుటవలన నవి హృద్గతము స్పష్టమగును. మయుఁడా సభలో జలమున్నచోట స్థలమున్నట్లును స్థలమున్నచోట జలమున్నట్లును, త్రోవయున్నచోటఁ ద్రోవలేనట్లును లేనిచోట నున్నట్లును గానవచ్చునట్లు దానిని నిర్మించెనఁట. దుర్యోధనుఁడు నీళ్లున్నచోట లేవనుకొని పోయి కట్టినపుట్టము తడుపుకొనుటయు, లేనిచోట నున్నదనుకొని

ధోవతి నైకి నెత్తుకొనుటయుఁజూచి ద్రౌపది నవ్వెను. ఆనవ్వే భారతరణమునకు బీజాంకురమయ్యెను. ఈవర్ణనములవలనఁ గవియొక్క యాశయము తేటతెల్లముగ దెలియుట లేదా? ఇందున గురించి నన్నయభారతములోని కొన్ని పద్యములను, కృష్ణభారతములోని కొన్ని పద్యములను ఎత్తివ్రాయుచున్నాను. సంస్కృత మూలములోని శ్లోకములను విస్తరభీతిచే నిచ్చుట లేదు.

## భారతము

సీ. సురుచిర హరినీల కిరణజలంబులఁ బద్మరాగారుణ పద్మములను
రాజిత రాజీవ రాజహంసావళి నిర్మల సౌవర్ణ కూర్మములను
గమనీయ వైదూర్యకుముదంబులను వజ్రమీనమౌక్తికనవ ఫేనములను
మరకత శైవలోత్కరముల విలసిల్లఁ గొలనని సన్మణిస్థలము సూచి

ఆ. పలుఁగురాల పద్యముల రుచుల్ గప్పిన
జలము లున్న యెడలు వెలయఁజూచి
యనుపస్థలంబులని జను లెఱుఁగక
యుండునట్లుగా మయుండు సేసె.

[నన్నయ. భా. ౨. ౧. ౧౨]

వ అట్లు దుర్యోధనుండు శకునియుం దానును సభావిభవంబుఁ జూచు వేడుక నందు గొన్ని దినంబులుండి యొక్కనాడు దాని యపూర్వరమణీయతకు విస్మితుఁడగుచు నయ్యయి ప్రదేశంబులం గ్రుమ్మరువాఁడు వివృతంబైన ద్వార దేశంబు సంవృతంబుగా వగచి చొరనొల్లక సంవృతంబైన దాని వివృతంబుగా వగచి చొరంబోయి లలాటఘట్టితి గృహద్వారుం డయి సమప్రదేశం బున్నతంబుగా వగచి యొక్క సముకట్టి, నీలాశ్మరశ్మిస్థగితంబైనవిమలమణిస్థలంబు జలాశయంబుగా వగచి పరిధానం బెగద్రోచికొని స్ఫటికదీప్తిజాలపరివృతంబైన జలాశయంబు స్థలంబుగా వగచి కట్టినపుట్టంబు దడియం జొచ్చి క్రమ్మఱిన వానిం జూచి పాంచాలియుఁ బాండుకుమారులును నగిరంత. [నన్నయ. భా. ౨-౨. ౮౬.]

క. మయ నీకుఁ బ్రియము యేనిఁక
నయవిమఁడగు ధర్మరాజునకు శిల్పకళో
దయమునఁ జేయము త్రిజగ
త్ప్రియము నపూర్వంబుగాఁగ వెస నొక్క సభన్.

క. అది చూచి యెల్లమర్త్యులు
నిది దివ్యవిమానమనుచు నెంతయు వేడ్కన్
మదిఁగొంచు బ్రమసి యాడఁగఁ
బొదవింపుము దాని నీదు పోఁడిమి మెఱయన్.

(కృష్ణ-భా-౯-౧-౮-౯)

భాగవతము

ఇఁక భాగవతముఁ జూతము. చిత్రకళనుగుఱించి మనవారి అభిప్రాయము భాగవతమందలి ఉషాపరిణయాఖ్యానమునందుఁ జూపఁబడినది. ఉషాకన్య స్వప్నమునందు ననిరుద్ధునిఁ గనును. ఆమె సఖియైన చిత్రరేఖ ముల్లోకములందుఁ గల దేవదానవగంధర్వయక్షరాక్షసరాజుల యొక్కయు, నీలోకమందలి ఛప్పన్న దేశముల రాజుల యొక్కయుఁ బటములను చిత్రించును. వానిలోనుండి ఉష అనిరుద్ధుని గుర్తింపఁ గలిగెను! రూపానుకరణమహిమ యింతకంటె నెక్కుడుగ వర్ణించుటకు వీలుండునా? చిత్రరేఖయనునది చిత్రలేఖనముయొక్క యపరావతారమనియే కవియొక్క హృద్గతము.

కాళిదాసుఁడు

ఇఁకఁ దరువాతి కవుల యభిప్రాయము గందము. కవికులగురువయిన కాళిదాసుని యభిప్రాయ మేమి? మూలమునకుఁ జిత్ర మెంత సదృశముగ నుండునో చిత్రకారునికిఁ జిత్రవిద్యయందంత యెక్కుడు నిపుణతకలదని యాకవి యభిప్రాయ మైనట్లు శకుంతలాదినాటకములవలన స్పష్టమగుచున్నది. అభిజ్ఞాన శాకుంతలమున నాఱవయంకమునందు రాజుచేఁ జిత్రింపఁబడిన శకుంతల యొక్క చిత్రఫలక మొకటి రంగము మీదికి వచ్చును. రాజునకుఁ గానఁబడ

కుండ నుండి రాజు చర్యలను చూచుచున్న యొకయప్సర (శకుంతలకు సఖి) ఆపటముం జూచి యిట్లనును:—

అహో ఏషారాజర్షేర్నిపుణతా జానే సఖ్యగ్రతో వర్తతే

ఏమి? యీరాజర్షియొక్క [చిత్రకళా] నైపుణ్యము!

నాసఖి నాయెదుట నున్నట్లె యున్నదే?

రఘువంశమునందు ౧౬ వ సర్గమున పాడుపడిన సాకేతము నిట్లు వర్ణించి యున్నాడు.

శ్లో. చిత్రద్విపాః పద్మవనావతీర్ణాః, కరేణుభిర్దత్త మృణాల భంగాః
నఖాంకుశాఘాత విభిన్నకుంభాః, సంరబ్ధ సింహప్రహృతంవహంతి.

తాత్పర్యమేమనగా, గోడలమీఁద నేనుఁగులు పద్మవనములో నున్నట్టును, ఆయేనుఁగులు మగయేనుఁగులకు మృణాళము లందిచ్చుచున్నట్టును పటములు వ్రాయఁబడియుండెను. ఇప్పు డామందిరములచుట్టు అరణ్యములు పెరిగినందున సింహములు వచ్చి ఆపటములోని యేనుఁగులు నిజమైనవియే యని భ్రమపడి వాని కుంభస్థలములను విదారించుచున్నవి! కాళిదాసుని యభిప్రాయమునకై యింతకంటె వేఱు ప్రమాణము కావలెనా?

ఇంకొక విశేషముకలదు. భావము కాళిదాసునకును గావలసినదే యైనను అది రూపానుకరణమువలననే చిత్రములలో సిద్ధించునని యీ మహాకవి మతము. కావుననే యీతఁడు శాకుంతలమునందుఁ జైని మూపఁబడిన ప్రసంగమున నాపటమును గూర్చించిరియే విదూషకునిచే నిట్లు చెప్పించెను.

విదూషక:—సాధు మధురావస్థానదర్శనీయో భావానుప్రవేశః స్ఖలతీవ మేదృష్టి ర్నిమ్నోన్నతప్రదేశేషు॥*

---

*మేలు! మిత్రుడా! మేలు! ఈభావానులేఖనము రమణీయస్థితిచేత దర్శనీయముగా నున్నది. నిమ్నోన్నత ప్రదేశములందు నాదృష్టి జారుచు లేచుచున్నట్లున్నది. [కం. వీ.]

దీనిపై రాఘవభట్టిట్లు టీక వ్రాసెను. "మధురం సుందరం యాదృశమాకృతిస్తయా దర్శనయోగ్యాద్యో భావస్యానుప్రవేశోऽభ్యంతరీకరణం సుందరాకారతయా భావావిర్భావోऽత్యుత్తర ఇత్యర్థః। స్ఖలతీవ దృష్టిస్స్నేహాన్మోన్నతప్రదేశేషు। అనేన మనుష్యాకృతిత్వమేవోక్తమ్। యథా ప్రత్యక్షే దృష్టయామాకృతౌ నిమ్నోన్నతేషు దృష్టిః స్ఖలతి లేఖాచిత్రేపీతి మహదాలేఖ్యకౌశల మితిభావః। కిం బహునా సత్యానుప్రవేశం కథాలావణ్యం కౌతూహలం మే జనయతి."

కాళిదాసుని మాలవికాగ్నిమిత్ర నాటకమునకుఁ జిత్రసాదృశ్యమే మూలము. మాళవిక యొక్క పటమును దేవి వ్రాయించును. రాజున కద్దానిఁ గానరాకుండ నుంచవలయునని యామె కోరిక యైనను రాజకస్మాత్తుగ దానిని జూచును. పటముఁ జూచియే మోహించును. తరువాత నైదవ యంకమందు మాళవిక రాజుపటముఁ జూచి నిజముగా రాజే అనుకొనును. ఇత్యాది ప్రసంగముల నానాటకమునందు వెనుకముందు సందర్భములతోఁ జదివిన నెంతయు వినోదముగ నుండి, చిత్రములు మూలముల నెంత సమీపించిన నవి యంత శ్రేష్ఠకళాబోధకములని కాళిదాసుని యభిప్రాయ మైనట్లు స్పష్టపడఁగలదు.

## భవభూతి

కాళిదాసుని తరువాతఁ గాళిదాసంతవాఁడు భవభూతి. చిత్రమును జూచి మూలమాయని భ్రమపడునంత సాదృశ్యముగల చిత్రమే కళాశ్రేష్ఠతకు నిదర్శనమని యీ మహాకవి యొక్క యభిప్రాయమైనట్లు ఉత్తర రామచరిత్రము వలనఁ గానవచ్చుచున్నది. ఈ నాటక రాజము యొక్క ప్రథమాంకమున, రామచరిత్రమంతయు నర్జునుఁడను చిత్రకారునిచేతఁ బటములుగా వ్రాయించిన ప్రసంగము వచ్చును. ఆ పటములను లక్ష్మణుఁడు తెచ్చి సీతారాములకుఁ జూపును. ఆ పటములను జూచుచు, నలుగిరి వివాహప్రసంగమునకు వచ్చినప్పుడు,

సీతా—ఏతే ఖలు తత్కాలకృత గోదాన మంగలాశ్చత్వారో భ్రాతరః వివాహ దీక్షితాః యుష్మాకమ్। అహో జానామి తస్మిన్నేవ ప్రదేశే తస్మిన్నేవ కాలే వర్తే *

రామః—ఏవమ్

కాలము స్థలములను గుఱించిగూడ భ్రమపుట్టునట్లు చిత్రమును చిత్రించిన చిత్రకారుఁ డెట్టివాఁడో?

తరువాత రాముని నెదురించుటకుఁ బరశురాముఁడు వచ్చునప్పుడు:—

† లక్ష్మణః—అయం భగవాన్ భార్గవః

సీతా (ససంభ్రమం)-కంపితాస్మి.

తరువాతఁ గొన్ని చిత్రములు చూపి,

‡ లక్ష్మణః—ఏషా పంచవట్యాం శూర్పణఖా

సీతా—ఆర్యపుత్ర! ఏతావ త్తేదర్శనమ్.

రామ—అయి విప్రయోగ స్తే. చిత్రమేతత్

---

*సీత-ఇప్పుడే గోదానమంగళ కార్యమును నెఱవేర్చిన నలుగురన్నదమ్ములమగు వీరు నిజముగా వివాహ దీక్షను గైకొనిన వారే. ఆహా! ఆప్రదేశమ్మునందే ఆ సమయమునందే నే నిప్పు డున్నట్లున్నది.

రామ—అగును. అట్లే.

† లక్ష్మణుఁడు-ఇతఁడు భగవంతుఁ డైన భార్గవుఁడు.

సీత (భయముతో)—వణుకు బుట్టుచున్నది.

‡ లక్ష్మ—పంచవటిలో నిదిగో చుప్పనాతి.

సీత—ఆర్యపుత్ర! మీదర్శన మింతవఱకే.

రా—ఓసీ. నీవెడబాటా! ఇదిపటము.

పైవాక్యములే భవభూతి యభిప్రాయమును తెల్పుచున్నవి; గనుక నిందునగురించి భాష్యమక్కరలేదు.

హేమచంద్రుఁడు

కాళిదాసభవభూతులకాలమునకుఁ దరువాతి కాలమువారును ఇట్లే తలంచుచుండిరి. పండ్రెండవశతాబ్దము వాఁడయిన హేమచంద్రుడు 'స్థవిరావలి చరితమ్' అను నొకకావ్యము వ్రాసియున్నాఁడు. అందలి పరిశిష్టపర్వమునందు నొకకథ కలదు. ఒక రాజు పెద్దకుమారునకు రాజ్యమునిచ్చి వనమునకుఁ బోయి భార్యతోఁ నగాపుర ముండెను. అచ్చట నతనికి నొకకుమారుఁడు కలిగెను. తనకుఁ దమ్ముఁడు పుట్టెనని తెలియగా రాజ్యముచేయుచున్న పెద్దకుమారుఁడు చిత్రకారులను బంపి, తమ్ముని ప్రతిమ వ్రాసి తెప్పించెను. ఆప్రతిమ పిల్లవాఁ డెట్లుండెనో అట్లే, అద్దములోని ప్రతిబింబమువలె నుండెను. అన్న తరువాత నాపిల్లవానిని మోసముచేఁ దీసికొని రమ్మనుగని వారకామినులను ఋషి వేషమువేసి పంపును. ఆపిల్లవాఁడు ఋష్యశృంగునివలె స్త్రీపురుష విభేదము తెలియనివాఁడు కావున వారివెంట దవిలి పట్టణమునకుఁ బయలుదేరును. మధ్య నొంత చిత్రకథ జరిగి రాజపుత్రుఁడును, వారకాంతలును మారుపడుదురు. తరువాత నారాజపుత్రుఁడెట్లయిన నేమి తన యన్న రాజధానికి వచ్చిచేరును. పటసాదృశ్యమువలన అన్న యాతని గుర్తించును.

ఈ క్రింది శ్లోకములు చూడనగును:—

శ్లో. పితృపాదాబ్జహంసస్య మదీయస్యానుజన్మనః
వనే నివసతో రూపమాలిఖ్యానయతే ద్రుతమ్.

ప్రమాణమాదేశ ఇతి ప్రోచ్య చిత్రకరా అపి
యయుస్తత్రవనే పుణ్యే కృతే వల్కలచారిణౌ
తే విశ్వకర్మణో మూర్తా న్తరాణీవాతికౌశలాత్.

తమాలిఖద్యథావస్థమాదర్శ ప్రతిబింబవత్
అనయా దర్శయామాస రూపం వల్కలచీరిణః.
తేచిత్రకారిణో రాజ్ఞః సుధావర్తినిభం దృశోః
దిధ్యాన్నృపతిరాకృత్యా మత్పితుర్నైవ హీయతే
ఆత్మావై జాయతే పుత్రః శ్రుతిరేషాహి నాన్యథా.

[౧౩౨-౬]

పై శ్లోకములలోని 'యథావస్థమాదర్శ ప్రతిబింబవత్' [ఉన్నవానిని ఉన్నట్లు, అద్దములోని ప్రతిబింబమువలె] అనినమాటలవలనఁ జిత్రకౌశలము విషయమై హేమచంద్రుని యభిప్రాయ మెట్టిదో చెప్పకయే తెలియుచున్నది.

ఇంకను నాలుగైదు వందలు తరువాతి కాలపువా రేమనుచుండిరో చూతము. అక్బరు కాలపువాఁడైన అబూఫజల్ అప్పటి చిత్రకారులను గురించి యిట్లు వ్రాసియున్నాఁడు.

"The minuteness in detail, the general finish, the boldness of execution &c. now observed in pictures are incomparable; *even inanimate objects look as if they had life*............This is especially true of Hindus, their pictures surpass our conceptions of things. Few, indeed in the whole world, are found equal to them."

[Aini Akbari Vol I, P. 107.]

ఇందువలన నిర్జీవపదార్థములను సజీవములుగ గనఁబరుపఁ యత్నించుట దోషమని యప్పటి హిందూచిత్రకారులు గాని, రసికులు గాని తలంచుటలేదు, అది యొకభూషణమే యని తలఁచుచుండిరి అనుట నిజము.

కావున నేకాలపు హైందవ వాఙ్మయముఁ దీసికొన్నను చిత్రకళలో మూలపదార్థానుకరణము భూషణముగ నెంచినట్లు గానవచ్చుచున్నది గాని దూషణముగా లేదు; ఇంతియు గాదు. ఈ యనుకరణ మెంత యెక్కువరో అంత చిత్రకారుఁడు తన కర్మయం దెక్కుడు కుశలుఁడని తలంచుచుండిరనుట విస్పష్టము.

## దేవతాదుల పటములు

దేవతాదుల చిత్రములును, విగ్రహములును మానవప్రతిమలవలె నుండక, కొంత భేదముగ నుండుట చూచి, పాశ్చాత్యులు కొందఱు హిందువులకుఁ జిత్రవిద్యయందుఁ జక్కఁగాఁ బ్రవేశము లేదని వ్రాసిరి. దానిని ఖండించుటకునై హావెల్ మొదలయినవారు హిందువుల చిత్రవిద్య యాధ్యాత్మికము, భౌతికముకాదు, వారికి మూలముతోఁ బోలిక యక్కఱలేదు – ఇత్యాది వ్రాసిరి. దానినే మనవారు అనువదించి హిందూదేశమందలి చిత్రవిద్య నంతటిని గుఱించి యిట్టిమాటలు పలుకుచున్నారు. కాని మనచిత్రవిద్యను లౌకికచిత్రవిద్య, ఆగమిక చిత్రవిద్య యని రెండు శాఖలు చేయవలెను. మనుష్యులు, పశుపక్ష్యాదులు, వృక్షాదులు, పర్వతాదులు మొదలయిన వ్యావహారిక పదార్థముల చిత్రములు లౌకిక చిత్రవిద్యకు విషయములు. వీనిలో మూలమాయుని భ్రాంతి కలిగించుటయే చిత్రవిద్యాప్రమావధి. దేవతలు రాక్షసాదులు మొదలయిన పౌరాణిక అమానుషుల ప్రతిమలు ఆగమచిత్రవిద్యకు విషయములు. ఇవి మతసంబంధములైనవి. మతగ్రంథములలో వీనివర్ణన లెట్లుండునో యట్లు వానిని చిత్రకారులు రచించుట సహజము. అవి మనుష్యాకృతికి ననుకరణములు కావని, హిందువులకుఁ జిత్రవిద్యయందు ననుకరణ మక్కఱలేదని చెప్పుట సాహసము. జగన్నాథుని ప్రతిమ వికారముగ నుండును. ఆప్రతిమ అట్లే యుండవలయునని శాస్త్రము కలదు. దానినిబట్టి పండ్రెండేండ్ల కొకసారి తయారుచేసెదరు. ఆ ప్రతిమనుబట్టియా హిందూదేశపు చిత్రకళాసిద్ధాంతములను నిర్ణయించుట? హనుమంతునిఁ గోఁతివలె దింపుదురు. కావున మానవులను కోఁతివలె వ్రాయుట హిందూచిత్రకారుల సంప్రదాయము, మానవుని పోలిక మానవవిగ్రహములో నుండుట వారి మతమునఁ దప్పు అని చెప్పిన నెట్లుండును? దేవతలు మానవులకంటెఁ బొడుగుగ నుందురని నమ్మకముగలవారగుటచే, ఆగమకారులు మానవుల ప్రతిమలకంటె దేవతల ప్రతిమ లెత్తుగ నుండవలెనని నియమించిరి. ఆవర్ణనలన్నిటికిని సరిపోవునట్లు ప్రతిమఁ జేయుట అనుకరణముగాదా?

ఆంధ్రపత్రికా కార్యాలయము, మద్రాసు.